ధ్రభాషాభివర్ధనీప్రచురములు. 15.



# నా దేశపు చరిత్ర.

బేతపూఁడి. లక్ష్మీకాంతరావు గారిచే

రచియింపఁబడి

---

మచిలీపట్టణమునందలి

భాషాభివర్ధనీసంఘము (లిమిటెడ్) వారిచేఁ

ప్రచురింపఁబడినది.



విళ్ల. రామస్వామిశాస్త్రులు అన్డ్ సన్స్ వారిచే

ముద్రింపఁబడినది.

1912.

# ఉపోద్ఘాతము.





ఈ చీనాదేశచరిత్రమున కుపోద్ఘాతము వ్రాయుమని న్నాంధ్రభాషాభివర్ధనీ సంఘమువా రడుగ నా కాంధ్రంబు దంత యభినివేశంబు లేమిం జేసి కొంత సంకోచించి తుదకు శ్లాఘ్య మగునుద్యమముల నా దగుసాహాయ్యముఁ ంధ్ర శ్చయించి యద్దాని కియ్యకొంటిని. ఆంగ్లేయాది భాష బోలె బలువిధ శాస్త్రంబులును నానాదేశ చరితంబు మన భాషయందు లేమి మన భాష కొక్క గొప్ప లోప టింగి యట్టి లోపమును నివారింప నుద్యుక్తులై కొంద షాభిమానులనుఁ బ్రోత్సాహపఱచి వారిచే సులభశై ను గ్రంథముల వ్రాయించి వాని నచ్చొత్తించి యాంధ్రజ గారకు లగు వీరి నెంతయును బొగడవలయును.

ప్రస్తుతము వీ రీచీనాదేశచరిత్రమును బ్రచురించుచు ు. పరదేశ చరిత్రములఁ జదువుట మిక్కిలి లాభకరము. వరియొక్క జ్ఞానము నభివృద్ధిఁ జేయును. నూతనానుభవ నొడఁగూర్చును. పరదేశస్థుల బలాబలములను గుణాగు ను రాజ్యాంగపద్ధతులను విశదము జేయును. చరిత్రాంశ సాధారణముగాఁ బల్మాఱు సంభవించుచుండుటచే బుద్ధి

మంత్రులకు రాజ్యాది విషయములయందు మంచి త్రోవలఁ జూపును. ఇట్లుండ మనకు చీనాదేశచరిత్రము కరము పఠనీయము. చీనాదేశమునకును మనదేశమునకును బెక్కుసామ్యంబులుండుటచే నాదేశచరితంబు పఠనీయమైనది. ఆసామ్యంబు లెవ్వియన. మనదేశంబునుం బోలె చీనాదేశ మనాదినుండి పేరొందియున్నది. అందు మనదేశమునందుఁ బోలె బలుజాతులును బలుభాషలును బెక్కు మతములును విజృంభించుచున్నవి. అందలి జనులు మనవారివలె మొట్టమొదట విశేషశాస్త్రానురక్తియును, కల్పనాకుశలతయును, కళానిపుణతను గలిగియుండి రానురాను క్షీణదశఁ జెంది మొన్నటివఱకును వృద్ధిలేకయే యుండినవారు. మఱియు వారు స్వతంత్రులును స్వచ్ఛందవృత్తులును గాక పరతంత్రులై యుండి యనేక నిర్బంధములలో నుంచఁబడి యుండిరి. ఇంకను వారు పరరాజ్యాధికారమున నుండి వారి నిరంకుశాధికారమున ననేక కష్టముల ననుభవించిరి. ఇదియును గాక మనదేశజునిచే స్థాపింపఁబడిన బౌద్ధమతమును మఱి కొన్ని మతముల నవలంబించి విగ్రహారాధకులై మూర్ఖస్థిర భావంబులఁ జెంది మార్పునకు విరోధులై యుండిరి.

ఇట్లుండఁ గ్రమక్రమమున వారల కిటీవల పాశ్చాత్యులతో సంబంధము గలిగెను. తత్క్షణమే వారికి జ్ఞానాభివృద్ధియు సంభవించెను. పాశ్చాత్యులం జూచి వారి కల్పనాశక్తియు వారి దేశౌన్నత్యమును వారి జ్ఞానాతిరేకమును దమ కలవడిన బాగు

గా నుండునని వారలలోఁ గొందఱు వారి దేశములకుం బోయి యచ్చట వారి విద్యలను నేర్చి తమ దేశమునకు వచ్చి దానికిని వారు జూచిన దేశములకును గల తారతమ్యమును జూచి దుఃఖించి యత్యంత దేశాభిమానముతోఁ దమదేశమును చెడ్డస్థితినుండి రక్షింపవలె నని పూని తత్సాఫల్యమునకై యనేక వత్సరము లష్టకష్టములఁ బడి నిష్ఫలులైరి. తుదకు వారు మంచూ జాతివారు సింహాసనాసీనులై యుండువఱకు తమ దేశమున కుత్తరగతు లుండవని తెలిసికొని వారిని వెడలఁ ద్రోలి ప్రజారాజ్యము నొకదాని స్థాపింప గృతనిశ్చయులైరి. ఆ యుద్యమమును సాగించుటకై యొక గొప్ప తిరుగబాటు జఱిగెను. ఈ విప్లవమున జయము ప్రజాపక్షకుల దైనందున వారు మంచూ జాతివారిని సింహాసనభ్రష్టులఁ జేసి ప్రజా రాజ్యమును సంస్థాపించిరి. ఇది మొన్న మొన్నటి సమాచారము. ఇంకను నేదియు స్థిరమని జెప్పుటకు వీలులేదు. సంక్షోభ మింకను సంపూర్ణముగా నడపఁబడలేదు. అక్కడక్కడ దుర్మార్గములు ప్రజాపీడనములుఁ బ్రబలియున్నవి. రాజ్యాంగముల సవరించి సంక్షోభముల నడఁచి దేశమంతయు శాంతము నొందఁజేయుటకు ధనము లేక దానికై పాశ్చాత్య రాజ్యముల నడిగి వారి నిబంధనల కియ్యకొని ధనమును తెచ్చుకొనుచున్నారు. టిబెటు మంగోలియా దేశములు పరరాజ ప్రోత్సాహమున చీనాదేశీయుల ప్రజారాజ్యమును నొల్లక వేర్వేరు రాజ్యముల స్థాపింప యత్నించుచున్నారు.

ఇంక నెన్నియో విఘ్నములు చైనావారి యుద్యమమునకుం గానంబడుచున్నవి. ఇవన్నియు నెట్లుమాఱునో తుద కేమగునో మనము వేచి చూడ వలసి యున్నది.

ఇట్లు,

ముత్తరాజు. సుబ్బరావు,

ఎమ్. ఏ.

V. S. Subba Rao

# చీనాదేశ చరిత్ర.

## 1వ అధ్యాయము.

### గ్రంథప్రయోజనము.

శ్రీకరంబుగ లోకస్థులకు సర్వసస్యంబుల నొసంగుటచేఁ బంటవలంతియై నవవిధ రత్నంబుల నొసంగు ఖనులం గలదియగుటచే రత్నగర్భయై చెన్నొందెడి యీ మహీతలంబునం దనేక దేశంబులు కలవు. ఆదేశంబులు నానావిధ నదీపర్వతాది నైసర్గిక సంపదచేతను భేదభూమిసారమువల్లఁ గలుగు సస్యవైచిత్ర్యంబుచేతను నొండొంటిం బోలకుండు. అది యటుండ నాయా దేశవాసులు దేశకాలపాత్రానుగుణంబుగను బుద్ధివైశద్యాదితారతమ్యానుసారంబుగను వివిధపరిశ్రమజీవన వృత్త్యాదులు కల వారైయుందురు. కావున నాయా దేశస్థుల గుణంబులు, నడతలు, వృత్తులు, స్థితులు నీమొదలగునవి యన్నియుఁ బ్రాయికంబుగ భేదంబులయి కన్పట్టుచుండును. మఱియు నీశ్వరుఁడే నరునకును సంపూర్ణప్రజ్ఞ నీయక దాని నంతరాంతరములుగ నొసంగుచుండును. అందువలన నే యొకనికంటె నొకఁడు ప్రజ్ఞావంతుఁడై కనిపించుచుండును. కాఁబట్టి యొకఁడు వేఱొకఁ డెట్టిమనోవాక్కాయకర్మంబులచే లాభాలాభంబుల బొందునో వానిం గ్రహించి లాభకరవ్యాపారంబులఁ దానునవలంబించి యలాభకరకృత్యంబులఁ బరిత్యజించుచుండుట యెల్ల రెఱింగిన విషయంబే కదా. ఇట్లొక గ్రామమందుండువారు పొరుగుగ్రామమందుండు వారియొక్కయు నొకదేశమందుండువారిరుగుదేశమందుండువారియొక్కయు వృద్ధిక్షయకారణంబులవిమర్శించుట ప్రతిగ్రామస్థులకును దేశస్థులకును బరోవృద్ధికై యగత్యంబని యెవరు తల

వరు? సమీపగ్రామ దేశస్థితుల విచారింప నభిలాషవొడమెనేని నానాగ్రామదేశస్థితుల నెఱుంగుట కదియే ప్రోత్సాహపఱచునని వేఱచెప్ప నేల!

గ్రామము యొక్క-గాని దేశము యొక్క-గాని మహాపురుషుల యొక్క-గాని సమగ్రస్థితులం బోధించునవి యేవియందురేమో? అవి చరిత్రలె. అట్టి చరిత్రలయందు యథార్థవిషయంబులేయుండునుగాని కల్పనాకథ లుండవు. అట్టి చరిత్రలు మన యీ భరతఖండమందుఁ గలవా యని విచారింతము. లేవనియే చెప్పనగును. మన కీ దేశమందుఁ దెలుంగు భాషలో భారత భాగవత రామాయణాది మహాపురాణగ్రంథములును నింక ననేక యితరగ్రంథములును మాత్రము కలవు. అవి వర్ణనాంశములతోను మానవశక్తి నతిక్రమించు ప్రశంసలతోను నిండియుండుటచే యథార్థ విషయంబు లెవ్వియొ విస్పష్టంబుగ నెఱుంగుటకు వలనుపడకుండును. మఱియు నవి బహుకాలమునాటి ముచ్చట లగుటంజేసియుఁ గొన్నియుగాంతర గాథ లగుటంజేసియుఁ బ్రకృతోపయోగకరములు గాకుండును. దేశచరిత్రలుగాని మహాపురుషులచరిత్రలుగాని హిందూదేశమందు వ్రాసియుంచునాచారము పూర్వమునుండియు లేదనియు నవిలేమిచేతనే యీభరతఖండవాసులు కూపస్థమండూకములవలె పురోవృద్ధిలేక యుండిరనియుఁ బాశ్చాత్యు లధిక్షేపించుట కవకాశము కలిగినది. వారన్ననో! నానా దేశములకుఁబోయి యాదేశభాషల నభ్యసించి యచ్చట దేశగ్రంథముల నవలోకించి దృష్టాంతపూర్వకంబుగ యథార్థవిషయంబుల గ్రహించి తమ తమ భాషలలోఁ జరిత్రల వ్రాసియున్నారు. అట్లేఁ బదినాలుగు దేశచరిత్ర లాంగ్లేయభాషలో వ్రాయఁబడియున్నవి.

మన దేశీయులలోఁ దగువా రట్లన్యదేశములకుం బోయి యాదేశచరిత్రలు వ్రాయునంతటి ప్రోత్సాహ సామర్థ్యములు కలవారగునంత వట్టుకు స్వభాషలోనికి భాషాంతరీకరింపఁబడిన చరిత్రలఁ జదివి, యాయా దేశవృత్తాంతములను మహాపురుషుల చర్యల నెఱింగి, సారాంశములు గ్రహించి, శక్తికొలఁదిగ మన దేశవాసులు పురోవృద్ధిం జెంద యత్నిం

చుట యుచితంబేకదా? ఇంతవట్టుకు దేశచరిత్రల వలని ప్రయోజనంబు సంగ్రహముగా నుడువఁబడినది. అట్టి ప్రయోజనము గుర్తెఱిఁగి మన దేశీయులలోఁ గొందఱు బుద్ధిశాలురు మహాపురుషుల చరిత్రల నిటీవల దేశభాషలలోఁ బ్రచురించుచున్నారు.

ప్రకృతంబున నీగ్రంథమందు చీనారాజ్యచరిత్ర బహుపురాతన కాలము నుండి 1901 సంవత్సరమువఱకు విశదీకరింపఁబడుచున్నది. ఆరాజ్యమునకును మన హిందూదేశమునకును హిమాలయపర్వతములు నడుమనున్నవి కాఁబట్టి యారాజ్యము మనకుఁ బొరుగు రాజ్యమేయగుచున్నది. పూర్వమునుండియు నారాజ్యమునకును మన దేశమునకును వాణిజ్యముకలదు. చీనాకాగితములు. చీనాపింగాణులు, పట్టు నిట్టిసరకులు మన దేశమందు వాడబడుచుండుటయే దానికిఁదార్కాణము. కాఁబట్టి యట్టి రాజ్యముయొక్క వృద్ధిక్షయంబులను దత్కారణంబులను జదువరులు విమర్శించి తెలిసికొనుట యాహ్లాదకరమును బ్రయోజనకారియుఁగాకున్నె? పరరాజ్యచరిత్రం జదువుటకుఁబూర్వ మదియెచ్చటనుండునొ దాని నైసర్గికస్వరూపములును భూమిసారమును, పంటలును, వాణిజ్యమును, జనులపరిశ్రమలును, గుణములును, నడతలును, రాజ్యపరిపాలనావిశేషంబులును, మతమును, మొదలయినవి యెట్టులుండునొ తెలియుటయావశ్యకము. కావున నీదిగువ సంగ్రహముగ నుడువఁబడుచున్నవి.

## చీనారాష్ట్రము.

ఎల్లలు:—ఉత్తరమున-ఆసియాఖండపు రసియా, తూర్పున - పసిఫిక్ (శాంత) మహాసముద్రము, దక్షిణమున - హిందూచీనా ద్వీపకల్పము, పడమట - తురుష్కస్థానము.

వైశాల్యము, 42,50,000 చదరపుమైళ్లు. జనసంఖ్య 39,90,00,000 అనఁగా చదరపుమైలునకు రమారమి 90 మంది కలరు. భరతఖండమందు 70 మంది కలరు. భాగములు. (1) ప్రధాన చీనాదేశము,

(2) మంచూరియా, (3) మంగోలియా, (4) తిబెటు, (5) తురష్కస్థాన ములోని తూర్పుభాగము. చివరఁజెప్పిన నాల్గును అధీన రాజ్యములు.

## 1. ప్రధాన చీనాదేశము.

ఇది చీనారాష్ట్రమున కాగ్నేయమూల నున్నది. ఇది యిండియా దేశ మంతయే యుండినను నెక్కువ జనసంఖ్య గలది. చీనారాష్ట్రమం దంతలో నిది యధిక సంపదయును జనసంఖ్యయును గలదియయి యున్నది.

దీని విస్తీర్ణము 15,00,000 చదరపుమైళ్లు. జనసంఖ్య 38,00,00,000 చీనారాష్ట్రముయొక్క శేషించిన భాగము దీనికి రెండంతలుండినను 2,00,00,000 జనసంఖ్య మాత్రమె కలిగియున్నది.

పైభాగము—చీనాదేశమం దేటిపల్లపుభూములు వరుసగానున్నవి. ఈపల్లపుభూముల నడుమ కొండల వరుసలున్నవి.

చీనాదేశమందలి భూమి తూర్పునుండి పడమరకు బోయినకొలఁది యెత్తుగ నుండును. పర్వతశిఖరములలోఁ గొన్ని సంతతమిమముచేఁ బొదువఁబడి యుండును. యాంగ్ట్సికియాంగు అను నొక నదికలదు. ఇది ఆసియాఖండమం దుండెడి యన్ని నదులలోఁ బెద్దది.

హొయాంహొ మరియొక నది. ఇదితఱచుగఁ బొంగి జనుల కపాయం బొనర్పుటచే దీనిని "చీనాదేశపీడ" యని జనులందురు. ఈదేశమందు 700 మైళ్లు పొడవుఁగల పెద్ద కాలువయొకటి యున్నది. దీనిని మించిన పొడవుఁ గల కాలువ ప్రపంచములో లేనేలేదు. నివాసంబునకు దగిన స్థలంబులులేక బహుజనులు నదులలోను గాలువలలోను బడవలమీఁదను నివసించెదరు.

భూమిసారము:—ఉత్తరప్రదేశము దక్షిణమునకంటె యెక్కువ శీతలము. దక్షిణభాగము వేసవియందు మిగుల వేడిమిఁ గలిగి యుఁడును.

మఱియు తైఫూన్లను పేరుగల బెడిదంబులగు సుడిగాలు లప్పుడప్పుడు మెండుగ వీచుచుండును.

ఖనిజములు:—రాగి, తుత్తినాగము, పాదరసమును పశ్చిమపర్వతములయందు దొరకును. ఇనుము సమృద్ధిగఁజిక్కును. గొప్ప నేలబొగ్గు గనులున్నవి. ఇవి 70,000 చదరపుమైళ్ల ప్రదేశము నాక్రమించుకొనియున్నవి. కాని వానినించుమించుగా చీనావారు తాకియుండలేదు. పింగాణి జిగటమన్ను అనఁబడు విన్నాణమైన మృత్తిక యీదేశపు సంపదలలో నొకటియై యున్నది.

ఉద్భిజ్జములు:—వరియును తేయాకును ముఖ్యముగాఁ బండించెదరు. ఈపంటలు విశేషముగా దక్షిణాగ్నేయభాగములయందె. దక్షిణమున మఱియు చెఱుకు, దూది, నీలియాకు సాగుచేసెదరు. నైరుతీమూలలను నల్లమందపరిమితముగ సాగుచేసెదరు. ఉత్తరప్రదేశమున గోధుమలు బార్లెధాన్యము, మొక్కజొన్నలు, పండించెదరు.

సగటున భూమి సారవంతమయినది. జనులు ముఖ్యముగా వరియన్నము భక్షించెదరు. బొంగువెదురు దేశమందుఁ బుష్కలముగా దొరకును. దీనిని బలువిధంబులనుపయోగించుకొనెదరు. ముఖ్యముగా దీనివలన నె చీనా కాగితములు చేయఁబడును. కొప్పును గర్పూరవృక్షములును రాజ్యమున కాదాయదాయకము లగుచున్నవి. వ్యవసాయమే యీరాజ్యమునకు ముఖ్యాధారము.

జంతువులు:—మత్స్యములును సూకరములును జనులకు ముఖ్యజీవనాధారములు. దేశము జనబాహుళ్యంబయి కృషిపాత్రంబయి యుంటంజేసి యడవులు పొడసూపకుండు కావున నడవిమృగంబు లంతగాఁ గానరావు. గుఱ్ఱములును పశువులును స్వల్పంబులే. నెమిలివంటి సుందరమయిన పక్షు లడవులం గన్పట్టును. బంగారుచేపలును వెండిచేపలును మొదట నీదేశమునుండియే వచ్చినవి.

జనులు:—చీనావారు, మంగోలియాజాతిలోఁ జేరినవారు. వీరు సూక్ష్మబుద్ధి గలవారును, శరీరకష్టముపడువారును, మితవ్యయముచేయువారునై యున్నారు. వీరుముఖ్యముగ వ్యవసాయపరులు. తోఁటలపెంచుటయం దందెవేసిన చేతులని వీరిని వర్ణింపవచ్చును. వీరు చీమవలెఁ బాటుపడువారు. వీరు పూర్వాచారపరాయణులు. అన్యజాతివారలయెడఁ దృణీకారభావముకలవారు. వీరివ్రాఁత పైనుండికిందికి మాటక్రింద మాటగా వ్రాయఁబడును.

చీనావారు బహుపూర్వకాలముక్రిందటనె విశేష నాగరికులయియుండిరి. ముద్రించుట, కాగితములఁ జేయుట, దిక్సూచికయంత్రము నిర్మించుట, యిాపనులు యూరోపుఖండవాసులకుఁ దెలియకమున్నె వీరు నేర్చియుండిరి. పైని లిఖించియున్న ప్రకారము పూర్వాచారానుసరణమువలనను నన్యజాతితిరస్కారణమువలననును నేకశతాబ్దములువఱకు వీరు పురోవృద్ధి లేకయే యుండిరి. ఆదోషములు రెండు నిప్పుడిప్పుడు వీరిం బాసి పోవుచున్నవి. ఈదేశ విద్యార్థులు యూరోపు అమెరికాఖండములకు విద్యాగ్రహణార్థము పంపఁబడుచున్నారు. పాశ్చాత్యవిద్య శీఘ్రముగ దేశమందు వ్యాపించుచున్నది.

పరిపాలన:—చక్రవర్తి స్వచ్ఛందాధికారి. ప్రధానోద్యోగులను మండారినులందురు. చక్రవర్తిని స్వర్గపుత్రుడందురు. పురాతనగ్రంథప్రవీణతం బరీక్షింపఁగా దేరినవారికే రాజకీయోద్యోగములనిచ్చెదరు. ఉద్యోగులయొక్క తారతమ్యములం దెల్పుటకు నానారూపములుగ నుండు చిన్నబంతులు శిరంబులనుండు కుళ్లాయలమీఁద ధరింపఁబడును.

మతము:—బౌద్ధమతము దేశవ్యాపకమయి యున్నది. గొప్పవారిలో ననేకులు కన్ఫ్యూసియసు అను మహాజ్ఞాని యొక్క మతావలంబకులయి యున్నారు. అందఱును బూర్వుల నారాధించువారె. కన్ఫ్యూసియసు క్రీ. పూ. 6 వ శతాబ్దమందు జీవించియుండెను. 'టేయొ'

(Taou) మతస్థులును కొందఱు కలరు. ఈదేశమందు బౌద్ధమతము క్రీ. పూ. 60 సం॥ ప్రాంతమున వ్యాపించెను.

చేతిపనులు:—పట్టు, పింగాణి, పచ్చ వార్నీసు వేసిన సామానులును. పట్టునేత పింగాణులు చేయుట, యీపనులను మొదట నేర్చినవారు చీనావారె యని చెప్పుదురు. పసుపువార్నీసునందు చీనావారిని మించినవా రిప్పటికిని లేరు. దంతపు పనులయందును వీరే యధికప్రజ్ఞులు. పట్టునూలె చీనాదేశమునకు కీర్తి తెచ్చినది. దానిపై నిరంతరము చక్రవర్తి భార్యలోక కన్నులుంచెదరు. ఇచ్చటి పట్టునేత యద్భుతదాయకంబుగ నుండును.

వర్తకము:—ముఖ్యమయిన దిగుమతిసరకులు దూదిసరకులు. నల్లమందు, లోహములు, కెరసనాయలు, ఎగుమతిసరకులు. పట్టు, తేయాకు, ప్రత్తి, చిక్కుడుకాయలు, చర్మములు, చక్కెఱ, హిందూదేశమునుండి నల్లమందును, హిందూదేశమునుండియు ఇంగ్లాండుదేశమునుండియు దూదిసరకులును, దిగుమతియగును. ఇంగ్లాండుతోను ఇండియాతోను యునైటెడు స్టేట్సుతోను చీనావారు వర్తకము చేయుదురు. మెట్టమార్గమున రుషియా దేశముతోను వర్తకము కలదు.

## చీనారాజ్యవిభాగములు.

ఇది 18 పరగణాలుగ విభజింపఁబడియున్నది. ఈపరగణాలయొక్క విస్తీర్ణము 34 వేలు మొదలుకొని 60 వేల చదరపుమైళ్లును, జనసంఖ్య 50 లక్షలు మొదలుకొని 6 కోట్ల 30 లక్షలు వఱకు నుండును.

పట్టణములు:—పికిన్ రాజధాని. దీనిలోని జనసంఖ్య 5,00,000 ఇది చీనాపురమనియు, తార్తారపురమనియు రెండుభాగములుగా నుండును. తార్తారభాగమందె రాజనగరమును నుద్యానవనములు నున్నవి.

1. దీని రేవుపట్టణము టీన్టిసను.

2. హాంకౌ (Hankow) ఇది వర్తకస్థలము, సముద్రమునకు 700 మైళ్లు దూరమున నున్నది. సముద్రము మీఁది వ్యాపారమునకును దగియున్నది.

3. షాంఘాయి (Shanghai) దీనిజనసంఖ్య 4,00,000 ఇచ్చట నన్యదేశీయ వ్యాపారము మెండుగ జరుగును. ఇచ్చట యూరోపుఖండ వాసు లనేకులు కలరు.

4. నానికిను:—ఇది యాంగుటిసుకియాంగు నదీ తీరమం దున్నది. పురాతన రాజధాని. వస్త్రములకుఁ బ్రసిద్ధి.

5. కాంటను. 6. ఏమాయి. 7. ఫూచూ. 8. నింగ్పో. ఇవి రేవుపట్టణములు. దీనికి దక్షిణమున నున్న మెకాయోద్వీపము పోర్చుగీసు వారిది. హాంకాంగు ద్వీపము ఇంగ్లీసువారిది. ఈ రెండును మొదట చీనా వారివె.

## మంచూరియా రాజ్యము.

ఇది కొరియాకు నుత్తరమున నున్నది. రాజధాని కిరినౌలా. ఈ రాజ్యములోఁ జాలభాగము రుష్యావారి స్వాధీనములో నున్నవి.

## మంగోలియా రాజ్యము.

ఇది మంచూరియాకుఁ బడమరగా నున్నది. దీనియందు గోబి యెడారియున్నది. దీనియందలి జను లడవిజాతులవారు. ఉర్గా రాజధాని దీనిలో చీనాగవర్నరు నివసించును.

## తిబెటు రాజ్యము.

ఇది యిండియాదేశమునకు నుత్తరముగానున్నది. ఇది పీఠభూమి. దీనిచుట్టు నెత్తైన కొండలవరుసలున్నవి. దీనియం దనేక సరస్సులు న్నవి. సింధు,శతద్రు,బ్రహ్మపుత్ర, నదులు,దీనియందె యుత్పన్నమయినవి. తమదేశపు సరస్సులు పవిత్రమయినవి యని యీదేశీయులు భావింతురు. బంగారము, వెండి, పాదరసము, వెలిగారమును బుష్కలముగా దొరకును. ఏటిపల్లపుప్రదేశములయందుఁ గొన్ని ధాన్యములఁ బండింతురు. అయినను

జనులు చాలవఱకు పశుజీవనము గలవారు. గొఱ్ఱెలు, మేకలు, నొకవిధమయిన గేదెలు, వారల గ్రామీణములయిన జంతువులు. ఈదేశపు గొఱ్ఱెల తోకలు పెడల్పు. వీనిచే బరువులు మోయించెదరు. ఈమేకల యున్ని మిగుల నాజూకయి యుండుటం జేసి విశేషముగా నెగుమతి చేయుదురు.

ఈదేశపు జనులు మంగోలియా జాతివారు. మిగుల బలశాలులును గష్టపడువారునై యున్నారు. చీనారాజ్యప్రతినిధు లిచ్చట నివసించి పాలనము సేయుదురు.

మతము:—బుద్ధుని నారాధించు ముఖ్యస్థాన మీదేశమే యయి యున్నది. ఈదేశాధిపతిని "గ్రాండులామా" యని యందురు. ఈ గ్రాండులామాయందు బుద్ధుఁ డావిర్భవించి యుండునని యీదేశీయుల నమ్మకము.

తార్తారులు గ్రాండులామాను సర్వజ్ఞుఁడని భావించి యెంతెంత దూరమునుండియైనను వచ్చి యాయన దర్శనము సేయుదురు. ఆయన యొక మఠమందుండును. ఆయన ననేకులయిన మతాచార్యులు పరివేష్టించి యుందురు. లామా మరణించిన పిమ్మట నాయన యాత్మ దేహాంతరమును బొందునని యీదేశీయుల నమ్మకము. వీరి ప్రార్థనావచనముల యర్థము వీరికే తెలియదు. అయినను ఆవచనములను వర్తులస్తంభములమీఁదఁ జెక్కించి, వానిని దమచుట్టును ద్రిప్పుకొందురు. లేదా గాలియంత్రములచేతఁ ద్రిప్పించెదరు. ఇట్లు చేయుటవలనఁ దామా ప్రార్థనలఁ జేసినట్లే యని భావించెదరు.

దీని రాజధాని లాసాపట్టణము. దీనియందు గ్రాండులామాయుండును. దీనియం దనేక దేవాలయము లున్నవి.

## తూర్పు తురుష్కస్థాన రాజ్యము.

ఇది టిబెత్తునకు వాయువ్యమూల నుండును. దీనికి మూడువైపులఁ గొండలవరుస లున్నవి. చనుపలమూలమున వర్తకము జరుగును. యార్కాండును, కాష్గరును, వర్తక పట్టణములు.

# 2 వ అధ్యాయము.

## మతము, పరిపాలనము, విద్య.

గతాధ్యాయమందు చీనావారి మతమునుగూర్చియుఁ బరిపాలనముగూర్చియు బహుసంగ్రహముగ నుడువఁబడినది. చీనావారి మతపరిపాలనయు రాజ్యపరిపాలనయుఁ జక్రవర్తియందేయుండును. చక్రవర్తియేమతగురువని వచింపవచ్చును. మతమే ప్రజలనడువడిని చక్రవర్తియొక్క యేలుబడిని జక్కఁజేయుచుండును. దానినతిక్రమించి ప్రజలుగాని ప్రభువుగాని ప్రవర్తించినయెడల శిక్షకుఁబాత్రులగుదురు. ఇతర నాగరిక రాజ్యములయందన్నను పూర్వకాలమందు చీనారాజ్య మందువలెనే మత రాజ్యపరిపాలనములు ప్రభువునందే యుండెను. మధ్యకాలములో నారెండు పరిపాలన కృత్యములు ప్రత్యేకింపఁబడెను. అప్పుడు మత గురువులు ప్రత్యేకాధికారము కలవారయి యుండిరి. అందువలన నాద్వివిధాధికారము లొండొంటికి బాధకరములుగా నుండెను. అయినప్పటికి రాజ్యాధిపతి మతవిషయములయందుఁ బ్రవేశింపక, మతగురువు రాజకీయవ్యవహారములలోఁ జొరక, ప్రకృతకాలము దనుక నెమ్మదిగ వ్యవహరించుచున్నారు. చీనారాజ్యమం దన్ననో పైని నుడువఁబడినట్లనాదికాలమునుండి చక్రవర్తియందే యా రెండధికారములు నెలకొల్పఁబడియున్నవి. వీరి మతమే రాజ్యపరిపాలనముచేయునట్లుండును. కావున దానింగూర్చి సంగ్రహముగ నీదిగువను విశదీకరింపఁ బడుచున్నది.

### A. మతము.

#### (a) మతలక్షణము.

(1) ఆదిమశక్తియనఁగా నాకాశము.
(2) ఆదిమసామగ్రి యనఁగా భూమి.
} అని రెండు కలవు.

ఆ రెంటికిని మధ్యను నరుడుండును. ఇతఁడు మహాత్మ్యము శక్తిగలవాఁడు. ఇతఁడు సునీతి దుర్నీతు లను నుభయపక్షంబులను గల త్రాసునకు ముల్లువంటివాఁడు.

చీనావారికి దైవతత్త్వమెట్టిదో తెలియదు. వీరి మతసారంబంతయు నరుని జీవితమునకే సంబంధించి యుండును. ఆదిమశక్తియనఁబడెడి యాకాశ మనుదానిలో సృష్టి కారణములయిన సూర్యుఁడు,చంద్రుఁడు,నక్షత్రములును,జేరియుండును. ప్రపంచ మనాదియనియు,ననంతమనియుఁదలఁతురు. సృష్టికర్త దేవుఁడని భావింపరు. విగ్రహారాధకులు దలఁచునట్లు గతి యనునది యొకటి గలదందురు.

## (b) భూతారాధనము.

ఆకాశము, భూమి, నక్షత్రములు, గతించిన యోగ్యచక్రవర్తులు, సజ్జనులయిన పూర్వులు అనెడు వీరిని రక్షక భూతములని చీనావారు భావించెదరు. వీరిని దమకుటుంబరక్షకులని తలఁచెదరు. గతించిన పుణ్యాత్ములు బహుమానార్హులనియెదరు. వారు గతించినను గీర్తికాయులై భూతరూపంబుల మరల దర్శన మిచ్చెదరని నమ్మి వారికిఁ బూజార్హపదవులను చక్రవర్తి యొసంగును. అట్టి పదవి నొసంగుఁడని యాపుణ్యాత్ముని వంశజులో యితరులో ప్రదేశాధికారికి లిఖితపూర్వకముగా విన్నపింపఁగా నాయధికారి చక్రవర్తికి సహేతుకముగా నంగీకారము నిమిత్త మా విన్నపమును బంపును. ఇందున కొక దృష్టాంత మీక్రిందఁ జొందుపఱుపఁబడుచున్నది.

"పూచు"పరగణాగవర్నరు, చక్రవర్తికిట్లువ్రాసెను. "కోకాంగు చంగు" అను పుణ్యాత్మునకు గౌరవార్థమున ఈవడలో నొక యాలయము గట్టింపబడియున్నది. ఆయనకు "శ్వేతభూతమని" పావననామ మొసంగఁబడెను. ఇప్పు డాయన వంశజు లిట్లు మనవి వ్రాసికొనిరి

"ఈపుణ్యాత్ముఁడు సుంగు వంశోద్భవుఁడు. ఈయన గొప్ప సాహిలి. సమర్థుఁడయిన భిషక్కు.1881 సంవత్సరములోనాయనను బ్రార్థిం

పఁగా నాయన మాఱువల్కెను. ఆయనకుఁ బావనంపుబిరుద మొసఁగుఁడని మేమ కార్కలపు చక్రవర్తిం బ్రార్థింపఁగా నాయనకు ''దైవసహాయకారి'' యని పావనంపుబిరుదము నొసంగెను. గతవత్సరంబున దీర్ఘకాలానావృష్టివాటిల్లఁగా నమ్మహనీయుని యాలయంబున మేము గుంపులుగాఁ జేరి యాయీతిబాధం దొలఁగింపుఁడని మొఱలిడఁ గుంభద్రోణంబుగ వర్షించెను. కాఁబట్టి మొక్కుబడి పలక యొకటి యాయన పేరిట నిర్మించుటకును, నింకొక పావనంపుబిరుదమాయన కొసంగుటకును, బూజార్హుల నామపట్టికలో నాయన నామముం జేర్చి, యాయనకుఁ బూజలొనరించుటకును చక్రవర్తిం బ్రార్థించుచున్నాము''.

అంతట వారి ప్రార్థన మంగీకరించితి మని చక్రవర్తి శాసనము ప్రకటింపఁ జేసెను. ఇట్టి శాసనము లనేకములు గలవు. గ్రంథవిస్తర భీతిచే విరమింపఁబడుచున్నవి.

## (e) నీతిబోధ పాప ప్రతిఫలము.

I. నరజన్మమం దాదిమశక్తి యధికముగ స్ఫురించును. కావున నరుఁడు స్వభావసిద్ధముగ సన్మార్గవంతుఁడే. నరునికి హేతుజ్ఞానముగలదు. దానివలనఁ బుణ్యవృత్తియు భక్తియుఁ గలుగును. సంశయావిష్టుఁ డయినపుడు నీతిబోధలవలనను బూర్వుల దృష్టాంతములవలనను సంశయనివృత్తుఁడగును. దుర్వృత్తి యంతయు సామగ్రిజన్యమందురు. ఇచ్చట సామగ్రి యనఁగాఁ బ్రకృతియని గ్రహింపవచ్చును. నరుఁడాదిమశక్త్యధీనుఁడు. చీనారాజ్య మాదిమశక్తి నిర్మితమనియుఁ గావున స్వర్గ రాజ్యమనియు దాని చట్టములకు నరుఁడు లోఁబడుటయే యతనికి విధికృత్యమనియు నట్టి ప్రాచీనములయిన చట్టములను సంస్కరింపఁ గూడదనియు వచింతురు. మఱియు నీదిగువ నమ్మకములు గలవు.

1. పాపఫలిత మీ లోకంబుననే జను లనుభవింతురు. కాని జన్మాంతరమందుఁగాదు. వ్యాధులు, క్షామములు, వఱదలు, భూకంపములు, నివి పాపఫలితము లేను.

2. పుణ్యప్రవర్తనము నిష్కల్మషంబుగ నున్నయెడల సౌఖ్యంబుగ జనులుందురు.

3. ఇహలోక సుఖముకొఱకే నీతిశాస్త్రము.

4. రాజ్యముయొక్క చట్టములకుఁ బ్రజలు లోఁబడి నడుచుకొనుటయే నీతి. (అట్లు లోఁబడుచున్నది లేనిది ముఖ్యముగాఁ గనిపెట్టవలెనని నియమము.)

5. పదుగురాడుమాటయే యాదిమశక్తియొక్క యభిప్రాయము కాఁబట్టి జనాభిప్రాయానుకూలముగ నేలుబడి యుండవలయును.

6. చక్రవర్తి నియమించిన దుస్తులనే ప్రజలు ధరింపవలెను. మార్పు చేయఁగూడదు.

II. చీనావారు చేయుపూజలు నిస్సారముగను శృంగారరహితముగ నుండును. దేవాలయములు లేవు. పూజార్థమకై చావడు లేర్పడి యుండును. అచ్చట జనులు కూడి వారిని ధ్యానించెదరు. గురువులని ప్రత్యేకముగ లేరు. ధ్యానించుటకు బ్రజలందరు నర్హులె. అట్టిపూజ కట్టుదిట్టముగ జరుగుటకై రాజకీయాధికారులే దాని నొనర్చెదరు. నాలుగు ఋతువులను జక్రవర్తిస్వయముగఁ బూజించును. ఏలయన, భూమి సలక్షణముగ ఫలింపవలెను. సోదెలు శకునములు చీనావారికిఁ బనికిరావు. కాలమానము, ఆకాశము, శుభాశుభంబులఁ దెలియఁజేయునందురు. గ్రహణములు, భూకంపములు, అనావృష్టి, మున్నగువిషయంబులం దెల్పునట్టి పంచాంగమును బ్రతిసంవత్సరము దొరతనమువారు ప్రచురించెదరు. చక్రవర్తియే మతగురువు. రాజధాని యందుండు సామాన్య దేవాలయములలో నాయన స్వయముగాఁ బూజ నొనర్చును.

జనులకుఁ బండుగలనియు నుత్సవములనియు విశ్రాంతిదినములనియు నేమియు లేవు. ఎల్లప్పుడు పాటుపడి సుఖజీవనము చేయ యత్నించెదరు. ఈ ప్రకరణమందుఁ జెప్పఁబడిన ధర్మములన్నియు "కన్ఫ్యూసియను"

అను జ్ఞాని నుడివినవె. ఆధర్మములను ప్రభువును ప్రజలును శిరసావహించి యాచరించుచుందురు.

(*d*) మతశాఖలు.

1. కన్‌ఫ్యూసియస్ మతము, 2. తేయొ మతము, 3. బౌద్ధమతము.

1. కన్‌ఫ్యూసియస్ కాలము క్రీ. పూ. 550 మొ॥ 479 వఱకు నైయుండెను. ఈయన మిక్కిలి పేదవాఁడయినను సజ్జనుఁడు. చీనారాజ్యమున కాదిమచక్రవర్తు లయిన యేయొ మొదలయినవారి సదాచారములు కాలక్రమంబున నశింపుకాఁగా కన్‌ఫ్యూసియస్ వానిని పునరుద్ధారణ మొనరించెను. పిమ్మట క్రీ. పూ. 360 సం॥న మింగ్సి (Mingtse) యును క్రీ. త. 1150 సం॥న విద్యాచక్రవర్తియైన షుట్సి (Tshutse) యు నామతమునే దృఢంబుగఁ బ్రతిపాదించిరి. ఆమతమె చీనావారికి జీవగఱ్ఱవలెనుండును, దానింబట్టి వీరికిఁ బ్రత్యక్షమె ప్రమాణము. ఐహికమందే వారికి లక్ష్యము. కావున వీరు కన్‌ఫ్యూసియస్‌మతమును బ్రధానమతముగ నమ్మి యితర మతంబుల విలాసార్థముగ తమ మతమున కనుకూలించుదనుక స్వీకరింతురు. ఆ కన్‌ఫ్యూసియస్ మతము ప్రకారము పూర్వాచారములను చీనావారు విడువఁగూడదు.

2. తేయొ మతము.

ఇది చీనావారి ద్వైతమతమునకు వ్యతిరేకముగ నద్వైతమతమును బోధించును. ఇది నిస్పృహను, నైష్కర్మ్యమును, ప్రతిపాదించును. మితిమీఱిన యాశకంటె మించిన పాపము లేదని తెల్పును. మనుష్యుఁడు భూమివలనను, భూమి యాకాశమువలనను, ఆకాశము హేతుజ్ఞానము వలనను గలుగుచున్నవనియు, హేతుజ్ఞానము మాత్రము స్వయంభువనియుఁ దెల్పును. హిందూదేశ మందలి బ్రాహ్మణుల వలెనే ధ్యానయోగము ముఖ్యముగ నాచరింపుమని చెప్పును. ఆల్టాయి పర్వతప్రాంతవాసు లీ

ధ్యానయోగమువలన మహత్తులఁ జూపవచ్చు ననియు, మంత్రశక్తి కలుగుననియు, భూతముల నాకర్షింపవచ్చుననియుఁ, బ్రకృతియొక్క శక్తిని నిరోధింప వచ్చు ననియు, నమర్త్యత్వమును సాధింపవచ్చుననియుఁ బిశాచములఁ బారఁదోలవచ్చుననియు నంతగా విశ్వసించిరి. అలాగున నే చీనావారును ముఖ్యముగ నమ్ముదురు.

3. బౌద్ధమతము.

బౌద్ధ దేవాలయములలోఁ బుష్పములతో నలంకరించుట యొక గొప్ప యాచారము గలదు. చీనావారికి నుద్యానవనముల నేర్పఱచి నానావిధ పుష్పజాతులను వానియందుఁ బెంచుటకు మిగుల నభిలాష గలదు. ఈ కారణముచేతఁ గొంతవట్టుకును, బౌద్ధమతము ముఖ్యముగ నీతిప్రవర్తన బోధించుటచేత మఱికొంతవట్టుకును, చీనావారికి బౌద్ధమతము కూడ నొకవిధముగ నంగీకార మయ్యెను.

(c) మతత్రయ సాంకర్య కారణము.

కన్ఫ్యూసియసుయొక్క మతము ముఖ్యముగ స్వచ్ఛమయిన నీతిని బోధించుచు నట్టి నీతి పరులైన పెద్దల నారాధించుటను మాత్ర మనివార్యముగఁ బ్రతిపాదించునే కాని మరణానంతరమందు జీవులకు స్వర్గనరకాదులు కలవని చెప్పదు. బౌద్ధమత మందన్ననో యగాధమయిన మానసిక తత్త్వమును, నిర్మలమయిన నీతి ప్రవర్తనమును, సునీతి దుర్నీతి ప్రవర్తనముల ఫలితములుగ బుణ్యలోక పాపలోకములును, (ఇచ్చట లోకము లనఁగా మానసికావస్థలే కాని యార్యమతమందుఁ జెప్పఁబడు లోకాంతరములు కావు) కొన్ని యాచారములును, పామరజనార్థమయి కొన్ని ప్రతిమారాధనలును జెప్పఁబడియున్నవి. కాని యీ రెండుమతములయందు నానావిధ దేవతారాధనలు చేయవలయునని నుడువఁబడియుండ లేదు. ఈ కొఱతను టేయోమతము పూర్తి చేసినది. ఇదిపూర్వమందు లిఖింపఁబడినట్లు మనుష్యులయొక్క శుభాశుభములును సమస్తవ్యాపారము

లును దేవతాధీనములయి యున్నవని యనేక తాంత్రికముల బోధించెను. ఈమత త్రియ కర్తలు ముప్వురను క్రీ. పూ. 6 వ శతాబ్ద ప్రాంతముల వారె. ఆముప్వురను చీనావారు గురుమూర్తి త్రియమని యేకకాలమందె పూజింతురు.

చీనాదేశీయులలోఁ బ్రతి మానవుఁడును మూఁడుమతములను నమ్మి యుండు వాఁడనియే వక్కాణింప వచ్చును. ప్రభు వా మూఁడు మతములను దానును నమ్మి యాచరించుచుండుటచేఁ బ్రజలును జిరకాలము నుండి తదాచరణను విడువ కుండిరి.

## (*f*) చీనావారి మతవిశ్వాసము.

పరిశీలింపఁగాఁ జీనావారి మత విశ్వాసమునకుఁ గట్టి పునాది యున్నట్లు కనుపట్టదు. వారి విశ్వాస మటువంటిదేయైన యెడల నది చిరకాలమునుండి యవిచ్ఛిన్నముగ నెట్లుండెనని చదువరులు శంకింప వచ్చును. దానికి సమాధాన మేమనఁగా, చీనావారి యదృష్టవశంబున వారికి మహమ్మదీయుల తాకుఁడు తగిలి యుండలేదు. క్రీ. త. 16 వ శతాబ్దము దనుక యన్య మత సంపర్కమే కలుగలేదు. ఆ శతాబ్దమందు క్రీస్తుమత బోధకులు దేశములో నడుగు పెట్టిరి. అదియే చీనాపండితులకుఁ బ్రాణగొడ్డ మయినట్టు దేశ చరిత్రయే ముందు విశదీకరింపఁ గలదు.

## B. పరిపాలన పద్ధతి.

రాజ్యము పరగణాలుగ విభజింపఁబడి యుండును. ప్రతి పరగణాకొక గవర్నరుండును. ఆ గవర్నరును మందారినుఁడందురు. అట్టిపరగణాల కొన్నిటిపై రాజప్రతినిధి యుండును. గవర్నరులుగాని, రాజప్రతినిధులుగాని, చక్రవర్తి యుత్తరువులకు లోఁబడి యుండవలెను. చక్రవర్తి యట్టి నిరంకుశాధికారము గలిగి యుండుటచే సమర్థులయిన కొందఱు చక్రవర్తు లేలునపుడు తప్పఁ గడమవారి కాలమందుఁ బ్రజాకలహము లుద్దండంబుగ నెందుకొని యున్నట్లు చరిత్రయే తెల్పుచున్నది.






ప్రజాప్రతినిధిసంఘము లేదు. పైనిఁజెప్పఁబడిన మందారీనులు రాజ్యమున కవయవముల వంటివారు. V.S. Subba Rao.

2. మందారీనులు:— వీరపారమైన దేశభాషను సమగ్రముగఁ జదివి, న్యాయచట్టములయందునను బూర్వాచారగ్రంథములయందునను నించు మించుగఁ బూర్ణ పాండిత్యము గలిగిన వారు. అట్టి వారిని జక్రవర్తి తన సమ్ముఖమునఁ బరీక్ష చేయించి మెప్పువడసిన వారికి మందారిక్ బిరుదా నొసఁగును. ఆ గొప్ప యుద్యోగముఁ బడయుటకై చీనాపండితులు తపస్సు ధారవోయుదురు. అట్టియధికారముఁ బడసిరేనిఁ దాము ధన్యుల మనుకొందురు. పూర్వుల చట్టముల నాచారములను వారు జాగరూకులై రక్షింపవలయు. వీరిలో వ్యావహారిక మందారీను లనియు సైనిక మందారీను లనియు రెండు విధంబులు కలవు.* మొదటి విధపు మందారీనులు రెండవ విధపు మందారీనుల కంటె నెక్కువ యధికారము గలవారు.

3. సూపరువైజరులని కొందరు ఉద్యోగులు గలరు. వీరిని ధర్మరక్షకు లందురు. వీరు ప్రబలపండితులు. పూర్వాచారములను గాపాడుచుందురు. చక్రవర్తిగాని యితర యుద్యోగులుగాని యాచారభంగము గావించిరేని వారినడతను వీరు నిషేధించెడి యధికారము గలవారు. వీరిం జూచి ప్రభువులును బ్రజలును భయపడుచుందురు. వీరారాజ్యములో సర్వత్ర పూజనీయులుగ నుందురు. రాజకీయోద్యోగముఁ బడయని పండితులు ప్రజలచే నధికముగ గౌరవింపఁ బడుచుందురు.

4. రాజకీయధనాగమము:— రాజ్యమునకు వచ్చెడి యాదాయమును, గాఁదగినవ్యయమును, గూర్చి మదింపులెక్క (Budget) నేర్పఱచుటకు వశముకాని యసమగ్రస్థితిలో వానిలెక్క లుండును. దీనికై

* సైన్యములపై విచారణకాక తక్కిన రాజకీయ పరిపాలనమునకు వ్యావహారికమని సంకేతముగ నుడువఁబడినది.

కొంద ఱుద్యోగులు నియమింపఁబడియున్నను బ్రయోజనము లేకుండును. రాజకీయోద్యోగులకు వేతనము లల్పములుగ నీయఁబడును. కావున వారు నేకరింపఁబడిన రాజద్రవ్యములోఁ గొంతయపహరించుటయు, లంచములు గొనుటయు, సంభవించుచుండును. అందువలన రాజ్యద్రవ్యము సక్రమముగ ధనాగారము చేరకుండును. గొప్పరుసుములు, నాదాయపుపన్నులు మొదలయినవియు ధనాగమమూలములయి యున్నవి. ఆద్రవ్యముతో రాజమార్గములును, వంతెనలును, బాటశాలలును, మొదలయినవి యేర్ప ఱుపఁబడుచుండును.

5. సైన్యస్థితి:—చీనా దొరతనమువారు తమ ప్రజలలోఁ గొందఱను రణవిద్యయందుఁ దీక్షచేయించి వారిని స్వస్వవృత్తులవలన జీవింపుచుండుఁ డందురు. యుద్ధము ప్రసక్తించునపుడు వారింగూర్చుకొని, కూలియిచ్చి మఱికొందఱను దెచ్చుకొందురు. విల్లు నమ్ముల ధరించి యుద్ధమాడుటయే వారి పూర్వాచారము. కావున నాయాచారమును వారు విధి యనుకొని విడువరు. చీనావారు తమనేర్పుకొలఁదిని వ్యవసాయమును శిల్పకృత్యములను వాణిజ్యాదులను జేయుటయందాసక్తి గల వారేకాని యుద్ధాసక్తి గలవారుకారు. మఱియు సౌమ్యముగ వ్యవహరింపఁ జూచువారేగాని యుద్ధమునకుఁ గాలుద్రవ్వువారుగారు. అది యుంగాక, వీరికి 18వ శతాబ్దాంతమువఱకు యుద్ధనైపుణ్యము లేని యడవి గుంపులతోను ననాగరీకజనులతోను బోరుట కలిగెను. కావున వీరు వారిని జయించుటకుఁ దమ పేదరణవిద్యతోనే సమర్థులయియుండిరి.

## C. విద్యావిషయము.

వీరి లిపి యగమ్యమనియు, వీరి భాష యపారమనియు నుడువ వచ్చును. వీరి లిపిని గూఢలిపి యనికాని సాంకేతిక లిపియనికాని వక్కాణింపవచ్చును. ఒక సంకేతము (అనఁగా గుర్తు) ఒక యూహను దెలియఁజేయును. ఇట్లీభాషయందు 50,000 గుర్తులు గలవు. వీనిలో

సగము మాత్రమే వాడుకలో నున్నవి. సామాన్య వ్రాంతలలో 4,000 మాత్ర ముపయోగింపంబడును. అట్టి లిపిని జదువ నేర్చుట కేండులు పూండులు పట్టునని యన్యదేశీయు లభ్యసించి పల్కిరి. ఈభాషయం దొక యచ్చుమాత్రము గల శబ్దములే ప్రాయికముగా వాడంబడును. గ్రంథవిస్తరభీతిచే వీరి భాషావైచిత్ర్యమును విస్తరింపలేదు.

వీరి భాషాగ్రంథములు ముఖ్యముగ మూడు విధంబులుగ నుండును.

1. ఫోవా యను మహాపురుషుండు రచించిన గ్రంథము. దీని యందుం బ్రపంచము, నీతిమార్గము విశదీకరింపంబడి యున్నవి. ఈయనయే చీనారాజ్య కర్తయని చీనావారు నమ్మెదరు.

2. కన్ఫ్యూసియను అను జ్ఞాని వ్రాసిన కావ్యములు.

3. రాజ్య చరిత్ర.

ఈ గ్రంథములను బ్రభువును బ్రజలును దప్పక యభ్యసించి వానిప్రకారము నడుచుకొనవలెను. పైని నుడువంబడిన గ్రంథవిషయములు తఱుచుగా సంగీతముతోం బాడుదురు. పూర్వాచారము లుత్సన్నము లైనపుడు పండితులు దుఃఖించుచు వానిని మఱల నుద్ధరింపవల యునని దుఃఖజనకమైన గానముతోం బాటలుపాడి ప్రజలం బ్రోత్సాహ పఱచెదరు. వీరికి గానము బహుముఖ్యవిషయమై యున్నది. రాజ్యపుచట్టములను బాటలుగాం బాడుదురు. గానమువలన విషయములను మనస్సుల గాటంబుగ నాటవచ్చు నని చీనావారు బహుపూర్వకాలము క్రిందటనే యెఱింగియుండుట స్తవనీయంబై యుండునుగదా. ఇదిగాక చక్రవర్తులలోం గొందఱు ప్రబలపండితులై యుత్కృష్టకావ్యంబుల రచించుటకలదు. ప్రతిమాసమునం దొకసారి జనసంఘమునకు నీతిమార్గము చక్రవర్తు లుపన్యసింపుచుందురు. చీనావారి గ్రంథబాహుళ్య మింతంతని చెప్పనలవికాదు. ఒకొ్కక విషయముం గూర్చి వందల కొలందిగ గ్రంథములును, నొకొ్కక గ్రంథములో వేలకొలందిగ నధ్యాయములు నుండును, అద్భుతములైన నిఘంటువులు గలవు. పాఠశాల లనేక

ములున్నవి. పండితులు సర్వాధికారము గలవారై సమస్త వ్యవహారముల నడపించువారుగఁ గన్పట్టుదురు. ఇంతయేల 18 వ శతాబ్దాంతముదనుక చీనావారు పండితులకు దాసులయి యుండిరి. ఈపండితులు స్వదేశ విద్యాప్రవీణులయి యున్నను, దమకు బాగుగ దెలియని విషయములలోఁ గూడ మిగుల నిపుణతఁ గలవారివలె నటించి, యితరుల భ్రమింపఁజేయ సమర్థులనియు, వారికి డంబమెక్కుడనియుఁ బాశ్చాత్యు లాక్షేపించిరి. దానికిఁ దార్కాణంబుగ నీదిగువ యంశంబుల నుడివిరి.

1. చీనారాజ్యములో జనాభాలెక్క వ్రాయుటకు గొప్ప డిపార్టుమెంటు గలదు. కాని జనసంఖ్య యింతయని నిష్కర్షగ నిప్పటికిని దెలియదు. కొందఱు 5,00,00,000 అనియు మరికొందఱు 10,00,00,000 యనియుఁ జెప్పెదరు.

2. పటములు వ్రాయుటకుఁ బ్రబలమయినయుద్యోగ మండల మొకటి గలదు. కాని వారు వ్రాసిన పటములన్నియు నఱగొఱగానే యుండెను. కావుననే జస్యూట్సు అను మిషనరీలు (క్రైస్తవమతబోధకులు) వానిని సలక్షణముగ వ్రాసి యా మూలముననే చక్రవర్తుల యొక్క ప్రాపకముఁ బడసిరి.

3. చరిత్రలు వ్రాయుటకుఁ గొంద ఱుద్యోగులు నియమింపఁబడి యుండిరి. వారు రాజ్యవ్యవహారములను, జక్రవర్తుల నిర్గమనములను మాత్రము వ్రాసిరికాని జాతీయాభివృద్ధికై ప్రజలొనర్చిన మహోద్యమంబుల నేమియు వ్రాయరైరి.

4. చేతిపనులలో చీనావారి చిరంతన ప్రావీణ్యతను గుఱించి గతాధ్యాయములో నుడువఁబడియున్నది. అట్టి ప్రావీణ్యము కలవారయ్యు గడియారముల సలక్షణముగఁ జక్కఁబఱచుకొనఁ జాలరైరి.

మఱియు వారే చీనావారొనరించిన కొన్ని కార్యము లద్భుతములని యిట్లు మెచ్చుకొనిరి.

1. "హొయాంహొ" "యాన్ గుటిసిక్యాంగు" నదులకు నడుమ నావికాయాత్రానుకూలముగ నొక కాలువఁ ద్రవ్వించిరి. అది బహు శ్లాఘనీయముగ నున్నది. 1800 సం॥ ప్రాంకది సక్రమముగ నుంచఁ బడెను.

2. పచిలీసింధుశాఖలోనికిఁ బ్రవహించుచుండు "హొయాంహొ" నదిని బసుపుసముద్రములో శాశ్వతముగఁ బ్రవహించునట్లు జేసిరి. ఆ పని "చియన్ లుంగు" చక్రవర్తి కాలములో జరిగెను. ఆయద్భుత కృత్యము నెంతని కొనియాడవచ్చును.

చీనావారి గృహనిర్మాణనైపుణ్యము మోటనియు, రంగులు వేయుట మనోహరమనియు, వీరి చరిత్రలు రసహీనములనియు, నాటక గ్రంథములు మఱియు రసహీనములనియుఁ బాశ్చాత్యులు భావించిరి.

## చీనా స్త్రీలు.

తా మారాధించెడి యాకాశదేవతాస్వరూపులు పురుషులనియు, భూదేవతాస్వరూపిణులు స్త్రీలనియు, చీనావారు భావింతురు. కావున వారు స్త్రీలను గౌరవింతురు. వీరికిని జనానా కట్టుపాటు కలదు. చీనావారు స్త్రీలకు విద్య నేర్పింపరు. ఓలియిచ్చి స్త్రీలను బెండ్లి యాడుదురు. తల్లి దండ్రులకు బిడ్డలు విధేయులై యుండుటయే పావన ధర్మమని చీనావారు దలంతురు. ఖోషి అను మహాత్ముండు వివాహధర్మముల నిరూపించి యుండెను. మఱియొక విశేషంబుగలదు, ఏదియన; స్త్రీలకుఁ బాదంబులు పొడవుగ నుండుట యందంబు కాదని బాల్యముననందే వారిపాదంబుల మడఁచెదరు. అట్లు సంకుచితచరణలై వారు గమనసౌలభ్యంబుఁ గోల్పోయి సంకట పడుచుందురు.



# ౩ వ అధ్యాయము.

## చీనారాజ్యముయొక్క పూర్వచరిత్ర.

చీనా రాజ్యముయొక్క స్వస్థితి.

పురాతనములయిన గొప్ప రాజ్యములలో చీనారాజ్య మొక్కటియే కాలవ్యత్యయంబులచేతఁగాని శత్రువుల దండయాత్రల చేతఁగాని మార్పుల నొందక స్వస్థితిని నిల్పుకొన్నదై యున్నది. ఈజిప్తు, బాబిలోనియా, అస్సీరియా యను ప్రాచీన రాజ్యములు వృద్ధిక్షయములను బొందియుండఁగా ప్రాచీన ప్రపంచమందీరాజ్యము స్వకీయస్థితిం బాయకుండుటయే కాక యభివృద్ధింగూడఁ జెందియుండెను.

చీనా రాజ్యాభివృద్ధి.

చీనాదేశముయొక్క యీశాన్యమూలను పసుపుయేటి ప్రాంతమందున్న ఫలవంత ప్రదేశములయందు చీనాదేశీయుల చిన్నగుంపెన్నటినుండియో వచ్చి నివసించుచుండెనని తద్దేశపురాతనగ్రంథసామగ్రివలనఁ దెలియుచున్నది. క్రమక్రమముగా వారు తమ రాజ్యము స్థిరీకరించుకొని పరిపాలనాపద్ధతులఁ గుదుర్చుకొనిరి. తమ్ము నావరించియున్న పూర్వనివాసులు తమ రాజ్యాభివృద్ధికి నిరోధకులయి యుండుటచే వారిం దఱిమి తమ రాజ్యమును పశ్చిమ దక్షిణ దిశలకు వ్యాపింపఁ జేసిరి. ఇట్లనేక శతాబ్దంబులు చనఁజన చీనాదేశీయులలోఁ గొందఱు తమ రాజ్యబహిఃప్రదేశములయందు నివాసంబులఁ గుదుర్చుకొని తమ రాజ్యాభివృద్ధికై తత్ప్రదేశంబులను మధ్యస్థానంబులుగ నేర్పఱచుకొని పిమ్మటఁ దమ రాజ్యమను మహాభవనముయొక్క నిర్మాణమునకు నాప్రదేశములనే పునాదులుగఁ జేసికొనిరి. పిమ్మట క్రీ. పూ. మూఁడవ శతాబ్దమందు పసుపుయేఱు (Yangtsze-king) ను దాటి దక్షిణముగా వచ్చి నూతన ప్రదేశంబుల నొక్కొక్కటిఁ దమ రాజ్యములోఁ జేర్చుకొని యిప్పటి చీనా రాజ్యమును నిర్మించుకొనిరి.

పరదేశములపై దండెత్తి జయించి తమరాజ్యముఁ బెంపొనరింపక పొంతప్రదేశములయందు సౌమ్యముగ నివాసంబులఁ గుదుర్చుకొని క్రమ క్రమంబుగ వానిని దమరాజ్యముతోఁ జేర్చుకొను గొప్పసామర్థ్య మీదేశీయుల కెల్లప్పుడు కలదని వారి దేశచరిత్రలయం దెక్కడఁజూచినను గన్పట్టును. వారియందు వీరలక్షణంబు లేమియుఁ గానరావు. అల్పశక్తివంతులపై వారొందిన జయంబులుసాహసోపాయార్జితంబులే కాని వారిపై దాడిచేసి వారిని బీడించి యోడించిపడసినవి కావు. వారీచీనా దేశమునకు వచ్చినప్పటికే యచ్చటనున్న పూర్వవాసులకునువారికిని సర్వవిషయములయందు భేదంబు కలదని తద్దేశీయగ్రంథంబులు నుడువుచున్నవి. కాఁబట్టి చీనాదేశీయు లెవరో వారెచ్చటనుండి వచ్చిరో యను ప్రశ్నలు పొడమక మానవు.

చీనాదేశీయుల పూర్వ నివాస నిరూపణము.

చీనాదేశీయు లెచ్చటఁ బుట్టిపెరిగిరో తద్విషయ నిరూపణంబునకై యనేక యోచనలు చేయఁబడినవి. వారు సెన్నారు (Sennar) మైదానములనుండి వలస పోయిరనియు, ఈజిప్తు (Egypt) దేశవాసులయి కొంతకాల ముండిరనియు వారునిదియా దేశీయ సంతతివారనియు నెట్టకేలకూహింపఁబడినది. ఈయూహకు గ్రంథ సాక్ష్యంబేమియుఁ గానరాదయ్యె. "టెర్రియను-డి-లాకూపరి" (Terrien-de-Lacouperie) యను చరిత్రకారుఁడు పరిష్కరించువఱ కీవిషయము సంశయగ్రస్తంబుగనే యుండెను. ఆయన పరిష్కృతిమాత్రము నిర్వివాదంబుగా నుండెను. అదేమనిన క్రీ. పూ. 23 వ శతాబ్దమందు, వారు కాస్పియను (Caspean) సముద్రమునకు దక్షిణమందున్న అకేడియా యను ప్రదేశమునుండి వలసపోయిరని నిశ్చయించెను.

అకేడియాదేశీయుల యొక్కయు చీనాదేశీయులయొక్కయుఁ బ్రథమలిపులు చాలవఱకుఁ గొంచెంచెం బోలియుండుటయు, నుభయదేశీయులకు మత, సాంఘిక, శాస్త్రీయ విషయములయందుఁ బ్రత్యక్షసామ్యం

బుంటుటయుఁ దననిర్ధారణకుఁ బ్రబలసాక్ష్యము లని యాయన వక్కా-ణించెను. మఱియు నీదిగువ సామ్యములుగూడ సాక్ష్యములనియే నుడివెను.

## సాక్ష్యములు.

**చీనాదేశమందు.**

(1) క్రీ. పూ. 2085-2004 వఱకుఁ బాలించిన "యేయొ" చక్రవర్తి చీనారాజ్యమును బన్నిద్దఱుగురువులకు విభాగించెను.

(2) చీనావారు షాంగ్టియను దేవతను, నార్వ్వర మహాత్ములను బూజింతురు.

(3) చీనావారు జ్యోతిషశాస్త్రమందును, వైద్యశాస్త్రమందును బ్రవేశముఁ గలవారు.

**సుసియానాదేశమందు.**

సుసియానారాజ్యము పన్నిద్దఱురాజులకు విభాగింపఁ బడియుండెను.

సుసియాను లొక్కదేవుని నార్గుర నుపదేవతలను సేవించెదరు.

మెసపొటేమియా వారు వైద్యశాస్త్ర జ్యోతిషశాస్త్ర పరిజ్ఞానమందు చీనావారిం బోలియుండిరి.

(4) బాబిలోనియాయందుఁ గొద్దికాలముక్రిందట భూమిని ద్రవ్వి కనుఁగొనిన జలాధారములు, కాలువలు, మొదలయినవి చీనాదేశమందిప్పుడు దృశ్యమానములగు జలప్రవాహములను, గల్పితజలమార్గములను సాక్షాత్తుగఁ బోలియున్నవి. ఇప్పటికి యేళ్లచేతను గాల్వలచేతను చీనాదేశ మెంతరమ్యముగాఁ గన్పట్టుచున్నదో యంతగానె పూర్వకాలమందు బాబిలోనియా కన్పట్టి యుండెననియు గ్రహింపఁ దగియున్నది.

ఆశియాఖండ చరిత్రలయందు జనులు వలసపోవుట ప్రాయికముగాఁ గన్పట్టును:—గత శతాబ్దాంతమందు గూడ "కాల్మక్సు" అను జాతివారాఱు వేలమంది రుష్యాదేశముయొక్క పొలిమేర భూములనుండి చీనాదేశ ప్రాంతములకు వలసవచ్చినట్లు తెలియవచ్చుచున్నది. ఆశియాఖండమం దొక దేశవాసులు మరియొక దేశవాసు లగుచుండి రనుటకీవలసపోవుటయే ప్రబలతార్కాణం బగుచున్నది.

ఒక దేశమందుండువా రంపటు కాని వారిలోఁ గొన్ని తెగలవారు కాని వలసపోవుటకు గారణములు, మహామారియు, క్షామము, రాజవిడ్వరము యయియుండును. కాఁబట్టి మెసపొటేమియా దేశమునుండి చీనావారిపూర్వులు పసుపు యేటి తీరమునకు వలసవచ్చి యుందురనుట కసంగతాంశంబు లేవియుఁ గానరావు. చీనాదేశీయుల పూర్వనివాసదేశముం గూర్చి యింక వితర్కించుట కావశ్యకమును గనఁబట్టదు. చీనాదేశమునకు వచ్చిన పదంపడి వారి వృత్తాంతంబును దెల్పుటయే యీగ్రంథోద్దేశమయియున్నది. తన్నిమిత్తమయి తద్దేశీయ పరంపరాగతగ్రంథములే చాలునని చదువరులును దలంపవచ్చును.

బహు పురాతనరాజ్యములయిన ఈజిప్టు, కాల్డియా (Egypt & Chaldea) రాజ్యముల కాలముకంటె పూర్వమునుండి చీనాదేశీయ చరిత్రయందు చీనావారి పూర్వికము తెలియబడుచున్నది. తద్గ్రంథమందు వారి యొక్క బహుపూర్వ వృత్తాంతములు పుక్కిటిపురాణములతో నిండియున్నను మూలాధారమయి విశ్వసనీయమైన యంశము మాత్రము వాని యందు లోపించి యుండలేదు. అది యెద్దియనిన చీనాదేశీయులయొక్క ప్రధానమూలపురుషులు విశేషజ్ఞానులనియు, దైవసమానులనియు, వర్ణింపఁబడియుండుటయే. రాజ్యమేలు ప్రతిజాతివారును దమపూర్వుల నట్లె వర్ణించుచుందురు. వారి ప్రధానమూలపూరుషులలో నొకఁడు ఫూసి (Fuhsi) నామధేయుఁ డీక్రిందియంశంబులచే శాశ్వత కీర్తిసంపన్నుండయ్యెనఁట.

(1) షడ్విధలిపి నిర్మాణంబుచేయుట.

(2) ఘటికాకాలచక్రసంబంధసంకేతముల నేర్పఱచుట.

(3) వైవాహికధర్మశాస్త్రకర్తయగుట.

(4) వికృతిశాస్త్రబోధక గ్రంథమున కాధారములని జను లత్యాదరంబుతో భావించెడి ప్రసిద్ధాష్టచక్రగ్రంథనిర్మాతయగుట.

ఆయన కనంతరమువచ్చిన "షెన్నంగు" (Shennung) అను

**షెన్నంగు చక్రవర్తి.**

నాతఁడు ప్రజలకు వ్యవసాయవిద్య నేర్పెననియు, రాజవిపణముల నేర్పఱచెననియుఁ, బొలములయందుండు నోషధులలోఁ జిరకాలమునుండి యవ్యక్తంబులుగనున్న యోషధులయొక్క గుణంబులఁ గన్పెట్టెననియు నూహింపఁబడియున్నది. రాజుల జీవచరిత్రల కనుసంధింపఁబడువారి ప్రతిమలలోఁ బైని నుదహరింపఁబడిన ప్రాచీనజ్ఞానియొక్క ప్రతిమయం దాయన యేదో యోషధియొక్క కాఁడ యది యెంతగుణవంతమయియున్నను దన కరుచిగా నున్నట్లు తన ముఖలక్షణమువలనఁ గనఁబఱచుచు, దానిని నమలుచున్నట్లుగఁ బ్రదర్శింపఁబడెను. ఓషధుల గుణాగుణంబుల నాయన వ్యక్తీకరించెననుట కదియే తార్కాణంబు కదా! తర్వాత వచ్చినప్రభువు "హాంగ్టి." (Hwangti.) ఆయన క్రీ. పూ. 2332 సం॥ లో సింహాసన మెక్కెను. ఆయన తన పూర్వులవలెనే దీర్ఘకాల మనఁగా నొకశతాబ్దమేలెను. కొయ్యతోను, మట్టితోను, లోహముతోను, బాత్రలను జేయుటఁ బ్రజలకునేర్పి యన్యోన్యవ్యాపారయోగ్యములగు నాణెముల నేర్పాటుచేసెను. అట్టి ప్రభువు చీనాదేశమును బాలింపనేలేదని యొక గ్రంథకర్త వాదించెను. కాని చీనాదేశీయచరిత్రకారులు మాత్రమాయనజ్ఞానమును యోగ్యతను గుఱించి విసుగులేకుండ నెంతయో వర్ణించి వ్రాసిరి. ఆయనరాణియే పట్టునూలును గనుగొనెనఁట.

**యేయొ చక్రవర్తి**

క్రీ. పూ. 2085-2004 సం॥ వఱకుఁ బరిపాలించిన "యేయొ" (Yao) ప్రభుత్వమునకు వచ్చుటతో చీనాదేశపుకల్పితపూర్వచరిత్ర తుదముట్టిన దనవచ్చునఁగా నాయనకుఁ బూర్వమందున్న చరిత్ర యంతయుఁ గేవల కల్పనాకథగాఁ గన్పట్టుచున్నది. యేయో ప్రభువు కాలమునుండి దేశచరిత్రను బండితుఁడైన కన్ఫ్యూసియస్ (Confucious) లిఖించెను.

“యేవు” సర్వజ్ఞుఁడనియు, చాకచక్యము గలవాఁడనియు నిపుణుఁడనియు, యోచనశాలియనియు, ఆగ్రంథకర్త వ్రాసెను. నీలశిరోజులను విశేషనామంబు గల చీనావారి నాప్రభువు దైవప్రేరితునిమాడ్కిఁ బాలించెననియు, ఆయన సర్వసద్విషయములయందుఁ బురోగామిగనుండి ప్రజలు తన్ననుకరించునట్లు చేసెననియు, ఆగ్రంథకర్తయే లిఖించెను. దయామయుఁడైన యాయనయొక్క పరిపాలనములో చీనారాజ్యముత్తర దక్షిణములయందును దూర్వపడమరలయందును విస్తరిల్లెను.

ఆయన పరలోకగతుఁడయిన పదంపడి ప్రజలు “షున్” (Shun) అను పురుషునిఁ బ్రభువుగాఁ జేసికొనిరి. ఈ

షున్ చక్రవర్తి.

ప్రభువుకాలములో నొక జలప్రళయము సంభవించుటచే చీనారాజ్యములో బహుప్రదేశములు పాడయ్యెను. ఆజలప్రళయమునే నోవాజలప్రళయమని క్రైస్తవబోధకులలో నొక తెగవార లనిరి. వా రేమనినను ఆజలప్రళయము చీనాదేశములోనుండు పసుపుటేటి (Yellow-river) యొక్క వెల్లువయే కాని మఱియొకటి కాదు. ఆవెల్లువ కొంతకాలమున కొకసారి యపారముగా నానదినుండి వెడలి దాని తీరప్రదేశములను నాశము చేయుచుండును. పైనిఁజెప్పిన జలప్రళయానంతర మాజలము మరల నదిలోనికిఁ బోవునట్లు చేయుటకు “యూ” (Yu) అను నుద్యోగి నియమింపఁబడెను. ఆయన యాపనిమీఁదఁ దొమ్మిదివత్సరము లుండెనఁట. మఱియు నాపనియం దాయనకుఁగల యాసక్తిని నిట్లు చీనాపండితులు వర్ణించిరి. ఆపనిఁజేయు కాలమం దాయన తనగృహంబును మఱచి మూఁడుపర్యాయములు దాని నతిక్రమించి వెళ్లెనఁట.

అట్టి ప్రసిద్ధకార్యం బొనరించుటం జేసి యాయనను షున్ ప్రభువుయొక్క మరణానంతరము ప్రజలు రాజుగాఁ

“యూ” చక్రవర్తి

“సియ్యా.” వంశము

గైకొనిరి. ఈయనయే “సియ్యా” (Hsia) వంశప్రభువులలోఁ బ్రథముఁడు. ఈ వంశప్రభువులు

క్రీ. పూ. 1954 మొదలుకొని 1687సం॥ వ ఱకుఁ బరిపాలనము చేసిరి. అంతకుఁబూర్వము చీనారాజ్యము పదునె కండు పరగణాలుగ నుండఁగ నీరాజుతొమ్మిదిపరగణాలుగ విభజించుట యీయన సాహసకార్యములలో నొకటియయి యున్నది. ఆవిభాగ మును ముందుసంతతులవా రెఱుంగుటకయి యిత్తడిరేకులమీఁద నది చె క్కింపఁబడెను. ఆయనయొక్క పరమయోగ్యతను శాశ్వతముగఁ బ్రకా శింపఁజేయుటకు జనులు "హెంగు" (Heng) కొండమీఁద శిలాస్తంభంబు స్థాపించి యాయన తమకొనర్చినట్లుగఁ దాము నమ్మిన యుపకారంబుల నన్నిఁటిని దానిమీఁదఁ జెక్కించిరి.

"యూ" ప్రభువునకుఁ బిమ్మటఁ బదియార్గురు రాజులు పాలించిరి. వీర లాప్రభువు తమవంశమునకుఁ గలుగఁజే సిన యున్నతస్థితి నుండిభ్రంశంబునొంది యథో గతిం బడిరి. ఇట్టధోగతినిబడుట ప్రాగ్ప్రపంచ రాజ్యముల కన్నిఁటికి నాచారమయ్యే యున్న దని యాంగ్లేయచరిత్రకారుఁడు వ్రాసెను. "యూ" ప్రభువుయొక్క సత్య శీలతను నిష్కాపట్యమును జరిత్రకారులు బహుగా వర్ణించి యుండిరి. ఆయన యనంతరరాజు లారెండు సుగుణములను బాటింపక యయో గ్యులైరి. స్వేచ్ఛాప్రవర్తనమును గ్రూరత్వమును ఈరాజులయొక్క పరంపరతోఁబాటుగ వృద్ధియయ్యెను.

సియ్యావంశము క్షీణించుట.

తుదకు వచ్చిన రాజైన చిక్వి (Cheeh-kwei) యందుఁ దన పూర్వు లయిన యాయధర్మరాజుల దుర్గుణము లన్నియు మూర్తీభవించెను. ఈప్రభువు క్రీ. పూ. 1739. సం॥ మొదలుకొని 1687సం॥ వఱకుఁబాలించెను. చీనాదేశీయులు తమరాజు స్వర్గపుత్రుండనియుఁ దమ రాజ్యవిధాయక శాసనములు స్వర్గనిర్మితములనియు భావించెదరు. అట్టి శాసనముల నతిక్రమించిరాజు మూర్ఖముగాఁ బ్రవర్తించినయెడల

చిక్వి చక్రవర్తి పద భ్రష్టుడగుట.

రాజుతోఁగలహించి తిరుగబడుట ప్రజలకువిధియని పూర్వాచారమును బట్టి ప్రజలుభావించెదరు. పూర్వాచారవిశ్వాసమును జనులు కలిగియుండ వలసినదనివారి దేశపు ప్రబలవిద్వాంసుఁడు నొకఁడు వక్కాణించియుండెను. అట్టియిక్కట్టు పైనిఁజెప్పబడిన చిక్వి ప్రభువుకాలమందు జనులకుఁ గలిగెను. రాజకీయోపద్రవమువలనను, ప్రాణధనములవిషయమై ప్రజలొండొరులకొనరించుకొను చెఱుపులవలనను, ఆరాజు దురవస్థపాలయ్యెను. జనులంపఱు నేకాభిప్రాయులై పరిపూర్ణుఁడని బిరుదువహించిన టాఙ్గు(Tang)అనువానిచే నడిపింపఁబడి రాజుపై దండెత్తిరి.

టాంగుచక్రవర్తి, షాంగువంశము.

ఆనాయకుఁడు చక్రవర్తిని రాజ్యపదభ్రష్టుని గావించి తానుదైవానుగ్రహమువలనఁజక్రవర్తియై తన బిరుదును సార్థకరించుకొనెను. ఈయన కాలములో నేడేండ్ల కరవు సంభవించెనఁట. ఈయనవంశము "షాఙ్గు" (Shang) వంశమని కాని "యిఙ్" (Yin) వంశమని కాని పిలువఁబడెను. ఈవంశపు రాజుల చరిత్ర తత్పూర్వవంశమనఁగా "సియా"వంశ రాజులచరిత్రకుఁ బ్రతియే యయి యుండెను. "టాఙ్గు" నకు సింహాసనమే విశేషయోగ్యతవలనఁ గలిగెనో యది యాయన యనంతరమేలిన యిరువది యెనిమిది రాజుల కాలములోఁ గ్రమక్రమముగా క్షీణించెను. వీరిలో నిద్దఱు ముగ్గురు మాత్రము యోగ్యులని చరిత్రకారులు ప్రతిపాదించిరి. ఎట్లయినను వీరికాలమందు రాజ్యము క్షీణోన్ముఖంబయియే యుండెను.

చౌసిను చక్రవర్తి యొక్క దుర్నయము.

వీరిలోఁగడపటిరాజయిన "చౌసిను" (Chowsin) క్రీ. పూ. 1153 సం॥ లో వెనుకటి "చిక్వి" వలెనే తన యపరాధములవలనను నధర్మమువలనను వంశాంతకుఁడయ్యెను. అవ్యక్తదుర్వ్యయము, నమిత విషయాసక్తియు, నతిఘోరక్రూరత్వము, నివి యాతని పాపగుణములలోఁ గొన్ని యయియుండెను. అపఖ్యాతిని బొందియున్న తన యుంపుడుకత్తెయయిన "టాకి" యను దానిని సంతోష

పెట్టుటకై గొప్ప రాజభవనములను, నుద్యానవనములను నిర్మాణము చేయించి యచ్చట మైమఱచినట్లు విరామములేకుండ మన్మథక్రీడలం దేలియాడెను. ఆకాలపు ప్రసిద్ధరాజనీతినిపుణుం డిట్లు లిఖించెను. యిన్ (Yin) వంశపురాజులు చీనారాజ్యముయొక్క నాల్గుదెసలను విశేష కాలము పరిపాలింపంబోరు. మావంశమూలపురుషుండయిన టాన్గు బహుప్రఖ్యాతిం జెంది యుండెను. ఇంకను జెందును. మేము సురాపాన లోలురమయి మైమఱచి యాయనయొక్క విశేషయోగ్యతవలన లభించి యున్న ఫలితములను వీటిం బుచ్చుచున్నాము. ఈవంశమందుం బుట్టిన చిన్నలును, బెద్దలును, దారిదోపుడులు, దుష్కృత్యములు, రాజద్రోహము నిట్టి పాపకార్యముల నాచరించుచున్నారు. రాజ్యమందుండు గొప్పవారును నుద్యోగులును నొకరినిజూచి యొకరు రాజశాసనముల నుల్లంఘించుచున్నారు. అపరాధులకు దండనలేనందున జనులు చెలరేంగి యొండొరుల మిగుల నగడుచేయుచున్నారు. యిన్ వంశ మవసానమునకు వచ్చినది. రాజ్యస్థితి దారియు డొంకయు లేకుండ నున్నది.

చౌసినుచక్రవర్తి యాత్మహత్యచేసికొనుట.

“చౌసిను” ప్రభువు తన మంత్రులయొక్క మందలింపులం బెడ చెవినిడి తాను చీనాచక్రవర్తి యగుటంజేసి తనకు స్వర్గరక్షణ కలదనియొకరితోం బ్రసంగవశమున ఆయననుడివినట్లు“కన్ఫ్యూసియసు” వ్రాసెను. ఆవచనములను విన్నయుద్యోగి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెనంట. “అసంఖ్యాతములయిన నీనేరములు స్వర్గమునకు విశదమవుచునే యున్నవి. యిన్ వంశము శీఘ్రములోనే తుదముట్టును. మీ దుష్కృత్యములు దేశమును బాడుచేయ నున్నవి”. ఈ భవిష్యద్వచనంబుల విలంబనంబుగనే సిద్ధింపనయి యుండెను. “రణశూరప్రభువు”(Warlike Prince) అను నతం డారాజును దఱిమివేయంగ నాతం డాత్మహత్యం జేసికొనెను. ఈకార్యమంతయు జను లవిధేయులై తిరుగంబడు లక్షణముం గలదియై యున్నను చీనావారి రాజ

నీతి కనుగుణముగనే యుండెను. మఱియు ''మెన్సియస్సు'' (Mencius) పండితునకును నంగీకారముగనుండెను. ఆజ్ఞానియిట్లనియెను. ''ఎవఁడుఁ దయాళుత్వము నవమానించునో యనగాఁ ద్యజించునో వాఁడాతతాయి. ఎవఁడు ధర్మము నుల్లంఘించునో వాడు పాపి. ఆతతాయిని బాపాత్ముని మనము నీచులని యందుము. ''చౌసిను అను వాఁడాతతాయియుఁ బాపియునయి ప్రభుత్వము పోయిన పిమ్మట మరణించెనని వింటిని అది లెక్కకాదు. వాఁడు ప్రభువుగా నుండఁగఁ హతుండయినట్లు విననయితిని.''

మెన్సియస్సు పండితుని యభిప్రాయము.

ప్రభువునెదిరించి జయమొందు రణవీరుల యాచారప్రకార మారణవీరుఁడును సర్వజనాంగీకారముతో సింహాసనమధిష్ఠించెను. ''కన్ఫ్యూసియస్సు'' (Conf-ucius) అనుగ్రంథకర్తయు ఆయనయనంతర గ్రంథకర్తలును నారాజుయొక్క పరిపాలనము ననంతముఖములుగ స్తుతించిరి. ఆగ్రంథకర్తల నుడువులు విశ్వసనీయంబు లయినచో నాప్రభువు రాజార్హములయిన యన్ని యోగ్యతలు గలవాఁడనియే చెప్పవలెను. సర్వజన వశీకరణమే యుత్తమరాజలక్షణంబని కన్ఫ్యూసియస్సు లిఖించి యుండిన దానికిఁ దన యౌదార్యప్రవర్తనవలన నారాజు లక్ష్యంబయ్యెను. ఆయన ప్రభుత్వకాలములో క్రీ. పూ. 1121 సంII లో కోరియా, కొచ్చిన్ చీనా, దేశములనుండియు నింక దూరప్రదేశములనుండియు ఆయన సన్నిధికి రాయబారులు వచ్చిరి. ఆయన దండయాత్రల కపజయ మన్నమాటయే లేదు. ఆయన యనంతరుని కాయన యిచ్చిపోయిన రాజ్యముయొక్క యెల్లలను బొరుగురాజ్యములవార లొప్పుకొనిరి. ఆరాజ్యముయొక్క స్వస్థతంజూచి యాయన మిత్రరాజు లోర్వలేమిం జెందిరి. ఆయన కనంతరమువచ్చిన రాజులలో నిద్దఱు ముగ్గురు రాయననుఁ బోలి

''రణశూరుడు'' చక్రవర్తియగుట ''చౌవంశము''.

యోగ్యముగఁ బరిపాలించిరి. వారు రాజ్యమును స్థిరపఱచుకొని పాలెగాండ్రు లోఁబఱచుకొని యుద్ధసమయములయందు వారివలనం బనులఁ గొనుచుండిరి. "చౌ" (Chou) అనఁబడునీవంశపు రాజులలో నెక్కువమంది రాజులను గుఱించి దేశచరిత్రగ్రంథములేమియుఁ దెల్పి యుండలేదు. కాని క్రీ. పూ. 1001 సం॥ మొదలుకొని 946 సం॥ వఱకుఁ

మ్యూవాంగుచక్రవర్తి.

బాలించిన "మ్యూవాంగు" (Mu-Wang) ను గుఱించి కొంత విశేషంబు కలదని చరిత్ర తెలుపుచున్నది. ఆరాజు జరిమానాలు పుచ్చుకొని యపరాధులను విడుదలఁజేయుట యను పాతకం బొనరించెనఁట. అందువలన లంచములు పుచ్చుకొనుటయుఁ, జెడునడతయుఁ, బ్రబలిఁ ప్రజలయొక్కయు బ్రభువుయొక్కయు నయమార్గమును మొదలంటఁ జెడగొట్టెను. అది యటుండ, ఆయన తన రాజ్యపు పడమటి యెల్లనుండెడి యడవి జనంబులను దఱిమివేయుటకై జయప్రదమయిన యుద్ధముల, జేసెనఁట. దీని ననుసరించి పురాణగాథకూడ నొకటి యున్నది. అది యేమనిన ఆయన రత్నసరస్సునకు వెళ్లెననియు, నక్కడ తురుష్కదేశీయులవలన మహమ్మదీయస్వర్గతుల్యభోగము లాయన కొసంగబడిన వనియుఁ, జెప్పెదరు. ఆప్రభుపుకాలమందు రాజ్యస్థితి యెట్లుండెనో

రాజ్యస్థితి.

సరిగాఁ దెలిసికొనవలెనని నీదిగువ లిఖింపఁబడుచున్నది. ఆరాజ్యమంతయుఁ గొన్ని చిన్న రాజ్యముల సమూహమయి యుండెను. ఆయల్ప రాజ్యాధిపతులు మహారాజ్యాధిపతికి నస్థిరమైన రాజభక్తిని విధేయతను జూపుచుండిరి. ఇట్టి రాజభక్తిని జూపుట ప్రాగ్రాజ్యమర్యాదగా నున్నదని చరిత్రకారుఁడు లిఖించెను. పాలెగాండ్రనఁబడెడి యల్పరాజ్యాధిపతు లందఱును మహారాజ్యాధిపతియం దభిమానము గలవారుగాను, ఆయనకు బద్ధులుగాను నుండుటలేదు. ఆయన తన బాహుపరాక్రమముచే వారిని లోఁబఱచుకొన వలసియుండెను. ఆయన యధికారము

నకు దౌర్బల్యము పొటమ్లినపు డవిశ్వాస చిత్తులయిన యాపాలెగాం డ్రాయనపైఁ దిరుగఁబడ నుంకించియుండి రనియే యెఱుంగవలయును. “చౌ” వంశపు రాజు లిట్లు కొంతకాలము పరిపాలింపఁగా వారి రాజ్యము విభవమందును, నధికారమందును, నిస్సారంబుగ నుండెను. అట్టిసమయమందు విశేషఘనతం బొందఁగోరిన పాలెగాండ్రయొక్క యౌద్ధత్యంబులు ప్రాయికంబులై భయదంబులుగ నుండెను.

“చౌ” వంశము యొక్క క్షీణదశ.

కాన రాని కలహములచేతను, నక్రమప్రవర్తనలచేతను, రాజ్యము యథాయథలుగ నుండెను. ఆస్థితిని జ్ఞానియయిన “మెన్సియస్సు” విస్పష్టముగ నిట్లు వ్రాసెను. “దండువెడలును. ఆహారపదార్థములు వ్యయమగును. ఆఁకలిఁగొనియున్న యితరులకు నన్నములేదు. కష్టించి జీవించువారికి విశ్రాంతియే లేదు. ఓరచూపులతో జను లొండొరులఁ గ్రూరముగఁ జూచుచుండిరి. జనులు చెడుపనులం జేయఁదొరకొనుచుండిరి. అంతటను రాజనిబంధన ఉల్లంఘింపఁ బడుచుండెను. జనులు బలాత్కరింపఁ బడుచుండిరి. అన్నపానీయములు ప్రవాహవేగముంబోలి వ్యయమగుచుండెను. అట్టి ప్రవాహవేగమునకు రాజులు కొన్నివేళల లోఁబడుచుండిరి. మఱి కొన్నివేళల దాని నెదుర్కొనుచుండిరి. వారు వెఱ్ఱెత్తినట్లు ప్రవర్తించుచుండిరి. రాజుయొక్క దుర్మార్గమును జూచి చూడనట్లూరకుండి యాయనకుఁ దోడ్పడుట స్వల్పదోషం బనియు నట్టి దుర్మార్గము జరుగునని ముందుగ నూహించి యాదుష్కృత్యం బొనర్చునట్లు రాజు నుత్సాహపఱచుట యధికదోషంబనియు భావింపఁబడుచుండెను. ఈ యధికదోషమునే యకాలపు గొప్పయధికారు లొనర్చుచుండిరి. కాఁబట్టి వారినందఱను రాజద్రోహులనియే యనవలెను. జ్ఞానులయిన రాజు లుదయించుటలేదు. పాలెగాండ్రయిన యల్పరా

మెన్సియస్సు అను జ్ఞాని యాదశను వర్ణించుట.

జులు విషయలంపటు లగుచుండిరి. లాయములయందుండు మృగములను హయములనుబోలి రాజులు తెగబలిసి యుండిరి. వారి ప్రజలో క్షుత్పీడితు లగుచుండిరి. పొలములయందు క్షామపీడితులు మరణించుచుండిరి. వీరిట్లు మరణించుట యడవి మృగముల కాహారమగుటకే".

చీనాదేశ మటువంటి దురవస్థలో నుండఁగ క్రీ. పూ. 549 సఁ॥ లో "కన్ఫ్యూసియసు" జన్మించెను.

**"కన్ఫ్యూసియసు" యొక్క జననము.**

ఆయన జన్మమహిమను గుఱించియు, ఆయన బాల్యదశావృత్తాంతమును గూర్చియు చీనాదేశపు పౌరాణికగ్రంథములయందుఁ గల్పనాకథల మూలకముగా నేమేమొ వర్ణింపఁబడి యున్నది. కాఁబట్టి తత్కల్పిత వృత్తాంతములఁ ద్యజించి రాజకీయ వ్యవహారములయం దాయన యధికార మెంత చెల్లెనో యావిషయంబు మాత్ర మీక్రింద సంగ్రహముగా లిఖింపఁబడును. ఆయన వచోదార్ఢ్యంబునకును, ఆయన సిద్ధాంతముల యొక్క సయుక్తికప్రతిపాదనాశక్తికిని దగిన

**ఆయన సిద్ధాంతము.**

ట్లాయన సిద్ధాంతంబులు వినియోగింపఁ బడలేదని చీనాదేశచరిత్రం జదువువారు తెలిసికొనఁగలరు. కలహబుద్ధియు, రాజభక్త్యభావము ననెడు తుపానులచే రాజ్యమనెడు నావ తూగియాడుచుండెనని యాయన యెఱింగి ప్రభువును ప్రజలను బూర్వాచారపరాయణులం జేయుట తనకు విహితకృత్యంబని నమ్మియుండెను. పూర్వాచారమనఁగా గతంబున లిఖింపఁబడిన "యేయొ" ప్రభువు తాను స్వర్గప్రతినిధి ననుకొని పరిపాలించిన కాలమందునను, "రణవీరుఁడు" అను విఖ్యాత నామంబు గల ప్రభువు తన వంశమూల పురుషుఁడయి పాలించిన కాలమందునను బ్రవర్తిల్లిన రాజ్యవ్యవహారముల మర్యాద యని యెఱుంగవలెను. పూర్వజ్ఞానుల యొక్క పుణ్యశీలమే యాయన విచారణవిషయమై యుండెను. అట్టి

మహనీయులయొక్క పరంపరాగత పుణ్యశీలము రాజును, ప్రజలును మరల నవలంబించునట్లు చేయుటయే రాజకీయ వ్యవహారజాడ్యనివారణకు సిద్ధౌషధమని యాయన తలంచెను. ఆయన జీవించియున్న కాలమం దాయన ననేకరాజన్యు లవహసించిరి. ఏరాజునకైనను, ఏప్రయోజనమునకైనను ఆయన సిద్ధాంత ముపయోగించినప్పుడే యాయన కొనియాడంబడెను. మానవకోటి కాయన మార్గదర్శి యని ప్రజలాయనను గౌరవించుట యాయన మరణాంతరము కలిగెను గాని యాయన జీవించియుండగం గలుగలేదు. మఱియు నిప్పటికిం గడచిన యిరువది మూడు శతాబ్దముల కాలమం దంతట చీనావారికిం గలిగిన మార్పులకును, శుభాశుభ సంభవములకును, నమ్మహనీయుని వదనమునుండి వెలువడియున్న సద్బోధయే వేగుంజుక్కగా నుండెను. తన కాలమందలి యరాజకమును గుఱించి యాయన మిగుల దుఃఖించెను. అట్టి దుఃఖముం గూర్చి యీదిగువ విషయ మొక దృష్టాంతముగాం జెప్పంబడెను. ఒకప్పుడాయన తన స్వగ్రామమునుండి "చి" (Chi) అను గ్రామమునకుం బోవుచుండంగా దారిప్రక్కనున్న యొక సమాధియొద్ద గూర్చుండి యొక స్త్రీ దుఃఖించుచుండెను. ఆమెయొక్క దుఃఖాలాపము విని జాలిపడి దుఃఖకారణ మడిగిరమ్మని యాయన తనశిష్యునిం బంపెను. "నీకాపత్పరంపర గలిగినట్లు దుఃఖించుచున్నావేమి" యని యాశిష్యుం డామెతో ననియె. "అవును నాకట్లే సంభవించినవి. నామామ నొక వ్యాఘ్రం బిచ్చటం బొరిగొనెను. నాభర్తను గూడ నది యిచ్చటనే పీంచమడంచెను. ఇప్పుడు నాకుమారునిగూడ నిచ్చటనే యది పిలుకుమార్చెను" అని యామె నుడివెను. శిష్యునివలన నది విని తాను పోయి "నీ వీచోటు విడిచి యేల పోవు" అని కన్ఫ్యూసియసు ఆమె నడిగెను "ఏల పోనంగా నిచ్చట క్రూరప్రభుత్వములేదు". అని యామె చెప్పెను. అంతట కన్ఫ్యూసియసు తన శిష్యులకై చూచి "నాబిడ్డ

లారా! క్రూరప్రభుత్వము వ్యాఘ్రమునకంటె భయంకర మని జ్ఞాపక ముంచుకొనుఁడు" అని పలికెను.

చిన్ వంశ్యుఁడు సింహాసన మెక్కుట.

కన్ ఫ్యూసియస్ చేసిన ప్రబోధములను, "టేయొ" మతస్థాపకుఁడైన "లేయోసి" (Lao Tsze) చేసిన యధిక నీతిబోధలను, లక్ష్యపెట్టక జనులు నాల్గుదెసల యందు నల్లరులు ప్రబలముగఁ జేయుచుండిరి. "చౌ" వంశరాజ్యము నశించునని తెల్పెడి యశుభసూచకముల కేమియుఁ గొఱఁత లేకుండెను. మహానుభావుఁడయిన "యేయొ" నిర్మించియున్న యిత్తడిరేకులు రాజవిధ్వరము కలుగునని తెలుపుచున్నవో యనునట్లుయ్యల లూగుచుండెను. కరవును, మారిరోగమును, దేశమందంతట నిక్కుచుఁ దిరుగుచుండెను. జనులు భయభ్రాంతులై యుండిరి. ఘనతంగోరు వీరున కిదియే కద సమయంబు. కావున నకాలంబున "చిన్" వంశ పాలకుఁడు సమయ మదియే యని యప్పటి చక్రవర్తిపై దండెత్తెను. "చిన్" వంశపాలకుఁడు జయప్రదములయిన కొన్ని యుద్ధములను జేసి తుదకుఁ జక్రవర్తిని బూర్ణముగ జయించి రాజ్య మెచ్చటనైనను వీరభోజ్యమను న్యాయంబున చీనా రాజ్యము తనదియని సింహాసన మెక్కెను. చీనారాజ్యము నేలిన "చిన్" వంశమున కీతఁడే ప్రథముఁడు. కాని యీవంశము శీఘ్రకాలములోనే యంతరించెను. ఈప్రభువు కాని యీయన కనంతరము వచ్చిన యిద్దఱు రాజులు కాని ప్రసిద్ధికెక్కిన వారు కారు. ఈ ముఫ్వురకుఁ దర్వాత వచ్చిన రాజుమాత్రము విఖ్యాతపురుషుండు. ఈయన లేనియెడల "చిన్" వంశమూరును పేరును లేకుండ నశించి పోయియుండును. పైనిఁ జెప్పఁబడిన ముఫ్వురు నే మహాత్కార్యమును జేయనులేదు, సంకల్పింపనులేదు. వారికి ననంతరుఁడుఁను నట్టివాఁడే యని యనుటకు వలనుపడదు. ఆయన పేరు "షిహాంగ్టి" (Shi Hangti).

పాలెగాండ్రి పరిపాలనాపద్ధతి వలనఁ గలిగిన చెఱుపులు బహుకాలమునుండి ప్రత్యక్షములుగానే యున్నవి.

పాలెగాండ్రపరిపాలన నిరాటంకముగా జరుగుచుండుట.

అయినను ఆపద్ధతి కాధారముగా నున్న పూర్వాచారమును, అట్టి పూర్వాచారమును బ్రతిపాదించు చరిత్రను, లక్ష్యముచేయక యా పద్ధతిని సంస్కరింపఁ జాలిన ధీరుఁ డప్పటికి నుదయింప నందున నాపద్ధతి నిరాటంకంబుగ జరుగుచుండెను. అట్లుండ నా "షిహాంగ్టి" (Shi Hangti) ప్రభువు చీనారాజ్యమునకుఁ గలుగుచుండిన యిక్కట్టులన్నియుఁ బైనిఁజెప్పిన పద్ధతి వలననే వొడముచున్నవనియు, ఆ రాజ్యము యొక్క సుఖాసుఖాస్థితు లాపద్ధతి ననుసరించియే యుండుననియు, గ్రహించి పాలెగాండ్రకుఁ బ్రత్యేక ప్రభుత్వములు లేకుండ వారి రాజ్యములను బ్రధాన రాజ్యములోఁ జేర్చుకొనియన్నియు నేకరాజ్యంబుగ నొనర్చి తా నేకచ్ఛత్రాధిపతిగా నుండిన యెడల నంతఃకలహంబు లంతరించునని నిశ్చయాభిప్రాయుఁ డయ్యెను.

చిన్ వంశమందలి నాల్గవచక్రవర్తి యయిన షిహాంగ్టి.

పాలెగాండ్రి ప్రభుత్వమును నిరాకరించుట.

ఇట్టి సంస్కరణకు నచ్చటి పండితసమాజ మెదుర్కొనెను. కన్ఫ్యూసియసును; ఆయన శిష్యులును తాము వచించి యున్న సామెతలందును, వ్రాసిన గ్రంథముల యందును జనులు పూర్వాచారపరాయణులై యుండవలయునని మిగులఁ బ్రతిపాదించి యుండిరి. ఏకరాజ్య నిర్మాణోద్దేశము పూర్వాచార ప్రేమలతను ఖండించుటకు వచ్చిన కుఠారమని యా పండితులు భావించిరి. రణవీరుఁడని బిరుదు వహించిన పూర్వ ప్రభువుయొక్కయు, ఆయన యనంతరప్రభువుల యొక్కయుఁ, బరిపాలన కాలమందు

రాజ్యసంస్కరణమును బండితసమాజము నిరోధించుట.

పాలెగాండ్రు రాజ్యములకును బ్రధాన రాజ్యమునకును గలిగి యుండిన యైకమత్యము నుదహరించుచు, నట్టి స్థితియందు దేశమునకుఁ బ్రాప్తించిన యున్నత దశను వర్ణించుచు, కన్ఫ్యూసియను లిఖించియున్న గ్రంథములను దారాళంబులుగ నా పండితులు చూపిరి. పండితులయొక్క నిరోధ మట్లు ప్రబలముగ నుండెను. అసంపూర్తిగఁ గార్యములఁ జేయుట యెట్టిదో యా ప్రభు వెఱుంగఁడు. కావునఁ బ్రబలసాక్ష్యములని పండితులు కుతూహలముతోఁ జూపుచున్న గ్రంథములను వారియొద్ద నుండి పెఱికికొని తన యుద్యమము నెఱవేర్చుకొనుట కారాజుద్యుక్తుం డయ్యెను. దైవ, వైద్య, సంబంధమయిన గ్రంథములను దప్ప శేషించిన గ్రంథసముదాయము నంతయు నగ్నికాహుతి సేయ వలసినదని యొక శాసనము నాచక్రవర్తి ప్రకటనము చేయించెను. అట్టి శాసనము సమగ్రముగ నెఱవేర్పఁబడుట యసాధ్యమని యాశాసనలక్షణమువలననే తెలియుచున్నది. తమ ప్రాణప్రియములైన పూర్వగ్రంథదహనము, గ్రంథముల నగ్నిజ్వాలల కర్పణంబు సేయ నొల్లక, శాసన ధిక్కారంబునకై విధింపఁబడుచున్న మరణదండనకుఁ బండితులు తమ కంఠంబుల నొసంగుచుండినను సాధ్య మగునంతవఱకు గ్రంథదహనంబు కావింపఁబడెను. రాజశాసన మిట్లు వెంటనే చెల్లింపఁబడుటవలనఁ గొంత ప్రయోజనము కలిగినది. ఈ రాజ్యసంస్కారణమువలన జనబాహుళ్యమునకు మేలుకలుగుటం జేసి యాసంస్కారణ కర్తకు జనానురాగ లాభంబు చేకూరెను.

"షిహాంగ్టి" చక్రవర్తి రాజ్యమునకుఁ జేసిన మేలులు.

ఆ రాజు తన రాజ్యమునకు మూర్తిమంత మయిన యభివృద్ధి గలుగఁ జేయమన స్ఫూర్తిగ గోరఁకొనెను. రాజ్యవ్యవహారము కొఱకుఁగాని, వాణిజ్యముకొఱకుఁగాని, పాలెగాండ్ర రాజ్యముల కన్నిఁటికి రాజమార్గము లుండుట యావశ్యకమని యెటెంగి రోడ్లను వేయించెను. నదులకు వంతెనలు కట్టించెను.

ఇంతయేల గమనాగమనముల కావశ్యకము లయిన వీళ్లన్నియుఁ దన శక్తికొలఁదిని నేర్పాటు చేయించెను. రాజ్యముయొక్క యుత్తరఁపు టెల్ల దారిని తార్తారులు దండెత్తి వచ్చెద మని యకాలంబునఁ దఱచుగ బెదరించు చుండిరి. తన ప్రజలను బరరాజులవారినుండి రక్షించుటయును దనకు విధికృత్యమని తలఁచి దేశముయొక్క యుత్తర దిశను సముద్రతీరము మొదలుకొని బ్రహ్మాండమయిన గోడయొకటి కట్టించెను. దీనిపొడవు 1250 మైళ్లు. ఈ మహారాజుయొక్క పరిపాలనాసామర్థ్యమును బోధింపుచు నా గోడ యిప్పటికిని గానవచ్చుచున్నది. ముగ్గురికి నొకనిచొప్పున జనులను సమకూర్చి యాగోడను గట్టించెనఁట. ఆయన యనంతరమున వచ్చిన రాజు వంశపరంపరాప్రాప్యం బయిన సహజజ్ఞాన విశేషంబు లేనివాఁడై తానేలిన మూడు వత్సరంబులలో రాజ్యమభివృద్ధిచేయుటకు మాఱుగా నంతఃకలహానులపాలు చేసెను. దేశమందంతట దారిద్రోపద్రవములు ప్రబల మయ్యెను.

చీనాగోడ,

చీనారాజ్య సింహాసనము నాటకరంగమయ్యెనో యనునట్లుగా రాజ్య మట్టు లల్లకల్లోలంబుగ నుండఁగ మఱియొక వీరుఁడు తన సమానుల నడఁగఁద్రొక్కి బలాత్కారముగఁ బయలువెడలెను. పూర్వకాలంబున "మాక్‌బెత్తు" (Macbeth) అను స్కాటులెండుదేశపు రాజు చేసినట్లా వీరుఁడు యుద్ధోన్ముఖుఁడగు నపుడు తన జయంబుఁగూర్చి సోది చెప్పువాని నొకనిఁ జూచి యడుగఁగా నాయన మహోన్నత పదవిం జెందఁగలఁడని వాఁడు చెప్పెనఁట. ఆభవిష్యత్కథనము వెంటనే నెఱవేరి స్తవనీయం బయ్యెను. ఆపరాక్రమశాలి జయశాలియై సర్వజనాంగీకారముతో చీనాచక్రవర్తి యయ్యెను. ఆయన "హౌన్" (Han) అను తన స్వదేశ నామమునే తన వంశమునకుఁ బెట్టెను. ఆచక్రవర్తి పేరు "కెయోటి" (Kaoti). పాలె

"హాన్" వంశముపరిపాలనకు వచ్చుట.

గాంధ్ర రాజ్యము లంతరించి యన్ని చిన్నరాజ్యములును గలసి యేక మండల మయినందుకు జనులు కాలక్రమమున

**"కెయోటి" చక్రివర్తి.**

సమ్మతికలవారయి యుండిరి. గతంబున లిఖింపఁబడిన రీతిని దత్కాలంబునఁగల్లోలకారణంబయిన దేశభాషాగ్రంథసముదాయాభిమానము "కేయోటి" ప్రభువుకాలమందు సముద్రములోఁ బెద్దలంగరువేసిన వడవయట్లు తొట్రుపాటులేకుండెను. కావున జనులను దదభిమాన రహితులం జేయుట యనావశ్యకమని యాప్రభువు భావించెను. ఆయన కాలమం దున్నపండితులు తమ పూర్వపండితులను దైవములనుగా భావించి గౌరవించుచుండిరి. వారి పాండిత్యాధికారము కూడఁ గొంతవఱకుఁ బాటింప వలసినదే యని యా ప్రభువు భావించి యుత్సన్నంబులైన గ్రంథంబుల మరల నుద్ధరించుటకు నిశ్చయించుకొనెను. ఆయనయొక్క యభయదానబలంబున నప్పటి పండితులు సర్వగ్రంథదహనముపాలుకాక

**పూర్వగ్రంథముల మరలనుద్ధరించుట.**

బ్రతికి చెదిరిపడియున్న గ్రంథముల నన్వేషింపసాగిరి. బూడిదలోనుండి మరల వెలువడుచున్నవో యనునట్లు కొన్ని ప్రాచీనగ్రంథములు దొరకుచుండెను. కొండగుహల పార్శ్వముల యందును, నిండ్ల నడికొప్పుల యందును, నదీతీరములయందును, గొన్ని గ్రంథములు లభించెను. వీనిని నట్లు దాఁచి యప్పటి పండితులు తమ ప్రాణంబులం గోలుపోయిరి. బొత్తిగ నశింపయిన గ్రంథము లప్పటి పండితులైన వృద్ధులు తమ దృఢజ్ఞాపకమునుబట్టి నోటను జెప్పఁగా నవి మరల లిఖింపఁ బడినవి. ప్రథమ మహాచక్రవర్తి యయిన "హోంగ్టి" యొనర్చియున్న గ్రంథదహనకార్యము నిట్లు సవరణ నేసి "కేయోటి" (Kaoti) ప్రభుం డాచక్రివర్తి

యేర్పఱచిన రాజమార్గముల వృద్ధిచేసి జనోపయోగములయిన కార్యము లనేకములు చేసెను. తగిన యింజినీర్లను నియమించి వేలాదు వంతెనలను గట్టించి బహు శ్లాఘాపాత్రుం డయ్యెను. అట్టివంతెన లంతకు మున్ను ప్రపంచమందు లేనే లేవు.

సర్వ జనోపయోగము లైనపనులు వృద్ధి చేయుట.

ఈ "హాణ్" వంశపువారి ప్రభుత్వకాలము తమదేశచరిత్రలో మిగుల గణనీయమని చీనావారందఱు కొని యాడెదరు. తమ్మైన "హాణ్" వంశపుత్రు లని పిలుచుటకంటె గొప్ప పరువుగల బిరుదు మఱియొకటి లేదనియుఁ దలఁచెదరు. ఈవంశ

హాణ్ వంశముయొక్క శాశ్వతకీర్తి.

ముయొక్క యేలుబడికాలములో నుత్పన్నమయిన గ్రంథసామగ్రి మఱల నుద్ధరింపఁబడినందున నీ వంశమున కింతప్రఖ్యాతి కలిగె ననుటకు సందియములేదు. గ్రంథదహన విషయమై ప్రథమచక్రవర్తికిఁ దోఁచిన హేతువులు వాస్తవము లనియే "కేయోటి" ప్రభువునకును గొంతవఱకుఁ దోఁచెను గాని యాయన యనంతరరాజులు మాత్ర మట్లు తలఁపక పురాతనగ్రంథసామగ్రి యుండుట యావశ్యకమే యని నిజంబెఱింగి తమ శక్తికొలంది చీనాదేశీయుల శాస్త్రపరిజ్ఞానమును వృద్ధిచేయించిరి. శాస్త్రాధ్యయనమందును, పాండిత్యసంపాదనయందును చీనావారి యభిలాష నంతయింతయని చెప్ప శక్యముకాదు. కావున నాచక్రవర్తులు. ప్రాచీన గ్రంథోద్ధారణము చేయుటయేకాక గొప్పశాస్త్ర పాఠశాల నొకటి నవీనముగా నేర్పఱచిరి. సాహిత్య శాఖలలోఁ బ్రతిశాఖయందునను బహునైపుణ్యము చూపఁబడెను. క్రీ. పూ. 206 సం॥ లో "కేయోటి" ప్రభువు సింహాసన మెక్కినపుడు నాగరికగ్రంథములు లేవు. క్రీస్తుశకోదయమునకుఁ గించిత్పూర్వము రాజకీయ గ్రంథాగా

ఆవంశపు రాజులు దేశభాషను శాస్త్రము లను వృద్ధిచేయుట.

రమం దాదిభాషాగ్రంథములు 3123, తత్త్వశాస్త్రగ్రంథములు 2705, కావ్యగ్రంథములు 1383, నున్నవి. ఇట్లు సాహిత్య విషయక సరసమార్గములయం దతిశీఘ్రగాముల మయితిమని చక్రవర్తులు విశ్రాంతినొంద లేదు. మఱియునిన్ బరరాజ్యములపై దండెత్తిపోవుటయో, తద్రాజ్యములకు రాయబారులనుఁ బంపుటయో యిట్టి ఘన కార్యపరాయణులై కూడనుండిరి. అట్టి యుద్యములలో ఆసియామధ్యభాగమందలి యజ్ఞాత ప్రదేశమునకుఁ బోయిరి. క్రీ. పూ. రెండవ శతాబ్దమందు "చాంగు చియన్" (Chang Chien) అను రాయబారి తూర్పుతురుష్కస్థానమునకుఁ బోయెను. తర్వాత రెండుశతాబ్దములకు "జనరలు పాన్ కేయో" (General Pan-Chao ) సేనాసమేతుఁడై ఖోటెన్ (Khoten) ప్రదేశముమీఁదికి దాడి వెడలెను. మఱియు కాస్పియను సముద్రతీరము వఱకుఁ దమ బావుటాలను నెలకొల్పుచు వెళ్లిరి. దక్షిణాగ్నేయ దిశల నున్న కొచ్చించీనాను, లియోటంగు (Liaotung) పర్యాయద్వీపమును జయించి తమపాళెములుగఁ జేసికొనిరి. యూనన్ (Yunun) చీనారాష్ట్రములోఁ గల్పుకొనఁబడెను. వీనిలో కొచ్చిన్‌చీనా ప్రాగ్ప్రపంచవ్యవహారములలోఁ గొంత కాలము క్రిందట వన్నెకెక్కియుండెను.

అన్యదేశ జయములు.

ఇట్లుండఁగాఁ బైని నంశంబులంబోలు ముఖ్యవిషయము మఱొక్కటి యక్కాలంబును దిలకించెను. అదియెద్ది యనిన బౌద్ధమతప్రవేశమే: క్రీ.త. 58 సం|| మొదలుకొని 76 సం|| వఱకుఁ బరిపాలించిన "మింగ్టి"యను చక్రవర్తికి నొకరాత్రి పాన్పుపైనుండఁగ నొక బంగారుబొమ్మ స్వప్నదృష్టమై బుద్ధుఁడను మహనీయుని సిద్ధాంతములను దృష్టాంతీకరించు గ్రంథములను, విగ్రహములను, నేమకి తెచ్చుటకై పశ్చిమదేశములకు మనుష్యులం బంపుమని చెప్పినట్లు చరిత్రలు ప్రతిపాదించుచున్నవి. ఈ యాజ్ఞానుసారముగ, నవ్యవధిగ, ఇండియా దేశమునకు దూతలను ఆయన పంపెను. వారు పదునొకండు వత్సరంబులు కడ

బుద్ధమతము చీనాయందుఁ బ్రవేశించుట.

చిన పిమ్మట గ్రంథములను, విగ్రహములను, బటనులను, సంపాదించి మఱియు నొక బౌద్ధమతాచార్యుని వెంటఁబెట్టుకొని వచ్చిరి. బౌద్ధమార్గదర్శియయిన యీ మతాచార్యు ననుసరించి పిమ్మట మరికొందఱు మతాచార్యులు వచ్చిరి. వీరందఱు సద్భుతశ్రద్ధాళువులై మతసూత్రములను సంస్కృతభాషలోనుండి చీనాభాషలోనికి భాషాంతరీకరణంబొనరించిరి. ఈవంశపుచక్రవర్తు లిన్నియుపకారముల నొనర్చినను వారివంశమంతమగుటతప్పక పోయెను. ఇది చీనాదేశ పరిపాలకులకుఁ దప్పనిగతియని తలఁపవలయును. క్రీ. త. 2 వ శతాబ్దాంతము కాఁబోవుచుండఁగా రాజ్యవిప్లవచిహ్నములు కన్పట్టెను. ఇట్టి విప్లవములు చీనావారికి మఱేమియుఁ గ్రొత్తలు కావు. వారలలవాటుకలవారై యుండిరి. ముగ్గురువీరులుతలలెత్తిరి.‘‘షుహు’’(Shuh)రాజ్యమందొకఁడును,‘‘వియి’’(Wei)రాజ్యమందొకడును,‘‘వ్యూ’’(Wu)రాజ్యమందొకఁడును. క్రీ. త. 190 సం॥ మొదలుకొని 221 సం॥ వఱకుఁ బాలనచేసిన ‘‘సైన్టి’’ (Hsienti) చక్రవర్తి వారితోఁబోరి తన రాజ్యమును రక్షించుకొనలేక రాజ్యమునకై యొండొరులతోఁ బెనంగి పోరుఁడని వారికి విడిచిపెట్టి రణభీరువయి రహస్యముగ జీవించుచుండెను. ‘‘హాన్’’ వంశము క్రీ. పూ. 205 మొదలు క్రీ. త. 226 వఱకేలెను. అప్పు డన్యోన్యఘోరకలహంబులు ప్రవర్తిల్లె. కలహకారులయిన వీరులు క్రూరమృగంబులవలెఁ బోరాడిరి. అందువలన రాజ్యమందలి నెమ్మదియు జనుల క్షేమమును నూఁచముట్టుగ నశించెను. కాఁబట్టి యీ కలహకాలము చీనాదేశచరిత్రలోఁ బాపిష్ఠకాల మనఁదగియున్నది. ఆకలహముచే జనులు మిగుల సంకటపడి పడమటి ‘‘చిన్’’ (Chin) వంశమువారు క్రీ. త. 265 సం॥ లో కానందభరితులైరి.

హాన్ వంశాంతము.

చీనారాజ్యమునకై కొందఱువీరులొండొరులతోఁ బోరుట.

‘‘చిన్’’వంశమువారు చక్రవర్తులగుట.

రాజ్యమునకు వచ్చుట

నామమాత్రముగ వ్యాపించియున్న బుద్ధమతమున కీవంశపురాజులు ప్రబల ప్రోత్సాహకులైరి. ఈవంశము

బౌద్ధమతప్రాబల్యము.

వారి యేలుబడి కాలములోనే "ఫాహియన్" (Fahien) అను చీనాదేశ బౌద్ధుఁడు హిందూదేశమందా బుద్ధముని పావన క్షేత్రంబులని తలఁచిన వెవ్వియు వానిం గనుగొనుటకును దన దేశస్థులకుఁ దెలియని బౌద్ధమతగ్రంథముల సంపాదించుటకును హిందూదేశయాత్ర చేసెను.

ఫాహియాన్ యాత్రికుఁడు.

14 వత్సరంబుల కాలము కడచిన పిమ్మట సింహళము నుండి సముద్రయానము చేసి కొంత గ్రంథ సముదాయముతోను గొన్ని విశేషవృత్తాంతంబులతోను ఆయన స్వదేశము చేరెను. అనంతరము విశ్రమకాలమందా గ్రంథాధారముల చేతను, విశేషాంశంబులచేతను, దన యాత్రావృత్తాంతము వ్రాయుట కాయన సమర్థుం డయ్యెను. ఆంగ్లేయ గ్రంథకర్త లిద్దఱాయాత్రావృత్తాంతము నాంగ్లేయ భాషలోని కతిమనోహరముగా భాషాంతరీకరించిరి. క్రీ. శ. 419 సం॥ లో ఈ చిన్ వంశ మవసానమునకు వచ్చెను. మహారాజ్యము మఱల విభాగదశకుఁ దేఁబడెను.

చిన్ వంశావసానము.

పిమ్మట 160 సం॥ల కాలము ఆఱుచిన్నరాజ్యములవారు జనులు కలవరపడుచున్న ప్రదేశములపై యధికారమును గుఱించి కలహించుచుండిరి. పదంపడి స్వల్పకాల మనఁగా ముప్పది వత్సరంబులుమాత్ర మొక వంశమువారు పాలించిరి. వారిలో "యాంగ్టి" (Yangti) అను

యాంగ్టి చక్రవర్తి.

ప్రభువును బట్టిమాత్ర మావంశమునకుఁ బ్రసిద్ధికలిగెను. రాజ్యములోఁ గాలువలఁ ద్రవ్వించుటకు యోగ్యమయిన ప్రదేశములు మధ్యభాగమందును దూర్పుననుమాత్ర మున్నవి. ఆప్రదేశములయందా ప్రభువు కొనియాడఁదగిన

కాలువలు త్రవ్వింపఁబడెను.

పూనికతో గాలువలఁ దర్శించి కీర్తిశాలి యయ్యెను.

ఆస్వల్పకాలపు వంశమంతరించిన తోడనే "టాంగు" (Tang) వంశమువారు చక్రవర్తులయిరి. పూర్వము "అగస్టసు" (Augustus) అను మహాజ్ఞాని కాలమందు యూరోపుఖండవాసులు జ్ఞానులయినట్లు చీనావారును టాంగు వంశపువారి కాలమందు జ్ఞానసంపన్నులయిరి. ఈవంశపు వారి ముఖ్యోద్దేశ్య మేమయి యుండెననఁగా గతంబున లిఖింపఁబడిన "కన్ఫ్యూసియసు" (Confucius) అనుమహాజ్ఞాని పవిత్రములని యెంచియున్న పూర్వవిశ్వాసములును, బరంపరాగతవృత్తాంతములను, సంపూర్ణముగాఁబునరుద్ధారణము చేయవలయుననియే. ఈయుద్దేశము నూతనముగా దేశమందు వ్యాపించుచున్న విదేశీయ బౌద్ధమతమునకు విరోధమయి దానిని దుర్బలపఱచెను. దేశమం దంతకు మున్నె బౌద్ధమత మనేకస్థలములయందు నెలకొనెను. ఇప్పటివలెనే యప్పుడును నట్టిమతములు రాజద్రోహమునకును, అల్లరులకును, బుట్టినిండ్లుగ నుండెను. ఏలయనఁగా నట్టిదురాలోచన లామతములయందుఁ జేయఁబడుచుండెను. ఆచెఱుపులెట్లున్నను ఆమతస్థులందఱును "కన్ఫ్యూసియసు యొక్క సిద్ధాంతము నవలంబింపవలయుననియుఁ బ్రజలలోఁ గొందఱు తెలివిహీనులలయి వానినిద్యజించి బౌద్ధమతస్థులయిరి కావున వారుమరల దానిని విడిచి పూర్వమువలెనే వ్యావహారిక దశలోనికి రావలయుననియు జక్రవర్తులచే ననేక యుత్తరువులు చేయఁబడెను.

టాంగువంశము.

బౌద్ధమతముక్షీణించుట.

ఈవంశచక్రవర్తులు దేశీయశాస్త్రపాండిత్యవిషయమై యత్యాదరముతోఁ జేసిన కృషియే వీరికి శాశ్వతకీర్తి సంపాదకం బయ్యెను. వీరి కాలమందుఁ గవీశ్వరులు, వ్యాసకులు, చరిత్రకారులు, మహాప్రవీణులయి నూతన గ్రంథవర్షముం గురిపించిరి.

టాంగువంశ చక్రవర్తులు పాండిత్యమును గ్రంథములను బెంపొనరించుట.

అవి వారి సమకాలీనులకే కాక యీ నేఁటి కాలపు విద్యార్థులకును, విద్వాంసులకును గూడ నతిమనోహరంబులుగ నుంచున్నవి. చీనాదేశమందలి ప్రతిపుస్తకాగారములో నేఁటికిని "టాంగు" వంశ చక్రవర్తికృతములయిన కావ్యములు కానవచ్చుచున్నవి. అవియేకాక యందలి యసంఖ్యాతములైన నాగరిక సాహిత్యగ్రంథములు నిరుపమాన సారస్యముగలవి యని పండితకోటి యిప్పటికిని భావించుచుండును. మఱియు సాహిత్యరంగమందు వారెంత ప్రాముఖ్యతం జెందిరో యుద్ధరంగమందును నంత విజయము నొందిరి "హామిల్" (Hamil) "తుర్ఫాను" (Turfan) "ఊగరు" (Ouigour) దేశములను జయించి తమరాజ్యముతోఁ జేర్చుకొనిరి. ఈరీతిగఁ దమ రాజ్యమును ఆసియాఖండముయొక్క పడమటి యెల్లవఱకనఁగా యూరోపు ఖండము నానుకొనువఱకు వృద్ధిచేసిరి. అట్టి మహోన్నత దశం జూచి రోమకక్రైస్తవమత గురువు తన మతముఁ దద్దేశంబున నెలకొల్పు తలఁపునంజేసి యొక రాయబారిని చక్రవర్తియొక్క సన్నిధికిఁ బంపెను. ఆ మతగురువు తన మతవ్యాపకంబునం దెల్లప్పుడును దత్తావధానుండయి యుండును. ఆరాయబారి వచ్చుటకు మున్నె పారశీక, నేపాళ రాజ్యముల నుండి రాయబారులు చీనాచక్రవర్తి సన్నిధానమం దుండుటఁ జూచి యాయన మిగుల నాశ్చర్య మొందెను.

రాజ్యముయొక్క మహోన్నత దశ.

అంతకుఁ బూర్వమే "నెస్టోరియన్" క్రైస్తవులు తమ మతమును దమకుఁ దెలిసినంతవఱకు చీనాదేశమందు వ్యాపింపఁజేయ మతబోధకులను బంపి యుండిరి. వారి ప్రయత్నము లెంతవఱకు సఫలములయినవో యావిషయము చరిత్రలయందుఁ గానఁబడదు. అయినను వారుకొంత ప్రయత్నము చేసిరనుటకు "సియాన్‌ఫ్యూ" (Hsianfu) అను పట్టణమందు నేఁటికిని గానవచ్చు నొక శాసనము ప్రబల దృష్టాంత

క్రైస్తవమతబోధకుల రాక.

ముగా నున్నది. ఇట్టి మహోన్నతపదవిం

**టాంగు వంశావసాన సూచనము.**

జెందినను వంశావసానకాల మాసన్నమయిన దని తెల్పుట కుండవలసిన యంతశ్ఛిద్రములు పొడసూపుచుండెను. ఈ వంశపు రాజు లిరువదిముగ్గు రవిచ్ఛిన్నముగఁ బాలించిరి. వీరిలో ననేకరాజులు పరిపాలనయందసమర్థులనియే యెన్నఁబడిరి. వీరిలో నొక "చక్రవర్తిని" మాత్రము పరిగణింపఁబడలేదు. ఆమె పేరు "వూ" (Wu). ఆమె క్రీ. త. 684 సం॥ మొదలుకొని 710 వఱకుఁ బరిపాలించెను, సింహాసన మారోహించుట కధికారము గలవానిని ద్రోసివేసి యామె సింహాసన మాక్రమించుకొనెను. అయినను నామె కలవరపడియున్నజనులకుఁ దన వివేక సామర్థ్యములవలన నెమ్మది సరసముగఁ గలుగఁజేసెను. కాని యానెమ్మది వెంటనేయంతరించెను.

**అన్యమతస్థుల బాధించుట.**

ఈవంశమువారు మతసహనమును గొంతకాలము పాటించి కాలక్రమంబున క్రైస్తవమతస్థుల నప్పుడప్పుడు వధించుటఁ బ్రారంభించిరి. పిమ్మట మహమ్మదీయులను, బౌద్ధమతస్థులను, క్రూరవధ గావించిరి.

**మనోహర కావ్యకర్తలు.**

"టూఫు" (Tufu) "లిటయిపో" (Let'aipo) అను కావ్యకర్తలు ప్రకృతిని గూర్చియు, ద్రాక్ష సారాయమును గూర్చియు, వాని సువిశేషంబులను వర్ణించి మనోజ్ఞకావ్యములను వ్రాసి తమకీర్తి నాచంద్రార్కంబుగ వెలయంజేసినది యీవంశపరిపాలనకాలమందె. వీరి కీర్తి ప్రపంచ మంతట లేకున్నను చీనారాజ్యమందున్నది. కీర్తితోఁగాని యపకీర్తితోఁగాని యీవంశము క్రీ. త. 620 మొదలు క్రీ. త. 907 సం॥ వఱకునేలెను. క్రీ. త. 907 సం॥ నందు, "సుంగు" (Sung) వంశము పాలనమునకు వచ్చువఱకుఁ గొన్ని వంశములు చీనారాజ్యమును స్వల్పకాలము పరిపాలించినవి.

**చిన్నవంశముల పాలన.**

ఆకాలమందనఁగా క్రీ. త. 924

సంవత్సరములో ముద్రణపద్ధతి కనుఁగొనఁబడెను. మఱియు నించుమించుగా నకాలంబుననే స్త్రీలపాదముల మడఁచుట యనెడి యాచారము ప్రారంభమయ్యెను. పైనిఁజెప్పిన తాంగువంశ మంత రించు కాలంబున చీనాదేశపు టెల్లలయందు నొక తిరుగుడుగుంపువారు పొడచూపిరి. వీరు చీనాదేశముయొక్క సుగతి దుర్గతులకు నిరంకుశకర్తలు కాఁగలవారలయి యుండిరి. వీరు తార్తారులు. చీనా

తార్తారులు చీనాదేశముపైదండెత్తివచ్చుట.

దేశ మందలి యుత్తరప్రదేశములను వీరప్పుడప్పుడు కొల్లఁగొనుచు బలవంతులై యాదేశమందలి దక్షిణభాగరాజ్యముపై దండెత్తివచ్చి జయించి "యాంగ్జిసుకియాంగు" నదికి నుత్తరమున నుండు ప్రదేశమంతయు స్వాధీనపఱచుకొనిరి. ఈజాతి వారిని "కిటాన్" (Kitan) అందురు. ఈ తిరు

కిటాన్ వంశపు తార్తారులు.

గుడుగుంపు యొక్క యధికార మెక్కువ కాలము చెల్లలేదు. రెండువందలవత్సరములకు లోపుగాఁ బరిపాలించిన తర్వాతఁ దమ వంటి మరియొక తిరుగుడుగుంపునకు వారు

కిన్ వంశపు తార్తారులుదండెత్తివచ్చుట.

రాజ్యమొసంగి పోవలసినవారైరి. వీరు "కిన్" (Kin) తార్తారులు. వీరివంశమువారె యిప్పుడు పరిపాలించు చక్రవర్తులు. వీరును, "సుంగు" వంశపువారును, చీనారాజ్యమును బంచుకొనిరి.



# 4 వ అధ్యాయము.

## యూయన్ (Yuyan) మింగు (Ming) వంశములు.

1276-1368 సం॥ 1368-1644 సం॥

కిన్, సుంగు వంశముల వారలొండొరులతోఁ బోరుట.

'కిన్' (Kin) వంశము వారును 'సుంగు' (Sung) వంశము వారు, నెడతెగని పోరుల బెడిదంబుగఁ దొడరియుండఁగ నుభయ వంశంబుల మట్టింపఁగల దిట్టలు మంగోలియా యెడారి ప్రదేశంబులనుండి వెడలుచుండిరి. కారకోరము కొండల చెంగటనున్న 'అనన్' (Anon) కొండచఱియయందు మంగోలియా దేశపువీరుఁడొకఁడు పెరుగుచుండెను.

చంగిజ్ఖానుఁడు.

ఇతని పేరు చంగిజ్ఖానుఁడు (Chengizkhan) ప్రపంచమునఁదలి మహాపరాక్రమశాలు లయినపరిపాలకులలో నితఁడొకఁడని పరిగణింపఁ దగిన వాఁడయియుండెను. ఇతని వంశమునునితనిఁబరివేష్టించియుండు వారి వంశము నొక్కటియే యయియుండెను. స్వభావసిద్ధముగ నితఁడు జననాయకుండగుటకుఁ బుట్టెనని చెప్పఁదగియున్నది. ఇతఁడుచిన్నతనములోనె 'ఖాన్' (Khan) అను బిరుదుతో నొక తెగవారికిఁ బ్రభువయి యిరుగుపొరుగు దేశములపైఁ దాడి వెడలెను. ఆదేశాధీశులనుమంటఁగలిపి వారల పరాజిత సైన్యంబులతోఁ దనబలంబు బలపఱచుకొని ప్రబల యుద్ధంబులకు సన్నద్ధుఁడై యుండెను.

ప్రబలుట.

చంగిజ్ఖానునిజయములు.

ఇప్పటి 'కన్సు' (Kansu) 'సెన్సి' (Sensi) పరగణాలం జేర్చికొనియున్న సియా (Hsia) రాజ్యము విశేష ఫలవంత మయినది గాకున్నను, మంగోలియా దేశపు టతిశీతల ప్రదేశములతోఁ బోల్పఁగ

నది స్వర్గఖాండ్రికవలె మంగోలియావారికిఁ గన్పట్టెను. చంగిజ్ ఖానుని పోటుబంటులా దేశమును స్వవశంబు కావించుకొని నూతనజయోల్లా సులై పేరాసతో 'కిన్' వంశపు వారిపై క్రీ. శ. 1211 సం॥లో దాడివె డలిరి. ఈ దండయాత్ర యసంపూర్ణ జయప్రదంబగుటచే "చంగిజ్ ఖానుఁ డు' 'ఓనన్' (Onon) నదీతీరమందున్న 'ఒర్దు' (Ordu) నగరము నకుఁ దన యాచారప్రకారము వెళ్లి యచ్చటఁ దన సైన్యంబుఁ బలపఱు చుకొని ద్వితీయ దండయాత్రకై సిద్ధపడియుండెను. వత్సరద్వయానంతర మాజగజెట్టి 'చిహ్లి' (Chihli) పరగణాను ముట్టడించి దాని యందలి తొంబది సుందరనగరములఁ బాడువెట్టెను. ఇప్పటి రాజధానియయిన 'పికిన్' నగరమునకుఁ బరిసరంబుననున్న 'కిన్' వంశపువారి రాజ ధానికిఁగూడ నట్టిగతియే పట్టెను. నూతన సంపాదితము లయిన యాప్ర దేశముల యందుఁ దన సైన్యమును వాని సంరక్షణార్థంబుంచి చంగిజ్ ఖానుఁడు తన లక్ష్యమును పశ్చిమప్రాంతములకుఁ ద్రిప్పెను. ఇతఁడు సంపూర్ణ సన్నాహంబుతో నతి శీఘ్రంబుగ దండువెడలి 'కాష్గరు' (Kashgar) 'యార్కాండు' (Yarkand) 'ఖోటెన్' (Khoten) దేశ ముల జయించెను. అన్నిదేశంబుల జయించినను నతని రాజ్యకాంక్ష తీఱదయ్యెను. ఏదియో నెపముఁ గల్పించుకొని యాతండు దేశద్రిమ్మరు లయిన గుఱ్ఱపురౌతులం గూర్చుకొని 'ఖారిజం' (Khaurezm) రాజ్య ముపై వెడలి యందలి ఫలవంతప్రదేశంబుల నాశంబుచేసి 'జార్జియా' (Georgia) దేశమును ముట్టడించి తుట్టతుదకు యూరోపు ఖండముయొక్క పశ్చిమభాగమందుఁ బ్రవేశించెను. అతఁడు లోకభయంకరుఁ డయి నెగడవలయునని దేవుని నిర్మాణమయిన ట్లూహింపఁ దగియున్నది. అట్టిలోకభీకరత్వము తోడుగాఁగ నెదురొడ్డ నశక్యంబుగాని దళంబు తో 'మాస్కో' (Moscow) 'కీవు' (Kiev) పట్టణముల ముట్టడించెను. పవిత్రతంబట్టి యాకీవుపట్నమును రుషియాదేశపు జరూసలెము (Jarusa- lem) అనియందురు. అంతటితో నయిన విరమింపక "క్రాకో" (Cracow)

'పెస్తు' (Pesth) పట్టణములను ముట్టడించువఱకుఁ దన రాజ్యకాంక్ష యను గుఱ్ఱముయొక్క కళ్లెమును వెనుకకు లాగఁ డయ్యెను. ఈ పట్టణంబుల నెట్టన మట్టుపెట్టి తన జయించిన దేశములలోఁ దాను స్వారివెడలునప్పుడు తన గుఱ్ఱము వెనుకంజ వేయు నంతటి యిక్కట్టు దనకు లేదని యీజగజెట్టి మట్టుమీఱిన బింకంబు నెట్టుకొనఁ బలెక్కనఁట. అంతట నీ దిట్టరి తన స్వదేశమయిన మంగోలియాకు మఱలివెళ్లి 1227 సం|| లో కాలధర్మము నొందెను. ఈమధ్యకాలములో నీతని సేనానులు చీనాదేశమందు సోమరులుగ నుండలేదు. పసుపుకేటియొక్క తూర్పువంపున నుండు ఫలవంతక్షేత్రములను వీరు జయించి చంగిస్ఖానుని వారసునికి నమితభాగ్యము నొప్పగించిరి. ఆవారసుని పేరు 'ఒఘోతాయి' (Oghotai).

చంగిస్ఖానుని బింకపు పలుకులు.

రోమను కాతోలికు మిషనరీలు (క్రైస్తవ మత ప్రవర్తకులు) తమ మతప్రకాశము నజ్ఞానాంధకార పూరితమయిన మంగోలియా దేశమందుఁ జొప్పించుట యావారసుని ప్రభుత్వకాలమందే యయియుండెను. ఇది క్రైస్తవమతబోధకు లందఱును గృతజ్ఞతాపూర్వకంబుగ జ్ఞాపకముంచుకొనఁ దగియున్నది. ఈవిషయమై యొక క్రైస్తవ మత ప్రవర్తకుఁ డిట్లువ్రాసెను. "చావుఁడని చంపుఁడని దేవుఁడు తార్తారులను బడమటి ఖండములోనికిఁ బంపినపుడే రోమక మతాచార్యుఁడు తన్మత ప్రవర్తకులు ననఁగా 'డామినికు' (Dominic) 'ఫ్రాన్సిసు' (Fransis) అనబఁడు మతశాఖలవారి నీతూర్పుఖండమునకుఁ బంపి యామతమును ప్రకాశింపఁజేసి, బోధించి, స్థాపింపవలసిన దని వారికిఁ జెప్పెను. ఈ మతప్రవర్తకు లెంతగా నాసందేశమును నెఱవేర్చిరో తెలియదు. 'కార్పిని' (Carpini) యను మిషనరీపైని నుడువ

రోమక్ కాతోలికు మతము మంగోలియా దేశములోఁ బ్రవేశించుట.

'కార్పిని' యను మిష నరీ చీనావారిం గూర్చి వ్రాసినది.

బడిన 'ఒఘేాతాయి ఖాన్' యొక్క సంస్థానములో 1245 సంII మొదలుకొని 1247 సంII వఱకు నుండి తాను గనిపెట్టిన విషయంబుల గ్రంథస్థములుగఁ జేసెను. ఏవనఁగా 'నేను చీనాదేశమును జూడక మున్నా దేశీయులు మంగోలియా సంస్థానంబునం గనుపించిరి. వారు విగ్రహారాధకులుగానుండిరి. కానిపూర్వాచారమును విడిచెడివారు కారు. వారు దయగలవారును నాగరికులుగానుండిరి. వారికి గడ్డములు లేవు. మంగోలియావారిం బోలు ముఖవర్చస్సు కలవారె కాని ముఖములు వారియంత విశాలములుకావు. వారి దొకచిత్రమయినభాష. శిల్పవిద్యలయందు వారినిమించినవారు లోకములోనే లేరు. ధాన్యము, ద్రాక్షసారాయము, వెండిబంగారములు, మనుష్యజీవనమున కావశ్యక మయిన సమస్తవస్తువులు వీనితో వారిదేశము సమృద్ధమయి యుండును'.

'రూబ్రూక్విసు' అను క్రైస్తవమతబోధకుండు చీనావారిం గూర్చి వ్రాసినది.

పిమ్మటఁ గొన్ని వత్సరంబులకు 'రూబ్రూక్విసు' (Rubruquis) అను మఱియొక క్రైస్తవ మతబోధకుఁ డానంస్థానమునకే వెళ్లి పైనిఁజెప్పఁబడిన బోధకుఁడు వ్రాసిన విషయంబుల ధృవపఱచుచు నింకఁ గొన్ని విషయంబుల నిట్లు వ్రాసెను. 'అగస్టసు' కాలమందు లాటెను భాషా కవీశ్వరులు తమ కావ్యములయం దుదహరించిన 'సిరిసు' (Ceres) ప్రదేశము చీనాదేశమే యని నేను గనుగొంటిని. ఆ దేశీయులు వామనమూర్తులు. వారు ముక్కుగుండ మాట్లాడుదురు. వారి నేత్రము లిఱుకుగానుండును. ప్రాగ్ప్రపంచవాసుల యందఱనేత్రములకు నది సాధారణ లక్షణమే. అన్నివిధములయిన చిత్రపు పనివాండ్రలోవారగ్రగణ్యులు, ఆ దేశీయవైద్యులకు నౌషధులగుణవిశేషంబులు సమగ్రముగఁ దెలియును. నాడి చూచి రోగనిదాన మెఱుగుటయం దద్భుతులు

దూదితోఁ జేయఁబడిన కాగితపు తునకలే చీనావారి నాణెములు. ఆ కాగిత మరచేయి యంత పొడుగును వెడల్పును గలిగి యుండును. దానిమీఁద మంగూఖానుని మొహర్లవంటిగీతలు ముద్రింపఁబడియుండును. ఈ మంగుఖానుఁడు చెంగిస్‌ఖానుని వంశములోమూడవవాఁడు. చిత్రకారుని పేన్సలు వంటి పేన్సలుతో వారు వ్రాయుదురు. వారు వ్రాసెడి యొకయక్షరాకృతిలో నొక శబ్దమున కావశ్యకమగు నక్షరము లిమిడి యుండును. సహనము కలిగి దేహకష్టముపడు చీనావారియొక్క లక్షణములు పైనివ్రాసిన సంగతులవలన యథార్థముగ బోధపడఁగలవు.

'నెస్టోరియను' మత బోధకుల దుర్నయ మునుగూర్చి 'రూబ్రూక్విసు' వ్రాసినది.

చీనావారియొక్క సాంఘిక మర్యాదలను నాచారములను జూచి పైనినుదహరింపఁబడిన రోమన్ కాతొలిక్ మత ప్రవర్తకులు మిగుల సింతసించినవారైరికాని వారికిఁబూర్వమె యచటికివచ్చియున్న 'నెస్టోరియన్' క్రైస్తవ మతబోధకుల దుస్సహప్రవర్తనను గనుగొనిచింతాక్రాంతులై వెడలిపోయిరి.

'రూబ్రూక్విసు' (Rubruquis) అను మత బోధకుఁ డిట్లు వ్రాసెను. తాను వచ్చినయుద్దేశమును మంగూఖానుకు విశదీకరింపఁదలచినప్పుడు తత్స్థాన ద్విభాషి (దుబాసి) యామంగూఖానుఁ డిచ్చిన ద్రాక్షసారాయమును బలుమాఱు త్రాగియుండుటచే నస్వస్థచిత్తుఁడై యుండెననియు; ఆమంగూఖానుఁడును దత్పానపరవశుండై యుండెననియు, నందువలన నా దుబాసి తనమనవిని మంగూఖానున కవలక్షణముగ శ్రుతపఱచెననియు వ్రాసెను.

సురాపానము.

మతబోధలవలని ప్రయోజనము నీసురాపానాసక్తి వ్యర్థము కావించుచుండెను. గొప్పపుణ్యదినములయందునను, నుత్సవదినములయందునను, మతపవిత్రాచారములు జనులు త్రాగి తందనాలాడుటతో ముగింపఁబడుచుండెను. నెస్టోరియను క్రైస్తవమతాదరణగల "చక్రవర్తిని" యొకప్పుడు క్రైస్తవదేవాలయ

మందు సురాపానంబు చేసి మైమఱచియుండఁగా నామెగృహంబునకుఁ దోడ్కొనిపోఁబడెను. తాగి తూఁగి యాడుచున్న మతాచార్యులామె వెంటఁ బోవుచు సంగీతములు పాడి ధ్యానశ్లోకములు చదివిరి.

'మంగూఖాన్' యొక్క మరణము.

ఈమధ్యకాలములో మంగూఖాన్ సుంగువంశపువారితోఁ బోరాడుచుండెను. కాని యుద్ధసమాప్తి కాక మునుపే 1259 సం|| లో నాతఁడు మృతినొందెను. అట్లు పెంపొందుచున్న రాజ్యము నాతఁడు మహాకుబాలికి విడిచిపెట్టిపోయెను. ఈకుబాలి చెంగిస్ఖానుని మనుమఁడు. తన పితామహుఁడు చిరకాల మపేక్షించి యుండిన చీనాదేశమును జయించుటకై యెడతెగని పూనికతో కుబాలి ధారకొనెను.

మహాకుబాలీ మంగోలియా వారికి ప్రభువగుట.

ఈప్రబలమనోరథంబు సిద్ధింపక పూర్వమె వెనిసుయాత్రికుఁడయిన 'మార్కొపోలో' (Marco Polo) మహాకుబాలియొక్క సన్నిధికి వచ్చెను. మార్కొయొక్క తండ్రియుఁ బినతండ్రియు నదివఱకె వాణిజ్యముకొఱకు ఏసియాఖండము మీఁదుగా ఓనక్స్ నదియొక్క పల్లపుప్రదేశముల దనుక వచ్చియుండిరి.

మార్కొపోలో మహాకుబాలియొక్క సన్నిధికి వచ్చుట.

వారు 1571సం|| లో రెండవసారి వచ్చినప్పుడు తమ వెంట మార్కొను దీసికొనివచ్చిరి. వారు మహాకుబాలియొక్క రాజధానికిఁ బోయి రాజమందిరప్రవేశం బొనరించినప్పుడు మహాకుబాలి యనేక జమీందారులచేఁ బరివేష్టింపఁబడియుండెను. అప్పుడు వా రాప్రభువునకు సంపూర్ణగౌరవసూచకంబుగ మోకాలించి దండప్రణామంబు లాచరించిరి. అంతట నాప్రభువు వారిని లెమ్మని సెలవిచ్చి ప్రీతిపూర్వకసన్మానంబులు కావించి వారి యాగమనంబునకుఁ బ్రముదితహృదయుండై వారి క్షేమాభివృద్ధులం దెలుపఁగోరెను. 'ఏలినవారిక్షేమం బభివృద్ధి యగుచుండ మాకేమి కొఱంత

వాటిల్లు' నని వారు మనవిచేసిరి. పోపు (రోమన్‌కాతోలికు మత గురువు) తమకిచ్చిన యోగ్యతాపత్రికలను, లేఖలను, ఖానుకొసంగఁగా నాయన మిగుల సంతసించెను. పిమ్మట సమాధితైలము నిచ్చిరి. దానికి గూడ నాయన మిక్కిలి యానందపడెను. బాలకుఁడుగానున్న మార్కోనుజూపి యితఁడె వరని ఖాన్ వారి నడిగెను. వానితండ్రియయిన 'నికోలో' (Nicolo) 'అయ్యా! వీఁడు నాపుత్రుఁడును మీభక్తుఁడును, అని ప్రత్యుత్తర మిచ్చెను. వీనిరాకయు మాకు సంతోషకరమె యని ప్రభువు పలికెను. వీరి యాగమనము రాజసభయందు సర్వసంతోషకరంబును సమ్మానితంబు నయ్యెను.

మహాకుబాలియొక్క సభావైభవము.

తూర్పుఖండమందలి యారాజసభయొక్క విజృంభమును వైభవముసు జూచియాయాత్రికు లత్యద్భుతపడిరి. రాజసభావైభవాదు లంత యద్భుతంబులుగ నుండునని వారు స్వప్నంబుననైన నెఱిఁగియుండరైరి. సంవత్సరపుపండుగలును, దేశీయులుజ్ఞాపకార్థ మొనరించు నుత్సవంబులును, వా రూహింపనలవిగానియంత వైభవముతో జరపఁబడెను. మఱియు నాగరికలక్షణములయందు చీనావారికాలంబునఁ బాశ్చాత్యులకంటె నెంతహీనంబుగనున్నారో యకాలంబున వారంత యధికంబుగ నుండిరి. అట్టి లక్షణములలోఁజేరిన బ్యాంకినోట్ల యేర్పాటు

బ్యాంకినోట్లు.

చూచి వారు మిక్కిలియాశ్చర్యంబు నొందిరి. ఏలయన నప్పటికి బిమ్మట నాలుగుశతాబ్దముల వఱకు యూరోపుఖండమం దట్టి యేర్పాటనఁగ నేమియో యెఱుఁగకుండిరి. ఆకాలమున కనంతర మొక శతాబ్దమునకు చీనాదేశమం దుపయోగింపఁబడిన యొకబ్యాంకినోటు ఆంగ్లేయదేశమందలి మ్యూజియము (విచిత్రవస్తుప్రదర్శనశాల) లోఁ గానఁబడుచున్నది. ఇంచుమించుగా నల్లగనుండుకాగితము మీఁద నది

లిఖింపఁబడియున్నది. ఈ రంగునుగురించి 'మార్కో పోలో' యిట్లు విశదీకరించి యుండెను. చక్రవర్తి మల్బెరి (పట్టుపురుగు) చెట్లయొక్క పట్టలను దనప్రజలచేఁ దెప్పించును. ఆచెట్లు దేశమందు మెండుగ నుండును. దాని యాకులు పట్టుపురుగుల కాహారము. చెట్టుయొక్క కొయ్యవంటి భాగమునకును వెలుపలనుండు దట్టమయిన పట్టకును నడుమ నుండెడి యందమయిన తెల్లని పొరయే పైనిఁ జెప్పిన పట్టయయి యున్నది. దానిని చీనావారు నల్లకాగితముగఁ జేయుదురు.

బాంకినోటు యొక్క వర్ణన.

చక్రవర్తి యయిన 'ఖాన్' అంత పొడుగును బొట్టియును గాక సమ పరిమాణ మయిన దేహము కలవాఁడనియు, నవయవసౌష్టవము కలవాఁడనియు, ఆయనయే లిఖించి యుండెను. ఆ లిఖితాంశమే సత్యమయిన యెడల చీనాదేశపు చిత్రకారులు తాము లిఖించి పెట్టిపోయిన పటములయం దాయన సుందరవిగ్రహమునకు బూర్ణమయిన యపకార మొనర్చి యుండిరి. ఎట్లనఁగా వా రాపటముల యం దాయన నతి స్థూలకాయునిగాను వికారరూపిగాను గనఁబఱచిరి. స్వదేశీయుల చిత్రశాలా లేఖనములకంటె వెనిసు దేశీయుఁడైన యా "మార్కో" చేసిన వర్ణనమే యెక్కువ విస్రంభపాత్రమని యెన్నఁదగి యున్నది.

మహాకుబాలియొక్క యాకారవర్ణనము.

ఆ మధ్యకాలమందు చక్రవర్తి యయిన 'కుబాలిఖాన్' "సుంగువంశ్యుఁడైనయప్పటి ప్రభువును జయించుటకు జాగరూకతతో యుద్ధసన్నాహం బొనర్చు చుండెను. ఈ సన్నాహ ప్రారంభమందు 'మార్కో' యా చక్రవర్తి కనుకూల, సహాయం బొనర్చెనని చెప్పెదరు. 'మార్కో'

మార్కో మహాకుబాలి ఖాన్‌కు సహాయము చేయుట.

మంగోలియా సంగ్రామమునకు వచ్చిన కాలంబునకును యుద్ధప్రారంభ కాలంబునకును వ్యత్యయంబు కనుపించు చున్నది. ఆకాల వ్యత్యయ మెట్లున్నను మొదటి దండయాత్రలో కుబాలి పసుపు యేరు దాటి 'సియాంగ్యాంగు' (Hsian-gyang) పట్టణము మీఁదికి వెళ్ళెను. ఆసియా ఖండ పశ్చిమప్రాంత వాసులును యూరోపు ఖండముయొక్క ప్రాగ్ప్రాంతవాసులును రణరంగమందుఁ జూపఁగలిగిన మగఁటిమికంటె నెక్కువ మగఁటిమితోఁ జీనావారు మంగోలియనుల నెదుర్కొని రని యక్కాలపు యుద్ధములం గూర్చి వ్రాయఁబడిన చరిత్రలవలనం దెలియుట మిగుల గణనీయ మయి యున్నది. కాఁబట్టి యాపట్టణము బహుకాలము ముట్టడింపఁబడిన తర్వాత శత్రుపు లయిన మంగోలియావారికిఁ గైవసం బయ్యెను. మఱి కొన్ని దుష్కరయుద్ధంబులకుఁ బదంపడి కొన్ని ముఖ్యపట్టణముల వశపఱచుకొని తుదకు రాజధానియైన 'హంగుచౌ' (Hongchow) ను మంగోలియావారు స్వాధీనపఱచుకొనిరి. ఇట్లు తమరాజధానిని శత్రువశంబయినది మొదలుకొని 'సుంగు' వంశ్యుల పరిపాలనాధికార మవసానమునకు వచ్చిన దనియే యెంచవలెను, మంగోలియా వారి దండయాత్రాప్రవాహము నడ్డగింప సుంగువంశ్యులు చపలప్రయత్నంబులఁ జేసిరి కాని నిష్ప్రయోజనము లయ్యెను. తుదకు 1276 సం॥ లో 'కుబాలి' చీనాదేశప్రభువని చీనావా రొప్పుకొనిరి. మంగోలియాప్రభు వక్కాలంబున నేలిన రాజ్యమునకంటె యధికవిస్తీర్ణరాజ్య మేరాజయిన నేలియుండినట్లు ప్రపంచచరిత్రలోఁ గానరాదు. మఱియు నల్లసను

కుబాలిఖాన్ యొక్క మొదటి దండయాత్ర.

సుంగువంశ్యుల రాజధానిని వశపఱచుకొనుట.

కుబాలిఖాన్ చీనాప్రభు వగుట. ఇచ్చట నుండి 'యూయన్' వంశారంభము.

రాజ్య విస్తీర్ణము.

ద్రిము మొదలుకొని చీనాసముద్రిము వఱకును, ఉత్తరమంగోలియా మొదలుకొని ఆనాము (Annam) దేశమువఱకును గల విశాలదేశమం దలి యసంఖ్యాతము లయిన జనసంఘుంబు లన్నియు నాప్రిభువుయొక్క పరిపాలనలోని వయ్యెను.

కుబాలిఖాన్ యొక్క సేనలకుఁగల దండ యాత్రాప్రవీణత.

ఎంత దూరప్రిదేశములయందయినను నెంత విస్తీర్ణప్రిదేశములయందైనను నతిశీఘ్రిప్రియాణముల ననాయాసము గఁజేయుట "కుబాలి" యొక్క దండయాత్రా విశేషములలో నొకటి యయి యున్నది. అది కాక యెవ్వఁడేని చీనాదేశములోని పడమటి భాగమునందుఁ బ్రియాణముచేయుచు మేకలు మాత్రిము నడవఁదగిన యిరుకుదారులై కాని త్రోవలుగాఁగల పర్వతపంక్తులను దాటెడునంతటి యదృష్టవంతుఁడే యైనయెడల వాఁడాదండయాత్రల యద్భుతస్థితిని గ్రహింపఁగలఁడు. ఏదేశము మీఁది కయినను దండయాత్రి చేయకతప్పదని వా రనుకొనిరేని యెంతదూర మయినను నెన్నికష్టంబులు వాటిల్లినను వారు వెళ్లితీరినవారె. ఆప్రికారమె దక్షిణమందున్న 'యుంగుచాంగు' (Yung-chang) ప్రదేశపు యెడారులమీఁద వారిసేన లొకప్పుడు విడిసెను. 'కుబాలి' యొక్క సేనలకు నుత్తరదేశముల యందలి యుద్ధాభ్యాసమేకలదు కాని దక్షిణదేశ యుద్ధములరీతివారెఱుగరు. కాఁబట్టియాయెడారియగు

బర్మారాజ్యముపై దండెత్తి గెల్చుట.

ప్రదేశమునకు ప్రిభువుగా నుండిన బర్మారాజుయొక్క సైన్యవిశేషములను జూడ వారికచ్చెరువయ్యెను. బర్మావారియాయుధాద్యుపకరణములుమంగోలియావారికి నవీనములును భయంకరములునుగా నుండెను. బర్మావారికి గజసైన్యము కలదు. అట్టిది మంగోలియావా రెన్నఁడును జూచి యుండలేదు. కాని, మంగోలియావారి సేనాధిపతి పిఱికివియక, జంకక, యాగజసైన్యముపై బాణవర్షము కురిపించునట్లు తన గుఱ్ఱపుదళమును

బ్రోత్సాహపఱచెను. వారు గుఱ్ఱములను దిగి యట్లుచేయఁగా నాయేనుఁగులు కలతనొంది, చెదరి, వెనుకకు గిఱుకుఱ్ఱనమఱలి బర్మావారి సైన్యమునే యల్లకల్లోలము చేసెను. అట్టి కల్లోలావస్థలోనుండు బర్మా సైన్యముమీఁద నిరాటంకముగా మంగోలియాసైన్యము పడి పూర్ణముగ నోడించెను. మంగోలియావారియొక్క యధికసైన్యమును, నధికపరాక్రమమును జూచి తాళఁజాలక బర్మారాజు లోఁబడఁగా ప్రతి సం॥ చీ

కప్పము గొనుట.

నారాజ్యమునకుఁ గొంత నిర్ణీతమయినకప్పమును జెల్లించు నిబంధనమీఁద నాబర్మారాజునకు రాజ్యమును మఱల నొసఁగి కుబాలిప్రభువు స్వరాజ్యమునకుఁ దిరిగి వెళ్లెను. ఇంగ్లీషువారు బర్మారాజ్యమును స్వాధీనపఱచుకొనువఱకు నట్టి కప్పము క్రమముగాఁ జెల్లింపఁబడుచుండెను. ఇంగ్లీషువారు 'మాండెలె' (Mandalay) పట్టణమును వశపఱచుకొనిన తర్వాతఁ గూడ రెండు సం॥లు వారును లోఁబడినవారివలె గ్రహచారవశమున నట్టి కప్పమును చీనారాజునకుఁ బంపియుండిరట.

కుబాలిఖాన్ నౌకా దండయాత్రలలో నోడిపోవుట.

మెట్టదారులనగు దండయాత్రలయందు 'కుబాలి' దిగ్విజయము పొందినను నౌకాదండయాత్రయందు దురదృష్టుఁడుగానుండెను. జపాన్ దేశీయులోడదొంగతనములచే చీనా, కోరియా సముద్రతీరవ్యాపారులకు భీతిని, గలవరమును గలుగఁజేయుచుండిరి. తన్నివారణార్థము జపాను రాజ్యాధిపతితో 'కూబ్లాయి' (Kublae) కి సఖ్యము కుదరదయ్యెను. కావున నారాజ్యముపై కుబాలి నౌకాదండయాత్ర చేసెను. కాని కొద్దికాలము క్రిందట జరిగిన నౌకాయుద్ధములోఁ జీనావారు జపానువారిచేత నెట్టుల

జపాను దేశీయులు గెల్చుట.

నోడిపోయిరో యాలాగుననే యప్పుడును సంపూర్ణముగ నపజయము నొందిరి. ఆయుద్ధములోఁ గలిగిన యపజయమును దెల్పుటకు

హతశేషులుమాత్రము తిరిగి వచ్చిరి. ఆయవమానమునకుఁగాను బగఁ దీర్చుకొనుటకై పదఁపడి గొన్ని వత్సరంబులకు నొకలక్షనౌకాసైన్యముతో మఱల నాతండు దండెత్తెను గాని వెనుకటివలె నపజయమే కలిగెను. చీనాదేశమందలి లంకలమీఁదికి దండెత్తి యటులనే యపజయ మొందెను. కావునఁ దన సేనలు సుట్టను జేయఁబడు యుద్ధములయందె దిట్టలుగాని నౌకాయుద్ధముల కసమర్థులని 'కూబ్లాయి' తుద కొప్పుకొనవలసి వచ్చెను. తన పూర్వులవలెనే

పరమత సహనము.

కూబ్లాయికినిఁ బరమతసహనము కలదు. క్రైస్తవ మహమ్మదీయ బౌద్ధమతములయం దాయన కపేక్ష కాని యుపేక్ష కాని తుల్యముగా నుండెను. పిట్టను బట్టుటకై యెరం జూపినట్లు లౌక్యవ్యవహారము సాధించుటకై యొకప్పు డొకానొక మతమం దధిక ప్రేమఁ జూపెను. ఎట్లనఁగా

బౌద్ధమతమవలంబించినట్లు నటించి కుబాలిఖాన్ తిబెటునుస్వాధీనపఱచుకొనెను.

తిబెటు దేశమునందలి యజ్ఞాతారణ్య ప్రదేశముల వశపఱచుకొనుటకై తద్దేశీయమతమైన బౌద్ధమందుఁ దన కధికవిశ్వాస మున్నట్లు నటించెను. అందువలన నద్దేశమందు గురుపీఠమునకు మనుష్యుని నిర్ణయింపవలసిన యావశ్యకము కలిగినప్పుడు నియమింపుఁ డని ప్రజలు తన్నుఁ గోరునంతగా భ్రమింపఁ జేసెను. అట్లా దేశప్రభువును దన భక్తునిగఁ జేసికొని పిమ్మట నా దేశమునకుఁ దానే ప్రభువయి దాని నదివఱకే విపులమయియున్న చీనారాజ్యముతోఁ జేర్చుకొనెను. కాని యది సారవంతమయిన దేశము కాదు.

కూబ్లాయిఖాన్ అన్య జాతులవారిని సమ్మానించుట.

కూబ్లాయి యొక్క సహనము మతవిషయమైయేకాక యన్యజాతులవారిని నన్నియంతస్థులవారిని నాదరించుటయందును వ్యాపించుచుండెను. మంగోలియా సంస్థానమునకు వచ్చినప్పుడు ప్రి

థమున మార్కొపోలో (Marco Polo) కుజూపఁబడిన గౌరవమును ఆయన యానంస్థాన మందున్న పదునేడువత్సరంబులయం దెల్లప్పుడు నేకవిధము గానేచూపఁబడెను. మార్కొయొక్క పట్టుదలను సామర్థ్యమును జూచి ఆయన కుద్యోగముల నిచ్చుచు పాంసి మొదలైన దేశములలోఁ దిరిగెడి యుద్యోగము నొకప్పుడు కూబ్లాయి యిచ్చెను. ఆయుద్యోగము ప్రకార మాయా దేశస్థితులను గూర్చి యాయన కూబ్లాయికిఁ దెలియపఱుపవలసియుండెను. ఆయన యాపనియందును మఱియు నితరపనులయందును నెంతసమర్థతను జూపెననిన 'యాంచౌ' (Yangchow) పురపాలకునిగా నాయనను కుబ్లాయి నియమించెను. అక్కడ ఆయన 3 సం॥లు మాత్రము పరిపాలించి స్వదేశమునకుఁ బోవుటకు కూబ్లాయి సమ్మతింపనందున నెట్టకేల కాయన యంగీకారమును బొంది తనతండ్రినిఁ బినతండ్రిని వెంటఁగొని వెళ్లెను. ఈకూబ్లాయికాలమందు చీనాదేశ మదివఱ కెన్నఁడును లేనియభివృద్ధిఁ జెందెనని వక్కాణించుటకు లేశమయినను సందియంబు కానరాదు. ఆయన యనేకవిషయములయం దెంత బుద్ధిసూక్ష్మతంజూపెనో యంత శ్రద్ధావిశేషమును జనుల కష్టసుఖంబుల విచారించుచు న్యాయపరిపాలనఁ జేయుటయందును జూపెను. ఆయన చీనావారి శాస్త్రనియమములు నవలంబించి వారల యిష్టానిష్టంబులఁ బాటించుచుండెను. వారి జాతీయసాహిత్యప్రాపకుఁడుగానుండెను. న్యాయపరిపాలనయం దన్యాయమించుకంతయైన దొర్లనీయఁడయ్యె. కాని, యాప్రభువు విదేశీయుఁడగుటచేత నాయనవంశ్యుల దౌర్జన్యాదులచేతను బ్రిజ లాప్రభు వెంతయనుకూలంబుగాఁ బాలించినను దమదేశీయుడు కాఁడనియే పెదవి విఱుచుచుండిరి. మార్కొపాలో వెడలిపోయిన తర్వాత రెండు వత్సరంబులకు కూబ్లాయిఖాన్ కాలధర్మంబునొందెఁ. ఆయన 35 సం॥లు పాలించినను నాయన కళేబరమును

కూబ్లాయిఖాన్ యొక్క యోగ్యతలు.

కూబ్లాయిఖానునియందు చీనావారికిఁ గృతజ్ఞత లేకపోవుట.

సమాధి చేయుటకుం గొనిపోవునపుడు ప్రజలు విచారచిహ్నమేమియుం జూపరైరి. ఆయన ననుమఁడయిన 'తైమూరు' ఆయన యనంతరము సింహాసనాసీనుం డయ్యె. కాని చీనారాజ్యము నంతము పెూన్నత పదవికిం దెచ్చుట కాయన పితామహునియందుండిన ప్రబల సామర్థ్య మాతనియందు లేదయ్యెను. ఆయనకుఁ దర్వాత నేడుగురు చక్రవర్తులు శీఘ్రముగా నొకరివెంట నొకరువచ్చి యేలిరి. కాని వారిలో రెండవచక్రవర్తి తప్ప శేషించిన వారు ప్రసిద్ధిం జెందియుండలేదు. ఆ రెండవ చక్రవర్తి మాత్రము 'కన్ఫ్యూసియను' చేసిన సిద్ధాంతములను బ్రయాసపడి యనుసరించెను. మఱియు చీనావారికిని మంగోలియావారికిని సమముగా నుద్యోగముల నిచ్చుట యుదివఱకు లేకున్నను ఆయన యొసంగెను.

కూబ్లాయిఖానుని పరిపాలనముయొక్క మఱికొన్ని విశేషంబులు.

పైనిఁ జెప్పఁబడిన కూబ్లాయిఖానుని పరిపాలన విశేషంబులు మఱికొన్ని నుడువఁబడుచున్నవి. ఆయన మంగోలియా ప్రభు వయినప్పుడు మంగోలియావారికి లిఖిత భాష లేనందునఁ బొరుగుదేశీయు లయిన చీనా వారిచే వ్రాయించుకొనుచుండిరి. 'కూబ్లాయి' చక్రవర్తి చీనాదేశపు చదువరులతోడను బండితులతోడను బరిచయముకలవాఁడై తన దేశమందున్న లిఖితభాషాలోపమును నివారించుట యావశ్యకమని యెంచెను.

మంగోలియా ప్రజలకు లిపి యేర్పాటు చేయించెను.

కావునఁ దన దేశపు బుద్ధిశాలుర యూహలను దెలియపఱచుటకుఁ దగినట్టియు జనులకందఱకుపయోగించునట్టియు వ్రాఁతయక్షరంబులం బోలిన ముద్రాక్షరములనిర్మింపుమని 'బాష్పా' (Bashpa) అను నామంబుకల యొక పండితునిం గోరెను. ఆయన యట్లు నిర్మించెను. రాజ్యవ్యవహార సంబంధములయిన కాగితంబు లన్నియు నట్టి నిర్మితలిపిలో నుండవలయునని యొకశాసనమును 'కూబ్లాయి' ప్రచురింపఁ జేసెను. మంగోలియావారు చీనాదేశమును బ్రవేశించిన తోడనె యాలిపిని

మంగోలియాప్రజలు తమభాషను విడిచి చీనాభాష నభ్యసించుట.

విసర్జించిరి. పాదుపడి నట్లుండు తమ ప్రదేశములను విడిచినట్లే తత్తుల్యముగానే యుండు తమ భిన్నభిన్న భాషను ద్యజించి చీనావారి పాండిత్య విశేషముం జూచి యద్భుతపడిరి. కావుననే చీనాదేశము తనలోఁ గలిగియు సమస్తజలంబును దనతోఁ బాటుగ క్షారముగఁ జేయు సముద్రము వంటిది యని చెప్పుదురు. తదనుగుణంబుగనే చీనాదేశము మంగోలియా వారికిఁ దనభాషయందే యభిరుచి కలుగఁజేసెను. కావున వారు చీనా భాష నభ్యసించి చదువ వ్రాయ నేర్చుకొనిరి. చీనాభాషకుఁ గొంచెము భిన్నముగానుండి దానికి శాఖగా నుండు భాషయొకటి చీనాదేశములో వాడఁబడుచుండును. ఆశాఖభాష మంగోలియావారిదే యయి యున్నది. మంగోలియావారు చీనాకు రాక పూర్వమే చీనాదేశములో బొమ్మలాటలును, నాటకప్రదర్శనములును, సర్వజనులకు సంతోషకరము లయిన వినోదములలోఁ గొన్ని యయియుండెను. మంగోలియావా

నాటకములయభివృద్ధి.

రాయాటలయందుఁ గుతూహలము కలవారగుటం జూచి చీనావా రాయాటలను సక్రమంబుగ నధికంబు చేసిరి. మఱియుఁ బండితులయొక్కయు కఠినశాస్త్రాభిప్రాయములఁ జర్చించుటకంటెఁ బ్రత్యక్షంబగు ప్రపంచమును నాటకముఖంబునఁ బ్రదర్శించి వెలయింపం జేయుటయం దధికాపేక్ష గల నాటక గ్రంథకర్తలయొక్కయు వృత్తి యక్కాలంబున సర్వాదరణీయంబుగ నుండెను. మంగోలియావారి కాలమందు రచింపఁబడిన నాటకగ్రంథముల కంటెఁ జీనావారు తదనంతరమెక్కువ నాటకంబుల జేసియుండలేదు. చీనావారి నాటక సాహిత్యములో మంగోలియావారి కాలమందలి నాటకగ్రంథములు ప్రశస్తములయిన వని గౌరవింపఁబడుచుండును.

నాటకగ్రంథరచనము శ్లాఘనీయముగ నుండెననుట.

ఈవంశమువారిలోఁ జివరచక్రవర్తుల కాలమందు రాజ్యవిప్లవ చిహ్నంబులు పొడఁజూప నారంభించెను. కలహములును నల్లరులును నన్నివైపులఁ బ్రకోపించెను. 'షుంటి' (Shunti) అను పేరుగల చక్రవర్తి కాలమం దక్రమములు పూర్ణముగ విజృంభించెను. ఈవంశము జనానురాగము కలది కాదయ్యెను. ప్రభువులసమర్థులయిరి. కాఁబట్టి చీనాదేశీయ వంశ మేదియైనను బరిపాలింప వలెనను కోరిక ప్రజలకు మెండుగాఁ గలిగెను. చీనాదేశమందలి దక్షిణభాగములో విజృంభించుచున్న కలహసంఘములలో నొకసంఘపు నాయకుఁడు కిరీటధారి కాఁదగియుండెను.

యూయన్ వంశావసాన కారణములు.

'చు' అను వీరుని పూర్వస్థితి.

'చు' (Chu) అను పేరుఁగలవాఁడు చీనాదేశీయుఁడె. వాని తండ్రి కుటుంబమునకు దుర్దశపట్టెను. కావున వాని తల్లితండ్రులు మరణించునప్పటికి వాఁడు మిక్కిలిదరిద్రుఁడును దిక్కుమాలినవాఁడుగాఁ నుండెను. అట్టి దిక్కులేనివాండ్రను దఱచుగా మఠస్థు లాదరించుచుండిరి. కష్టములుసంభవించినప్పుడెల్ల నాతఁడు తనకు మఠమే శరణ్యమని యనుకొనుచుండెను. కాఁబట్టి వాడు శిరోముండనము కావించుకొని యథావిధిగ బౌద్ధసన్యాసి యయ్యెను.

ఆసన్యాసి కప్పటిదేశదుస్థితి కడు ముమ్మరముగఁ గనిపించెను. ఆయనయొక్క మఠమునకుఁ జెంగట రవులుకొనిన యొక కల్లోల మాయన సహజవీరధైర్యమును బురికొల్పఁగాఁ దన సన్యాసపు ముసుంగును వెసంగడఁద్రోచి కరవాలంబు ధరించెను. ధైర్యస్థైర్యసామర్థ్యంబులు గొప్పఁగ ముప్పిరిగొని యాయన నా కలహకారులకు నాయకునిగఁ జేసెను. తన యధికకౌశలంబుచే వారిని యుద్ధరంగములయం దెంత సమర్థంబుగ వ్యూహంబున నిల్పెననిన నాయన యొనరించిన రణంబులన్నియు నాయనకు విజయాభరణంబులయ్యె. ఆయన నాన్కిను పట్టణంబుపై దండ

డెత్తి పోవుచుండఁగ నెదిరించినవారే లేరు. ఆపట్టణమును ఆయన ముట్టడించి 40 సం॥లక్రిందట 'తైపింగువాంగు' (Taiping Wang) చేసినట్లుదానిని దన రాజధానిగాఁజేసికొనెను. అట్లు రాజధానిగా నొనరించి మంగోలియావారిని 'కియాంగ్సి' (Kiangsi) పరగణానుండి వెడలఁగొట్టెను.

'చు' కలహానాయకుఁడగుట.

మంగోలియా వారట్లపజయము నొందుట చీనా దేశపు మధ్యప్రదేశములయందే కాదు. కోరియాదేశమందును చీనా దేశపు పడమటి భాగములయందును నొూడిపోయిరి. ఇట్లాపదలు మూగియున్న కాలమందునసె 'షుంతి' చక్రవర్తి గతించిన తన పెద్దలలోఁ గలసెను. అంతటనింకయు జయింపఁబడని దేశములపై మూడు సేనలను 'చు' వీరుఁడు పంపెను. అట్టి సమయంబునఁ బ్రజాకలహంబు పెల్లునరేగి దేశమందంతట వ్యాపించియుండెను గాన నావీరుఁడు పంపిన సేనలనాయాసంబుగ జయముఁ బడసెను. రాజధానిస్తైన పికిన్పట్టణమా వీరసైన్యమునకు నిరాటంకముగాఁ గైవసంబయ్యెను. ఇట్టి విజయంబునకుం దగిన ఫలంబుగ నాతనిని సర్వజనంబులును గిరీటధారివి కమ్మని ప్రార్థింపఁగా నతఁడు 1368 సం॥ లోఁ గిరీటంబు ధరించెను. ప్రబలప్రయాసకార్యంబులు తనకు ముందున్న వని యాప్రభు వెఱింగి యుండెను.

'చు' మంగోలియావారిని దఱిమివేయుట.

వీరావేశముతోఁ బోరఁగల సేనలం గలవాఁడై యుండుటచే ధైర్యము చెడియున్న మంగోలియా వారిని దేశమునుండి పారదోలుట 'చు' ప్రభువునకుఁ బ్రయాసకరమయిన కార్యముగ నుండలేదు. కాని తనను చక్రవర్తినిగాఁ గోరిన ప్రజలకు సంతుష్టిగఁ బరిపాలించుట ప్రయాసకర మని యాయన గ్రహించి యెట్లయిన నీచక్రవర్తి రాజ్యార్హుఁడే యని

'చు' చీనాచక్రవర్తి యగుట. ఇచ్చట నుండి మింగువంశ పాలనము.

వారలచే ననిపించుకొనుట తనకు విధియని యనుకొనెను. తాను కలహకారులతోఁ గలసినయెడల నిట్లు తాత్కాలికజయము తనకుఁ గలుగునని యెట్లు ముందుగయోచనఁజేసెనో రాగల శత్రుబాధనుండి తానును బ్రజలును సురక్షితులగుట కాప్రకారమె భవిష్యదాలోచనము కలవాఁడై యుండెను. చీనాదేశీయులు తమకే కలదని గర్వించెడు దేశభాషాసాహిత్యమును బోషించుట యావశ్యకమని యాప్రభు వెఱింగెను. కావున నంతకుమున్ను చీనాదేశము నేలిన చంగిస్ఖానుని వంశావసానకాలమందు సంభవించిన దేశోపద్రవములలో నాశమొందిన పాఠశాలల నన్నిటిని దిరిగి స్థాపింపవలసినదని యాప్రభు వాకశాసనము ప్రచురించెను. ఆయన ప్రచురించిన ప్రప్రథమశాసనములలో నదియొకటి యయి యుండెను.

విద్యాభివృద్ధి చేయుట.

గతంబున లిఖింపఁబడిన 'టాంగు' వంశమువారియొక్క నెమ్మదియయిన యేలుబడికాలమందు రాజకీయమైన శాస్త్రపాఠశాల స్థాపింపఁబడెను. దానిపేరు 'హాన్లిను' (Hanlin.) ఈ రాజకీయ విద్యాలయమందుఁ బ్రవేశముం గనుట ప్రబలపాండిత్యసూచకం బని చీనావారు గౌరవముతో భావించిరి. చీనాదేశము నేలిన వంశములతోఁబాటుగ నీ శాస్త్రపాఠశాలయు ననేకమార్పులం జెందియుండెను. 'హంగూ' అను రాజకీయనామంబు వహించిన 'చు' ప్రభువా శాస్త్రపాఠశాలను యథాస్థితికిం దెచ్చుటకు నిశ్చయించుకొని యది శిథిలముగ నుండుటంజేసి వలసియుండిన సంస్కరణము లన్నియు స్వయముగాఁ జేయించెను. ఈ పాఠశాలాలయము రాజధానియయిన పికిన్ పట్టణము నందెయుండ వలసినదై యుండుటంజేసి దాని నట్లు సంస్కరించియును నాన్కిన్ పట్టణమును

'చు' ప్రభువుయొక్క రాజకీయనామము 'హంగువూ'.

పికిన్ రాజధానిలోను సర్వకళాశాలను సంస్కరించుట.

నానికిన్ నగరమందు మఱియొక సర్వకళా శాలను నిర్మించుట.

రాజధానిగా జేసికొనుట తన ముఖ్యాభిలాషమై యున్నందున దానియందును శాస్త్రపాఠశాలకై యొక యాలయమును గట్టించి పాఠశాల పెట్టించెను. ప్రస్తుతకాలమందుఁబరిపాలించు 'మంచూ' వంశమువారి కాలమందు నానికిన్ శాస్త్రిపాఠశాల యంతరించెను. 'పికిన్' రాజధానియందలి శాస్త్రపాఠశాలమాత్రి మిప్పటికిని విశేషగౌరవముతో వెలయుచున్నది కాని పికిన్ రాజధానియందుండు రాజభవనములును విదేశీయులగు రాయబారుల భవనాదులును దప్ప తక్కిన మందిరములించుమించుగ శిధిలమయిన స్థితిలోనుంచున్నవిం

పికిన్ రాజధాని యందలి సర్వకళాశాల యొక్క యాలయము క్షీణదశలోనుండుట.

వానితోఁబాటుగ నచ్చటి శాస్త్రిపాఠశాలాలయమును క్షీణదశలో నున్నది. జనులందఱెంతో గౌరవముతో జూచు శాస్త్రిపాఠశాలాభవనము శిధిలావస్థలోనున్న దనుట చదువరుల కసంగతంబుగ నుండవచ్చును. అయినను వాస్తవస్థితి యంతగనే యున్నది. దాని కారణంబు విస్పష్టంబుగాఁ దెలియదు.

న్యాయ శాసనముల సంగ్రహ స్మృతి.

చీనాదేశమందలి న్యాయశాసనములన్నిఁటినిసంగ్రిహస్మృతిరూపముగఁ జేయించుటయే 'హంసువు' యొక్క మఱియొక మహాత్కార్యము. మంగోలియావారి కాలమందు న్యాయపరిపాలన కట్టుదిట్టముగ నుండలేదు. వారికిఁ దమ యాయుధసామగ్రియందుఁగలదృష్టి న్యాయశాస్త్రములయందు లేకపోయెను. ఈ సౌమ్యకార్యమువలన 'హంగువు' దేశీయుల కమితలాభము చేసినవాఁ డయ్యెను. ధర్మశాస్త్రనిర్మాతకు సహజముగ నుండు బుద్ధివిశేషము కలవాఁడయి యాయన కేవల చట్టములను నమూనాలను నేర్పఱచినంత మాత్రిమున నెక్కువప్రియోజనము లేదని తెలిసికొని న్యాయస్థానములయందు న్యాయమును ధర్మమును బ్రిజలకు సమగ్రముగఁజేయుటకై

తన కాలమును సామర్థ్యమును వినియోగపఱచెను. అట్టి మహత్కార్యమును నెఱవేర్చుట సాధ్యమా యని శంకింపఁదగి యుండదు. కాని బహు

హాంగువూచక్రవర్తి తన న్యాయ బుద్ధిని వినియోగింపని కారణములు.

కాలమునుండి వివాదాంశములు విచారణము లేక చీనావారి న్యాయస్థానములయందుఁ బడి యుండినందున నెంత శక్తిగలవాఁడయినను నెంత యభిలాషకలవాఁడైనను నొక్కమనుష్యుఁడట్లు పేరుకొనియున్న వివాదములను సమగ్రముగఁదీర్పుచేయఁ జాలఁడు కదా. అదియటుండఁ బ్రజలకు న్యాయముకలుగఁజేయవలయు ననెడి 'హాంగువూ' యొక్క సదుద్దేశము బీజావస్థలో నుండఁగా రాజకీయోద్యోగులు దానిని వృక్షమయి ఫలించుదనుక పోషించి చక్కఁగఁ బెంపక వెంటనే కుళ్లగించిరి. అట్లొనరించుటచే నది ఫలింపనులేదు. చీనాదేశీయులకు మేలు కలుగనులేదు. అట్లగుట చీనావారి దురదృష్టమే యనఁదగి యున్నది. మంగోలియావారు పరాజయముల ననేకముగఁ బొందియుండినపిమ్మట మఱల

మంగోలియావారు మఱల చీనాపై దండెత్తి వచ్చుట.

బలవంతులై చీనారాజ్యముపై దండెత్తిరి. అందువలన నా ప్రభువు న్యాయశాసనములను వాని వినియోగమును మఱియు బాగుచేయుటకు వలనుపడక పోయెను. మంగోలియావారు మఱలఁ గొన్ని ప్రదేశంబుల జయించుటచే హాంగువూ ప్రభువునకు ద్రవ్యసాధనముల కిక్కట్టు సంభవించెను. అయినను మఱి కొన్ని ప్రదేశములను వారు ముట్టడించి పరాజయమునే పొందిరి. కొన్ని

మంగోలియావారిని దఱిమి వేయుట.

సేనలను గొన్నివైపులకు బంపి యచ్చట శత్రువులం బారఁదోలించి 'హాంగువూ' చక్రవర్తి దాను స్వయముగా 'యూనన్' ప్రదేశమునకు యుద్ధసన్నాహముతో వెడలి శత్రువుల రూపుమాపి యా ప్రదేశమును మఱల వశపఱచుకొనెను. అట్టి సంపూర్ణజయం

బులమధ్య పరిపక్వవయస్సునందు మహాగౌరవముతో 'హంగువూ' నిర్యాణమును బొందెను. మఱియు నాయన యనంతరునికి సమృద్ధమయిన రాజ్యసంపద నొసంగిపోయెను. కతిపయదినంబులకిందట చీనావారిలో బహుజనము ఆ 'హంగువూ' కాలమందలి తమ పూర్వుల బలపరాక్రమములను మఱల సంపాదింప నూహలుకలవారయిరి. మఱియు తత్కాలపు సేనావైపుల్యసామర్థ్యమును నిక్కాలపు స్థితులను బోల్చి 'కొలాహోవి' (Kolaohwei) కలహకారుల నాయకులు తమ సైన్యములలో నూతనుల ననేకులను జేర్చుకొని సేనలను బలపఱచి కొనిరి. తమ కలహసంఘమునకు 'హంగు' (Hung) అను పౌరుషనామమునుగూడఁ బెట్టుకొనిరి. ఇది పైనిజెప్పఁబడిన 'హంగువూ' చక్రవర్తి యొక్క నామమే యని యెఱుంగవలయు. 'హంగువూ' చనిపోవుటకుఁ గొన్ని సం॥ లకు ముందు ఆయన జ్యేష్ఠపుత్రుఁడు వ్యాధిచే మరణమొందెను. పిమ్మట నాయన తన రాజ్యమును దన పౌత్రున కొసంగునట్లు మరణశాసన మొకటివ్రాసెను. ఆ మనుమఁడు 'చీన్‌విన్' (Cheenwen) అను నూతననామమునుఁ బెట్టుకొనెను. వారసత్వవిషయమై జ్యేష్ఠత్వము ముఖ్యముగా నాలోచింపని తూర్పుదేశములయందు రాజ్యాధిపతి మరణానంతరము సింహాసనము నధిష్ఠించువా రెవ రగుదురో యను సంశయము కలుగుచుండును. అలాగుననే చీనారాజ్యమందు 'హంగువూ' యొక్క మరణానంతర మాయనయొక్క శేషించిన పుత్రులాయన పౌత్రునికంటె రాజ్యాధిపతిత్వమున కెవరికి వారెక్కువ యధికారము కలవార మని యనుకొనుచుండిరి. అట్లాశపడుచున్న తన పుత్రులు సింహాసనమునకై కల్లోలములను గలుగజేయ కుండుటకై రాజ్యమందలి వారివారి యధికారస్థానములకు వారిని బంపివేసి తన మనుమని మాత్రము తన చెంగట నుంచుకొనెను. తన తాతగారికి నుత్తర

హంగువూయొక్క స్మృతి.

'చీన్‌విన్' చక్రవర్తి యగుట.

క్రియ లొనరించు కాలమునఁ దన పినతండ్రుల రావించుట విధికృత్యముగ నెంచి వారిని రండని కోరుటచే నాపౌత్రునికిఁ జిక్కుకుక్కువమ్యెను. 'యన్' (Yen) అను పుత్రుండు తప్ప కడమపుత్రులు రామని నిరాకరించిరి. ఆపుత్రుఁడును దన యన్నకొడుకయిన యాచక్రవర్తికి లోఁబడిన వాఁడనని వచ్చియుండలేదు. తన తండ్రియెడల గౌరవము చూపవచ్చియుండెను. అదియునుంగాక యాయుత్తర క్రియలు ముగియఁగానే యాయన 'నాన్కిన్' (Nankin) నగరమ్మునకుఁ బోయి చక్రవర్తితోఁ గలహించుటకు యుద్ధసన్నాహము చేయుచుండెను. ఆ 'యన్' (Yen) గొప్ప సమర్థతను నిశ్చలబుద్ధిని ధైర్యమును గలవాఁ డగుటం జేసి తన భ్రాతృభ్రాతీయులతోఁ బలుసార్లు పోరి గెలుపొందెను. తుదకు 1402 సం॥ లో దన భ్రాతీయు డయిన చక్రవర్తిని నిశ్శేషముగ నోడించుటం జేసి యాయన తన పినతండ్రితోఁ బోరలేక యుద్ధము విరమించి రాజ్యమును ద్యజింప నిశ్చయించుకొనెను. అట్టి తెంపుం జూచి జను లాయన యాత్మహత్యం జేసికొనె నని కూడఁ దలచిరి. కాని తన పితామహునికిఁ గల మతాభిలాషను స్మృతికిం దెచ్చుకొనియో యేమొ యాయన శిరోముండనంబు కావించుకొని 'యూనాన్' మఠములో శరణస్థానముం బొందెను. నలువది సంవత్సరముల కాల మాయన యామఠమందు బ్రచ్ఛన్నముగ నుండెను. తదనంతరము తాను చిరకాలము ట్లజ్ఞాతవాసంబుగ నుండుటకు విసికియో యేమొ యాయన కవిత్వమారంభించి తనకు సంభవించిన క్లేశంబులను గష్టంబులను సవిస్తరంబుగ వర్ణించి యొక గ్రంథంబు వ్రాసెను. ఆ గ్రంథమందలి విషయంబులంజూచి దాని గ్రంథకర్త యాయనే యనినిర్ధ్వా

పాఁగుపూ కొడుకయిన 'యన్' యుద్ధసన్నాహంబు చేయుట.

చక్రవర్తిని నోడించుట.

ఓడినచక్రవర్తి కష్టములు.

దంబుగ నొప్పుకొనిరి. ఆయన చక్రవర్తి కుమారుఁ డగుటం జేసియో యాయన స్వేచ్ఛగా దిరుగుచుండిన యెడల గల

గ్రంథము రచించుట.

హంబులఁ బ్రేరేపించు ననియో యాయనను గాబోవు రాజ్యాధిపతి యయిన యాయన పినతండ్రి రాజనగరమందె కారాగృహస్థునిం

కారాగృహములో మరణించుట.

జేసెను. తుదకు మరణమే యాయన కష్టంబులఁ దుదముట్టించెను. 'యన్' (Yen) యొక్క యనుచరులు సింహాసన మధిష్ఠించు మని యాయనను బురికొల్పిరి. అది తన కనిష్టమయిన కార్యము కానందున ఆయన సింహాసన మెక్కెను. ఆయన యిరువదిరెండు

'యన్' చక్రవర్తి యగుట.

సంవత్సరము లవిచ్ఛిన్నముగను సమర్థంబుగను బాలించెను. మంగోలియావారి ప్రభుత్వకాలమందు 'పికిన్' పట్టణము చీనా రాజ్యమునకు

నామాంతరము 'యంగ్లో'

రాజధానిగా నుండెను. 'యంగ్లో' (Yenglo) అను నామాంతరము వహించిన ఆ 'యన్' (Yen) ప్రభువు తన వంశపూర్వక వృత్తాంతముల భిన్నంబొనర్చి వానిని జనులు మఱచునట్లు చేయుటకు నాన్కిన్ నగరమునుండి తన రాజధానిని పికిన్ నగర

పికిన్ నగరమును రాజధానిగా జేసికొనుట.

మునకు మార్చుకొనెను. తన చిత్తశాంతికొఱకును తన యనుచరుల సంతోషముకొఱకును తానె 'హంగువు' (Hongwu) చక్రవర్తికి ననంతర వారసుఁడయినట్టు తన సంతతివారికిఁ దెలియపఱచుటకును గూడఁ దన యన్నకొడు

'హంగువు' చక్రవర్తి దానే యనంతరుఁడ ననుట.

కయిన 'చిన్‌విన్' పరిపాలన కాలమును వంశచరిత్రలనుండి తుడిచివేయ వలసినదనియు, ఆయన పాలించిన నాలుగువత్సరముల కాల

మును గతించిన 'హాంగువూ' యొక్క పరిపాలనతోఁ గలుపవలయు ననియు శాసనము చేసెను.

పరిపాలనము యోగ్యముగా నుండెననుట.

ఆయన యొక్క సమర్థమయిన పరిపాలన కాలములో నంతకు మున్నున్న కల్లోలములతోఁ బోల్చి చూడఁగా ప్రజలు నెమ్మదిననుభవించి రని చెప్పవచ్చును. అందువలననే రాజ్యమందలి 13 పరగణాలపై తనకుంగల లక్ష్యమును 'యన్' ప్రభువు 'టాఁక్విను' (Tonquin) పరగణాయందలి వ్యవహారకల్లోలములకై త్రిప్పుట కవకాశము కలవాఁడయ్యెను. ఈయన పూర్వరాజుల పరిపాలనతోఁ బోల్పఁగా నీయన పాలనము తన రాజ్యమందేమియుఁ గలతలు లేక సుఖలక్షణముకలదై యుండెను. అయినను ఉత్తరపుటెల్లయందు తార్తారులతోఁ దీఱనిపోరొకటి యుండెను.

తార్తారులతోఁ బోరుట.

ఈయన సేనానాయకు లనేక పర్యాయములు వారిని జయించినప్పటికి వారిని నిశ్శేషముగ జయించితిమని యనుకొనుటకు వలనుపడ కుండెను. ఏలయన తార్తారులపోరుల తీరట్టిదిగా నుండెను. బహువిశాలము లైన ప్రదేశములనుండి వచ్చు బందిపోటుదొంగల గుంపులను నిర్మూలం బొనరింప నెన్నఁటికిని సాధ్యముకాదు. ఏలయన, వారోడిపోయి తమ విస్తీర్ణదేశములో నెచ్చటనో దాఁగికొని మఱలమఱల వచ్చుచుందురు. ఈప్రభువు వారలకు ఘోరనష్టములు కలుగజేసె ననునది యెవ్వరును లేదనలేరు. ఆబందిపోటు దొంగలగుంపుపై నొకప్పుడు దాడివెడలియుండఁగా 1435 సం॥ లో ఈప్రభువు మరణవ్యాధిచే పరలోకగతుఁడయ్యెను. ఈప్రభువు కేవలము యుద్ధవీరుఁడె కాఁడు. మఱేమనిన దేశభాషాసాహిత్యమందు విశేషాభిలాష కలవాఁడై యుండెను. కావున దనపే రద్దేశమందు శాశ్వతముగ వెలయింపఁ జేయునట్టి యొక గ్రంథరచనకుఁ గారకుఁడయ్యెను. చీనాదేశభాషయందుఁ గొనియాడఁదగిన సమస్తగ్రంథము

సర్వగ్రంథ సారమును రచింపఁ జేసెను.

లనుండి 'సర్వగ్రంథసారము' అను నొక గ్రంథమును గూర్పఁడని యప్పటి మహాపండితులకు నియమించెను. ఆబ్రహ్మాండ మయిన గ్రంథసంగ్రహము ననేక సంవత్సరములు చేసి వారు 1407 సం॥ లోఁ బ్రభువునకు సమర్పించిరి. అది 22877 గ్రంథములయొక్క సంగ్రహమయి యుండెను. దాని విషయసూచక 60 సంపుటములు కలదిగా నుండెను.

తదనంతర రాజుల యేలుబడి.

ఈప్రభువున కనంతరము పెక్కండ్రు రాజులు పాలించిరి కాని వారు పరిపాలనమున కసమర్థులనియు నందువలన దేశమంతయు నించుమించుగ నరాజకముగ నుండెననియుఁ జరిత్రలు తెలుపుచున్నవి. అయినను మధ్యఆసియానుండియు, ఇండియా, మలాకా దేశములనుండియు రాయబారులు 'స్వర్గపుత్రులు' అని బిరుదువహించిన యాప్రభువుల సన్నిధికి వచ్చిరనునది యొక విశేషసంగతియని చరిత్రకారులు వ్రాసిరి కాని బాహాటమయిన యల్లరులతోను జయప్రదములయిన ప్రజాకలహములతోను గూడి యంధకారసదృశంబుగనున్న వారి పరిపాలనకాలములో నట్టి ఘనవిశేషంబులను మెఱుములతోఁ బోల్ప వచ్చును. 1428 సం॥ లో 'టాంక్విను' పరగణా చీనావారి యాధిపత్యమును ద్రోసిపుచ్చి స్వతంత్రమయ్యెను. ఉత్తరపుటెల్లయందు తార్తార్యుల బందిపోట్లు ప్రబలమయి యనివారితములుగ నుండెను. తార్తారుల గుజ్జుపుదండుతోఁ బోరుటలో నొకప్పుడు లక్షమంది చీనావారు నశించిరనియు 'చంగ్ టంగ్' అను చక్రవర్తి యాయుద్ధములోఁ బట్టుకొనిపోఁబడెననియుఁ గూడఁ జెప్పెదరు. తనకు నాణెము 1 కి 6 షిల్లింగుల * వెలగల 100 బంగారు నాణెములను 200 వెండినాణెములను జెల్లించిన యెడల తార్తారనాయఁకుఁ

తార్తారులబందిపోట్లు.

* ఇది చీనాదేశపు నాణెము. దీని పేరు తేల్ అందురు.

డాచక్రవర్తిని విడిచిపెట్టెద ననినప్పుడు చీనా ధనాగారములో నంత పాటి సొమ్మే లేకపోయెనని చరిత్రలవలనఁ దెలియుచున్నది. దేశము యొక్క యప్పటి నీచస్థితిం దెల్పుటకదియే గొప్ప తార్కాణముకదా? ఆచక్రవర్తి 8 సం॥ లు తార్తారుల చెఱసాలలోనుండి యుండఁగా, ఆయనకుఁ బ్రతినిధిగ నాయనయనుజుఁడు రాజ్యమేలెను. 1465 సం॥ లో

చంగుటంగ్ చక్రవర్తి యొక్క నీచమరణము.

'చంగ్ టంగ్' ఆకారాగృహములోనే మరణింపఁగా తార్తారులాయనను గనికరముతో సమాధిజేసిరఁట. ఎట్లనిన రాజుల సమాధిదగ్గిఱ జానిసలను బలి యిచ్చెడి యాచారము తార్తారులలో నుండఁగా ఆయన సమాధియొద్ద నటుల జరుపలేదఁట. చీనాదేశములోఁగూడ 'మింగు' వంశపురాజులలో మొదటివారును నట్లు చేసిరఁట. ఆచక్రవర్తి కాలమందలిది, జ్ఞాపకార్హమయిన విషయమొకటికలదు. అది యేదియనిన 'మింగు' రాజుల కాలమందు చీనాదేశముయొక్క విస్తీర్ణా

భూగోళశాస్త్రము.

దులం దెల్పునట్టి సంపూర్ణ భూగోళశాస్త్రమును రచియింపఁ జేయుటయే. అదృష్టవశమున నిప్పటిప్రభుత్వరాజులు దానియం దభిమానము కలవారయి 500 గ్రంథములనుగల యాశాస్త్రమును ముద్రింపించిరి.

'చంగ్ టంగ్' యొక్క యనంతర చక్రవర్తి పికిఙ్ పట్నము

చంగ్టంగ్ చక్రవర్తి పికిఙ్ పట్టణమునుండి పీహెూపట్టణము దనుక కాలువను త్రవ్వించుట.

నుండి 'పీహెూ' పట్టణమువఱకు నొక కాలువను త్రవ్వించెను. ఆయన పేరు 'చంగ్టి' (Chengti). చీనాయొక్క యుత్తరపశ్చిమ ప్రదేశములలో తార్తారు లనవరతము చేయు దోపుడులు యుద్ధము లట్లుండగా మనస్సు నిబ్బరించుకొని యవకాశము చేసికొని చీనావా రొనరించిన సర్వజనోపయోగమయిన కార్యమదియొక్కటియే యయ్యెను.

**అన్యదేశీయుల సన్మానించుట.**

1506 సం॥ మొదలుకొని 1522 వఱకుఁ బాలించిన యీ 'చంగ్టి' (Chengti) ప్రభువు కాలమం దొక విషయము జరిగెను. బహు కాలవ్యవధి యయినను దాని వలనఁ గొన్ని యొడంబడిక లేర్పడెను. ఆయొడంబడికలే చీనావారికిని నన్యదేశీయులకును గల సంబంధముల సరసముగ నడపునవి యైయున్నవి. 1511 సం॥ లో పోర్చుగలు దేశీయుఁడైన 'రఫేల్ పెరెస్ట్రోలో' (Raphel Perestrolo) చీనాదేశపుదక్షిణతీరమందు నావదిగెను. తర్వాత 6 సం॥ లకు 'ఆన్డ్రేడు' (Don. Fernao Peres. D. Andrade) కొద్దిపాటినావల సమూహముతో 'కాంటన్' పట్టణము నొద్ద దిగెను. వర్తకాభివృద్ధికొఱకే యీపురోగాము లనఁగా దొరతీయువారు చీనాదేశమునకు వచ్చిరి. చీనాదేశమందున్న యధికారులు ఆండ్రేడును దగురీతిని గౌరవింపఁగా నాయన 'పికిన్' పట్టణమునకుఁ బోయి యచ్చటఁ బ్రతిఫలముకోరని రాయబారిగాఁ గొన్ని సంవత్సరములు వ్యవహరించెను. కొంతకాలమువఱకు నాయనకును నచ్చటి ముఖ్యాధికారులకును వ్యవహారసంబంధము లనుకూలముగానే యుండెను. కాని యాయనవలెనే వచ్చినమఱి

**అన్యదేశీయుల దౌర్జన్యముల వలని కీడు.**

కొందఱు విదేశీయు లారాజ్యమందే యితరస్థలములలో జరిగించిన దౌర్జన్యకృత్యము లాయన వ్యవహారమున కకస్మాత్తుగా భంగము కలుగఁ జేయుటయేకాక యాయననుగూడ నిర్భాగ్యునిఁ జేసెను. చక్రవర్తియొక్క యాజ్ఞానుసారముగా ఆయనను బట్టుకొని చెఱసాలలోఁ బెట్టిరి. అటుల నాలుగువత్సరంబులు చెఱలోనుంచి యాయనను దుదకు విచారణచేయకయే యురితీసిరి. ఇట్లురితీయించినది యాచక్రవర్తి కనంతరమువచ్చిన చక్రవర్తియయిన 'చియాచింగు' (Chiaching). అట్టి కఠినదండనము కేవలమక్రమమయి యున్నది. 'నింగుపో' (Ningpo) 'ఫూచూ' (Fuchoo) రేవుపట్టణములయం దున్న పోర్చుగీయులు గొప్పయు

ధర్మకృత్యముల వెనుదీయక వెంటనే చేసిరి. వారన్ని విధములయిన దౌర్జన్యములను జేయుటయే కాక 'సింగుపో' పట్టణమందుండి తమకును బొరుగుగ్రామ జనులకును సరిపడని విషయము సంభవించినపుడు వారిపైబడి వధచేసిరి. తూర్పు రాజ్యములయొక్క ధర్మాధర్మములను విచారించుపట్ల వారిశత్రువుల నడతనుగూడ విచారించుటయు న్యాయమయియుండును. పోర్చుగలు దేశమునుండి చీనాదేశమునకు వర్తకము నిమిత్తము వచ్చిన ప్రథమజనులు మిక్కిలి యధర్మముగ నడచుకొనిరని వచింపక వలను లేదు అని చరిత్రకారుండు వ్రాసెను.

పైని జెప్పంబడిన 'ఆండ్రేడు' (Andrade) పికిక్ పట్టణమందు నివసించిన సంగతి చీనాదేశచరిత్రలో నుదాహరింపంబడలేదు. చీనాతీరమునకు పోర్చుగీసువారు 1535 సం॥ లో వచ్చినట్టుమాత్రము వ్రాయంబడియున్నది.

పోర్చుగలు దేశీయులను చీనావారు వధించుట.

పోర్చుగీసువారు చేసియున్న ఘోరకృత్యమునుబట్టి 'ఫూచూ' నగరపరిసరంబున వారినందఱనొకసమయంబుననే చీనావారు వధించిరి. వారిలో 30 మంది మాత్రము సజీవులయి 'కాంటన్' పట్టణ సమీపమందున్న తమవారితోం జెప్పుకొనంబోయిరి. అనేక సంధిరాయబారములును, అనేకాధర్మములయిన ముట్టడులు, నయినతర్వాతం తుదకు సంవత్సరమునకుం గొంతపన్ను చెల్లించుపద్ధతిమీంద 'మెకాయొ' (Macao) పర్యాయద్వీపములో పోర్చుగీయులు నివసించుటకు 'కాంటన్' పట్టణాధికారు లంగీకరించిరి. చీనావారిసైన్యములవలన రేపులనుగొల్లగొనుచుండు నోడదొంగలవలనను ననేక బాధలంబడుచుం దమప్రాణముల నరచేతులలోంబెట్టుకొని బ్రతుకుచున్నను పోర్చుగీయులు చీనాదేశవర్తకమువలనం గలుగుచున్న యధికలాభమునుబట్టి యాదేశమును విడువంజాలరైరి.

మెకాయొద్వీపము పోర్చుగీసువారి కీయంబడుట.

వర్తకమునకనివచ్చి దౌర్జన్యాదులంజూపి విదేశీయు లట్లుతమ్మునే బాధించుటంజేసి విదేశీయులను దమదేశములో నడుగుపెట్టనీయఁగూడదని చీనావారుతలంచిరి. అది న్యాయమేకదా? కావుననే క్రైస్తవ మతబోధకుఁడైన 'జేవియరు' (Xavier) చీనావారికి మతబోధనుజేయఁ బ్రబలోత్సాహియై వారితో ముచ్చటింపఁగా మాదేశములోనికి రావద్దని యాయనను బంపివేసిరి. ఆలాగుననే మఱియొక బోధకుని వెడలఁగొట్టిరి. 'రిక్కి' (Ricci) అనుగొప్ప బోధకుఁడొకఁడు మాత్రము తన నేర్పునోర్పుదీర్పులవలన జయ మొందెను గాన ఆయననుగూర్చి యిచటఁ గొంత వ్రాయఁబడుచున్నది. ఆయన కరుణామయుఁడును, ప్రబలవిద్యావంతుడును, పరోపకారచింతన కలవాఁడు నయి యుండెను. ఆయన చీనాభాషను లెస్సఁగ నభ్యసించి వారి మతగ్రంథములఁ జదివి దేవునివిషయమై వారికినిఁ గ్రైస్తవులకును గల యభిప్రాయములకు భేదములేదనియు వారి సిద్ధాంతములు కొంచెము మూఢభక్తితోఁ గూడియున్న వనియు వారికిఁ జెప్పెను. ఆయన నిష్కపటవచనములు కూలివాఁడు మొదలుకొని మండారిన్ వఱకు చీనావారికి నానందజనకము లయ్యెను. పికిన్‌నగరమం దాయనకుఁ దగుగౌరవ ముండెను. ఆయనకు యంత్రగతిశాస్త్రమందు సలక్షణమయిన ప్రవేశముండుటచే నది మఱియు గౌరవమును సంపాదించెను. ఎట్లన చీనావారికి గడియారములను గ్రమముగ వాడుకొను నేర్పప్పటికి లేనందున వారి గడియారములు చెడి బహుకాలమునుండి మూలపడియుండెను. వాని నాయన బాగుచేసి యిచ్చుటచే వారికి మఱియు సంతోషకరుఁడయ్యెను. మఱియు 'యూక్లిడు' (Euclid)

విదేశీయులయెడల చీనావారికి ద్వేషముకలుగుట.

రిక్కియను బోధకుని సామర్థ్యము.

ఆయన చీనావారికిఁ జేసిన యుపకారములు.

రచించిన క్షేత్రగణిత మందలి మొదటి యాఱుపుస్తకములను 'రిక్కి' చీనావారి భాషలోనికి భాషాంతరీకరణ మొనర్చెను. పిమ్మట చీనాభాషలో జ్యోతిశ్శాస్త్ర మొకటి చేసెను. తుదకు దైవస్వరూపస్వభావాదులం దెల్పుగ్రంథ మొకటి సవిస్తరంబుగఁ జేసెను. ఆయనగ్రంథరచన మధిక సూక్ష్మవిచారణపరు లయిన యద్దేశపండితశ్రేష్ఠులకును స్తవనీయముగ నుండెనఁట. ఇప్పుడుచీనాదేశమం దాయనపద్ధతి ననుకరించు పద్ధతి నవలంబింప నుద్యుక్తులగుచున్నారని తెలియుట శ్లాఘనీయము. శాస్త్రగ్రంథములును, సర్వజనులకు నభిలాషపుట్టించు గ్రంథములును, చీనాభాషలోనికి భాషాంతరీకరింపఁ బడుచున్నవి. చీనాదేశములోని

ఐరోపీయుల గ్రంథముల భాషాంతరీకరించుట.

గొప్పవారికి ఐరోపీయుల గ్రంథము లదువుటకు గిట్టకుండెను. కావున వారికి రుచిపుట్టించుటకై యీ ప్రయత్నము చేయఁబడుచున్నది. రిక్కి 1610 సం॥ లో మృతిఁబొందెను. ఆయనతోఁ బరిచయము కలవారంద ఱాయన మరణమునకుఁ జింతిల్లిరి.

చియాచింగు అను చక్రవర్తి 1522 సం॥ మొదలుకొని 1567సం॥

చియాచింగు చక్రవర్తి యొక్క పరిపాలన విశేషములు.

వఱకుఁ బరిపాలించెను. ఈయన పరిపాలనారంభము స్వరాజ్యమందలి కలహములచేఁ బీడింపఁబడెను. పరిపాలనాంత మీవరలో చీనావారి గర్వము నడగద్రొక్కిన జపానుదేశీయులచే నలజడినొందెను. మంగోలీయుఁడైన కుబ్లాయి ఖాను అను చీనాచక్రవర్తి జపానుదేశీయులపైఁ బలుమార్లుదండెత్తియోడి పోవుట గతంబున లిఖింపఁబడియే యున్నది. జపానువా రప్పుడు

జయశీలురై యుండినను చీనావారిపైఁ బగఁబట్టియే యుండిరి. మంగోలియావారి పరిపాలన మంతరించినది మొదలుకొని జపానీయులు తమ పగఁదీర్చుకొనుటకై చీనాదేశపు తూర్పుతీర ప్రదేశములపైఁబడి తఱచుగాఁ గొల్లఁగొనుచుండిరి. చీనాదేశచరిత్రమందు 'బౌగ్లరు' అను గ్రంథకర్త అక్కాలపు జపానీయులను గుఱించి చీనాదేశచరిత్రకారుఁ డిట్లు వ్రాసియుండెనని లిఖించెను.

జపానీయులు చీనా వారిపైఁ బగఁబూని యుండుట.

'జపానీయులు నిర్భయులు. కష్టములకు జంకరు. వారికి ప్రాణము తృణప్రాయము కావున మృత్యువు నెట్లెదుర్కొనవలెనో యెఱుఁగుదురు. తాము నూరుమందియే యైనను వేయిమందితోఁ బోరుటకు వెనుకడుగు వేయరు. అట్లు వెనుకంజవేసిరేని సిగ్గుంజెంది స్వదేశమునకు మఱలఁ బోనేపోరు. ఇట్టి ధీరరసము వారి కుగ్గుతోఁబోసిరా యనునట్లు తోఁచును. అట్టి ధీరులగుటచేతనే రణశూరులయి వెలయుచున్నారు.'

జపానీయులమగటిమి.

జపానీయు లప్పుడెట్లు వర్ణింపఁబడిరో యిప్పటికిని నటులనే వర్ణనీయులయియున్నారు. వారు 16వ శతాబ్దమందు 'ఫుకియన్' (Fuhkien) 'చెకియాంగు' (Chehkiang) రేవుపట్టణములను ముట్టడించునపుడు చూపిన పరాక్రమమునే యీశతాబ్దమందు 'పింగ్యాంగు' (Pingyang) 'యాలు' (Yalu) యుద్ధములయందును జూపియున్నారు. 1552 సంll లో వారు చెకియాంగుతీరమం దొకకోటను ముట్టడింపఁగా చీనావారు కొంతకాలమువఱకు ముట్టడిని విడిపింపలేకపోయిరి. మఱికొన్నిసంవత్సరములకుఁ దర్వాత వారు 'నాన్కిను' (Nankin) పట్టణము ముట్టడించిరి కాని యోడిపోయిరి. అయినను జపానీయు లట్లు తఱచుగ ముట్టడించుచుండఁగా

జపానీయులు చెకియాంగును నాన్కినును ముట్టడించుట.

చీనావా రంతకంతకు క్షీణబలులైరి. అందువలనఁ దూర్పుతీరము చిర కాలము కలగుండుపడుచునే యుండెను. నావికదండయాత్రలలో జయము జపానువారి సొమ్మగనే యుండెను. మెట్టనుజేయఁబడు రణం బులలో చీనావారి సేన యసంఖ్యాతం బయి తమ్మను మించియుండినను జపానువా రెన్నఁడు నూచముట్టుగ జయింపఁబడరైరి.

చియాచింగుచక్రవర్తి రసవాదజ్ఞులచే వంచింపఁబడుట.

ఈచక్రవర్తిని గుఱించి యొక వినోదకరమయిన విషయము చదువరులకు విశదీకరింపఁ బడుచున్నది. పరుస వేదిని, అమృతమును, సాధింపవలె ననుకోరిక చీనావారి కెప్పటినుండియో కలదు. వానికై యాదేశపు రసవాదులు తపస్సుధారపోసిరి కాని వినియోగింపను లేదు; వారికి మరణము తప్పను లేదు. అట్లుండినను ఆరసవాదశాస్త్రిమహిమ యేమోకాని దానియందలి భ్రిమ వారినెన్నఁడును విడువదయ్యెను. పైనిఁజెప్పిన చక్రివర్తి తన పరిపాలనకాలమంతయు నల్లరులతోను గల్లోలములతోను గడఁపబడు చుండుటచే సుఖమెట్టిదో యెఱుగకుండియు దాను చిరంజీవిగా నుండుట కపేక్షించెను. ప్రాణ మంత ప్రియతమముకదా ! కావున తేయో సిద్ధాంతావలంబకు లయిన రసవాదులవలన నమృతరహస్యముఁ బడయఁ గోరి వారిని శ్రద్ధాభక్తులతో నశ్రాంతము సేవించుచు వారియుపదేశముల ప్రకారము నడచుకొను చుండెను. తుదకు మరణ మాసన్నమయి యతని యవివేకమును దెల్పఁగాఁ దాను వెఱ్ఱిభ్రమంబడితినని త్రికరణ శుద్ధిగ నమ్మి తన మరణశయ్యయం దుండి యిట్లు తన యజ్ఞానమును నొ

ఆయన ప్రకటించిన శాసనము.

ప్పుకొనుచు నుడివెను. 'నేను నలువదియయిదు సంవత్సరములు పరిపాలించితిని. ఇంత దీర్ఘ కాలము వఱకుఁ బాలించిన రాజులరుదుగ నుం దురు. దేవుని సేవించుటయుఁ బ్రజాసౌఖ్యమును భావించుటయు నాకు విధికృత్యము లయి యుండెను. వానిని నెఱవేర్ప

లేక యనేక కష్టపరంపరలచే నాకుఁ గలిగిన చిత్తక్షోభమునయిన నివారించుకొని విశ్రాంతిం జెందుటకై యధికాపేక్ష కలవాఁడనై తదుద్రేకంబుచే, నన్ను చిరంజీవిగఁ జేసెద మని నమ్మించిన రసవాదజ్ఞుల మాయలలోఁబడి తుదకు వంచితుఁడనైతిని. మఱియు నా రాజ్యమందలి ప్రముఖులకును, నాస్వజనమునకును ఈకపటమార్గమం దాశపుట్టించుటకు నేను పురోగామినై పాపినైతిని.. ఈ పాపావనోదార్థ మీ శాసనంబు లిఖింపించితిని. దీనిని రాజ్యమందంతటను నా మరణానంతరము ప్రచురింపవలయును. 1566 సం॥లో నాయన తన పెద్దలలోఁ

ఆయన మరణము.

గలసెను. ఆయన తనయుండగు 'లంగుచింగు' (Lungching) ప్రభుత్వమునకు వచ్చెను.

ఈ 'లంగుచింగు' యొక్క యేలుబడికాలములో నొక్కటే విశేషాంశము ప్రవర్తించెను. అది యేదియనిన

లంగుచింగు చక్రవర్తి.

లెక్కసేయక బహుకాలము చీనావారితోఁ బోరాట మొనర్చిన మంగోలియా సేనానాయకుఁడైన 'యంటా' (Yenta) వృద్ధుఁడై తన చివరదినములయినను నెమ్మదిగ వెళ్లబుచ్చుకొనఁ గోరిక గలిగి లంగుచింగు చక్ర

మంగోలియా సేనానాయకుఁడు లోఁబడుట.

వర్తితో సంధికావించుకొనెను. శత్రువు లోఁబడివచ్చినప్పు డీతూర్పుదేశ రాజుల యాచారప్రకార మాతని నతనిదేశమునకు రాజుగా నర్చి సన్మానించి బహుకాలమునుండి యెడతెగక యుండిన పోరును వారించెను. ఈ చక్రవర్తి యొక్క ప్రభుత్వకాలము సౌమ్యముగ జరిగినప్పటికి రాజ్యము మాత్రము క్షీణదశలోనికి వచ్చుచుండెను. అట్టి దశలో రాజ్యము నుద్ధ

రాజ్యము క్షీణించుచుండుట.

రింపఁగల సమర్థుడు ప్రభువయియుండుటకు మాఱుగ నొక బాలుఁడు చక్రవర్తిగ నుండుట తటస్థించెను. ఆదేశాచారప్రకార మా బాల

చక్రవర్తికిఁ బ్రతినిధిగ నాయన జనని వ్యవహరించెను. వెనుకటి చక్రవర్తి నెలకొల్పిన నెమ్మది కీచక్రవర్తి కాలములో భంగముకలుగుట కారంభమాయెను. పశ్చిమోత్తరదిశను తార్తారులరాయిడి ప్రబలమయి రాజ్యమునకుఁ బీడాకరముగ నుండెను. ప్రఖ్యాతఁగల 'నింఘ్‌సియా' (Ninghsia) నగరము తార్తారుల వశమయ్యెను. తార్తారసేనానాయకుఁడు 'పోపాయి' (Popai) అనువాఁడు పూర్వము చీనావారి సేనలో గొప్పయుద్యోగము చేసినవాఁడై విశ్వాసపాత్రుఁడుగా నుండి తుదకు శత్రువులంగూడి చీనావారిపై యట్లుదండెత్తి తన కలహస్వభావమును గృతఘ్నతాబుద్ధిని దేటపఱచెను. అదృష్టవశమున చీనావార లాకలహకారుల నడంచి యాపట్టణమును మఱల స్వాధీనము కావించుకొనిరి. ఆతఁడే చీనాతూర్పుతీరమునకు వచ్చి రాజ్యమునకుఁ దొందరలు కలుగఁజేసెను. జపానుదేశీయులు బహుకాలమునుండి శత్రుపీడలేక చీనావారిపై దండెత్తిన పుడెల్ల జయమొందుచు నతిగర్వితులై యుండిరి. అక్కాలంబున 'కోరియా' (Corea) పర్యాయద్వీపమం దంతఃకలహములు మెండుగ నుండెను. ఆపర్యాయద్వీపమం దంతఃకలహములు తఱచుగా జరుగుచునే యుండెను. ఆసమయము చూచి జపానీయులు 'ఫూసాన్' (Fusan) రేవు పట్టణమునొద్ద దండువిడిసిరి. అప్పుడు వారి సేనాధిపతి ప్రసిద్ధుఁడైన 'హిదియోషి' (Hydeyoshi) యెదిరించువారలు లేమింజేసి యాతడు తిన్నగాఁబోయి రాజధానియైన 'స్యూలు' (Seoul) పట్టణము నాక్రమించుకొనెను. కొద్దికాలముక్రిందటఁ బ్రవర్తిల్లిన యుద్ధమువఱకును 'కోరియా' చీనావారి యాధిపత్యముక్రింద సామంతరాజ్యముగా నుండెను. ఆరాజు జపానువారితోఁ బోరలేక తనవిధిచొ

చక్రవర్తిజనని రాజప్రతినిధియగుట.

పోపాయి యెదిరించుట.

కోరియాయందలి యంతఃకలహములు.

ప్పున చీనాచక్రవర్తియొక్క సాహాయ్యము కోరెను. చీనాచక్రవర్తి గొప్పసైన్యమును బంపెను. ఆసైన్యముయొక్క రాక యెఱింగి హిదియోషి' తగు నేర్పాటులజేసికొని చీనావారెం

చీనావారు జపానీయులచే నోడిపోవుట.

తపెనంగినను వారిని సుకరంబుగ నోడించెను. ఈయుద్ధమునకై యుభయసైన్యము వారు చేసిన ప్రయత్నములవలనఁ దమతము ద్రవ్యాదిసాధనములు క్షీణించుటచే యుద్ధమును మఱియు సాగింపఁజాలక యుభయకక్షలవారును విరమించిరి. చీనావారు సాధనసామగ్రి దమ రాజ్యమునుండి వచ్చుట కెదురుచూచు చుండిరి. జపానీయులు 'ఫ్యూసన్'(Fusan) నగరమునకుఁ జల్లఁగా మరలిరి. పిమ్మటఁ జిన్న చిన్న పోరాటములు కొన్ని జరుగఁగఁ దుదకు 'పింగ్యాంగు' (Pingyang) నగరమునొద్ద జపానీయులను చీనావారు బిట్టుగనోడించి వారి యాయుధసామగ్రుల గిడ్డంగిని దగులబెట్టిరి. తన

జపానీయులోడిపోవుట.

కాధారమయిన యాయుధ సామగ్రులు నశించుటంజేసి జపానీయ సేనానాయకుఁడు సంధి చేసికొన నుద్యుక్తుఁ డయ్యెను. ముందు 1895 సం॥లో జేయఁబోవు యుక్తినే చీనావారప్పుడును జేసిరి. ఏమనిన చీనా చక్రవర్తి సంధివిషయముల మాటలాడుటకు నల్పతరగతిగలయుద్యోగులను రాయబారులనుగాఁ బంపెను. అటుల బుత్తెంచుట తన నవమానించుటకే యని యాగ్రహావ్యగ్రుండై హిదియోషి చీనాదేశ విజయార్థముగా నవీన దండయాత్రాసన్నద్ధుం డయ్యెను. కాని యింతలో నతఁడు మృత్యువాతంబడెను. ఈగొప్ప విపత్తువలన యుద్ధము విర

జపానీయులు సంధికావించుకొనుట.

మించిజపానీయులు సంధికావించుకొనిరి. పైనిజెప్పఁబడిన యుద్ధములలో చీనావారు శత్రువుల సంబంధమయిన వేమియు జయసూచకముగాఁ గొనిపోయినట్టు తెలియదు. కాని జపానీయులుకొన్నిగొంపోయిరి.

అట్టి జయచిహ్నములలో యుద్ధములయందు పడిసిన 10,000 కోరియావారియొక్క చెవులనుగోసి తీసుకొనిపోవుటయొకటిగానుండెనట. ఈచక్రవర్తిప్రభుత్వకాలములోనే స్పానియాదేశీయులు ఫిలిప్పయిను దీవులయందు గాపురములు కుదుర్చుకొనిరి. వారి కాదీవులయందునికి యారోగ్యకరముగాను, భూమి ఫలవంతమయినదిగాను, గన్పట్టెను. పిమ్మట చీనాదేశీయులలోఁ గొంతమంది వలసబోయి చల్లచల్లఁగా నాదీవులయందు నివాసము చేయ నారంభించిరి. వారు మంచి

చీనాప్రజలు ఫిలిప్పయిను దీవులకు వలసఁబోవుట.

పనివాండ్రగుటవలన స్పానియావారికి వలస వచ్చినయాచీనావారి నివాసము ప్రథమమున ననుకూలముగానే యుండెను. కాని, యనంతరము వారు గుంపుగుంపులుగా వలసరాఁగావారు సహింపలేక వారిని స్పానియావారు వెడలఁగొట్టఁజూచిరి. వారు లేచివెళ్లక మొండివేషముగ నుండినందున 20,000చీనావారినిస్పానియావారు హతము కావించిరి. పైనిజెప్పిన దీవులు చీనావారివి కావు. అక్కడ నదివఱకుఁ గాపురముండువారే లేరు. చీనాదేశమందు జనసంఖ్యయధికమగుటచే నట్లు వలసవోవుట గలిగెనని గ్రహింపఁదగును. స్వదేశీయు లంతమంది హతులయినను చీనావారికి చీమకుట్టినపాటిగ లేకపోయెను. మఱియొకదేశీయు లయిన నెన్ని యుద్ధము లగునో? కాని యీయుపేక్షను గుఱించి వాన్లి (Wanli అను పేరుగల యప్పటి చీనాచక్రవర్తిని విశేషముగ నిందించుటకు వలనుపడదు.

చీనావారిని స్పానీయావారు హతముకావించుట.

ఏలయనఁగా రాజ్యమందంతఃకలహములు ప్రబలమగుచుండెను. వానిని నివారించుట కశక్యముగ నుండెను. ఆయన 1620 సంII లో మరణించువఱకును నివారింపఁ బడనేలేదు. అట్టి కలహపరంపర యాదేశ దీర్ఘవ్యాధిగా నుండెను.

చీనారాజ్యమందలి యంతఃకలహములు.

అల్లరులును, గలహములు నట్లుండినను "రిక్కి (Ricci) క్రైస్తవ మతము నభివృద్ధి జేయుచునే యుండెను. చీనా దేశీయులగొప్ప పండితులలో నొకడయిన 'సు' అను నాతఁడు క్రైస్తవు డయ్యెను. ధనవంతురా లయిన యాయన కుమారి తన్మతావలంబిని యయ్యెను. ఆమె క్రైస్తవనామము 'కాండిడా' (Candida). వీరిరువురతోడ్పాటుచే 'రిక్కి' చేసియున్న గ్రంథములు ముద్రితము లయ్యెను. మఱియు ముప్పది క్రైస్తవ దేవాలయములును, ఆమతబోధకులకుఁ దొంబది భవనములును నిర్మింపఁబడెను. రాజ్యవిషయమై మరలఁ గల్లోలకారణ మొకటి సంభవించెను. చక్రవర్తియయిన వాన్లికి నౌరసపుత్రులు లేరు. ఆయన యుంపుడుకత్తెవలన మాత్ర మిరువురు పుత్రులు కలిగిరి. కావున తనయనంతర మాయిరువురిలో జ్యేష్ఠుఁడు చక్రవర్తియగునట్లాయన నిర్ణయించెను. వారిలోఁ గనిష్ఠునియందు చక్రవర్తికి నధికప్రేమయగుటచే రాజు తన స్వభార్యవలనఁ బుత్రసంతానప్రాప్తిలేని యెడల వానికి రాజ్యమిచ్చునని జను లనుకొనిరి. కావునఁ దన యన్నను రాజ్యకర్తగా చక్రవర్తి నియమించుటచే వాఁడు తనకు రాజ్యాపదంబుఁ బోయెనని యీర్ష్యాసూయాగ్రహములు ముప్పిరిగొన నంతఃపురంబునఁ గల్లోలములు పొడమఁజేసి చక్రవర్తి యొక్క యవసానదినములు దుఃఖప్రాయములుగ జేసెను. కాని వినియోగింపలేదు.

*క్రైస్తవ మతాభివృద్ధి.*

*చక్రవర్తి పుత్రహీనుం డగుట.*

'వాన్లి' చక్రవర్తి కనంతరము ముగ్గురు చక్రవర్తు లేలిరి. అంతటితో మింగువంశము సాంతమయ్యెను. 1644 సంll లో నిప్పటి 'టాచింగు' (Taching) వంశపు ప్రథమ పురుషుఁడు చక్రవర్తి యయ్యెను. పైనిఁజెప్పఁబడిన మింగువంశ్యులయొక్క ప్రభుత్వకాల విశేషములు సంగ్రహముగా నీదిగువ వ్రాయఁబడుచున్నవి. వీరి కాలమందు శాస్త్ర

*మింగువంశావసానము.*

*టాచింగువంశారంభము.*

మింగువంశ ప్రభుత్వ కాల విశేషములు

ములుగాని శిల్పాదివిద్యలుగాని పెంపొందలేదు. కాని చిత్రకారుల విద్యమాత్రము పూర్తిగా నుపేక్షింపఁబడలేదు. వెనుకటి "సుంగు, తాంగు"వంశము లేలినప్పటివలెనే వీరి కాలమందును జిత్రముల వ్రాయుట యతి మనోహరముగ నుండెను. వీరి చిత్రపటాములం జూచి జపానీయులును చిత్రవిద్యయం దభివృద్ధిం జెందిరి. ఈ మింగువంశమువారి కాలమందలి చిత్రవిచిత్ర లేఖనములలోఁ గొన్ని సర్వకాలములయందును సర్వదేశములయందును మిగులఁ గొనియాడఁదగినంత మనోహరములుగా నున్నవి. వానిం జూచి చిత్రకారకళాభిజ్ఞు లీనాఁటికిని మిగుల నానందించెదరు. మఱియు దారువుపై జిత్రప్రతిమల జెక్కు విద్య యీ వంశపురాజుల కాలమందుఁ గల్పనారచనలచేఁ బ్రసిద్ధిఁ జెందెను. భాగ్యదేవతాప్రియులు ప్రతిమాదులచేఁ బ్రకాశించు దారువులను దమ భవనములయందు శృంగారార్థము నిర్మింపఁ జేయుచుందురు.

చిత్రలేఖన మభివృద్ధి యయ్యెను.

కొన్నిశాస్త్రములుచీనా వారభ్యసించిరి.

చీనాదేశమునకు క్రైస్తవమతబోధకులు వచ్చుచుండుటచే శాస్త్రములయందలి కొన్ని ముఖ్యాంశములను బోధించు క్రమమును లెస్సఁగాఁ దెలిసికొనిరి. క్షేత్రగణితమును, జ్యోతిషశాస్త్రమును "రిక్కి" చీనాపండితులకుఁ జెప్పియుండె నని గతంబున లిఖింపఁబడి యున్నది. ఆశాస్త్రములను చీనాపండితులు విడిచిపెట్టక యభ్యసించుచునే యుండిరి. 1628 సం॥ లో 'షాల్' (John Adam Schall) చీనాదేశమునకు వచ్చి 'పికిన్' రాజధానికిఁ బోగా నాయన నాస్థాన జ్యోతిష్కునిగ నియమించి రాజకీయ పంచాంగమును రచింపఁజేసిరి. మఱియు నాయనకుఁ జేయవలసిన గౌరవమంతయు నచ్చటిప్రముఖులు చేయుచుండిరి. కాని కాంగిసి చక్రవర్తి కాలమం దాయన న్యాయశాసనము

లకు వ్యతిరేకముగ నడచెనని నేరమేర్పడఁగా నాయనను జెఱసాలలో బెట్టి సంకెళ్లు వేసిరి. దానిలోనే యాయన 1666 సం॥ లో మృతినొందెను.

కాంగిషిచక్రవర్తి క్రైస్తవమతమును విశ్వసింపలేదు.

కాంగిషి చక్రవర్తి క్రైస్తవ మతమందు దృఢవిశ్వాసము కలవాడుగాఁ గొంత కాలముండెను. 1660 సం॥ మొదలుకొని 1664 సం॥ నకులోగా చీనాదేశములలో 100,000 జనులు క్రైస్తవులయిరట! ఆచక్రవర్తి తల్లియు, భార్యయు, గొడుకును క్రైస్తవులయిరి. కాని యాయనమాత్రము కాలేదు. క్రైస్తవమతబోధకులు శాస్త్రవేత్తలని యాయన విశేషముగా గౌరవించుచుండెను. క్రైస్తవమతాభిమానము కలవాఁడై యుండెనని క్రైస్తవు లనుకొనిరి కాని కన్ఫ్యూసియసుయొక్క జ్ఞానసిద్ధాంతమే యాయన మనస్సున నాటియుండెను. క్రైస్తవమతమం దాయనకు విశ్వాసమే లేదు. కావుననే యాయన యొకప్పు డొక క్రైస్తవబోధకునితో నిట్లనియె. "మీ రెఱుంగని రాబోవు లోకంబుంగూర్చి మీరేల ప్రయాసపడెదరు. ఈ లోకమును గుఱించియే యెక్కువగా శ్రమపడుఁడు" చీనాదేశమం

రోమన్ కాతోలికుమతముయొక్క వృద్ధి.

దిప్పుడువ్యాపించియున్నది రోమన్ కాతోలిక్కు మతమే. అప్పటి మతప్రవర్తకులు చీనాదేశీయుల మూఢభక్త్యాచారముల నేదో విధముగ నంగీకరింపుచు వారిని గ్రమక్రమముగ క్రైస్తవులగునట్లు చేయుచుండిరి. ఆప్రవర్తకులకుఁ దోడ్పడుటకై 1651 సం॥ లో వచ్చిన మఱికొందఱు మతప్రవర్తకులు చీనావారి మూఢాచారముల నంగీకరించినందునకు నచ్చటి బోధకుల నాక్షేపించి తమ మతాచార్యులకుఁ దెలియపఱచి తన్నిషేధవచనముల వారివలనఁ దెప్పించిరి.



# 5 వ అధ్యాయము.

## మింగువంశ్యులయిన టియంచి టిసంగు సంగులయొక్కయు మంచూవంశ్యులయిన షుంచికాంగిషీలయొక్కయుఁ బరిపాలనము.

మంచూరియా దేశీయులు ప్రబలుచుండుట.

గతంబున లిఖింపఁబడిన వాన్లిచక్రవర్తి పరిపాలించుచుండఁగాను 'రిక్కీ'య క్రైస్తవబోధకుఁడు పికిన్ రాజధాని యందుండఁగాను, మంచూరియా దేశీయులీశాన్యమూలను బ్రబలుచుండిరి. వీరేచీనా రాజ్యమును బాలింపవలసినవారుగా విధికృతమయి యుండెను. మంగోలియావారు చీనారాజ్యమును బరిపాలించునపుడు, కిన్ తార్తారులను బదమూడవశతాబ్దమందు జయించి యుండిరి. అంతట తార్తారులు గుంపులు చీలిపోయి 'హూనుడెను' నగర సమీపముననున్న తమ యడవి పట్టున మరలి వెళ్లిరి. అప్పటినుండియు వారు తమయుద్ధాభిలాషకుఁదోడుగా యుద్ధనైపుణ్యమును గూడ సంపాదించుకొనిరి. తమచుట్టుప్రక్కలనుండు ప్రదేశములలో నివసించు తిరుగుడుగుంపులలో నా 'కిన్ తార్తారులు' సంఖ్యయందు స్వల్పముగనుండినను ప్రచండవీరసమూహముగ నుండిరి- వారిలో నొకకన్య యొకసరస్సుగట్టునఁ గూర్చుండి యుండగ 'కొండకాటుగాడు' అనుపక్షి యొక యెఱ్ఱనిపండు నామెవడిలోఁ బడవేయఁగా నామె దానిని దిని గర్భవతియై మగశిశువును గనెనఁట. వానికి 'ఎయిసిన్ జియోవి' (Aaisin Geevi) అనఁగా స్వర్ణమూర్తి యని పేరుపెట్టిరి. వాఁడు జన్మమహిమగలవాఁడగుటచే వానినాసమూహమునకు నాయఁకునిగా నప్పుడేచేసిరి. కాలక్రమమున వానికొడుకునకు 'నూరాహాచు'(Nurhachu) అనునొక మనుమండు 1559 సం॥లో నుదయించెను.

నూరాహాచు

ఈతఁడు పురాతన రాజ్యమయిన చీనాదేశమును జయించి తనపూర్వుని జన్మమహిమను స్థిరపఱచవలసినవాఁడై యుండెను.

ఈతఁడు తనగుంపువారిలోఁ గార్యనిర్వహణ దక్షుఁడుగా నున్నందున ఆగుంపున కీతని నాయకునిఁ జేసిరి. ఈతడెంతవాఁడు కాను న్నది యతనిముఖవర్చస్సే తెల్పుచుండెనఁట. మఱియు నతఁడు మహావీరలక్షణములను గలిగియుండె నని చరిత్రకారులు వర్ణించిరి. అనఁగా విశాలవక్షము, లంబకర్ణములు, గంభీరకంఠస్వరము మొదలగులక్షణములు. ఆకాలమందు మంచూరియను అనేకగుంపులుగాఁ జీలి "ఆమూరు" నదికిని చీనాగోడకును నడుమ నుండుప్రదేశములయందు నివసించుచుండిరి. ఆగుంపులనన్నిటిని నేకసమూహముగఁ గూర్చుటయే 'నుర్హాచు' యొక్క ప్రథమకార్యమయియుండెను. ఆప్రయత్నము సఫలమునయ్యెను. అతనియభివృద్ధి నతనిశత్రువులు చూచి సహింపఁజాలనంతగా నుండెను. "మంచూరియా"యం దుండుఇతరగుంపులు తమకు లోఁబడినవే యని చీనాచక్రవర్తి తలంచుచుండెను గావున "నుర్హాచు" యొక్కయుద్ధసన్నాహమును గుఱించి వినుచున్నను లెక్కసేయఁడయ్యె. మఱియు నాకాలంబుననే చీనారాజ్యమం దంతశ్ఛిద్రములు ప్రబలముగా నుండెను. అప్పటికిని "వాన్లి"యే చక్రవర్తిగా నుండెను. "నుర్హాచు" చే నోడిపోయినవారు వానిపై ననేకనేరములు, లున్నవియు లేనివియుఁ గూడఁ జక్రవర్తికిఁ జెప్పిరి. అంతట "వాన్లి" చక్రవర్తి నుర్హాచుయొక్క ముఖ్యశత్రువులలో నొకఁడైన "నికాన్" (Nikan) అను వానిపక్ష మవలంబించెను. అనేకరాజులతోఁ

"వాన్లి" చక్రవర్తి నికాన్ అనువానిపక్షంబుబూనుట

పాటుగ చీనాప్రభువులకును శత్రువుల నారంభమందు గణింపనిదోష మొకటియున్నది. కావుననే 'నుర్హాచు'తోఁ బోరి చీనావారు బహునష్టములతో నోడిపోయిరి. 1591 సం॥ లో "నుర్హాచు" చీనావారిదైన "యాలు" (Yalu) జిల్లాను వశపఱుచుకొనెను. కావున నతనిపెంపు సహింపలేక యతనితో నారంభమునుండియుఁ జేరనియితరగుంపుల నాయకులలో నేడుగురు నాయకులు ఏకమయి 30000 సేనను గూర్చుకొని యతనిని

డాంకి యతని 4000 సేన చేత నేమోడిపోయిరి. 'నుర్హాచు' 'నెపోలియన్' అను ఫ్రాన్సుదేశవీరాగ్రేసరునియంతధీరుఁ డనియెఱుంగవలయును. ఈగెల్పు చేఁ బ్రోత్సాహముకలిగి 'లియోటంగు' (Liaotung) పర్యాయ ద్వీపముపై "నుర్హాచు" దండెత్తెను. ఈదండెత్తుట చీనారాజ్యముపై దండెత్తినట్లే యనితలఁపవలయును. తానుదండెత్తుటకు నేడు కారణములు కలవనిచీనా చక్రవర్తి కాయన వ్రాసెను. ఆ కారణములలోని మొదటిదానిలోఁగడ మవి యిమిడియున్నవి. కావున మొదటి కారణ మీక్రింద వ్రాయఁబడు చున్నది.

కారణములు

'నాపూర్వులు మీరాజ్యమునుండి యొకపూరిపుడక యైనను నంగుళము భూమియైనను దీసికొని యుండలేదు. అటులున్నను మీరు వారితో సతతముఁ బోరాడుచునుంటిరి. అది కాక నా పొరుగునాయఁకులకు నిర్హేతుకముగా మీరు తోడ్పడి మిగులఁ జెఱుపు గావించితిరి.' అటులు వ్రాసి మఱుసటి వత్సరమున నఁగా 1618 సం॥

నుర్హాచను కొన్నిపట్టణములఁ బట్టుకొనుట

లో 'నుర్హాచు' చీనాయెల్ల దాటివచ్చి 'ఫుషన్' (Fushun), 'చింగో' (Chingo) పట్టణములఁ బట్టుకొనెను. ఆరంభమున శత్రువు నుపేక్షించు వాడుకగలచీనావారు బందిపోటుదొంగలకు నాయఁకుఁడై యున్నప్పుడు నురాచనుతోఁ బోరక యతఁడు ప్రబలసేనాధిపతియై యుండఁగఁ బోరాడఁ బూనిరి. చీనావారిది ప్రబల సైన్యమే యగును. ప్రబలసైన్యము పక్షముగ దేవుడుండు నని నీతివాక్యమును గలదు. కాని యావాక్యము చీనావారికిఁ జెల్లదు. వీరు కోరియాప్రభువునకు గొప్పసైన్యముతో సహాయపడి యల్పసైన్యము గలజపానుదేశీయులచేఁ బరాజితులైరి. పైనిఁ జెప్పిన రణంబున చీనావారిసైన్యము 100000; 'నుర్హాచు' సైన్యము 60000; అట్లున్నను చీనావారిసేనాధిపతి యొక్క వ్యూహరచనలో లోపముండుటచే సమర్థసేనానియైన నుర్హాచుచేత చీనావారు నిశ్శేషముగఁ బరాజితు

లైరి. చీనావారిలో 310 సేనాముఖ్యులును 45000 సైనికులును రణనిహతులైరి. చీనావారట్టిచిక్కులలో నుండగ "మెకాయొ" (Macao) ద్వీపమందు పోర్తుగలుదేశీయులు నివసించుటకుఁ జక్రవర్తి యనుమతిం బడయుటకై పోర్తుగలుదేశమునుండి యొక రాయబారి పికిన్ రాజధానికా సమయముననే వచ్చినవాఁడై చీనావారిదురవస్థఁ జూచి "మెకాయో" నుండి తనసైన్యమును వారికి సహాయార్థముగాఁ బంపెదననెను. మీసహాయము మాకగత్యములేదని యనఁదగినంతగర్వము కలవాఁ డయినను దమకష్టదశనుబట్టి పంపుమని చీనాచక్రవర్తి చెప్పెనఁట. ఆప్రకారమే యాయన 200 పోర్తుగీయ సైన్యమునుదీర్పుచేయఁ బడిన 200 ఆద్వీపవాసులను తుపాకులసమేతముగఁ బంపెను. ఆసేన చేరునప్పటికే చీనాచక్రవర్తికి శత్రుబాధ తగ్గుటచే ఆయన వారిని దిరిగి పంపివేసి పిరంగులను దుపాకులను మాత్రముంచుకొనెను. అవి చీనావారికిఁ దర్వాతియుద్ధములయందు మిగులనుపయోగించినట్లు గ్రంథదృష్టాంతము కలదు,

మంచూరియా సైన్యము మాక్డై పట్టణమును ముట్టడించుట.

కాని యాపిరంగులును తుపాకులును మంచూరియావారిముందరఁ బనికిరాక పోయెను. పిమ్మట మంచూరియా సైనికులు మాక్డెను (Moukden) పట్టణమును ముట్టడించిరి. అచ్చట చీనావారి సైన్యము బహు పరాక్రమముతో నెదిరించెను. వారినందఱను వధించి మంచూరియావారా పట్టణమును వశపఱుచుకొనిరి. ఆ పట్టణవాసులు మంచూరియావారికి లోఁబడి వారియాచారప్రకారము తలలు గొఱిగించుకొని రని చీనాదేశచరిత్రకారులు తమ గ్రంథములయందు సందర్భవశమున లిఖించియుండిరి. చీనావారికిప్పటికిని దలమీఁద జడకుఁ దగినంత జుట్టుంచుకొని తక్కినది గొఱిగించుకొనుట యాచారముగా నున్నది. ఆజడను జుట్టగాఁ జుట్టుకొందురు. ఆపట్టణవాసులను గుఱించి వ్రాసినప్పుడె చరిత్రలయందా విషయము దాహరింపఁ బడినది. అంతకుఁబూ

ర్వ మాయాచారమును గురించి చరిత్రలలో లేదు. కావున నది యెప్పు డారంభ మయినదో తెలియదు.

ఒక స్త్రీ స్వసైన్యముగ చీనా వారికిదోడ్పడుట.

ఈమధ్యకాలములో చీనా రాజ్యమునకు వెలుపల నున్న యొక జిల్లాయందు ఘోరమయిన యల్లరులు జరుగుచుండెను. వానిన ణచుట కచ్చటనున్న చీనావారి సైన్య మసమర్థంబుగ నుండఁగ నచ్చటి దేశవాసులలో నొక స్త్రీ సేనలం గూర్చుకొని చీనావారికిఁ దోడ్పడియాజిల్లాను చీనావారికి నిల్పెను.

“షు” అను కలహ నాయకుఁడు.

మఱికొన్ని ప్రదేశములయందుఁ గలహకారులు బయలువెడలిరి. వారిలో ముఖ్యుఁడు 'షు' (Shu) అనువాఁడు. వీనికనేక పట్టణములు లోఁబడెను; కాని వాఁడు సేనానాయకుఁడుగాఁ జిరకాల ముండుటకుఁ దగనివాఁడగుటం జేసి వాఁడొకసారి రోడి పోఁగానే వానియనుచరులు వానినిఁ ద్యజించి పోయిరి.

స్వ్రాచుయొక్క పరాజయమును మరణమును.

చీనా రాజ్యమునకుఁ బ్రబలాపదం జేయఁగల వాఁడీశాన్యమూలయందుండెను. అతఁడు 'స్వ్రాచు' అనువాఁడై. అతఁడనేకయుద్ధములయందు జయశాలిగ నుండినను చీనాగోడకు నుత్తరమున దుర్గముగల పట్టణమయిన “నింగ్యూయన్” (Ninguyan) మీఁద రెండుసార్లు దాడిచేసెను. అచ్చటి సేనానాయఁకుఁడు బహుసమర్థుఁడును ధైర్యశాలియుఁగా నుంటచే నతడు మంచూరియావారి జయప్రవాహమునకుఁ గొంతకాలమువఱకయిన నడ్డుకట్ట వేసినవాఁడయ్యెను. మంచూరియావారిపై చీనావారికిఁ గలిగిన యీ రెండుజయంబులకు ముఖ్యకారణములు (1) పోర్తుగీసువారు “మెకాయొ” నుండిపంపిన ఫిరంగుల యెదుట “మంచూరియనుల” ఫిరంగులుబలహీనములయ్యెను (2) “స్వ్రాచు” అప్పటికి వృద్ధుఁడయినందున మఱి

యుం బోరాడఁజాలఁడయ్యె. తనకు మరణమాసన్నమవుచున్నదని యెఱింగి 'నూర్హాచు' మూక్డను (Moukden) కుఁ దిరిగివెళ్లెను. అచ్చట 1626సం॥లో నీతనిమహావీరచరిత్రమును మరణము సాంత మొనర్చెను.

టియంటుసుంగు మంచూరియా రాజ్యాధిపతియగుట.

అతని రాజ్యమున కతనినాల్గవపుత్త్రుం డధిపతి యయ్యెను. ఆపుత్త్రుని పేరు 'టియంటుసుంగు' (Tientsung). మంచూరియా యొక్క యీ క్రొత్త ప్రభువు చీనాచక్రవర్తితో సంధి కావించుకొనుటకు మొట్టమొదటఁ దలంపుకలవాఁడైయుండెను; కాని తెలివిలోపమువల్లనో యేమొ సంధికృత్యమును సరసముగా నుపక్రమింపఁడయ్యె. ఒక్కఁడే సూర్యుఁడాకాశమునందును నొక్కఁడే చక్రవర్తి యాకాశము క్రిందను గలఁడని చీనావారిలో నొక సామెత యున్నది. (ఈసామెతలోని చక్రవర్తి చీనాచక్రవర్తి యనియే యెఱుంగవలయును). చీనావారిరాజ్య విస్తీర్ణమును బట్టి యీసామెతను దంభవచనముగాఁ దలఁపఁగూడదు. అట్టిసర్వాతిశాయిత్వముగల చక్రవర్తితో సమానసంబంధునివలె సంధిరాయబారములను మంచూరియాప్రభువు జరిగించుటంజూచి చీనారాజసభాముఖ్యులు వింతపడిరి. అది యటుండ నతఁడు కోరియాపై దండెత్తి దానిని దనపాదంబులక్రింద మట్టగించెనో యనునట్లు నాశము చేసెను. కాఁబట్టి సంధిరాయబారములు విటతటముగ నుండెను. సంధి యనుకూలంబుగఁ గావింపఁబడనిచో 'టియంటుసుంగు' (Tientsung) యుద్ధసన్నద్ధుండు కా నిశ్చయించుకొని యుండెను గావున 'నింగియూన్' నగరమును ముట్టడించి గతకాలంబునఁ దనజనకుండు పరాజితుఁడైనరీతిగనే యితఁడు నోడిపోయెను.

టియంటిచక్రవర్తియొక్కమరణము. టిసం

అకాలంబుననే 1627 సం॥ లో చీనాచక్రవర్తి యయిన 'టియంచి' పరలోకగతుఁడు కాఁగా ఆయనయనుజుండు "టిసంగుచంగు" సింహాసన మెక్కెను, 'నింగ్యూయాన్' నగరరక్షణ దక్షుండైన

గుచంగు సింహాసన మెక్కుట (1627-1643.)

సేనానికిఁ గలప్రసిద్ధమయిన వ్యూహరచనాశక్తియుఁబరాక్రమమునుచీనావారి సేనానాయఁకులుతఱచుగాఁగలిగి యుండరు. నింగ్వ్యాయాను స్వాధీన మయినయెడల చీనాదేశ మందలి యుత్తరపుబయళ్లను జయింపవచ్చునని, 'టియంటుసుంగు' ఎఱిఁగియుండెను. అస్వాధీనమయిన దుర్గంబును వెనుకతట్టున విడిచి శత్రుదేశములోనికిఁ జొరఁబడుట యపాయకరమని రణవీరులకందఱికిని స్వతస్సిద్ధముగఁ దెలిసిన విషయమై యున్నది; కాని యానియమంబునకుఁ గొన్ని పక్షాంతరంబులుకలవు. కావునఁదానుపక్షాంతరం బవలంబించి యానింగుయాఙ్ (Ningyuan)నగరమును ముట్టడించు చున్నటులు కొంచెము సైన్యము నక్కడఁ గపటవేషముగ నుంచి 'టియంటుసుంగ్ (Tientsung.) చీనారాజధాని యైన 'పికిఙ్ (Peking) పై సూటిగా దండు వెడలెను. ఆదండయాత్రయందు మంగోలియావా రాతనికిఁ దోడ్పడిరి. అటులు శత్రువు తన కందకుండఁగఁ బోయె నని 'నింగియాఙ్' నగర మందలి సేనానాయకుఁడు గ్రహించెను. శత్రు వతిసాహసముగా చీనారాజధానిపై దండువెడలె నని చారులు కూడ ఆయనకుఁ జెప్పిరి. మఱియు 'పికిఙ్' రాజధానియందు సేన యల్పముగ నుండెననికూడ ఆయన యెఱుఁగును. కాఁబట్టి రాజధానిని సంరక్షించుటకై యాయన తక్షణమే బయలువెడలెను. అటులు పందెమునకై గుఱ్ఱములు పరువిడునట్లు శత్రుసైన్యమును, చీనావారిసైన్యమును, రాజధానికిఁ బోవుచుండెను. మంచూరియావారు ముందుగాఁ బయలుదేరి యున్నను మార్గములో నున్నకొన్నినగరములను ముట్టడించుచుఁ బోవుటచేఁ గొంతకాలయాపనమై చీనాసైన్యము చేరునప్పటికే వారును జేరిరి.

కపటోపాయము

'నింగ్వ్యయాఙ్' (Ningyuan) నగరప్రసిద్ధ సేనానాయఁకుఁడు 'పికిఙ్' రాజధానికి వచ్చుటం జూచి మంచూరియా సేనానాయఁకుఁడు తాను ధర్మయుద్ధం బొనర్చి గెలువలేనని తలఁచి మాయోపాయ

మొకటిపన్నెను. అదియెంతనీచ మైనయుపాయమో యంతజయప్రద మైనది యయ్యెను. మంచూరియా సేనానాయకుఁడు 'పికిన్' నగరమందలి కొజ్జాల నిద్దఱినీవఱకే పట్టుకొని ఖైదులోఁ బెట్టి యుంచెను. తనయుద్యోగులలో నిద్దఱు నాకొజ్జాలు వినునట్లుగ నిట్లుసంభాషింపు మనిచెప్పెను. 'నింగ్స్యయాన్' నగరమందలి సేనానాయకుఁడైన 'చెంగువాన్' (Chunghwan) రాజద్రోహి యై పికిన్ నగరద్వారములను శత్రువునకుఁ దెఱచుట కిష్టపడి యుండెను. అట్లు ప్రసంగింపు మని వారికిఁ జెప్పి కొజ్జా లున్న చెఱసాలతలుపులను దెఱచి యుంచునట్లు సేవకులకుంజెప్పెను. పాఱిపోవుటకు నవకాశముదొరకుటంజేసి తప్పించుకొనిపాఱిపోయి

చక్రవర్తి యా సేనా నాయకుని జంపించుట

యాకొజ్జాలు తాము వినిన యావిషయమంతయు చక్రవర్తి చెవిని బడవేసిరి. అది యంతయు సత్యమనినమ్మి యాయన 'చెంగువాను'ను తన మోలికకుఁబిలిపించి నిర్విచారణగా నతనినురిదీయుమని యాజ్ఞాపించెను అట్లా సేనాని చంపఁబడినను చీనావారితోఁ బోరలే నని మంచూరియా సేనాపతి 'పికిన్' ముట్టడి చాలించి యుత్తరసీమకుఁ బోయెను. ఎదిరించుసేనతోఁ బోరాడుటకంటె పాఱిపోవుసైన్యమును దఱుముటకుచీనావారి కెక్కుడు సంతోషము. కావున వానినిఁదఱుముకొనిపోవుచు నంతకులోఁగడ వాఁడు ముట్టడించి లోఁబఱుచుకొని యున్నయనేకపట్టణములను చీనావారు మరల స్వాధీనపఱుచుకొనిరి.

కలహకారు లిద్దరు బయలు దేరుట.

ఇవ్విధముగ నప్పటికాలము చీనావారికి జయప్రదంబుగ నుండెను; కాని యదిక్షణభంగురంబేయయ్యెను. మంచూరియావారిని దఱిమితిమని చీనావా రుప్పొంగుచుండఁగా "షెన్సి" (Shensi) నగరమందసాధారణమైన కల్లోలము పుట్టె నని చీనాచక్రవర్తికి వర్తమానములు వచ్చెను. ఈకల్లోలమునకుఁ బ్రబలనా

యఁకులిద్దఱుండిరి. వారిపేర్లు, "చాంగూ" (Changu) "లి" (Li). వారు చీనా వారి సైన్యమువల్లఁ బరాజితులైరి. అట్లు జయము నొందినను చీనావారి సేనా నాయఁకుఁడు కొంచెము తెలివి లోప ముగ సంచరించి నందున ఆజయమువల్ల లాభమునకు మాఱుగ నష్టమువచ్చెను. "లి" (Li) యనువాఁడు నడిపించుకొని వచ్చి న కలహకారులగుంపును చీనావారు తఱిమివేసి వారు లోఁబడెద మని చెప్పఁగా నిబంధనలు లేకుండ లోఁబడు మనిరి. ఆగుంపున కధిపతియైన "లి" అనువాఁడు తానును దనగుంపును దప్పించుకొని పోవుటకు వెరవుఁగానక తనయాయుధములను చీనావారిముందరఁ బెట్టుటకు సమ్మతించి తనను దనగుంపును సురక్షితముగఁ బోనీయుఁడని యొకనిబంధనను మాత్రము సిగ్గులేక కోరెను. వాని కపటప్రార్థనను చీనావా రంగీకరించిరి. కాఁబట్టి చేతిలోఁజిక్కిన ముప్పదియాఱువేల కలహకారులు తప్పించుకొని యథేచ్ఛఁ బోయిరి.

టియఁటుసుంగు మఱల దండువెడలుట.

పైనిఁజెప్పఁబడిన మంచూరియా సేనానాయఁకుఁడైన 'టియంటుసుంగు' (Tientsung) ఆప్రకారముగా స్వదేశమునకుఁ బాఱిపోయి ప్రజలసైన్యముం గూర్చుకొని చీనాదేశముపై దండెత్తివచ్చుటకై సన్నద్ధుండగుచుండెను. విదేశీయులఫిరంగులయెదుటఁ దనసేన నిలువఁజాలమిం జేసి తానును ఫిరంగుల నమర్చుకొనెను. చీనా గోడనానుకొని యుండుప్రదేశముల ననేకములను జయించియనేకదుర్గంబులఁబట్టుకొని'సింగ్యుయాక్' కోటను జయించువఱకు పికిన్‌రాజధానిపై దండువెడలఁ గూడదని 'టియఁటుసుంగు' నిశ్చయించుకొనెను. ఇట్లుండఁగా నేఁబదిరెండేండ్లవయస్సునందు 'మౌక్డెన్' (Moukden) పట్టణమందు 1643 వ సంవత్సరములో వాఁడు మృతినొందెను. అంతకుఁబూర్వమే వాఁడు మంచూరియా రాజ్యమునకుఁ బ్రభువై తనవంశమునకు "టాచింగ్" వంశ మని పేరిడెను. ఆపేరిప్పటికిని జరుగుచున్నది.

'లీ' యొక్కయు
చాంగుయొక్కయు
జయము

ఈమధ్య కాలములో నింతకు మున్ను చెప్పఁబడిన 'లీ' 'చాంగు' (Li, Chaung) అనుకలహ సేనానాయకులు చీనారాజ్యములోనికిఁ జొరఁబడి వచ్చుచుండిరి. వారు షెన్సీ మొదలైన కొన్ని నగరములను బట్టుకొనిరి. చాంగు అనువాఁడు సంపూర్ణజయశాలిగ నుండెను; "కాని" సియాంగియాంగ్ (Hsiangyang) నందు ఈసాహసికునికి నొక వింతసంగతి కాకతాళీయంబుగ సంప్రాప్త మయ్యెను. వాఁ డానగరములోఁ బ్రవేశింపఁగానే యావఱకుఁ బదిమాసముల క్రిందట చీనావారి సేనోద్యోగులవల్లఁ బట్టుఁకొనఁబడియున్న వానిభార్యయు బిడ్డలును వాని కగపడిరి. ఆదారాపుత్రాదులు చీనావారిలోఁ గలసి నెమ్మదిగ జీవించుచుండిరి. శత్రుసంబంధులు తమచేతిలోఁ జిక్కినయెడల చీనావారికి వారి యందుఁ గరుణయే యుండదు. దయలేకున్నను చాంగ్ (Chang) ను దమకులోఁబడునట్లు చేసికొనుటకై వారు వానిదారాపుత్రాదులను సురక్షితముగ తమవద్దఁదాకట్టుగానుంచుకొనిరని యూహింపఁదగియే యున్నది.

లీ యొక్క యపజ
యమును ఘోర
కృత్యమును.

'లి' (Li) యనువాఁడు సాధారణముగా జయము నొందుచున్నను కెయిఫెంగ్ (Kaifeng) నగరము నొద్ద నపజయము నొందెను. 'టియంటుసుంగ్' (Tient-sung)కు 'సింగియాంగ్' (Ningyaung) నగరమువలెనే 'లీ (Li)కి ఆపట్టణమంత కష్టసాధ్యముగ నుండెను. వాఁడాకోటపై వేసిన ముట్టడులన్నియుఁ గొండపై వాన కురిసినట్లు వ్యర్థములయ్యెను. అనేక ముట్టడులు వేయఁగా నొకముట్టడియందు వానికొక కన్నుపోయెను. తుదకు వాఁడు ధర్మయుద్ధమందెన్నఁడును నెవరును జేసి యుండని ఘోరకృత్య మొకటి సేయుటకు నిశ్చయించుకొనెను. ఆపట్టణమునకు సమీపమున మంపముగఁ బ్రవ

హోంచు పసుపుటేఱు' (Hoangho) ఉండెను. దానికట్టలు భూమిమట్టమునకు మిగుల నెత్తుగా నుండిననుది యప్పు డప్పుడు పొంగి పొరలి దేశనాశము చేయుచుండె నని యాదేశచరిత్ర తెలుపు చున్నది. ఆపట్టణమును బాదుచేయఁదలఁచినట్లయిన నాయేటికట్టకు గండిపెట్టవంజాలును. అందువలన నాపట్టణమే కాక సమీపప్రదేశములు కూడ దాని వెల్లువలో మునిఁగిపోవును. కాఁబట్టి యాఘనకార్యము నే యాశూరుఁ డొనర్చెను. వానివలన నాప్రదేశమును ఆ నగరమును ఆ యేటివెల్లువ తుడిచిపెట్టి చీనావారి సైన్యమును గలహకారుల సైన్యమును నేకరీతిగ నాశమొనరించెను. ఆజలప్రళయములోఁ బదిలక్షలజనము యమపురికిం బోయిరఁట; వారిలోఁ గలహకారులు పదివేలమంది. ఏమయినను 'లి' యొక్క-కోరిక సిద్ధించెను. వానిసేనలు చేయఁజాలనిపనిని పసుపుటేఱు నెఱవేర్చెను. పిదప నాగండిని బూడ్పించి వెల్లువనాపి యాకోట బురుజులమీఁద నాతఁడు తనజయధ్వజము వెలయింపఁ జేసెను.

ఆతఁడు తన కిఁక నేవిధ మైనయపాయము లేదనుకొని తాను రాజునని ప్రకటించుకొనెను. ఆఘనతను వాఁ 'లి' చక్రవర్తి ననుట. డొక సంవత్సరమనుభవించితృప్తిఁజెందెను; కాని సుఖమనుభవించినకొలఁది నభిలాషలు హెచ్చుచుండు ననెడి లోకమర్యాదచొప్పున నాసంవత్సరము కాఁగానే యతఁడు చీనాదేశ చక్రవర్తి నని బిరుదు వహించి తనవంశమునకు 'తాయషున్' (Taishun) అను పేరు పెట్టెను. మఱియు చీనాదేశ ప్రభుత్వ నిబంధనను బోలునట్లు తన యుద్యోగుల నాఱుపంచాయతులుగ నేర్పఱిచి యుద్యోగములయందు ఘననీచతారతమ్యముల నిరూపించి తనయనుచరులు కోరినట్లు వారికి నుద్యోగముల నిచ్చి సంతోషపెట్టెను.

అటులు సింహాసనారూఢుండై పికిన్ రాజధానిని స్వాధీనపఱుచుకొనుట యొకటి శేషించియున్నదని దానిపైకి గొప్పదండుతో వెడలెను. త్రోవలో నతఁడు 'నింగ్వు' (Ningwu) అనెడు బలిష్ఠమైన కోటను ముట్టడించి యచ్చట తన సైన్యములో 10000 మంది చచ్చువఱకు నది స్వాధీనము కానందున దానిపైఁ గినిసి దానిని దగులఁ బెట్టించెను. అచ్చట చీనావారిముష్కరయుద్ధము చూచి యతఁడు కొంచెము జంకి వెనుకకు మఱలుట మేలనుకొను చుండఁగా 'తాతంగ్' (Tatang), 'సున్వా' (Sunwa), నగరములు తనకు లోఁబడినట్లు సమాచార మతనికిఁ దెలియవచ్చెను. అవి లోఁబడుటచే 'పికిన్' రాజధానిని నిరాటంకముగాఁ బోయి ముట్టడించెను. ఆ రాజధానియం దుండు సైన్యము వ్రాఁతలలోఁ గనఁబట్టునంత యధికముగాఁ బ్రత్యక్షమున నగపడదు. సహాయసైన్యము వచ్చువఱకు నున్న సైన్యమైనను శత్రువు నెదిరింపఁ జాలియుండెను; కాని దక్షిణద్వారమందుండిన సేనానాయకుఁడు ద్రోహబుద్ధితో శత్రువునకు దారియిచ్చెను. రాజధానియందున్న సైన్యమును రాజ్యాభిమానము కలిగి పోరాడదయ్యెను.

పికిన్ రాజధానిపై 'లి' దండెత్తుట.

1643 సం॥ లో సంభవించిన యాదురవస్థలోఁ జక్రవర్తి తాను సేనాధిపతియై పోరాడక పాఱిపోయి పరిసరమందున్న కొండపై నెక్కి రక్తపూరితమైన రణరంగమును దహనజ్వాలలను జూచి కడుఖేదఁ జెంది తనప్రజలను జంపక విడువుఁ డని ప్రార్థనాపూర్వకమైన యొకలేఖను గలహకారులకు వ్రాసి పంపి యొకచెట్టునకు నురివేసికొని యాత్మహత్యఁ జేసికొనెను. స్వర్గపుత్రుఁ డనబడెడి యాచీనాచక్రవర్తియొక్క మరణమునకు సాధనమైనదని యావృక్షమును దోషియనియెంచి దానికి సంకె

చక్రవర్తియాత్మహత్య చేసికొనుట.

ప్లీను వేయవలసినదని యిప్పుడు పరిపాలించు వంశముయొక్క ప్రథమ చక్రవర్తి యాజ్ఞాపించెను. రాజవంశము నెడల చీనావారికిఁగలగౌరవమును దెలుపుట కిది వినోదకర మైనదృష్టాంతమే కదా!

లీ' పికిన్ రాజధానిని వశపఱచుకొనఁగా 'వుసాంక్వి' లోఁబడకుండుట

అంతట 'లీ' పికిన్ రాజధానిని స్వాధీనపఱుచుకొనెను. అట్టిసమయములయం దుండెడియాచారప్రకారము రాజధానియం దుండుగొప్పవారిలో హతశేషు లాతని దర్శింపఁ బోయిరి. వారిలో 'వూ' (Wu) అనువాఁడుండెను. గతంబున లిఖింపబడినరీతిని 'నింగియాన్' సేనానాయకుఁడైన చెంగువాన్ మరణశిక్షాపాత్రుఁడైనతరువాత నాస్థానమునకు 'వూ' యొక్క కుమారుఁడైన 'వూసాంక్వీ' (WuSankwei) యను వాఁడు నియమింపఁ బడెను. ఈతఁడు ధైర్యసాహసములయందుఁ దన పూర్వునిం బోలి యుండి యాకోటను సురక్షితముగ నుంచెను. చీనా చక్రవర్తి తా నాత్మహత్యఁ జేసికొనుటకుఁ బూర్వము పికిన్ రాజధానిని శత్రువులనుండి రక్షించుటకై యాసేనాధిపతికి నుత్తరువు చేసి యుండెను. అతఁడు సేనాసమేతుఁడై రాజధానికి వచ్చుచుండఁగా రాజధాని శత్రువశ మైనదనియుఁ జక్రవర్తి యాత్మహత్యఁ జేసి కొనె ననియు నాతనికిఁ దెలిసెను. అది యటుండ నాతనితండ్రియును గుటుంబమును శత్రువు వశములో నుండుటంజేసి శత్రువునకు లోఁబడి తమ్మును విడిపింపుమని కుమారునిపేర తండ్రివ్రాసిన జాబును నాతని కప్పడే చేరెను ఆతఁడు శత్రువునకు లోఁబడవలె ననియే తలంచు చుండఁగా వేఱొక సమాచార మాతనికిఁ దెలియుటచేఁ దనదలంపు నాతఁడు వెంటనే మార్చుకొనెను.

స్త్రీల వలన రాజ్యములు సయితము తలక్రిందులగు ననుటకుఁ బ్రపంచ చరిత్రలో ననేకదృష్టాంతము లున్నవికదా! పైనిఁ జెప్పిన

స్త్రీలవల్లన రాజ్యములు తలక్రిందగుట

సమాచార మేదియనయావ్వనవతి యగు నొక బానిసచిన్నది యిప్పుడుచీనారాజ్యమును బాలించుచున్న మాంచూవంశమున కా రాజ్యము లభించుటకొక విధముగఁ గారణమయ్యెను. 'సాంక్వి' నింగియాక్ పట్టణమునకు సేనానాయకుఁడగుటవలనఁ బూర్వ మాదాసీచిన్నదాని నొక స్నేహితుఁ డాతనికిఁ గానుకగా నిచ్చెను. ఆమె యౌవనవతియే కాక సుగుణవతియు నై యుండెను. అతని కుటుంబముతోఁబాటుగ నాచిన్నదియు శత్రువశములో నేయుండెను. రాజధానిలో శత్రువశమందున్నవారి నందఱను శత్రువు వధించునని యాతఁ డెఱుంగును. కాఁబట్టి రాజధానిని శత్రువశమునుండి విడిపింపవలెనని యాతఁడతిశీఘ్రముగఁ బోవుచుండెను.

'లీ, పైదండెత్తుటకు 'వూసాంక్వి'యొక్క సన్నాహములు

తన ప్రియురా లైనయాబానిస వైరివశంబున నుండుటఁ జేసి వైరికిమర్యాదలాంఛనము లనావశ్యక మనుకొని యాతఁడాచిన్నదానిని వైరివశమేల చేసితివనికోపావేశకంబుతోఁ దండ్రికి జాబు వ్రాసి పుత్తెంచి తనను వచ్చికలియు మని మాంచూ రాజప్రతినిధికి మఱియొక యుత్తరము వ్రాసెను. అతని సేనాసహాయముతో పికిన్‌లో నూతనపరిపాలకుఁడైన 'లీ'పై దండెత్తవలెనని 'సాంక్వి' తలఁచియుండెను. అట్లుభయసైన్యములు కలియు నను సంగతి నూహించి 'లీ'వారిపై దండెత్తిపోయెను. 'సాంక్విని' లోఁబఱుచుకొనుటకై వానితండ్రినిఁ జంపించెద నని 'లీ, ముందుగ బెదరించెను. వైరికి లోఁబడు మనియుఁ దన్నుఁ బ్రతికింపు మనియు జనకుఁడు మొఱలిడినను నాతఁ డాబానిసయందలి మోహావేశంబున వైరికి లోఁబడఁడయ్యె. వైరినిసంహరించి పికిన్ రాజధానిలో నొక కలహకారుని యొద్ద నున్న యాబానిసను మరల స్వాధీనపఱుచుకొనుటయే యాతని ముఖ్యాభిలాషయయి యుండెను. సాంక్వి లోఁబడకపోవుటచే వాని తండ్రి నుభయసైన్యములయెదుట నతిఘోరముగ 'లీ' వధింపించెను.

'లీ' కిని 'సాంక్వి' కిని జరిగిన యుద్ధము.

'లీ' సైన్యము యొక్క సంఖ్య (2,20,000) 'సాంక్వి' సేన యంతకంటెఁ జాల స్వల్పము. 'షాన్‌హైక్వాన్' (Shanhaikwan) కోటలో నుండి బయలువెడలి సాంక్వి శత్రువుయొక్క సేనాబాహుళ్యముఁ జూచి వెనుదీయక ఘోరముగఁ బోరుచున్నను నాతనికే పరాజయము గలుగునట్లు గన్పట్టు సమయములో మంచూరియా రాజప్రతినిధిసైన్య మాతనికిఁ దోడ్పడెను. దానిచేఁ బ్రోత్సాహితుఁడై 'సాంక్వి' యంతకుమున్న జయము తమదే యనుకొనుచున్న 'లీ' యొక్క సైన్యమును జిందరవందరఁ గావించెను. ఆ సైన్యము పలాయన మగుచుండఁగా దానిని 14 మైళ్లవఱకు 'సాంక్వి' తఱుముకొనిపోయి వందలువందలుగా హతము కావించెను. వారిని మఱియుం దఱుముటకు 'సాంక్వి'కి నియమించి మంచూరియా రాజప్రతినిధి 'షాన్‌హైక్వాను' నగరమునకు మరలి బడలియున్న తన సైన్యమునకు విశ్రాంతి యొసంగెను. 'లీ' అంతట 'పికిన్' రాజధానికిఁ బరువెత్తి యచ్చట నుండి కొనిపోఁదగిన విన్నాణపువస్తువుల వెంటఁగొని 'వు' యొక్క కుటుంబమును బంధువులం దెగటార్చి రాజధానిని జిచ్చునకర్పించి పడమటిదిశగాఁ బాఱఁ దొడంగెను. 'సాంక్వి' పరువిడుచున్న వారిని లంబాడికుక్కవలెఁ గవిసికవిసి మాటిమాటికి పోటువుచ్చుచుండఁగా 'లీ' ని యాతని సైనికులు త్యజించి పోయిరి. ఇరువదిమంది భటులతో నాతఁడు కుడువఁగూడును నిలువనీడయును లేక యల్లాడుచుఁ ద్రోవలో నొక గ్రామముపైఁ దాఁసను దన సేవకులును బడి బెడిదంబగు నిడుమలం దొడరఁజేసి యా గ్రామజనులవలనఁ దమకువలసిన పదార్థంబులఁ బడయఁ జూడ వారు కడు నలుకం బూని తమ వ్యవసాయ సాధనంబులచే వానిని వానియనుచరులను మడియంజేసిరి. 'వుసాంక్వి' పోయిపోయి 'లీ' కడకు నిల్చిన స్థానంబుఁ జేరి వారిజాడ నరయ వారిశల్యంబులు మాత్రమచ్చోట నాతనికిఁ గానవచ్చె.

'షుంచి' చక్రవర్తి
1644-1661

పైనిఁ జెప్పఁబడిన మంచూరియా రాజప్రతినిధి పేరు డార్గను. ఆయన నాఱేండ్లవయస్సు గల తన సోదరపుత్రునికి మారుగఁ దాను పాలించుచుండెను. కావున 'డార్గను' ఈమధ్యకాలములో, మంచూరియా రాజధాని యైన మూక్డెన్ విడువఁబడి యారాజ్యమునకును 'పికిన్' రాజధానిగాఁ జేయఁబడుననియును ఆబాలరాజును 'పికిన్'కు రమ్మనియుఁ దెలియఁజేసెను. చీనారాజ్యమం దప్పటికిఁ గలహములు నివారింతము లగుటం జేసి యాబాలుఁడు రాగానే యాయనను డార్గను 1644 సం॥ లో చక్రవర్తినిగాఁ జేసి 'షుంచి' యనిపేరుపెట్టి తాను రాజప్రతినిధియై యుండెను.

మాంచూవంశము
చీనారాజ్యమేలు
టకుఁగారణము.

ఈయధ్యాయమం దింతదనుక మింగువంశపరిపాలనములోఁ జివర వచ్చిన యిద్దఱుచక్రవర్తులచరిత్ర వ్రాయఁబడినది. వారిలో 'టియంచి' చక్రవర్తి కాలమృత్యువు నొందెననియు నతనియనుజుఁడు డాత్మహత్య కావించుకొనెననియు ఆయనపేరు 'టిసంగుచెంగు' అనియు దెలిపియుంటిమి. ఈవంశమువారు చీనాదేశీయులే. వీరియందె చీనాప్రజలకభిమానము. 'సాంక్వే' యను చీనాసేనాయకుఁడు 'లీ', కి లోఁబడి యున్నయెడల నప్పుడు పరిపాలనవంశ మేది యయియుండునో! ఆతఁడు తన బానిసకన్నియందు మోహావేశంబు గలవాఁడై యాకన్యను శత్రువశమునుండి తానుబడయుటకై 'మంచూరియా' రాజప్రతినిధియొక్క సహాయమట్లుకోరెను. మంచూరియా వారావఱకే చీనారాజ్యమును జయింపవలెనని 'వాన్లి', చక్రవర్తికాలమున దనేకయుద్ధములు చేసి వ్యర్థమనోరథులైరి; కాని చీనారాజ్యముపైఁ గన్నుపెట్టియే యుండిరి. తాను వలచిన బానిస కన్యను మఱలఁ బడయుటనే జూచుకొనెను గాని శత్రువులయిన మంచూరియా

వారు రాజ్యము నాక్రమించుకొందు రేమోయని 'సాంక్వ్యీ' స్వదేశీయుఁడయ్యుఁ దలఁపడయ్యె. మఱియు నంతకు మున్నే చీనాచక్రవర్తియాత్మహత్య చేసికొని యుండెను. తిరిగి రాజ్యమునకు నూతనచక్రవర్తి వచ్చియున్నట్లు చరిత్రవలనఁ గన్పట్టుట. కాఁబట్టి మింగువంశము పోయి మంచూరియావంశము వచ్చుటకు మున్నునుడివినట్లు బానిసకన్య యొక్క విధంబుగఁ గారణమయిన దనియే భావింపఁ దగును. మంచూరియా వంశము పరరాజ్యవంశ మని ద్వేషించి చీనావారు వారిం దొలఁగించుటకు నెంత పెనఁగులాడుచురో ముందు విశదీకరింపఁబడును.

డార్గను కొజ్జాలను ఉద్యోగములనుండి తప్పించుట

మింగు వంశమందలి రాజులు పాలించు చుండఁగా రాజభవనమందు కొజ్జా లుండి యా రాజులు సమర్థత లేనివారగుటచే రాజకీయ వ్యవహారములయందు జోక్యము గలుగఁజేసికొని బలవంతులై గర్వితులైయుండుట సంభవించు చుండెను. అట్టి యపాత్రులు రాజకీయోద్యోగములయం దుండి యధికారము వహించుట యనుచిత మని తలఁచి కొజ్జాలు రాజకీయోద్యోగములయం దుండఁగూడదు అని 'డార్గను' ఉత్తరువు చేసెను. ఆ యాజ్ఞ యిప్పటికిని జెల్లుచున్నది. చీనాయం దుండుగొప్పవారి కందఱికి డార్గను యొక్క వ్యవహారమర్యాద సమ్మతంబుగ నుండుటచే నాయనపరిపాలనకు వారలు తక్షణమే యిష్టపడిరి. అట్లు రాజ్యస్థితి సౌమ్యదశలోనికి వచ్చెను; కాని ఆస్థితిని భంగపఱుచుట కొకవిరోధకారణ ముదయమయ్యెను. చీనాదేశ మందలి మధ్యప్రదేశ వాసులు పూర్వము చెప్పఁబడిన 'లి' జనుల కొనరించిన దౌర్జన్యాది దుష్కృత్యములను గూర్చియు నతని నిర్జించి నిలుకడ గల మంచూరియావంశప్రభుత్వమును డార్గను నిర్మించుటఁ గూర్చియు నెఱిఁగిన వారు కారు. కావున

వారికి, మంచూరియావారివంశ మేలుట తెలియఁగానే, కంటకముగ నుం డెను. చీనాదేశముయొక్క దక్షిణభాగమం దుండుప్రజలు మింగువంశస్థు లే చీనారాజ్యమును బరిపాలింపవలె నని కుతూహలము కలవారయి యుండిరి.

అకాలంబున నే మింగువంశమందలి ప్రథమ ప్రభువుయొక్క పురాతన రాజధానియందు 'షికోఫా, (Shih-K'ofa) యను పేరుగల పండితుఁడు చీనాదేశమం దుండెడియొక ప్రబలమయిన రహస్య సంఘమువారియొక్క తీర్పునే యవలంబించి యుండెను. ఆ తీర్పేమనఁగా చింగువంశపురాజుల బహిష్కరించి మింగువంశపురాజుల స్వీకరింపవలయు నని యుండెను. డార్గను నేల కొల్పిన మాంచూరియావంశము నూతనవంశమనియు నంతకుఁ బూర్వము చీనారాజ్యము నేలుచుండిన వంశము మింగువంశ మనియు మున్నె లిఖించితిమి. అట్టి మింగువంశ మంతరించినందునఁ పైనిఁ జెప్పఁబడిన పండితుఁడు తద్వంశమందుఁ దనతోఁబాటుగ నభిమానము కలప్రజలను గుమిఁగూర్చుకొని కలహోన్ముఖుం డయ్యెను. ఆ కలహకారుల నడంచుట సులభసాధ్యము కాదని డార్గను గ్రహించి వారితో సంధికావించుకొనెద నని రాయబారులం బంప షికోఫా యంగీకరింపక వ్యవహారములు సంధిమర్యాదను మీఱి యున్నవనియు, నేవంశము పరిపాలింపవలయునో యా విషయము యుద్ధపరిష్కృతము కావలయు ననియుఁ, బ్రతివచనముఁ బంపెను.

షికోఫాకలహ నాయఁకుఁడగుట.

మింగువంశ్యుఁడైన కడపటిచక్రవర్తి (టిసంగుచంగు) టియంటుసుంగుతోఁ బోర లేక యురిపెట్టుకొని యాత్మహత్య చేసికొనె నని గతంబున లిఖింపఁబడి యున్నది. ఆయన యపుత్రవంతుఁడు. ఆయన యందుఁదద్వంశాభిమానులకుఁ గలయనురాగముచే ఆయన పేరిటివాఁడును, మింగువంశ్యుఁడు నయిన మఱియొకనియొక్క పుత్రుని జక్రవర్తిత్వమునకు వారు నిరూపించిరి. ఆనూతనచక్రవర్తిపేరు 'ఫ్యూ వాంగు' (Fu Wang). చక్రవర్తిత్వమున కంతకంటె వ్యర్థుఁడు మఱియొకఁ డుండఁబోఁ డని చెప్పవచ్చును. మఱియు రాజ్యము తలక్రిందగునట్టి సమయంబున ధైర్యసాహసాదిగుణోపేతుండగువాఁడు చక్రవర్తిపదంబునకు నియమింపఁబడవలసియుండెను. ఆ నూతనచక్రవర్తి కట్టివీరలక్షణములు లేవు కాని కామలంపటత్వమును గలహాసక్తియు మాత్రము గలవు. చక్రవర్తి యోగ్యత యటు లుండుటచేఁ గలహకారులకు మంచూరియావారితో జరుగఁబోవు ప్రబలయుద్ధకార్యభారము 'షికోఫా' యందె యుండెను. దానికిఁదోడుగ నాచక్రవర్తియు నతనికి మఱియొక భారముగ నుండెను. పిమ్మట 'యాంచౌ' (Yongchow) నగరమం దుభయకక్షులవారికిని ప్రచండభండనంబు సప్తవాసరంబులు ప్రవర్తిల్లఁగా మింగువంశాభిమానులకు భంగంబు వాటిల్లె. యుద్ధానంతరము కూడ ఆనగరవాసులను మంచూరియావారు బహుక్రూరవధఁ గావించిరఁట. పండితుఁడైన షికోఫా పాఱిపోవ నుంకించుచుండఁగ వధింపఁబడెను. అతని యనుచరులు నిశ్శేషంబుగఁ బొలియింపఁబడిరి. యుద్ధకాలమం దానిర్భాగ్యచక్రవర్తి నాన్కిన్ పట్టణమందున మిణిమ్మించిన

మింగువంశ్యుఁడైన 'ఫ్యూవాంగు' చక్రవర్తి యగుట.

మింగువంశాభిమానులోడిపోవుట.

సురాపానంబుచే నొడలెఱుంగక తందనము పాడుచుండఁగాఁ దన పక్షమువారిని విపక్షులు జయించి రనువార్తయు శత్రువులు తన రాజధాని పైకి వచ్చుచున్నా రనుసమాచారమును నాకర్ణించినతోడనే తన క్షాత్రవంతంబును నామావశిష్టంబుగఁ జేసి డెందంబునఁ గొందలంబు పెంపొందఁ బందయై తన రాజధానిని శత్రువున కర్పణంబొనర్చి పలాయన మవ్యవహితంబుగఁ గావించెను; కాని యతనికై వచ్చిన వైరి సైన్యమాతనిఁబట్టుకొని దోషినైతి నని యతనివలనఁ బ్రమాణంబుఁ గొని తుదకు నతని వధించిరి.

మింగువంశచక్రవర్తి పాఱిపోఁగా వధింపఁబడుట

పదంపడి మింగువంశ్యుఁ డయిన మఱియొక చక్రవర్తి మూఁడు దినములు మాత్రము పరిపాలించెను. కాని మింగువంశపు క్షాత్రవంతము నానాఁటికి క్షీణించినందున నాచక్రవర్తి తనపై దండెత్తి వచ్చుచున్న మంచూరియా సైన్యమునకుఁ బట్టణద్వారములను దెఱచి తనను దన ప్రజలను శత్రువులు బాధింపకుందు రని నమ్మెను. ఐనను మంచూరియావారి సేనానాయకుఁడు ప్రజలను వధింపక యాచక్రవర్తిని మాత్రము వధించెను.

మింగువంశ్యుఁడైన మఱియొక చక్రవర్తి వధింపఁబడుట

మింగువంశ్యుడై మఱియొక చక్రవర్తి రాజ్యాధిపతి యయ్యెను. ఆతఁడు దనకుఁ గించిత్పూర్వులయినవారి వలె బిరికివాఁడుగాక బలపరాక్రమములుగలిగి శత్రువులయిన మంచూరియావారితోఁ గొంత వఱకుఁ బోరాడెను. కాని తుదకుఁ బరాజితుండై శత్రువశంగతుఁడై మృతిఁ జెందెను. మఱియు ఫలవంతములయిన కొన్ని ప్రదేశములను బరిపంథులు స్వాధీనపఱుచుకొనిరి.

మింగువంశ్యుఁడైన మఱియొక చక్రవర్తియు వధింపఁబడుట.

మొట్టను ప్రవర్తిల్లిన యుద్ధములయందు మంచూరియావారు జయశాలులయినను నావికాయుద్ధములయందు వారు జయమొందలేరనియు, వారియుద్ధప్రవాహ మద్దానిచే నడ్డగింపఁబడుననియుఁ బ్రజలు తలంచుచుండిరి. అక్కాలమందు 'కోక్సింగా' (Koksinga) ప్రబలుఁడయిన నావికాసైన్యాధిపతియై యుండెను. ఇచ్చట నొక విషయంబు చదువరు లెఱింగి యుండవలెను. మంచూరియావారు జయశాలులై పికిన్ రాజధానియందు 'షుంచి' (Shunchih) అనువానిని చక్రవర్తిగఁ జేసిరి. అప్పుడే యంతరించుచున్న మింగువంశ పరిపాలనము పోకుండ నాన్కిన్ పట్టణమందుఁ గొందఱభిమానులు తద్వంశ్యుని జక్రవర్తిగ నొకని తర్వాత నొకని నేర్పఱచుచుండిరి. ఇట్టిద్దఱు చక్రవర్తు లేకకాలంబునఁ బరిపాలించుచున్నట్లు చరిత్రలవల్లఁ దెలియుచున్నవి. పైని పేరాలో నుదహరించిన ప్రకారము మింగువంశచక్రవర్తి వధింపఁబడిన తర్వాత 'క్వివాంగు' (Kweiwang) చక్రవర్తి యయ్యెను. పైనిఁ జెప్పఁబడిన 'కోక్సింగా' (Koksinga) 'చెంగు' (Cheng) అనువాని పుత్రుఁడు.

కోక్సింగా.

'చెంగు' తన బాల్యమందు దరిద్రుఁడుగానుండి పిమ్మట వయఃకాలంబున మాయోపాయముచేతను నధర్మముచేతను ధనమార్జించి బలవంతుఁడై చీనాతీరముల యందోడదొంగతనములు చేయుచుండెను. గతంబున లిఖింపఁబడినఁ 'షుంచి' (Shunchih) చక్రవర్తికాలములో వాఁడు దుస్సాధ్యుఁడుగా నుండుటచే నా చక్రవర్తి వానిని మృదుమధుర వచనములచేఁ గపటోపాయముగఁ దన రాజధానికిఁ బిలిపించిఁ చెఱలోఁ బెట్టించెను. ఆ చక్రవర్తి జీవించియున్నంతవఱకు వానికిఁ జెఱసాల యందైనను మర్యాదగ జరుగుచుండెను. ఆయన యనంతరము రాజ

చెంగు.

ప్రతినిధులు వానిని ఘోరముగ వధించిరి. వాఁడు తన యౌవనకాలమందు జపానియా స్త్రీని బెండ్లియాడఁగా నొక కుమారుఁడు పుట్టెను. ఆ బాలుని రూపరేఖావిలాసంబులు చూచి యప్పటి చక్రవర్తియయిన 'ఘుంచి, వానిని ప్రేమించి వాని వంశనామమును మార్చి 'చు' అనెడు తన వంశనామము పెట్టెను. వాఁడు చదువుకొని 15 వత్సరముల ప్రాయమందె పట్ట పరీక్ష యందు మెప్పువడసెను. వానిపేరె కోక్సింగా. తనకుఁ బుత్రికయున్న యెడల వానికిచ్చి వివాహము చేయుదునేయని యా చక్రవర్తి తలఁచెను. వాని తండ్రిని ఆ చక్రవర్తి 'పికిను' నగరమునకు మాఱుపాయముగఁ బిలిపించినపుడు వాఁడును వెంటవచ్చునని యాశపడెనుగాని వాఁడు కొన్నిరోడలఁ జేర్చుకొని 'పిస్కెడోర్సు, (Pescadores) అను చోటునకుఁ బోయి యచ్చట బలవంతుఁడయి శత్రువులకు దుస్సాధ్యుఁడుగా నుండెను.

చెంగువధింపఁబడుట.

కోక్సింగాకు 'చు' అను వంశనామము.

మింగువంశాభిమానులొనరించిన యుద్ధములును, బొందిన పరాజయములును గతంబున లిఖించియుంటిమి. ఆ పరాజయములతోఁ గలహములు నివారణ కానే లేదు. పిమ్మటఁ నవితఱుచుగ జరుగుచునే యుండెను, జయాపజయంబు లుభయపక్షంబులకును బ్రాప్తించుచుండెను. మింగువంశచక్రవర్తియయిన 'క్విచాంగు' జయమొందునట్లు కూడఁ గన్పట్టెను. ఆయన సేనానాయకులిద్దఱు జయశాలులై కాంటన్ నగరమును స్వాధీనపఱుచుకొనిరి. ఆట్టిస్థితిని జూచి మింగువంశము తలయెత్తఁగలదని జనులనుకొనుచుండఁగాఁ మిం

మింగువంశస్థుఁడయిన క్విచాంగు చక్రవర్తి యగుట.

ఆయన జయములు.

గువంశాభిమానులలో హతశేషులు మంచూరియా

మింగువంశాభిమానులు మంచూరియా వారికి లోఁబడిరి.

వారికి లోఁబడిరి. కావున మంచూరియా వారు కాంటన్ నగరమును మఱల వశపఱుచుకొనిరి. అప్పు డానగరవాసులు వలసపోవుచుండఁగా వారికి 'కోక్సింగా' శరణ మొసంగి యాదరించెను. మఱియు వాఁడు 'ఫుకీను' (Fuhken) రేవుపట్టణమువద్ద మంచూరియా వారిని దాకి పలుసారు లోడించెను. వాని

కోక్సింగాకు మింగువంశమందభిమానము.

కి మింగువంశమందె యభిమానము కలదు. కావున వారికొఱకు నానిక్ను నగరము ముట్టడింపవలెనని తలఁచుచుండఁగా మంచూరియా సేనానాయఁకుఁడు వాని నోడించెను. అంతట వాఁడు హతశేషమయిన సేనతో దక్షిణప్రాంతములకుఁ బాఱి పోయెను. మంచూరియావారు నావికాయాత్రానుభవము లేనివారగుటచే వానిం

క్వివాంగు యొక్క క్షీణదశ.

దఱుముకొని పోఁజాలరైరి. అవ్విధముగ మింగువంశ చక్రవర్తియైన క్వివాంగునకుక్షీణదశ వచ్చుచుండెను.

ఆచక్రవర్తి స్థితి యటులుండఁగా నీవఁజలో 'లి' అనువానిని బట్టుదలతోఁ దఱుముకొనిపోయిన 'వుసాంక్వి' మఱలవచ్చి యవ్విధముగానె మింగు చక్రవర్తిం దాఁకి తఱుమఁగా నాతఁడు బర్మారాజును శరణుజొచ్చెను. బర్మారాజు రక్షింపవలెనని తలఁచినప్పటికి వెంబడించి వచ్చుచున్న 'వుసాంక్వి' సేనకు వెఱచి యాచక్రవర్తిని శత్రువశము చేసెను. అంతట

వుసాంక్వి క్వివాంగును దాకుట.

క్వివాంగు యొక్క మరణము.

నాతఁడు తనపూర్వులవలెనె శత్రువుల చేతిలో మడిసెను. మంచూరియా వంశ్యుఁడైన బాల చక్రవర్తి (షుంచి) రాజప్రతినిధియైన డార్గను

యొక్క యాలోచన ప్రకారము రాజ్యమేలుచుండఁగా డార్గనః మంచూరియా దేశములో మృగయాయాత్ర చేయుచు మరణ మొందెను. ఆయన మరణమునకుఁ జక్రవర్తి మిగులఁ జింతించి యాయన తనకొనరించిన మహోపకారములఁ దలఁచుకొని కృతజ్ఞతాపూర్వకముగాఁ జక్రవర్తులకొనరించు మర్యాదలతో నాయనకు గోరి కట్టించెను. ఆయన తన చివరకాలములోఁ జక్రవర్తిపై దండెత్తవలెనను ద్రోహచింతను గలిగియుండెనని యాయన గతించిన యనంతరము చక్రవర్తికిఁ దెలియఁగా విచారించి సత్యమని తోఁచుటచే నాయన గోరికి జరిగించిన రాజమర్యాదలను గొట్టివేసి తి మని లిఖితపూర్వకముగాఁ బ్రకటించి యా గోరీని తీసివేయించి దుర్మార్గుఁడని ప్రజలకందఱకుఁ దెలియునట్లు చేసెను. ఆ చక్రవర్తి కాలంబున డచ్చిరాజ్యమునుండియు రుషియా రాజ్యమునుండియు రాయబారులు పంపఁబడిరి. దానిని బట్టి మంచూరియా వారి పాలనాగౌరవము నూహింపవచ్చును. డచ్చిరాయబారి చక్రవర్తిని దర్శించి రాయబార సమాచారముల బహుగాఁ బ్రశంసించి తెచ్చిన కానుకల సమర్పింపఁగా చక్రవర్తి యిట్లు లిఖితపూర్వకముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను.

డార్గను యొక్క మరణము.

డార్గనుకు గోరీని గట్టించుట.

గోరీని దీసివేయించుట

మొదటి రాయబారులు.

'మీరు మా దేశములో వాణిజ్యము చేసికొనుట కంగీకారము వేఁడితిరి. మీది బహుదూరదేశము. ఈ తూర్పు దేశ తీరమందు తుపానులు మెండుగా నుండుటచే మీనావల కుపద్రవము కలుగును. అట్లున్నను మీరు వాణిజ్యము చేయఁబూనెదరేని నెనిమిదివత్సరంబులకొకసారి నూఱుమందికంటె మించకుండ నిచటికివ

చక్రవర్తి యొక్క ప్రత్యుత్తరము.

చ్చి వారిలో నిరువదిమంది మాపశ్ఞనముచేసి కొనవలయును. 'రుష్యా' రాయబారి మూర్ఖముఁగా ప్రవర్తించినందున డచ్చిరాయబారి కొసంగిన యర్థాంగీరమునయిన నొసఁగక యాతనిని చక్రవర్తి నిరాకరించి పంపివేసెను. డచ్చిరాయబారి నీటి మీఁద వచ్చియుండెను. రుషియా రాయబారి మెట్టను సైబీరియా దారినివచ్చి యుండె. వీరు యూరోపుఖండమునుండి తూర్పుదేశములకు వచ్చిన రాయబారులలో మొదటివారు. వీరు 1656 స॥ లో వచ్చిరి. ఆ రాయబారులను చీనాచక్రవర్తియటు లనాదరణ చేసె నని నిరుత్సాహులుగాక పడంబడి యూరోపు ఖండమునుండి రాయబారులు వచ్చుచునే యుండిరి.

కోక్సింగ మడిలనోడ దొంగతనములుచేయుట.

రాజకీయవ్యవహారస్థితు లిట్లుండ గతంబున లిఖింపఁబడిన 'కోక్సింగ; (Koxinga) చీనాతీరమున నోడదొంగతనములు చేయుచు సరకులను ధనమును గొల్లఁగొనుచుండుటఁ జూచి రేవుపట్టణములయం దుండుప్రజలకు సముద్రతీరమును విడిచి దానికి 12 మైళ్లదూరముగ రాజ్యములో నివసింపవలయు నని శాసనము ప్రకటించి యాప్రకారము కావించెను.

వింతశాసనము.

అదియెంతవింతవిషయము! తఱిమెడివారికిఁ బాఱిపోవువారు మఱియు లోఁకువ యగుదురు కదా!

షుంచి పదునెనిమిది వత్సరములు పాలించి రాజ్యము స్వస్థమయిన స్థితిలోకి రాకుండఁగనే 1661 సం॥ లోఁ గాలధర్మము నొందెను.

1661 సం॥ లో 'షుంచి' చక్రవర్తియొక్క మరణము.

మృతినొందుటకుఁ బూర్వమే ఆయన తన ద్వితీయసూనుండైన 'కాంఘ్సి, (Kanghsi) ని రాజ్యమునకు నిర్ణయించెను. కాంఘ్సి సింహాసనము నధిష్ఠించునప్పటికి నెనిమిదేండ్ల ప్రాయముగలిగి యుండెను కావున నాయన జనకుఁడు

నియమించిన నలుగురు రాజప్రతినిధులాయన చేఁ

**కాంగ్‌షిచక్రవర్తి యగుట. 1661-1722**

బరిపాలనము చేయించిరి. మింగువంశ్య చక్రవర్తియయిన క్వెవాంగు మరణానంతరము పైనిఁ జెప్పఁబడిన కోక్సింగ యొక్కఁడే ప్రబలసైన్యోపేతుఁడై ప్రచండకలహకారుఁడయి యుండెను, వాఁడు నావికాయుద్ధమం దాఱి తేఱినవాఁ డగుటచే డచ్చివారి నావికాసైన్యమును దోడుఁ గావించుకొని చీనావారు వానిని బట్టు

**'కోక్సింగ', యొక్క మరణము.**

గ నూడింప, వాఁడు 'ఫార్మోజా'కుఁ బాఱిపోయి యచ్చటఁ దదనంతరము మతిచెడి మరణమొందెను. వానిమరణమునకుఁ బూర్వమే మఱియొకకలహకారులగుంపును దొరతనమువా రడఁచియుండుటచే రాజ్యము స్వస్థతం జెందెను.

తూర్పుదేశములయందు రాజప్రతినిధిస్థాన మెల్లప్పుడు సంశయాస్పదముగను నపాయకరముగనుండును. నలుగు

**రాజప్రతినిధులనుదొలగించుట.**

రు రాజప్రతినిధులున్నయెడల నొండొరులయెడల నసూయాదులకును మనస్తాపంబులకును గారణమగుచుండును. కాంఘ్సిచక్రవర్తికి సహాయార్థ మాయనతండ్రి నియమించిన నలుగురురాజప్రతినిధులు తత్కాలంబునఁ బరస్పరద్వేషులై రాజ్యమునకుఁ బీడాకరులుగ నుండుటచే 1667సం॥ లో వారిని దొలఁగించియాయుద్యోగంబులనే సమాప్తినొనరించి కాంఘ్సి సర్వాధికారమును దా నేవహించెను. ఆచక్రవర్తియొక్క తండ్రియయినషుఙ్చియొక్క పరిపాలనకాలములో రోమన్‌కాతొలికు మిషనెరీలకు బహుగౌరవముగ జరుగుచుండెను. వారిలో 'షేరీసాల్' అనుమిషనరీ చక్రవర్తితనూజున కుపాధ్యాయుఁడగునంతటిమహత్తరపదవియందుఁ గూడనుండెను. రాజప్రతినిధులు పూర్వాచారపరాయణులగుటచే నాచక్రవర్తి మరణమొందినతోడనె విదేశీయులయందునను వారిమతమందునను బ్రబ

ల ద్వేషముగల వారై పైనిఁ జెప్పిన పేరిసాలుఁ మీఁద నొక నేర మభూతకల్పన సేయించి యాయనను గారాగృహమందుఁ బెట్టించి యచ్చటనే చల్లచల్లఁగా మృతినొందునట్లు చేయుఁడని యుత్తరవు జేసిరి. ఆయననుమృతినొందునట్లుచేయుటకుఁ దుదకు వారు సాహసింప లేకున్నను, నా చెఱసాలలో ఆయనయే కాలను రాఁగా మృతినొందెను. కాఁబట్టి రాజప్రతినిధులయుద్యోగములె సమాప్తినొందుట యామిషనెరీల కానందజనకంబయ్యెను.

ఒకమిషనరీ యొక్క యక్రమమృతి

పైనిఁ జెప్పఁబడిన యధర్మప్రవర్తన మంతయు కాంఘ్సిచక్రవర్తి రాజ్యపాలనమును స్వయముగా వహింపక పూర్వము ప్రవర్తిల్లెను. ఆయన స్వచ్ఛందాధికారము వహించినతోనే యామిషనీరలకుఁ గలుగుచున్న శ్రమల నివర్తింపఁబూనెను; కాని ప్రజలు పూర్వాచారలోలురగుటచే వారి కనిష్టంబుగ నా మిషనరీలకు ననుకూలమయిన న్యాయస్వాతంత్ర్యముల నియ్యఁజాలక, తత్పూర్వము రాజప్రతినిధులతోఁ జడలేక యెచ్చటెచ్చటనూఁ దాఁగియున్న యా మిషనరీలు మఱలఁ దమ ప్రార్థనాలయములకు రావచ్చుననియుఁ దమ మతములో స్వదేశీయులను జేర్చుకొనఁ గూడదనియు మాత్ర మర్ధాంగీకారముగ శాసనము ప్రకటించెను. ఆ శాసనమం దిట్లు వ్రాయఁబడెను.

కాంగిషిచక్రవర్తి మిషనరీలకొనర్చినకొద్దిమేలు.

"తార్తారదేశపులామాలు (గురువులు) కాని చీనాదేశపు మతాచార్యులు కాని దేవాలయములను గట్టుకొనుటకును వానియందు ధూపాదిక్రియల నొనరించుటకును మే మభ్యంతరపఱుపఁజాలము. మఱియు వారిమతము ధర్మవిరుద్ధమయినదని ప్రతిపాదింపఁబడనందున వారు దేవాలయములను నిర్మించుకొనఁ గూడదని

చక్రవర్తిమతవిషయమై చేసిన శాసనము.

యుఁ దమమతములను బోధింపఁగూడదనియు మే మాజ్ఞాపింప వలసి పడదు. కాఁబట్టి వారియిష్టముచొప్పున దేవాలయములను గట్టుకొన వచ్చు ననియు క్రైస్తవమతావలంబులయిన దేశీయులు తన్మతానుసారు లగుచుఁ దమకిష్టమయినయెడల నాదేవాలయములకుఁ బోయి ధూపాది క్రియ లాచరింపవచ్చుననియు మే మాజ్ఞాపించుచున్నాము.’’

మరియొక మిషనరీని కఱ-సామర్థ్యము.

‘‘పేరీసాలు’ అనుమిషనరీ మృతినొందిన పిమ్మట మఱియొక మిషనరీ యాయనస్థానమునకు వచ్చెను. ఆక్రొత్త మిషనరీ తత్వశాస్త్రమందును నితరశాస్త్రముల యందును నధికప్రవీణుఁడు; ప్రభువును శాస్త్ర పాండిత్యమం దభిలాషగలవాఁ డగుటచే ఆయ నను గౌరవించి తఱచుగా నాయనతో శాస్త్రప్రశంసలఁ జేయుచుండె. ఆట్లుండ నొకప్పుడు రాజకీయపంచాంగములో దోషమున్నదని యాయ న చెప్పఁగా చక్రవర్తి విమర్శించి సత్యంబుఁ గని యాయనను జ్యోతిష సంఘాధిపతియని నియమించి యాసంఘమం దావఱకున్నవారిని గఠినము గ దండించెనఁట.

మంచూరియా వంశోపకారులకు కాంఘ్సి కృతజ్ఞతంజూపుట.

మింగువంశాభిమానముచే సంభవమయినకలహములు నివారింపఁబడినపిమ్మట మంచూరియాచక్రవర్తి పరిపాలనము దృఢపడి యుండఁగా నట్టిస్వస్థతకుఁ గారణభూతులైనవారిలో ముఖ్యులగుమువ్వరకుఁ జక్రవర్తి కృతజ్ఞతాపూర్వకముగ రాజు లనిబిరుదొసంగెను. గతంబున లిఖింపఁబడిన ‘‘వూసాఙ్క్వె’’ వారిలో నొకఁడు. అతనిధైర్యసాహసాదిగుణంబులఁ గూర్చి చదువరు లీవఱకే యెఱిఁగియున్నారు. అతఁడు తనపరాక్రమంబుచేతనే ‘క్వెచౌ’(Kweichow), ‘యూనఙ్’(Yunnan)పట్టణముల స్వాధీనపఱచుకొని యుండెను.

కాని యతనిబలపరాక్రమంబులం జూచి చక్రవర్తి యతనితో నెగ్గుట దుర్లభం బని తలంచుచుండెను. వానినడతను నమ్మఁజాలక వానిపుత్రుని జక్రవర్తి తన నగరమందు దాకట్టుగనుంచుకొనెను. ఆపుత్రుఁడు రాజనగరమందు నమ్మకముగా నుండుటచే రాజవంశపుకన్య నిచ్చి యాతనికి వివాహంబు కూడఁ జేసిరి.

ఘూసాంక్వియెడల చక్రవర్తికి నసూయవొడముట.

రాజ్యమందుండు ముఖ్యులు దన నప్పుడప్పుడు దర్శించుటకై పిలిపించుకొను మర్యాదచొప్పున 'ఘుసాంక్వి' ని రమ్మనుమని చక్రవర్తి సందేశము పంపెను. రాజనగరమందున్న వానికుమారుఁడు చక్రవర్తి చేయుచున్న ద్రోహచింతనయొక్క సవ్వడి నెవ్వగనో యెఱింగి చక్రవర్తియొక్క దర్శనార్థము రావద్దని యాతఁడు తనజనకునకు రహస్యముగ వర్తమానము పంపెను. అంతట నాతనితండ్రి తాను వృద్ధుఁడగుటచే రాఁజాలఁ ననియుఁ దాను రానందునకుఁ దన్ను క్షమింపుఁ డనియుఁ జక్రవర్తికిఁ దెలియఁజేసెను. అతఁడు రాక నిరాకరించుటచేఁ జక్రవర్తి సందేహ మతిశయించెను. కావున వాని వార్ధక్యమతని రాక నడ్డగించుటకుఁ జాలిన కారణంబుగ నుండెనో లేదో కనుగొని రండి యని ముఖ్యోద్యోగులఁ గొందఱిని బంపెను. వారు తనను జేరఁగాఁ 'ఘుసాంక్వి' వారికిఁ దగుసన్మానములను గపటవృత్తితోఁ జేసి వారు చక్రవర్తి దర్శనార్థము తనను రమ్మనుచుఁ గోరఁగా '80,000 సైన్యముతో వచ్చెదను పొం డని చెప్పెను. వాఁడు మఱల నిరాకరించుట వారివలన నెఱింగి చక్రవర్తి వానికొడుకు నురితీయించెను. ఆపుత్రుఁడు రాజనగరమం దుండి చక్రవర్తి ప్రాణాపహారకృత్యంబునకై దురాలోచనపరుఁడుగ నుండుట తెలిసి చక్రవర్తి వాని నురితీయించె నని దేశచరిత్రకారులు లిఖించి యుండిరి. చక్రవర్తిని ద్వేషిం జేయుటకై యటులు లిఖించి రని పాశ్చాత్య చరిత్ర

కారులు తలంచెదరు. ఎట్లయినను 'ఫ్రూసాక్సి' తన పౌరుషంబు నిల్పు కొనుటకై పూర్వము తండ్రిని, నిప్పుడు కుమారుని, వధకు సర్పించినవాఁడయ్యె.

చక్రవర్తికిఁగల్గిన శత్రుబాధలు.

తన కుమారుని వధించిరని తెలియఁగానే ప్రచండకోపావేశంబున 'యూనాన్' పరిపాలకుని వధించి కొన్ని నగరములను స్వాధీనపఱుచుకొని 'ఫ్రూసాక్సి' ప్రబలయుద్ధసన్నాహం బొనర్చుచుండెను. అయినను వానితో నింక సంధి కావించుకొనవలెననియే చక్రవర్తి యుద్యమించుచుండెను; కాని వాఁడు సమ్మతింపఁడయ్యె. వాని ప్రాబల్యముం జూచి కడమయిద్దఱు రాజులును నన్నఁగాఁ జక్రవర్తి కృతజ్ఞుఁడై రాజబిరుదునొసంగినవారలు 'ఫ్రుసాక్సి'తోఁ గలసిరి. కావున చీనాదేశముయొక్క పశ్చిమదక్షిణభాగములు చక్రవర్తికి బ్రబల వైరస్థానంబు లయి యుండెను. ఆసమయంబుననే చీనాయొక్క యుత్తరదిశపైకి మంగోలియానాయకుఁ డొకఁడు దండెత్తి వచ్చుచుండెను. అటులు మూఁడుదిశలయందు శత్రువులు చెలరేఁగి యున్నప్పుడు కృతినియవంటి చక్రవర్తియైనను గొందలంబు నందిక యుండఁగలఁడా?

శత్రుబాధనివారణ మగుట.

అయినను 'కాంఘ్సి' చక్రవర్తి యంతకుఁ దాళినవాఁడైయే యుండెను. 'లినోటంగు' పర్యాయద్వీపము నుండి సేనలఁ దెప్పించుకొని యుత్తరదిశయందలి శత్రువును నిర్జించి వానికుటుంబమును ఖయిదీలనుగ రాజధానికిఁ దీసికొని వచ్చి తానే సేనాధిపతియై 'ఫ్రుసాంక్సి' మీఁదికి వెడలుచుండఁగా, వాఁడు 1678 సంll లో మృతి నొందెనని వర్తమానము వచ్చెను. వానిమరణముతోఁ గలహకారులు కుప్పకూలినట్లు కూలిపోయిరి. బలపరాక్రమములుగల వానిమనుమఁడు ముజ్జలబో రాడఁజూచెఁగాని, వాఁడును నిర్జింపఁబడి తఱుమఁబడెను

గాఁ దుదకు నాత్మహత్య చేసికొనెను; వానిశిరస్సును జక్రవర్తి పికిన్ నగరమునకుఁ బంపించెను. వానితాతశరీరమును సమాధినుండి వెల్లగించునటులు చేసి వానిశల్యముల రాజ్యమందు వెదఁజల్లించెను. ఆహా! క్రోధపిశాచం బావహించి యున్నప్పుడు వికారకృత్యంబులకుఁ గొదవ యుండదుకదా! ఈ ఘోరరణంబులును క్రూరకృత్యములును జరిగిన సంవత్సరము చీనారాజ్యమునకు గ్రహచారకాలమయి యుండె. ఘోరయుద్ధంబుల వలన జను లనేకులు మడియుచున్నను చక్రవర్తికిఁ బ్రజలవలని బాధ నిశ్శేషము కాదయ్యెనే యని చక్రవర్తిపైఁ గరుణ వహించి వచ్చెనో యనునట్లుగ చీనారాజ్యమం దప్పుడే భూకంపము గలిగి పికిన్ నగరము నుద్ధూతలూగించి మూఁడు లక్షలజనంబును నాశముచేసెను.

కోక్సింగుయొక్క మనుమని దఱిమి పట్టుకొని గొప్ప యుద్యోగ మిచ్చుట.

చీనాదేశమందలి పదునెనిమిది పరగణాలు నిప్పటికి స్వాస్థతం బొందెను. కావున నీవటులో నొండదొంగతనంబులయందుఁ బ్రముఖుం డని నుడువఁబడిన 'కోక్సింగు' ని కుమారుని హతమొనరించుటకుఁ జీనాచక్రవర్తి యిపుడు సావకాశముగ దొరకొనెను. వాఁడు 'పెస్కెడోర్సు' (Pescadores), 'ఫార్మోజా' (Farmosa), ద్వీపములయందుఁ బ్రజాకలహంబుఁ బురికొల్పు చుండెను. చక్రవర్తి మున్నూఱు నావికాసైన్యముతోఁ దన సేనానాయకుని వానిపైకిఁ బంపఁగా నాతండు వానిని బూర్తిగ నోడించెను. వాఁడు ఫార్మోజాకుఁ బాఱిపోయెను. అచ్చటికిని దఱుముకొని పోవగాఁ గలహింపక వాఁడె యాసేనానికి లోఁబడెను. అంతట వాని సేనాపతి 'పికిన్' నగరమునకుఁ బంపఁగా వాడుకచొప్పున చక్రవర్తి వానిం డెగటార్పక 'డ్యూకు' అను హోదా గల యొక గొప్పయుద్యోగమును వానికి నొసంగి తనసైనికులకు బహుమానము లొసంగెను. అది యెంతసరసమయిన కార్యమ్మొ చూడుఁడు!

ఇట్టి సరసము పూర్వరాజ్యములయందు లేనే లే దని పాశ్చాత్యచరిత్రకారు లభిప్రాయపడుదురు. అది పొరపా టని యనవలయునే కదా!

చీనాదేశ మతివిపులమై బహుజనాకీర్ణమై యుండుటచే నిరంతర కలహములకుఁ దానకం బయి యుండెను.

**అడవిజాతులుతొందరలు కలుగఁజేయుట.**

చీనాకు నుత్తరమునను బశ్చిమమునను గొండల వరుసలె యెల్ల లయి యున్నవి. ఆకొండల ప్రాంతములయం దడవి జాతులవా రనేకులు కలరు. వారు శౌర్యసాహసములు కలవారు. 'ఫుసాంక్వి' ని జయించినవారికిని, ఫార్మోజా ద్వీపమును వశపఱుచుకొనినవారికిని జక్రవర్తి తగుసన్మానములను జేయు చుండఁగా నుత్తరదిశయం దాజాతులవారు చెలరేఁగి చీనారాజ్యమునకుఁ దొందరలు గలుగఁ జేయుచున్నట్లు చక్రవర్తికి సమాచారము తెలిసెను. మఱియు నుత్తరపు సరిహద్దున నున్న చీనాగోడ కావల నేమి జరుగుచున్నదో పికిఙ్ రాజధానియం దుండువారి కజ్ఞాతవిషయుగ నుండెను. 'కాల్మకు' (Kulmuk) అనెడి యడవి జాతులవారిలో నొక తెగవా రయిన 'యెలూత్సు' (Eluths) చీనారాజ్యమునకు లోఁబడియున్న మఱియొక ప్రదేశవాసులను దమకు లోఁబడుమని పోరాడుచుండిరి. కావున వారు చీనారాజుతోఁ గలహమునకుఁ గాలుద్రవ్వుచున్నట్లె కదా. కాని వారి నాయకుఁ డైన 'గాల్డను' (Galdon) అనువాఁడు చీనాచక్రవర్తియొక్క సఖ్యమును గోరినవాఁడై యాయన సన్నిధికి రాయబారులను బంపెను. వారలాయన సమ్ముఖమునకు వచ్చియున్న సమయమం దీవలకు లిఖించి యున్నప్రకారము 'ఫూసాఙ్కి' తోఁ జక్రవర్తియెడతెగక పోరాడుచుండెను. ఆయుపప్రవస్థితిఁ జూచి వారు చీనాచక్రవర్తికి రాజ్యము దక్కదనియుఁ బరిపాలన వంశాంత మగుకాలము వచ్చినదనియుఁ దలఁచి తమనాయకునితో నంతయే చెప్పిరి. ఆ సమాచారము విని చీనాచక్రవర్తివలనఁ దన కేమియుఁ బ్రత్యపకారము గలుగ దని తలఁచి నిర్భయుఁడై పైని జెప్పఁబడిన ప్రదేశముపై దండువెడలెను.

గాల్డనురుష్యావారి సాహాయ్యముకోరుట.

ఆసమయమునందే రుషియావారు ఫౌనికతో ఆమూరునదికిం దూర్పున నున్నప్రదేశముల నాక్రమించుకొని చుఆనదియొక్క యెగువప్రదేశములయందున్న 'ఆల్బేజిన్' (Albazin) పట్టణములోం గోటలను గట్టి వానిచుట్టు కందకములు త్రవ్వించిరి. వారియొక్క పిరంగులు మొదలయిన యుద్ధపరికరములం జూచి గాల్డను (Galdon) వారి సహాయము తన కున్నయెడల చీనారాజ్యము జయింపవలె ననెడిప్రబలాపేక్ష తీరు నని తలంచి వారిసఖ్యము కావించుకొనెను. గాల్డనుచేయు రహస్యాలోచన తనకుం దెలియంగానే చీనాచక్రవర్తి మిషనరీలనిద్దఱను దనరాయబారులవెంట 'ఖాలాక్' దేశమునకుం బంపెను. ఆమిషనరీలపేర్లు 'గర్బిలియన్', 'పెరీరా'. వారు శాస్త్రజ్ఞులును సత్యప్రవర్తనము కలవారు నగుటచే వారియందుం జక్రవర్తికి దృఢవిశ్వాసము కలదు. మఱియు వారు మంగోలియాభాషయు రుషియాభాషయు నేర్చినవారు. ఆసందేశకులు వెళ్లిమఱలి వచ్చి చక్రవర్తికిం జెప్పినదేమనంగా ఖాలాక్ దేశముపై నధికారము చెల్లించు చుండవలెననియు ఆమూరునదికి దక్షిణమందలి ఫలవంతప్రదేశములను రుషియావా రాక్రమించుకొనంబూని యున్నందున వారు చొచ్చుకొని రాకుండ నిరోధింపవలయుననియుం దన్నిమిత్తమయి తగుసైన్యమును బంపి తార్తారులకు భయంబు కలుగంజేసి రుషియావారిని జయించి యుత్తరసరిహద్దును దాటి రాకుండం జేయవలయుననియు నా రాయబారులు సెప్పిరి.

చక్రవర్తి రుషియావారి నోడించుట.

పికిన్నగరమునుండి ప్రచండసైన్యమును జక్రవర్తి యంతటంబంపంగా రుషియావారు కందకములచాటుననుండి పిరంగులు మొదలయిన మహత్తర సాధనములచే చీనావారితోం బోరియుం బూర్తిగ నోడిపోయిరి. యుద్ధమందు రుషియావారిలో

న సేకులు హతులైరి. హతశేషులను పికిన్ నగరమునకుఁ బట్టుకొనిపోఁగాఁ జక్రవర్తి వారికిఁ బ్రత్యేకగృహముల నేర్పఱచి యందు వారు నివసించునటులు చేసెను. వారివంశ్యు లిప్పటికిని చీనాయందుఁ గలరు. వారియందు రుషియావారి ముఖలక్షణములు గోచరించును; కాని చీనాస్త్రీలను బెండ్లియాడుచుండుటచే చీనావారిస్వభావములే వారిసంతతివారికిఁ గలిగెననియు వారు తమపూర్వులసాహసాదిగుణములఁ గోల్పోయిరనియుఁ బాశ్చాత్యచరిత్రకారుఁడు వ్రాసెను. దీనింబట్టి చీనావారు సాహసాదిగుణములు లేనివారని ధ్వనించుచున్నది. అప్పటి చీనాచక్రవర్తియగు కాంగ్షి పొందిన జయములును తుదకు రుషియావారి యపజయమును చీనావారిబలపరాక్రమములను లెస్సఁగ బ్రకటించుచుండఁగా ఆచరిత్రకారుఁ డటులేల లిఖించెనో తెలియదు.

రుషియావారితో నొడంబడిక.

రుషియావా రుపరాజితులైనను దమకోటలనుగందకములను మఱల స్వాధీనపఱుచుకొనుచుండిరి. అటులు యుద్ధములు మఱలఁ బ్రవర్తిల్లుచున్నందున పైనినుడువఁబడిన మిషనరీలు సంధియేర్పాటుల నొనరింపఁజాలకుండిరి. తుదకు వారు రుష్యారాజ్యప్రతినిధితో సంభాషించి సంధికృత్యముల నెఱవేర్చి కృతకృత్యు లయిరి. ఆసంధనిబంధన లేమనఁగా రుషియావారు ఆమూరునదికి నుత్తరమున నున్నప్రదేశములను స్వాధీనమందుంచుకొని తృప్తిఁజెందవలయుననియు దక్షిణతీరప్రదేశములకు వారు లేశమాత్రమయినను దొందరలు గలుగఁ జేయఁగూడదనియు నై యుండెను. పశ్చిమఖండవాసులతో చీనారాజ్యాధిపతి చేసికొనిన ప్రథమసంధి యదియే; అది 'ఆమూరు' నదీతీరమందు 'నర్చిన్స్కు' (Nerchinsk) పట్టణములో జరిగెను; దానిననుసరించి పదంపడి రుష్యారాజ్యమునకును చీనారాజ్యమునకును ననేకములయిన నొడంబడికలు జరుగుట కలిగెను.

రుషియావారిని దోడుచేసికొని చీనారాజ్యముపై దండెత్తవలె నని గాల్డను పేరాసకలవాఁడై చేసినకుట్రయంతయు ఆయొడంబడికచే వ్యర్థమయ్యెను; ఏలయన రుషియావారు సాహాయ్యము చేయమనిరి. అయినను గాల్డనుకొంకెనా? జంకెనా? ఏమియు లేదు. తన కున్నబలముతో 'కాల్ఖున్' (Kalkhun) పరగణాపై మఱలదాడిసేయఁగలనని తలఁచుచుండెను.

రుషియావారిసహాయము తనకుఁ జిక్కకును గాల్డను చక్రవర్తితోఁ బోరఁదలఁచుట.

కాల్ఖున్ పరగణాప్రజలు చీనారాజ్యమునకు లోబడినవారై యుండఁగా వారు తన ప్రజలేయనియు వారు తన సేనలోనుండి దక్షిణదిశగాఁ పాఱిపోవుచుండఁగా చీనాచక్రవర్తి వారికి శరణమొసంగెననియు ఆదేశముపైఁ దాను దండెత్తుటకుఁ గారణములని యతఁడు చెప్పెను. దుర్జనులు కలహకారణములను వెదకికొనవలెనా? జిహ్వాగ్రమందె యుండును గదా! గాల్డను కలహమున కట్లుకాలు ద్రవ్వుచుండఁగా ననన్యవిధమునఁ బరాజయమును బరాభవమును వాని కకస్మాత్సంభవము లయ్యెను; ఎట్లనిన గాల్డను తన తెగలోఁ జేరిన ప్రజల కందఱకు దాను నాయఁకుండయి యుండుటకుఁ దన యన్న జీవించియున్నయెడల వలనుపడకుండు నని వానిని ఘోరముగ వధించియుండెను.

గాల్డనుయొక్క యన్నకొడుకు 'సివాంగు' (Tsi wang) అనువాడు చీనాచక్రవర్తియొక్క ప్రాపకము కలవాఁడై యాపరగణాలోఁ గొంతభాగమున కధిపుఁడుగా నుండెను. వాఁడు క్రమంబుగఁ బ్రబలి తనపినతండ్రితోఁ బోరం దొడఁగి తుదకు వాని మచ్చుమాపి తన తండ్రిని జంపిన కసిఁ దీర్చుకొనెను. ఈయోటమిచే గాల్డనుకు గాటమునఁ బరాభవము పాటిల్లినను క్షాత్రధర్మవిరుద్ధముగ నొకక్రూరకర్మం బొనర్చి వాఁడు తన పాటివారిలో మఱల వినుతిఁగాంచెను; అదేమనిన గాల్డనుతో నొడం

గాల్డనుతనయన్నకొడుకుచే వంచింపబడుట.

బడిక చేసికొని రాజ్యమందు నెమ్మదిని నెలకొల్పవలె నని మఱలఁ దలంచి చీనాచక్రవర్తి గాల్డనువద్దకు రాయబారులను బంపెను. ఆహా! సాహసపరాక్రమములుగల యాచక్రవర్తి యొక్క సౌమ్యగుణ మెంతనికొనియాడవచ్చును.

ధర్మము విడిచి యా రాయబారులను వాఁడు నిర్బంధములోఁ బెట్టి చీనాచక్రవర్తి తనయెడల సౌమ్యముగ నడచుకొనునంతవఱకు వారిని దాకట్టులో నుంచుకొనెద నని యాయనకుఁ దెలియఁ జేసెను. న్యాయయుద్ధపరులు రాయబారులను మర్యాద చేయుదురు కాని లేశమయినను హింసింపరు. అయినను 'గాల్డను' అడవిగుంపులనాయకుఁడు కావున వానికి క్షాత్రధర్మముతోను న్యాయముతోను బనియేమి? మఱియు నిష్కారణముగ నన్నను జంపినవానికి రాయబారులను నిర్బంధించుట యెంతపని? ఏమిశంకకలుగును. ఆయధర్మకృత్యము తన చెవిని బడఁగానే చీనాచక్రవర్తి యింక వానతో నొడంబడిక సంభవింప దని నిశ్చయించుకొని వానిని యుద్ధనిహతుని జేయుట యే కర్జం బని తలఁచి తన సైన్యము మూఁడుభాగములుగ విభజించి వానిపైకిఁ బంపుచుఁ దానును వెంటవెళ్ళెను. అతివిస్తారమైన యా సేన లెడారి ప్రదేశములను బహుప్రయాసముతోఁ దాటి 'వులాన్‌పుటాంగు' (Wulanputang) వద్ద శత్రువు నెదుర్కొనెను. చీనావారి సేనాబాహుళ్యముం జూచి తాను వారితోఁ బోరుటకు జంకి సంధి చేసికొనెద నని గాల్డను ప్రార్థింపఁగా నాతఁడు 'అందిన జుట్టు నందకుండిన కాళ్ళను మర్యాదగలవాఁ డని గ్రహించి చక్రవర్తి వానిపై దాడి వెడలుటయే యతని ప్రార్థనకుఁ బ్రత్యుత్తరమని తలఁచెను. దానికిఁ దోడుగ నతఁడు తన సేనావ్యూహరచనయందు లోపంబొకటి చేసెను; ఏమనిన 'పూసాఁక్వి' బర్మారాజుపై దండువెడలినప్పు డారాజు తన

'గాల్డను' రాయబారులఁ దాకట్టుపెట్టుకొనెనని చక్రవర్తియతనిపై దండెత్తుట.

సేనలకు ముందుగ నేనుఁగుల నిడికొనుటచే నవి శత్రువుల బాణపరం పరలకుఁ దాళఁజాలక వెఱ్ఱెత్తినటులు మఱలి యా రాజసైన్యమునే చిందర వందరఁ గావించుటయును ఆ రాజు దానంజేసి యోడిపోయి సంధి కావించుకొనుటయును గతంబున లిఖింపఁబడి యున్నది. తద్రీతిగానే 'గార్డన్' ఒంటెలను తన సేనకు ముందు నిల్పఁగా చీనావారి శతఘ్నికాజ్వాలల కెదుట నిల్వఁజాలక మఱలి వానిసైన్యమునే కాళ్ళక్రింద మట్టగించి పోయెను. కాని గార్డనుయొక్క యదృష్టవశమున 'కాంగిషి' చక్రవర్తి వ్యాధిపీడితుఁడై తన రాజధానికి వెంటనే మఱలి పోవలసివచ్చెను. అదియటుండ చీనావారి సేనానాయకుఁడు నేర్పరియు జాగరూకుఁడును కానివాఁ డయ్యెను. అట్లు సమర్థుఁడైన చక్రవర్తి యుద్ధభూమిని విడిచి పోఁగా ఆ సేనానాయకుఁడు కలవరపరపడుచున్న గార్డను చులుకగ విడిచిపెట్టెను. శత్రువును విడిచిపెట్టుట మఱల సేనల గూర్చుకొని వానిని యుద్ధమునకు రమ్మనుటయే కదా!

అట్లు కొంతకాలము వఱకు యుద్ధకృత్యములు చాలింపఁబడెను; కాని గార్డను యుద్ధాలోచనలను జేయుచుఁ జక్రవర్తిపై దండెత్తుటకు సమయము కొఱకుఁ జూచుచుండెను. అట్లుండఁగా చీనాచక్రవర్తికి ఆసియామధ్యభాగమందలి సమాచారములఁ దెలిసికొనవలెనని కోరిక గలిగి గార్డనుయొక్క యన్నకొడుకువద్ద కాయన రాయబారులను బంపఁగా దారిలో గార్డను సైన్యము వారిపైఁ బడి దోచుకొని వారిని వధించెను.

సంధికొఱకు గార్డనుకుఁ జక్రవర్తి లేఖను బంపుట

ఆ సమాచారము తెలియఁగానే చీనాచక్రవర్తి కోపోద్రిక్తమానసుం డయ్యెను గార్డను నొడంబడికలోనికిఁ దేలేక పోతిఁగదా యని విచారము కలవాఁడై పట్టుదలతో వానికిట్లు వ్రాసిపంపెను.

"నీవు నా యెదుట నెన్నియో ప్రమాణములు చేసి యుండియు నీయన్నకుమారునితోఁ గలహించుచునే యున్నావు. గతంబున మీ యుభయు

లకుఁ గలవివాదాంశంబులఁ బరిష్కరించి యుంటిని. సంధికై నాయుద్యోగులలో నొకనిని రాయబారిగ నీ యొద్దకుఁ బంప నాతనిని నీసైనికులు క్రూరమృగములవలె హింసించి చంపిరి. నీవు నీప్రమాణముల నబద్ధములఁ జేసి మాకు లోఁబడక వర్తించుచుంటివి. నీ నడతను నే నెట్టిదని యూహింపవచ్చును. నీ కీలేఖ యందినతోనే నీ దుష్కార్యములఁగూర్చి గాఢంబుగఁ బశ్చాత్తాపంబు నొంది శరణుచొచ్చనిచో బ్రబలసేనాసమేతుండ నయివచ్చి నీక్రూరకృత్యంబులకుఁ దగినశాస్తిని జేసెద ననినమ్ముము. ఈయుత్తరమునందుఁ జక్రవర్తి స్వగౌరవమును నిల్పుకొని శత్రువు పశ్చాత్తాపపడుట కవకాశ మొసంగె నని చదువరులు గ్రహింతురు.

చక్రవర్తియొక్క యుద్ధసన్నాహము.

చక్రవర్తి యంతసరసముగ లిఖించినను గాల్డను ఆటవికజననాయకుఁ డగుటచే నాసరస మేమి గ్రహింపఁ గలఁడు? వాని సహజదౌర్జన్య క్రూరత్వాది గుణములు వానిని విడిచి పోవునా? కాఁబట్టి యాసంధివచనములను గాలికి విడిచి యుద్ధసన్నద్ధుండే యగుచుండెను. తనకు సమీపమందున్న మంగోలియాజాతులతో సఖ్యము చేసికొని మహమ్మదీయుల సహాయముఁగూడఁ బడయుటకై వానిమత మవలంబించెను. వానికుట్రయుఁ గపట ప్రయత్నములను దెలియఁగానె చక్రవర్తి తనసేనల నన్నిటిని వ్యూహము పన్ని జనరల్ 'ఫీ' (Generol Fei) అను నతని సేనానాయకునిగా నియమించెను. యుద్ధయాత్రారంభమందు జరిగిన కొన్ని విశేషసంగతులను బట్టి తత్పూర్వమునఁ జక్రవర్తి యొనర్చిన యుద్ధయాత్రలకంటె నది విశేషమయినదిగా నున్నది. ఏ మనిన యాత్రారంభమునఁ జక్రవర్తి సేనోద్యోగుల కందఱకు గొప్పవిందుచేసెను. అత్యద్భుతంబుగ నలంకరింపఁబడిన సభామధ్యంబునఁ జక్రవర్తి యాసీనుం డయ్యెను. ఉత్సవానంతరము సేనానాయకుఁడు మొదలుకొని చివఱయుద్యోగి వఱ కంద

లను రాజభక్తుల మని ప్రమాణపూర్తిగఁ బ్రకటముగాఁ బలిక్రి. తన సైన్యమునకు ధైర్యోత్సాహములు కలుగుటకును రాజభక్తిని వారిహృదయములయందు గాటంబుగ నాటుటకును జక్రవర్తి యట్టిమహోత్సవము చేయించెను. ఒకసేనానాయకుని 30,000 సైన్యముతోఁ బుత్తెంచి పలుదినము మిగిలిన సైన్యమును రెండుభాగములు చేసి యొకభాగమున దాను స్వయముగానె నడిపించెను.

చక్రవర్తియొక్క దైవప్రార్థన.

రాజధానినుండి నిర్గమించుటకుఁ బూర్వము చక్రవర్తి స్వర్గాలయమని పేరుగల దేవాలయమునకుఁ బోయి 'షాంఘి' యను నామంబుగల తమ దేవుని నిట్లు ప్రార్థించెను.

"దేవా! నా సేవను గైకొనుము. నేను నీ కత్యంతభృత్యుఁడను, అతిదీనుఁడను. నా యిష్టమునకు వ్యతిరేకంబుగ నేను జేయఁ బోవుచున్న యుద్ధమునకు నీసహాయం బొసంగుటకై నిన్ను వేఁడుకొనుచున్నాను. నీ కరుణవల్లనే నాదండయాత్ర లింతవఱకు జయోదంచితములయినవి. అట్టి మేళ్ళొసంగితి వని నేను నిరంతరము కృతజ్ఞుఁడనయి యున్నాను. నారాజ్యమందేమి, పరరాజ్యమందేమి, కలహము లన్నమాట లేక యెల్లపుడు నెమ్మదిగ నుండుట నిమ్మ్మగఁ గోరుచుందును. అట్టి నాపూర్ణాభిలాషకు గాల్డను భంగంబు కలుగఁజేయు చున్నాఁడు. వాఁడు దేశమందల్లరులను బ్రవర్తిల్లఁజేసి నీచట్టములను బిట్టొంగ మట్టగించి నీకుఁ బ్రతినిధిగ భూలోకప్రభువు నయిన నాయొక్క యాజ్ఞల నుల్లంఘించు చున్నాఁడు. ఈ నరులలో వానికంటె నసత్యవాదియు దుష్టవర్తనుఁడును లేఁడు. దుష్టశిక్షణ మొనర్చునట్టి యధికారము నాకు నీ వొసంగినదే కదా! నా యధికారము చెల్లించుటకై సేనాయకుఁడ నై వెడలుచున్నాను. నీవు సాష్టాంగదండ

ప్రమాణంబులాచరించుచున్నాను. నీ సహాయమును వేఁడుకొనుచున్నాను. మఱియు నీవలన మహోపకారములను బొందుటకై వానిని నీకు బలి యియ్యఁ బోవుచున్నాను. పరిపాలింపుమని నాకు నీ వొసంగిన యీ విస్తీర్ణ రాజ్యమునందు నెమ్మదిని నెలకొల్పుటకుఁ గృతనిశ్చయుఁడనై యున్నాను".

చక్రవర్తి యధర్మనిధమునఁ బూర్ణజయ మొందుట.

చక్రవర్తి ప్రార్థన సంపూర్ణముగ నెఱవేఱెను. చీనావారి ప్రబల సైన్యము బెబ్బులింబోలు గాల్డను యొక్క గుహను సమీపించినతోడ నేతనను దఱుముకొని చీనావారు బహుళసంకటములు పడఁగలరని భావించి వాఁడు పాఱిపోవ నారంభించెను. చీనావారు తఱుముకొని పోఁగాఁ దుదకుఁ దిరుగఁబడి రణోన్ముఖుం డయ్యెను. అంతట చీనావారి సేనానాయకుఁడు చమత్కారహారకకర్మ మొకటి కావించి జయమొందెను. అదేదియనిన యుద్ధరంగమునకుఁ గురంగట నున్న యొక యున్నత ప్రదేశమందు గాల్డను యొక్కయు సేనలయొక్కయు దారాపుత్రాదు లుండుటఁ జూచి వారిపై నతఁడు పిరంగులఁ గాల్పించెను. స్త్రీలపైనను బిల్లలపైనను నట్లు కాల్చుటయధర్మమే కదా! తమవారలు పిరంగి వాతం బడిరి కదా! యని గుండెలు కొట్టుకొనఁగా రణరంగంబు విడిచి వారిం గాపాడుకొనఁ గొందఱు పరువెత్తఁగా, మిగిలినవారలల్లలజడిం జెందుచుండఁగా, చీనావారా సేనలపైఁబడి హతము కావించిరి. ఆసేనాని చేసినయుపాయ మధర్మమయినను జయప్రద మయ్యెను. గాల్డను యుద్ధభూమిని విడిచి పలాయన మయ్యెను. చీనావారు వానిం దఱుము సన్నాహములగు చుండఁగా వాఁడు మృతినొందె నని సమాచారము తెలిసెను. గాల్డను యొక్క శల్యాలను దారాపుత్రాదులను జక్రవర్తి తన రాజధానికిఁ దోడ్కొని వచ్చెను.

అంతియేకాని చక్రవర్తి వాని మరణమును గౌరవింపలేదు. ఆయన వానిశల్యముల కేమి యగౌరవంబు కావించెనో తెలియదు; కాని చక్రవర్తి వానిపుత్రునకు గొప్పయుద్యోగము నొసంగి వానికూతునకు సలక్షణమయిన వివాహం బొనర్చెను.

గాల్డనుయొక్క కుటుంబమునకుఁ జక్రవర్తి చేసిన మేళ్లు.

శత్రుపక్షమువారియెడలఁ జక్రవర్తి యిట్టియౌదార్యముఁ జూపుట యసాధారణకృత్యమయియుండుఁగదా! గాల్డను రాజ్యమును జక్రవర్తి రెండుభాగములు చేసి ఆల్టాయి పర్వతములకుఁ బడమరగ నుండుభాగమును వానియన్నకొడుకున కొసంగి తూర్పుభాగమును దనపరిపాలనలో నుంచుకొనెను.

ఇట్లు కాంఘ్సీచక్రవర్తి కోరినప్రకారము ప్రబల శత్రువయిన గాల్డను మృతినొందెను; కాని రాజ్యమునకు నెమ్మది కలుగ దయ్యెను. వానియన్నకొడుకయిన 'సివాంగు' (Tsiwang) చీనాచక్రవర్తియొక్క ప్రాపకమువలన ననేకజయములను బొంది తుదకు మహోన్నత్తుఁడై చీనావారిపట్టణమయిన 'లాసా'ను 6000 సేనతో ముట్టడించి యనాయాసముగా లోఁబఱచుకొని కొల్లఁగొను స్వభావము కలతనయనుచరులకు దాని నప్పగించెను. అట్లు చేయుట యుద్ధమునకు రమ్మని చీనాచక్రవర్తిని బిలుచుటయే కావున ఆయన మూఁడవ పర్యాయము మంగోలియాపైకి సైన్యమును బంపెను. ఆ దండయాత్రకు దీర్ఘకాలము పట్టియున్నను వానిని నిర్జించి జయభేరి మ్రోయుచు చీనాసైన్యము మఱలి వచ్చెను.

'సివాంగు'ను నోడించుట.

అప్పటికి అనఁగా 1721 సంll నందు రాజ్యము వైరిపీడారహితమై స్వస్థతం బొందుటఁ జూచి చక్రవర్తియానందమొంది యా సంవత్సరముతోఁ దన షష్టిపూర్తి యగుటచే మఱియు నానందపడి యుభయానందసూచకముగా మహోత్సవం బొనర్చి తన ప్రజలను సయితమానందసాగరంబున నోల

చక్రవర్తియొక్క పూర్ణానందమును మరణమును

లాడించెను. కాఁబట్టి యాయుత్సవమెల్లప్పుడు జ్ఞాపక ముంచుకొనఁదగిన కార్యమయ్యెను. అట్టిమహోత్సవము ప్రవర్తిల్లినయనంతరము శీఘ్రకాలములోనే, జను లాయుత్సవానందమును దలఁచుకొనుచుండఁగానే, కాంఘ్సి చక్రవర్తి 1722 సం॥లో మృత్యుదేవతావశంగతుఁ డయ్యెను. ఆయన 61 సం॥ము లతివిస్తీర్ణమైన చీనారాజ్యమును బరిపాలించెను. 1661 సం॥లో జననమొందిన చక్రవర్తి 1722 సం॥న మృతినొందఁగా 61 సం॥ లేలెనని చెప్పుటకుఁ గారణమేమనఁగా ఆయన పుట్టినవత్సరమందె యాయన జనకుఁ డాయనను జక్రవర్తిఁగా నియమించి రాజ్యపరిపాలనకు నలుగురు రాజప్రతినిధుల నేర్పఱిచె ననియు అష్టమవర్షమం దాయన సింహాసన మారోహించెననియు గతంబున లిఖింపఁబడి యున్నది. ప్రతినిధి పరిపాలన మాయన పాలనముగానె పరిగణింపఁగా ఆయన 61 సం॥ లు రాజ్యమేలినవాఁడయ్యెను. అంతదీర్ఘకాలము సలక్షణముగఁ బాలించిన చీనాచక్రవర్తి మఱియొకఁడు లేఁడనియే చెప్పవలెను. ఆయన వ్యాధి పీడితుఁడైనది పదమూఁడుదివసములు మాత్రమే. ఆ దినంబులలో రాజ్య పరిపాలనమునుగుఱించి ముందఱ యేర్పాటు లాయన సావకాశముగా నొనరింపఁగలిగి తన చతుర్థపుత్రుని రాజ్యాధిపతిం జేసెను. ఆయన పేరు 'యూంగుచంగు' (Yung Cheng).

కాంగిషిచక్రవర్తి సుగుణాదులు.

కాంఘ్సిచక్రవర్తి పరిపాలనము స్తవనీయమయినది. కావున సంగ్రహముగాఁ దద్విషయంబు లీక్రిందఁబొందుపఱుపఁబడుచున్నది.

(1) ఆయన న్యాయదృష్టికలవాఁడు; తనకున్యాయమని తోఁచిన దంతయుఁ జేసినవాఁడు.

(2) ఆయన పరాక్రమమున కందెవేసినచేయి; ధైర్యసాహసములకుగని; పట్టుదలకుఁ బెట్టినదిపేరు; ఈగుణము లా

యన యొనరించిన దండయాత్రలవలనను, బొందిన జయములవలనను, బ్రకాశ మొందినవి.

(3) తన రాజ్యమందునను బరరాజ్యమందునను గల్లోలములు లేకుండ జనులందఱు సుఖంబుండవలె నని యధికాభిలాషకలవాఁడును, దద్విషయమై మిగుల శ్రమపడినవాఁడును. గాల్డనువిషయమై యాయన చూపిన సహానమే యందునకుఁ దార్కాణము.

(4) పరమతసహనము నించుమించుగాఁ గలవాఁడని వక్ష్యమాణవృత్తాంతము విశదీకరింపఁగలదు.

(5) భూతదయయు నిష్పక్షపాత బుద్ధియుఁ గలవాఁడు. ఇందునకు శత్రువుల పుత్రులు తనవశములో నుండఁగ వారికుద్యోగము లిచ్చుటయు శత్రువుల పుత్రికలు తనకు లోఁబడియుండఁగ వారికి సలక్షణముగ వివాహములొనర్చుటయు గొప్పదృష్టాంతములు.

ఆయన ప్రబలపండితుఁడును సాహిత్యపోషకుఁడును బహుగ్రంథకర్తయు నైయుండెను. ఈవిషయమై గతంబున

గ్రంథములు.

లిఖింపఁబడినందున నీదిగువ నుదాహరింపఁబడుచున్నది. ఈయన గద్యపద్యాత్మకముగ రచించిన స్వదేశభాషాగ్రంథము లనేకము లున్నవి. అవి పెద్దపెద్ద సంపుటములు. స్వదేశభాషాసాహిత్యగ్రంథముల విషయమై యాయన లిఖింపఁజేసిన రెండుమహాగ్రంథము లాభాషాభూమిపై నుండునఱ కాయన నామము శాశ్వతము చేయుచున్నవి. అవి యెవ్వియనిన:—

(1) మహత్తరమయిన శబ్దార్థనిఘంటువు. దీనికి కాంఘ్సినిఘంటు వని పేరు; ఆ చక్రవర్తి నియమించిన పండితసమాజమువలన ఆయన యుత్తరప్రకార మది లిఖింపఁబడినది. ఈగ్రం

థ మాయనను జ్ఞాపకము చేయుచునే యుండును; చీనా భాష కదిసిద్ధాంతగ్రంథ మయి యున్నది; అది 36 సంపుటములు కలది.

(2) సర్వగ్రంథసారము. ఈ గ్రంథప్రోత్సాహకుఁడు కాంఘ్సిచక్రవర్తియే; ఇది 5020 సంపుటములు కలది. ఈ బృహద్గ్రంథములోఁ జేరియున్న గ్రంథములు 32 శాఖలుగా విభజింపఁబడినవి; అట్టిప్రతిశాఖయందును నంతశ్శాఖలసంఖ్యాతములుగ నున్నవి; ప్రతిశాఖకుఁ బ్రశస్తగ్రంథముల నుండి యుదాహరణములు చూపఁబడినవి; ఆగ్రంథములకుఁ బౌర్వాపర్యక్రమము చూపఁబడినది. కాఁబట్టి విద్యార్థియేశాఖాగ్రంథముల జదువఁ బూనినను ఈ గ్రంథసహాయమువలన యాశాఖలయందలి ప్రశస్తగ్రంథము లన్నియు ముం దిడికొనినవాఁ డగుచున్నాఁడు.

(3) ఆచక్రవర్తి పదియాఱు నీతిసిద్ధాంతముల వ్రాసెను. ఆ సిద్ధాంతములు విద్యాభ్యాసకుల కారంభమందుఁ పఠనీయ గ్రంథములుగా నుంచున్నవి.

కాంఘ్సిచక్రవర్తి శత్రువులతోఁ బలుమాఱు పోరుచు విస్తీర్ణ రాజ్యమును బరిపాలించుచుఁ బాండిత్యప్రకర్షకలవాఁడై బహుగ్రంథరచనాధురంధరుఁడై వెలుగొందుట యెంతయు శ్లాఘనీయంబుకదా!

ఆయనప్రభుత్వమునకు సంబంబంధించిన మఱియొక విషయంబు కలదు. అది యేదియనినఁ బరమతసహనము. ఆయనపరిపాలనకుఁ బూర్వమే 'జసూట్సు' అనఁబడు రోమకమతశాఖవారు చీనాకు వచ్చి చీనావారిలోఁ గొందఱను క్రైస్తవులఁ జేయుచుఁ దమశాస్త్రపాండిత్యవిశేషంబున రాజద్వా

కాంఘ్సిచక్రవర్తి యొక్క యన్యమత సహనము.

రమందు సమ్మానంబునొందుచుండి రనియు చీనావారికిఁ దెలియనికొన్ని శాస్త్రములను చీనాభాషలో వారు వ్రాసిరనియు గతంబున లిఖింపఁబడి యున్నది. వారు తమ మతసిద్ధాంతమునకు వ్యతిరేకముగ నున్నను చీనావారిపూర్వాచారములఁ గొంతవఱ కంగీకరింపుచు వారి కనుకూలముగఁ బ్రవర్తించి రని యామతమందలి 'డామినికన్' 'ఫ్రాన్సిస్కను' శాఖలవారు చీనాదేశమునకు వచ్చి 'జస్యూట్సు' నాక్షేపించి తమమతమును యథావిధిగఁ బ్రవర్తిల్లఁజేయుఁడని వారిని నిరోధించిరి. దేశకాలపాత్రముల కనుకూలముగాఁ బ్రవర్తించుట యావశ్యక మనియుఁ గొంతకాలము దేశీయాచారముల నంగీకరింపవలయుననియు రోమునగరమందున్న పీఠాచార్యులకు జస్యూట్సు తెలియఁ బఱచుకొనఁగా వారును దత్ప్రవర్తనను నిషేధించిరి. పిమ్మట నేకారణముచేతనో యచ్చట మతసంఘమువారు జస్యూట్సుయొక్క ప్రవర్తనయే సరసముగా నున్నదని పీఠాధిపతికి విన్నవించి యా జస్యూట్సు కనుకూలమయిన యంగీకార మాయనవలనఁ బడసి చీనాకుఁ బంపిరి. పిమ్మట నచ్చట నుండి యొకగురువు వచ్చి జస్యూట్సుతోఁజాలఁగఁ బోరాడి తమ మతసిద్ధాంతమునకు వ్యతిరేక మయినయాచారములను మాన్పింపఁ జూచెను. విరోధకృత్యము లుభయపక్షములయందును బ్రబలెను. కాంఘ్సిచక్రవర్తికి 'జస్యూట్సు' యెడల నభిమానమును గౌరవమును గలదు; ఏల యన వారివలనఁ గొన్నియుపకారములు శాస్త్రవిషయమందుఁ గలిగెను. ఇంకొకవిశేషంబు కలదు. చీనాలో 100కి వడ్డీ సం॥ 1కి రు 36 చొప్పన నుండఁగా జస్యూట్సు 100 కి రు24 చొప్పనఁ బుచ్చుకొనుచు నప్పలిచ్చుచుండిరి. అందువలన వారు మిగుల ధనికు లగుటయే కాక జనుల యభిమానముఁ బొందినవారైరి.

అట్టి కలహ సమయమునం దాచక్రవర్తి యా నూతనముగా వచ్చిన గురువును నాయనయనుచరులను 'మెకాయొ' ద్వీపమునకు వెళ్ళఁ

గొట్టి చీనాదేశమందు రోమక కాతొలిక్కు మతగురువులును మతబోధకులును జేయుచున్న యకృత్యములను అల్లరులను చీనాచార్యులకుం దెలియంజేయుటకు వ్రాయబారులను బంపెను. అటులు పంపుట జస్సూట్సువంవలి యభిమానముచేతనే. ఆరాయబారులు మఱల వచ్చువఱకు ఆగురుడు నాద్వీపమందే యుండునట్లు చక్రవర్తి యుత్తరవు చేసెను. ఆ గురువు జనులకును సరిపడవందున ఆయనకు వారివలన శ్రమలు కలిగి రాయబారులు మరలి రాకమునుపే వ్యాధిగ్రస్తుండై మృతి నొందెను. 'జస్సూట్సు' గడియారములను బాగుచేయుట సంగీతపుపెట్టెలు చేయుట మున్నగు పనులవలనం బ్రభువును బ్రజలను రంజింపంజేసిరి. పాశ్చాత్యవిద్యావిశేషంబులందు వారు చీనావారికి నభిరుచిపుట్టించిరి. కావుననే చీనావారిలోం గొందఱకుం బాశ్చాత్యవిద్యాప్రవేశము కలిగెను. చీనావిద్యార్థులలోం గొందఱు తద్విద్యాగ్రహణార్థము తమదేశమును విడుచుటకును యూరోపుఖండమునకుం బోవుటకు నుత్సాహము కలవారైరి. ఇట్లు జస్సూట్సు చీనావారికి మహోపకారులై విశేషముగ ధనమును వారి ప్రేమను సంపాదించినవారయినను దమమత్సరము సంకరము చేసి తమ్మును న్యాయముగ నాక్షేపించినగురువులపైం జక్రవర్తికిం గపటబోధలు చేసి ద్వేషము పుట్టించినవారైరని యపయశముం గాంచిరి.

రోమకమతపీఠాచార్యులవద్దకు రాయబారులబంపుట.

పైనిపుడువంబడిన మతకలహకాలమందు కాంఘ్సిచక్రవర్తి పరమతస్థులతో స్వదేశీయులు కలియక తొలంగి యుండవలయు నని యొకసిద్ధాంతము చేసెను. ఆ సిద్ధాంత మాయన చేసిన పదియాఱుసిద్ధాంతములలో నొకటి. ఆసిద్ధాంతములకాయనపుత్రుండైన 'యూంగుచంగు' చక్రవర్తి పైనినుడువంబడిన మతసిద్ధాంతమునకు వ్యాఖ్యానము చేయుట యందుం బర

నూతనచక్రవర్తి యొక్కయసంగతాభిప్రాయము.

మతస్థులలో రోమన్కాథోలికుమతస్థులు కూడఁ జేరియున్నా రనియు కాంఘ్సీచక్రవర్తియభిప్రాయ మదియే యనియు నసంగతమయిన యభిప్రాయకల్పనఁ జేసెను. అసంగతసేల యన నా చక్రవర్తి తన్మతస్థులయిన జస్సూట్సునందుఁ దాను జీవించి యున్నవఱకు గౌరవముకలవాఁడై యే యుండుటఁ జేసి వారిని రాజద్వారబాహ్యులను జేయుట కభిప్రాయపడి యుండఁడనియే గ్రహింపవలసియున్నది.



# 6 వ అధ్యాయము.

## యూంగ్ చంగు.

## A. D. 1722-1735 సం॥

'యూఙ్చంగు' చక్రవర్తియయి తనసోదరులబాధించుట.

కాంఘ్సిచక్రవర్తి బహు పుత్రసంపద కలవాఁడు. ఆయన పుత్రులలో నాల్గవవాఁడు 'యూఙ్చంగు'. ఈయనయే రాజ్యాధిపతి యయ్యెను. ఈయన విలక్షణుఁడును విశేషసమర్థుండు నయి యుండెను. ఇతఁ డనన్యసామాన్య మయిన సత్స్వభావము కలవాఁడనియు నించుమించుగఁ దననుఁ బోలినవాఁ డనియు కాంఘ్సిచక్రవర్తి ప్రశంసించి యుండెను. ఈయన సింహాసన మెక్కినప్పటికి 44 సం॥ ల ప్రాయము కలవాఁడు. కాంఘ్సిచక్రవర్తి తన రాజ్యములోఁ గొన్ని ప్రదేశములకు నధికారులనుగాఁ దనపుత్రులనందఱను నియమించి యుండెను. అట్టివారిలో నెవరు తన పరిపాలనమున కుపద్రవము కలుగఁజేసి రాజ్యము నాక్రమింపఁగలరని తనకుఁ దోఁచెనో, వారల కట్టియాశ లేశమాత్ర మయిన లేకుండఁ జేయుటయే తనప్రథమకార్యమని యీ నూతనచక్రవర్తి తలఁచెను. కావున మధ్యఆసియాయందు రాజప్రతినిధిగా నున్న తనకడగొట్టుతమ్ముఁడు మున్నర మయినఘోరమ్ము రాజ్యమ్మున నొనరింపఁగలఁడనియూహించి యాయనను ఆయనపుత్రుని రాజధానికి రానించి చెఱసాలయం దుంచెను. తక్కిన సోదరులను గూడ బహువిధములఁ బీడించెను. రాజ్యముయొక్క పడమటియెల్లవఱకు నొకసోదరుని బహిష్కార మొనరింపఁగా నచ్చట 'సినింగు' నగరమందుఁ జక్రవర్తియొక్క భ్రాతృసమూహ మంతయు క్రైస్తవమత మవలంబించెను. వా రామతముఁ గైకొనిరని మిగుల నసూయఁ జెంది వారిదారాపుత్రాదిబంధువర్గము నంతయుఁ జక్రవర్తి తన

రాజ్యమునుండి వెడలఁ గొట్టెను. 'జ్ఞాతిశ్చేదనలేనకిం' మ్మనునీతివాక్య మొకటి కలదు; అనఁగా జ్ఞాతివాఁడుండఁగా వేఱే యగ్ని యెందుకని యర్థము; అట్టియగ్నిసమానుఁ డయినజ్ఞాతిం దెగటార్చు మనిభావము. తదనుగుణముగానే చక్రవర్తి యొనరించెను; కాని యావాక్యము దుష్టజ్ఞాతివిషయముకాని సర్వసామాన్యము కాదని గ్రహింపనగును. కావునఁ జక్రవర్తిప్రవర్తన యీ విషయమై సరస మయిన దని స్పష్టమవ వల్లనుపడదు.

చక్రవర్తి పరమతవిద్వేషశాసనము ప్రకటించుట.

పూర్వచక్రవర్తి యైనతనజనకుఁడు చేసి యున్న పదియాఱునీతిసిద్ధాంతములలో నొకటి యయినమతసిద్ధాంతమున కీ చక్రవర్తి విపరీతార్థకల్పన యొనర్చుట గతాధ్యాయాంతమందు లిఖింపబడి యున్నది. అట్లొనర్చుట యే కాక ప్రజలు క్రైస్తవమతస్థులతో యెవ్విధమయిన సంబంధమును గలుగఁజేసికొనఁ గూడదనియు, రాజాస్థానమందుఁ దన్మతస్థులుండుట వారిగణితవిద్యాప్రావీణ్యమును బట్టియే కాని వారిమతమందుఁ జక్రవర్తికిఁ గల యభిలాషచేఁ గాదనియుఁ బ్రకటించి యుండెను. దేశీయులగుపండితులకుఁ బరమతస్థులయం దుండుసహజద్వేషము నాప్రకటనము రెచ్చఁగొట్టెను. అట్లుండఁ దనభ్రాతృలను క్రైస్తవులఁ జేయుటచేఁ జక్రవర్తికిఁ బరమతస్థులయం దసూయ యినుమడించి పండితులకు వారియందుఁ గలప్రబలద్వేషముతో మేళవించెను. కాఁబట్టి పరమతస్థుల కప్పుడు ప్రతికూలకాలము మిక్కుటముగ నెక్కొనెను. చక్రవర్తికి క్రైస్తవమతబోధకులమీఁద నసూయ పొడముటను గ్రహించి చీనావారిలో గొప్పవారును సామాన్యులును గలసి లిఖితరూప మయిన యొకవిన్నపము వ్రాసి దానిలోఁ బరదేశీయమతబోధకు

లను చీనారాజ్యమునుండి బహిష్కారము చేయవలసినదనియు వారి దేవాలయములను జనోపయోగకరము లయిన యితరకార్యముల కుపయోగింపవలయు ననియుఁ బ్రార్థించిరి.

మతవిచారిణసంఘము వారితీర్పు.

అంతట మతవిచారణసంఘమువారి కాలిఖితవిన్నపమును జక్రవర్తి వాడుక ప్రకారము పంపఁగా వా రన్యమత బోధకులను 'మెకావో' ద్వీపమునకుఁ బంపి వేయవచ్చుననియు, రాజకీయోద్యోగములయందు నున్న యన్యమతస్థులను మాత్రము రాజ్యమం దుండనీయవచ్చు ననియు, దేశీయుల నన్యమతమందుఁ జేర్చుకొనిన వారికి నురిదండన విధింపఁబడునని యాజ్ఞాపింపవలయు ననియు వారు చక్రవర్తికి విన్నవించిరి. చక్రవర్తి యాప్రకారమే యాజ్ఞాపింపఁగా క్రైస్తవదేవాలయములు (300) పాడుచేయఁబడినవి. మఱియు క్రైస్తవులుగా నున్న 300000 దేశీయులు నిరాధారులుగాఁ జేయఁబడిరి.

మంగోలియావారి నోడించుట.

మతస్థితి యిట్లుండఁగ రాజ్యస్థితి యు నకాలంబున క్షేమకరముగ నుండలేదు. కాంఘ్సీచక్రవర్తితో నెడతెగక తగవులాడిన మంగోలియనులు మరలఁ గలహమునకుఁ గాలుద్రవ్వుచుండిరి. వారిని నిర్జించుటకై చక్రవర్తి ధైర్యసాహసములు గల 'నియన్' (General Nien) అను సేనానాయకుని దగుసైన్యముతోఁ బంపఁగా నాతఁడా కలహకారులపోగ రడంచెను. అంతట వారు పాదాక్రాంతులై చక్రవర్తికి నిష్కపటముగ లోఁబడియుందుమనియు, శిక్షింపవద్దనియుఁ బ్రార్థించిరి. అట్టివిజయము నార్జించె నని చక్రవర్తి యాసేనానికి 'డ్యూకు' అనుగొప్పపరువు గలబిరు దిచ్చి యాయనకును ఆయన సేనలకును నగరబాహ్య మందున్నవనమందు గొప్పవిందుచేసెను. ఆ విందుకాలమందా సేనాజనులు తా మొందియున్న జయంబుచే నెడలు [illegible] చేయసాగిరి [illegible]గనుండుఁ డని [illegible]

పర్యాయములు వర్తమానములు పంపినను వారు లక్ష్యపెట్టరైరి, తన యధికారముక్రింద నున్న సేనయొక్క యల్లరివలనఁ దనకును గౌరవ హాని కలుగు నని తలఁచి యా సేనాని యుద్ధకాలమందూ దెడుబూర నూదెను. అంతట నా సేన నిశ్శబ్దముగ నుండెను.

తన యాజ్ఞ కంటెఁ దన సేనానియాజ్ఞ యట్టు లవిలంఘ్యముగ నుండుట గ్రహించి యంతప్రబలుఁడైన సేనానివలనఁ దనరాజ్యమునకు నపాయము కలుగవచ్చు నని తలఁచినవాఁడై చక్రవర్తి వాని నడఁగఁద్రొక్కుటయే కర్తవ్యం బని నిశ్చయించుకొనెను.

అట్లోడించిన సేనాధిపతిని జక్రవర్తి చెఱసాల లోఁ బెట్టించుట.

ఆహా! రాజసేవకుఁడు సమర్థుఁడై యుండుటయు హానికర మగునుఁగదా! అయిన నిట్టియోర్వలేమి దుష్టరాజలక్షణ మనితలఁపవలయును. అంతట రాజసన్నిధానవర్తులు చక్రవర్తియొక్క యీర్ష్య కనుకూలముగ నా సేనానాయకునిపైఁ గొన్ని నేరములు మోపిరి. ఆ నేరము లేమనఁగా:—

(1) మంగోలియా వారితో నతని సేనలు పోరుచుండఁగా నతఁడు యుద్ధరంగమునకు దూరముగ నొకచోటఁ గూర్చుండి వినోదములయందుఁ బ్రొద్దు పుచ్చుచుండె ననియు,

(2) రాజచిహ్నములను బిరుదులను ధరించి తానే చక్రవర్తి నని నటించుచుండె ననియు,

(3) తానునడుచువీధులను శుభ్రపఱిచి యలంకరింపుఁ డని జనుల కాజ్ఞాపించె ననియు,

(4) గొప్పలంచములు పుచ్చుకొనె ననియును.

అట్టి నేరములతో నియ్యఁబడినయర్జీని దండనాధికారులు విచారించి చెఱసాలలోనికి వానిని ద్రోయించి వానిని దుత్తునియలు చేయ విధించిరి; కాని

చక్రవర్తి తానును మనుష్యజన్మ మెత్తెను గావున నించుకంత భూత దయ కలవాఁడై యట్లువధించుట కియ్యకొనక కారాగృహములో వానిని దన్నుకొని చావనిచ్చెను.

రాయబారులప్రవర్తనము.

'నర్చిన్సుక్' (Nerchinsk) నగరమువద్ద గతకాలంబున జరుగఁబడిన యొడంబడికలోఁ గొన్ని సవరణలను జేయవలయు నని ప్రార్థించుచు చీనాచక్రవర్తి యొద్దకు రుషియాచక్రవర్తి 1727 సంII లో నొక రాయబారిని బంపెను. ఈరాయబారము వలన మూఁడు గొప్పవిషయములు ప్రవర్తిల్లెను:—

(1) చీనారాజధానియందు రుషియాదేశీయవిద్యార్థు లుండిచీనా భాషను నేర్చుకొనునట్లును, వారిపైవిచారణకు సర్వాధికారము వహించిన రుషియావారు కొందఱందుండునట్లును వారే రుషియాచక్రవర్తికిఁ బ్రతినిధులుగా నగత్యము కలిగినప్పుడు చీనాచక్రవర్తితోఁ బ్రశంసించున ట్లేర్పడెను.

(2) అన్యరాజ్యములనుండి వచ్చురాయబారులు చీనాచక్రవర్తికి నొసంగవలసిన యోగ్యతాపత్రికలును, నధికారపత్రములును ఆయన ముందఱ నుండుబల్లమీఁద నుంచెడి యాచార మొకటి మున్ను కలదు. అట్లు చేయుట గౌరవహీన మనితలఁచి రుషియారాయబారి యైన 'కౌంటుసావా' (Count sava) యా కాగితములను జక్రవర్తిహస్తములలో నుంచుట యిప్పుడు కలిగెను.

(3) పిమ్మట పోర్తుగల్ దేశమునుండి యొకరాయబారివచ్చి రుషియారాయబారిచేసిన స్వతంత్రకృత్యము విని చక్రవర్తికి నెదుట బల్లయుండుటయే యనావశ్యకమనియుఁ దాను స్వయముగాఁ జక్రవర్తి చేతికిఁ దనపత్రికల నీయఁదలఁచితి ననియు, రాజసభికులకుఁ జెప్పటచే వా ర్యాగ్రహపడి

యతఁడు జస్వాన్ట్సునొక్క కుటుంబములవ నట్లు పలుకుటకు కలిగె నని భావించిరి; కాని చక్రవర్తి వారు తనహస్తములయందు ఆకాగితముల నుంచుట కంగీకరించెను.

రాజసభికుల కటులు తమయెడల ననుమానము కలుగుటయు మఱియుఁ గొన్ని యిబ్బందులు సంభవించుటయుఁ గనుగొని జస్వాన్ట్సు తమరు చక్రవర్తి యొక్క సన్నిధికిఁ బోయెడి యవసరములు కలిగినప్పుడు తమకు మాఱుగ నెవరినైనఁ బంపుట కంగీకరింపుఁ డని చక్రవర్తిని గోరిరి.

జస్వాన్ట్సునొక్క ప్రార్థన నంగీకరించుట.

చక్రవర్తి యాప్రకారమే యంగీకరించుచు వారేమి మనవి చేసికొనిన నాలకింపక యాసమయముకొఱకుఁ దాను సిద్ధపఱిచికొని యున్న యొక యుపన్యాసమును వారికిట్లు వినిపించె.

'పూర్వపు చక్రవర్తి యైన నాజనకుఁడు సమస్తమును 40సం॥ లు నాకు నేర్పి తన కనంతరచక్రవర్తిగ నన్ను నిశ్చయించెను. ఆయన ననుకరించు చుండుటయు ఆయన పాలానాపద్ధతినుండి లేశమాత్ర మైన దొలఁగ కుండుటయు, నాముఖ్యోద్దేశము. మీరు మీమతసిద్ధాంతము సత్యమయిన దని చెప్పెదరు; మీమాట నేను నమ్మెదను. మీమత మసత్యమైన దని నేను భావింతు నేని మీదేవాలయములను నిర్మూలము చేయుటకును నాదేశమునుండి మిమ్ములను బహిష్కార మొనర్చుటకును నాకేమి యభ్యంతరముండును? మీరుఁ దమతమమతములను బోధించుటకై యన్యమత బోధకసమూహమును మీదేశములోనికి నేనుపంపుదు నేని మీ కెట్లుండునో, మీరేమందురో, వచింపుఁడు. చీనావారినందఱను మీమతములోఁ జేర్చుకొనుట యే మీకేమి మీమతాచార్యులకేమి ముఖ్యాభిప్రాయము కదా! మీమతసంఘము మట్లే యాజ్ఞాపించును గదా! ఆసంగతి నేను బాగుగా నెఱుఁగుదును. మీ రట్లొనరించినట్లయిన మే మిఁక నేమి కావ

లయినను మా మత మేమయినను మీ మత మవలంబించుటచే మేము మీరాజులకు దాసులము కావలసిన దేకదా! ఇంతవఱకు మీమతములోఁ జేరిన చీనావారు మిమ్ము నను దప్ప మఱెవ్వరిని లక్ష్యముచేయరు కదా! కావున దేశోపద్రవమేదయినఁ దటస్థ మయినప్పుడు వారు మీ మాటనే విందురు కాని మా మాటకు లోఁబడుదురా? మిమ్ము నేను నేరపెట్టకుండునంతవఱకు మీరీనగరమందుఁ గాని కాంటన్ (Comton) నగర మందుఁ గాని నివసింపవచ్చును. మీరు దోషు లని నాకు ధృవముగాఁ గన్పట్టినయెడల నా రెండు నగరములయందు మిమ్ము నుండనియ్యను. మీలో నొకఁడు పురుగు నయినను నా రాజ్యములోనే నిల్వనియ్యను. మిమ్మున నీ రాజ్యమునందు స్థిరముగ నుండ నిచ్చె నని యీదేశీయపండితులచే నాతండ్రి బహుగా నిందింపఁబడెను. ఇంతయేల? మీరు నాకునిష్టులని కాని కాకుండుటచే మిమ్ము బాధింపఁ దలఁచితినని కాని మీరు తలఁపవద్దు. ఈ రాజ్యమును జక్కఁగాఁ బాలించుట యే నా ముఖ్య మైనతలంపు.

ఉపన్యాస ఫలితము.

ఈ యుపన్యాసమందుఁ జక్రవర్తి ప్రశంసించినయంశములే చీనా చక్రవర్తులకును క్రైస్తవమతబోధకులకును నిరంతరవివాదకారణము లయి యుండెను. క్రైస్తవమతబోధకులు తమమతమందుఁ గలసిన చీనా జనులపక్షముగా న్యాయస్థానములయం దవసరము కలిగినప్పుడు వాదించుచుండిరి. ఈ విషయములో ప్రాటెస్టెంటుమతబోధకులకంటె రోమన్ కాథొలికుమతబోధకు లెక్కువస్వాతంత్ర్యముఁ జూపుచు వచ్చిరి. అట్టిచర్య లన్నియుఁ జక్రవర్తియొక్క యాజ్ఞవలన మట్టుపడెను. అందువలన నన్యమతబోధకులు నిరుత్సాహులై విచారగ్రస్తులయి యుండిరి. అటులుండఁగా మారీజాడ్యములు, క్షామము, భూకంపములు, చీనాచక్రవర్తియొక్క దౌర్జన్యకృత్యములను గొనసాగనియ్యలేదఁట. రాజభవనమందు మరణము లెక్కువయ్యెను. పసుపుకేఱు (Yangteskiang) పొంగి బహుప్రదేశములఁ బాడుచేసెను. 1730 సం॥

లోఁ గలిగిన భూకంపమువలన లక్షజనము నశించెను. మఱియు 'పికిన్' నగరమందలి భవనంబులన్నియు నూచముట్టుగ నుజ్ఝాతలూగింపఁబడెను. చక్రవర్తి తనుకపకారమొనర్చుటచే దేవుఁ డట్టియాపత్పరంపరకుఁ జక్రవర్తిని బాత్రునిగఁ జేసెనని యన్యమతస్థులు తలఁచి కొంతవఱకు సంతసించిరి. తమయపకారులను దైవమే దండించు నని వారికి నమ్మకమఁట.

చీనారాజ్యముయొక్క యుత్తరపుటెల్లయందలి సేనల రావించుట.

ఉత్తరపు టెల్ల కవల నుండు ప్రదేశముల జయింపఁబూనకుండుట యుచిత మని చెప్పెడువారు కొందఱు ఇంగ్లాండు దేశమునందు వలెనే చీనాదేశమందును గలరు; కాని యీ చక్రవర్తి యొక్క జనకుఁడును ఈయన కనంతరము రాఁబోవునీయన తనయుఁడును ఆ కొందఱు చెప్పినట్లు జయాభిలాషను విడిచినను నా యెల్లయందు సేనల నుంచి తత్ప్రాంతమం దుండడవిగుంపులవారికి భయము కలుగఁజేయుచుండుట రాజ్యమునకు క్షేమకరమని తలఁచిరి. ఈ చక్రవర్తి యనఁగా 'యుంగుచంగు' తన తండ్రియభిప్రాయమునకు భిన్నముగా నా యెల్లయం దావఱకుండు సేనలను రాజధానికి రావించెను. అందువలన శీఘ్రకాలములోనే రాజ్యమునకుఁ జెఱుపులు కలిగెను; కాని చక్రవర్తి యా చెఱుపుల ననుభవింపకయే యొకదినమం దుదయమునఁ గొలువుతీర్చి యంతఃపురంబునకుఁ బోయి యచ్చట నాకస్మిక వ్యాధి యొకటి పొడముటచే 1735 సం॥ అక్టోబరు 7 వ తేదీని మృతిఁబొందెను. ఈయన జనానురాగంబుఁబడసిన చక్రవర్తి కాఁడు కాని పాండిత్యాభిలాషయం దీయనను బోలిన చక్రవర్తియే లేఁడని చీనావారీయనను గొనియాడుచుందురు. ఈయన బహుగ్రంథకర్త; కాని యా గ్రంథములయందు విదేశీయులయెడలఁ దనకుఁ గల ప్రబలద్వేషమును బ్రకటించుచునే యుండెను. ఈయనకనంతర మీయన పెద్దకుమారుఁడు 'చియన్‌లుంగు' (ChienLung) రాజ్యమునకు వచ్చెను.

---

# 7 వ అధ్యాయము.



## చియన్‌లుంగు యొక్క పరిపాలనము.

## A. D. 1735-1796. సం॥



*చియన్‌లుంగు చక్రవర్తియై తన పితృవ్యుల కుపకారియగుట.*

"చియన్‌లుంగు" చక్రవర్తి యయినప్పు డిరువదియైదు వత్సరంబుల ప్రాయము కలవాఁడు. ఈయన నిగర్వశిరోమణి; కావున రాజ్యపరిపాలనమందుఁ దానేమి లోపముల నొనరించెదనో యని సంశయించి తన కుపదేశకులనుగ నలువుర రాజప్రతినిధుల నేర్పర్చుకొనెను. ఈయన తండ్రి తన కుఁదన సోదరు లేమి చెఱుపు కావించెదరో యని నిష్కారణముగా భీతిఁ జెంది వారిని కారాగృహవాసులఁ జేయుట గతంబున లిఖింపఁబడియుండె. ఈ చక్రవర్తి వారినందఱను విడుదలఁ జేయుట యే కాక ప్రమాదిక దోషంబులఁ జేసి చెఱసాలయం దుండువారలను గూడ బంధనిముక్తులఁ జేయించెను. ఈ చక్రవర్తి మంచూరియా వంశజుఁడు. ఆ వంశమూలపురుషుఁడు, చక్రవర్తియు ఆయన కుటుంబపరంపరలోఁ జేరినవారలును బసుపురంగు గల కాసెకోకను, చక్రవర్తి యొక్క దాయాదికుటుంబములలోని వార లెఱుపు కాసెకోకను నడుమున ధరింపవలెనని నియమించియుండెను. ఈ చక్రవర్తి యొక్క తండ్రి తన సోదరాదులపైఁ దనకుఁ గల యాగ్రహమును బట్టి యా కాసెకోకలను ధరింపవలదని వారిని శాసించి యుండెను. వారలు వానిని ధరించుట కీయన యంగీకరించెను.

ఆయన తన దాయాదివర్గమున కట్లుపకరించినను నన్యదేశీయ మతస్థుల కేమియు నుపకారి కాకపోయెను.

అన్యమతస్థులకపకారియగుట.

వారలయెడల ఆయన ప్రథమమున ద్వేషభావము లేనివాఁడైనను రాజప్రతినిధులదుర్బోధన వలన వారి కపకారిగనే యుండెను. గతచక్రవర్తులకాలమం దంతగ మన్నన లంబడసిన జస్యూట్సు బెడిదంబుల గునిదుఃమలపాలైరి. ముఖ్యముగా "ఫుకీను" (Fuhkien) పరగణాయందుండుపరదేశీయుల కెడతెగనిబాధలు కలుగుచుండెను. 1746 సం॥లో నచ్చట నుండిన స్పానియాదేశపు మిషనరీలను దత్ప్రదేశాధికారులు చెఱసాలలోఁ బెట్టి వారికి బెట్టిదంపుకట్టిడిచెయ్యిలను జేసితుదకు వారిని దుఃఖఖడ్గంబుల కర్పించిరి.

ఆకాలంబుననే చీనారాజ్యముయొక్క యాగ్నేయమూల నున్న జనులు కలహించిరి. వారిన డంచుటకుఁ బంపఁబడిన సేనాధిపతి వ్యత్యయముగ వ్యవహరించుటచే నాకలహము నివారింపఁ జాలఁ డయ్యె.

ఓడిపోయిన సేనాధిపతులనురిదీయుట.

ఏ సేనానియైనను దన బుద్ధిజాడ్యమువలనఁగాని దైవికమువలనఁగాని యపజయము నొందినయెడల వానిని నిర్విచారణగ వధించుట యనెడి దుర్న్యాయాచారము చీనారాజ్యమందుఁ గలదు. కావున ఆ సేనానాయకునిశిరస్సును ఖండించి 'చాంగుక్వాంగు' (Chang-kwang) అనుమఃటియొక సేనానిని జక్రవర్తి పంపఁగా నతఁడు కలహమడంచి జయశాలియై తనప్రాణము నప్పటికిఁ దక్కించుకొనెను గాని పిమ్మట శీఘ్రకాలములోనే యారాజ్యమందుఁ దటస్థమైనమఃటియొక

కలహమును నివారింపఁ బోయినపుడు శత్రువులు పంపినగూఢచారుల వలన నతని మంతనము లప్పటికప్పుడే వెల్లడి యగుటచే శత్రువుల నిర్జింపలేక తుదకుఁ బరాజితుఁడు నయ్యెను. కావున ఆదుర్న్యాయాచార ప్రకార మతఁడు తనప్రాణములను దనపూర్వులవలె నే కోల్పోయెను. అంతట జనరల్ ఫ్యూ (General Fu) ను సేనానిగాఁ జక్రవర్తి నియమించెను. అతఁడా కలహమడఁచి జయమొందెను. మఱియుఁ గలహనాయకుని నతనికుటుంబమును ఆసేనానిపట్టుకొని రాఁగాఁ జక్రవర్తి యొకబాలికను దప్ప శేషించినవారిని వధింప నాజ్ఞాపించెను.

మంగోలియాయందలి కలహము.

'చియన్‌లుంగు' చక్రవర్తి పరిపాలనమునకు వచ్చిన యనంతరము పదివత్సరములదనుక 'సినింగు' (Tse ning) అనుముఖ్యనాయఁకుఁడు మంగోలియా వారిని నెమ్మదిగఁ బరిపాలించుచు వారియక్రమకృత్యములను నివారించుచుండెను. అతని మరణానంతర మతనికుమారులలోనొకఁడైన 'డార్డుషా' (Dardsha) నాయఁకుఁడై యేలుచుండఁగా 'డావాట్సి' (Davatsi) అనువాఁడొకఁడు వానిబంధుఁడు తనతోఁబాటుగ గ్రూరాత్ముఁడైన "అమర్సన" (Amursana) అనుమఱియొక నాయఁకుని దోడ్పాటుచేసికొని 'డార్డుషా' పై దండెత్తి జయించి వానిరాజ్యము నామిత్రులిద్దఱును బంచుకొనుట లోఁ గలఁతపడిరి. అంతట అమర్సన పరాజితుఁడై చీనాచక్రవర్తిని శరణుచొచ్చఁగా ఆయన కరుణించికొంత సేనను వానికి సహాయముగాఁ బంపెను. తత్సహాయముచేఁ దన శత్రువును 'అమర్సన' యోడింపఁగా నారాజ్యమునుచీనాచక్రవర్తి వశపఱుచుకొని తనకుఁ బ్రతినిధిగా నచ్చట

నాతనినియమించెను. దొంగ లూండ్రోరులతోఁ గలహించి రేని దొరలు మేలుపొందెద రనుసామెతరీతిని చీనాచక్రవర్తికి వా రిరువురుకలహమువలన మే లయ్యెను; కాని అమర్సన చీనాచక్రవర్తికిఁ బ్రతినిధిగా నుండి మంగోలియాదేశమును బరిపాలించుచుఁ దన కున్నగోరంతయధికారమును గొండంతగఁ బెంచి తుదకుఁ దానే ప్రభువుగా వ్యవహరించెను. తనకుసహాయార్థముగా నంపఁబడిన చీనావారిస్వల్ప సైన్యమును వధించి యతఁడు చీనాచక్రవర్తితో యుద్ధముచేయ సన్నద్ధుఁ డగుచుండెను.

చక్రవర్తి దండయాత్ర.

ఊరకుండినయెడల బాధించుచుఁ బట్టుకొనబోయినచోఁ బాఱిపోవునట్టితోడేలును బోలి యుండువాఁ డని 'అమర్సన'ను గుఱించి పలుకుచు చీనాచక్రవర్తి వానిపైకి దండువెడలుఁ డనితన సేనలకొక ప్రకటన కాగితము పంపెను. దానిలో సందర్భానుసారముగ నిట్లు వ్రాసెను.

"ప్రపంచములో నారాజ్యముకంటె విస్తీర్ణరాజ్యము లేదు. నారాజ్యమందలిజనసంఖ్యయును, భాగ్యమును, నిరుపమానంబులయియున్నవి. నాభాండాగారము వెండిబంగారములతోఁ దులఁదూగుచున్నవి. నా భాండారములు సమస్తవస్తుసామగ్రిలతోఁ బరిపూర్ణము లయియున్నవి. ఇవియించుమించుగ సత్యవచనములు కావున స్వాతిశయదూష్యములు కానేరవు.

అమర్సనరయో డిపోవుటం.

'కేయొ' (Chao), 'ఫ్యూ' (Fu), అనుసేనానాయకులను దగు సైన్యముతో వానిపైకిఁ బంపుచు వానిని సజీవునిగాఁ గాని నిర్జీవునిగాఁగాని పట్టి తెచ్చి తనకుఁ జూపుఁ మని చక్రవర్తి వారికి నాజ్ఞాపించెను. వారు తన పైకివచ్చుటను ముందుగా నే

కనుగొని 'అమర్సన' బహిరంగయుద్ధమునకుఁ బూనక చాటుజగడములు చేసి యోడిపోయి 'ఫ్యూ' వెంటఁబడి తఱుమఁగాఁ బాఱిపోవసాగెను. తనయనుచరులు తనను విడిచి పోవఁగా వాఁడు నిరాధారుఁడై రుష్యా చక్రవర్తి పాలికిం బోయిశరణుఁజొచ్చెను; కాని వాఁ డచ్చట మశూచక పడి తుదకు మిత్తివాతం బడెను. ఆ సమాచారము నెఱిఁగి వానిమృత కళేబరమును దనకుఁ బంపుమని 'ఫ్యూ' కోరఁగా రుష్యాచక్రవర్తి పంపక వానియంగదుచ్ఛములను వచ్చి చూచుకొమ్మని వాని కాయన దెలియఁజేసెను.

చీనావారుతురుష్కస్థానమునుజయించుట.

ఆజయముచే చీనాసేనానాయకులు మహోత్సాహులై చీనా రాజ్యమునకుఁ బడమటియెల్ల నున్నతురుష్కస్థానము నిరంతర కలహముల కాటపట్టుగ నున్నదనితలఁచి 'కాష్కండు' (Kashkand) 'యార్కండు' (Yarkand) నగరములపై దండెత్తి వానిని వశపఱుచుకొనిరి. చీనావారియప్రతిహతవిజయంబులం జూచి నివ్వెఱఁజెంది 'ఖోకండు' (Khokand) ప్రభువును మఱికొందఱు సమీపనాయఁకులును చీనాసేనాయకులకు లోఁబడి వారినివిశేషంబుగ గౌరవించి వారిపాదంబులపైఁబడి, 'చీనాచక్రవర్తి చిరకాలజీవిగానుండుఁగాక' యని యుద్ఘోషించిరి.

జయశాలులనుచక్రవర్తిగౌరవించుట.

అట్లుతూర్పుతురుష్కస్థానమును చీనారాజ్యముతోఁ జేర్చి దాని పరిపాలననిబంధనలఁ గొంతవట్టున కేర్పఱిచి జయధ్వనులతోఁ దమరాజ్యమునకుమఱలివచ్చుచు రాజధానికి వారొకపూట ప్రయాణములో నుండఁగా చక్రవర్తి వారి నెదుర్కొనఁబోయి బహు సన్మానంబుతో వెంటఁ బెట్టుకొని వచ్చి తనరాజ్యమందు మిగుల గొప్పయుద్యోగమును 'కేయొ' (Chao)కును దానికిఁ గించిన్న్యూనమయి

న యుద్యోగము రెండవసేనానికి నొసంగెను. 'కేసొ' బహుసౌఖ్య మనుభవించి వ్యాధిపీడితుఁడై మరణ మొందఁగా నతనిమృతకళేబరము నొకకుర్చీలోఁ గూర్చుండఁబెట్టించి చక్రవర్తి యిట్లనెనఁట. 'నీవెప్పటి వలె జీవించియుండవలెనని యాజ్ఞాపించుచున్నాను. నీవారోగ్యవంతు డవు కమ్ము. నీవంటివాఁడు మారాజ్యమున కగత్యముగఁ గావలసి యున్నాఁడు.' సమర్థుఁడయిన భృత్యునియందు సత్ప్రభువున కుండు విశ్వాస మిట్టిదే కదా!

రాణికిషష్టిపూర్త్యుత్సవ ముచేయుటం.

అప్పటికి రాజ్య మంతయుఁ గల్లోలములు లేక సుఖస్థితిలో నుండెను. చక్రవర్తి యొక్క వైభవము సమగ్రముగ నుండెను. ఆయనరాణికి * షష్టిపూర్తి యగుటచే నఖండోత్సవము చేయఁబడెను. రాజధానినుండి యేడుమైళ్లదనుక యొక్క పేట పందిలియు, దాని కిరుప్రక్కల నాటకశాలలును, మండపములును నిర్మింపఁబడెను. అచ్చట గాననాటకవినోదములు ప్రవర్తిల్లెను. ఇంక ననేకము లయినయుత్సవములు చేయఁబడెను. అచ్చట నొనరింపఁబడిన యలంకారములు వర్ణనకు మించియుండెను; కాని చీనాచక్రవర్తులు నగరవీథులయందు విహరించునప్పుడు వారిభృత్యవర్గంబుతప్ప యితరులు వారిని జూడఁగూడదనెడి యొకయాచారము కలదు. కావునఁ దదుత్సవకాలమందుఁ జక్రవర్తి కుటుంబసమేతుఁడై బయలువెడలినప్పుడు పరులు కాని, యా యలంకారముల నొనరించిన వారు కాని, చూచి యానందింప వలనుపడదయ్యె.

జస్సూట్సుయొక్క.

జస్సూట్సునందు గౌరవ ముంచకుండునట్లు రాజప్రతినిధులు చక్రవర్తికి దుర్బోధ లొనర్చినను, వారిలో నిద్దఱియొక్క చిత్రకరణ రచనలకుఁ జక్ర

* 60 వ సంవత్సరాంతమం దొనర్పఁబడు పండుగ.

యంత్రకళాకౌశలము. వర్తికిఁ గలిగిన యానంద మనంతమయ్యెను.
వారిలో నొకఁడయిన 'ఆటిరెటు' (Attiret) అను నాతని జక్రవర్తి మిగుల గౌరవించి చీనావారిలోఁ బ్రముఖోద్యోగులతో ననఁగా మందారిను లనఁబడువారితో సరిగాఁ జూచెను. జసూ్యట్సు తమయంత్రకళా కౌశలముచేఁ జక్రవర్తి నిరంతర మద్భుత పడునట్లు చేయుచుండిరి. వారియద్భుత రచనలలో నొకటి యీదిగువ వ్రాయఁబడుచున్నది. వా రొక పెద్దగడియారము చేసిరి; దానిలో నొకదొడ్డియు ఆదొడ్డిలో నొక మండపమును నిర్మించిరి; గంటఁ గొట్టఁగానే యామండపమునుండి మందారిను డఁ నఁబడు నొకయుద్యోగియొక్క పతాకమును జేత ధరించి బయలువెడలును. ఆ పతాకముమీఁదఁ జక్రవర్తి చిరకాలజీవిగ నుండుఁగాక యని యాశీర్వచనము లిఖింపఁబడి యుండును. ఆ ప్రతిమ వంగి వందనము చేయఁగా నే నలువురు భటులు వెడలి వచ్చి తమహస్తములయందు నున్న వేత్రములతో నేకతాళము కొట్టుదురు. ఆ తాళమువలన నాదినమందలి యేదో యొకనిర్దిష్టకాలము విశదమగును. ఇట్టియద్భుత మంతయు నాగడియారమం దమర్చి యనేకాలంకారములతో దానిని నిర్మించిరి. ఆగడియారముయొక్క మాదిరులు 1860 సం॥ నందు చీనాచక్రవర్తియొక్క భాండాగారమందు గోచరములయ్యెను.

చీనాచక్రవర్తియొక్క నిరుపమాన మహౌన్నతదశ.

అకాలంబున చీనాచక్రవర్తియొక్క యధికారము మహోన్నతముగ నుండెను. ఆయనకీర్తి యాసియాఖండ మందంతట వ్యాపించి నిరుపమానముగ నుండెను. ఆయన పాలనక్రిందనున్న రాజ్యము సుభిక్షముగను సురక్షితముగ నున్నదనుటకు మఱియొక దేశమునుండి 600000 జనము వలస వచ్చి యాయన రాజ్యములో జీవింపఁ గాపురములు కుదుర్చుకొని యుండు

టయే గొప్పనిదర్శనము కదా!

బహుజనముల వలసవచ్చుట.

ఆ వలస మిగులనద్భుతమైనది కావున దానినిగూర్చి సంగ్రహముగ నుడువఁబడును. మంగోలియారాజ్య మందలియడవి జాతులగుంపులలో 'టుర్గౌట్సు' (Turgouts) అనఁబడు నొకజాతివార లా రాజ్యమందలినిరంతర కలహములవలన సౌఖ్యముఁ గానక యైరోపారుష్యాలో నున్న వాల్గానదిప్రాంతములకుఁ బోయి యందుఁ గాపురములు కుదుర్చుకొనిరి. అచ్చటియధికారులు వారికి జీవనార్థము కొంతభూమిని సేద్యముచేసికొన నొసంగిరి. అట్లుకొంతకాలము జీవింపఁగాఁ బిమ్మట వారి కచ్చటియధికారులు పన్నులువిధించిరి. ఆ పన్నులు చెల్లింపలేక వారు బాధపడుచుండఁగా రుషియాచక్రవర్తి యొక్క సేనలను బలపఱచుటకై యా మంగోలియాజాతివారిలోఁ దగు ప్రాయ మందున్నవారిని బదిమందికి నొకని చొప్పున బలాత్కారముగ నచ్చటియధికారులు పట్టుకొని పోసాగిరి. మఱియు నింక నెన్నియొ యిక్కట్టులు వారికిఁ గలుగజేసి యుండిరి. అట్టులుండఁగఁ దమజన్మదేశమయిన మంగోలియాదేశమందుఁ బ్రచండుఁడయిన 'అమర్సన' మృతినొందుటయుఁ జీనావారు మంగోలియాదేశమును జయించి యడవిజాతులనడంచి తూర్పుతురుష్కస్థానమును స్వాధీనపఱుచుకొని పరిపాలనచేయుచు దేశమందు నెమ్మదిని సౌఖ్యమును నెలకొల్పిరనియు, విని తమదేశమునకు మరల వచ్చి సుఖపడవలెనని 600000 జనము తత్ప్రదేశాధికారుల కించుకేనియుఁ దెలియకుండ నతిరహస్యముగా 1771సం॥ జనవరినెలలో వలసరా బయలుదేరిరి.

వలసవచ్చినవారి కష్టములు.

గుట్టలనక మిట్టలనక పల్లములనక వారుబహుదూరయాత్ర సేయవలసి యుండె. వారిపోకడ నెట్లో యచ్చటియధికారు లెఱింగి తీవ్రముగా వారినిబట్టుకొని

వచ్చుటకు సేనలం బంపిరి. ఆసేన లధికశ్రమతో వారినిమార్గములోఁ గలసికొని కరుణ యనునదిలేక అనేకవిధముల బహుక్రూరముగ బాధించిపలువురను దెగటార్చిరి. మిగిలినవా రనేకశ్రమలు పడుచు వెను కకు మరలక తమ గమ్యస్థానమునకుఁ బోవుచు భోజనసామగ్రులు లేక త్రాగుటకు జల మయినను లేక కొందఱునశించుచుండిరి. వారిరా కయు, వారికిఁ గలుగుచున్నపరబాధయు, చీనాచక్రవర్తి విని తురగ సైన్యమును వారిరక్షణార్థమయి పంపెను. ఆసేన బహుకష్టప్రయాణ ములఁ జేసి వారికిఁ దోడ్పడులోఁగా నే వారు పడవలసినశ్రమలన్నియుఁ బడిరి. చీనాసైన్యము తుదకు వారిని శత్రుబాధనుండి తొలఁగించి యాశత్రువులతోఁ బోరి జయించి తఱిమి వలసవచ్చినవారిని వా రెంత బాధించిరో దానికి నూఱంతలు వారిని హింసించిరి. ఇంతలో చీనాచ క్రవర్తి తనదయాళుత్వము ప్రకాశించులాగున వలసవచ్చినవారికి భోజ నసామగ్రులు సకాలములో నందునట్లు చేసి వారికి జీవనార్థము భూముల నిచ్చి చక్కఁగ నాదరించుట యే కాక యా ప్రదేశ మందు న్నయొకమడుగుదగ్గఱ నొకస్తంభము నాటించి వారు పడినకష్టంబుల సంగ్రహముగ దానిపై వ్రాయించెను.

బర్మారాజుతో యుద్ధము చేసిచీనావారోడి పోవుట.

ఉత్తరపుటెల్లయందుఁ గలహములు నల్లరులును నివారింపఁబడినపి మ్మట బర్మారాజుతోఁ బోరాడునావశ్యకము చీనాచక్రవర్తికిఁ గలిగెను. యుద్ధకారణ ములు విస్పష్టంబుగ దేశచరిత్రమునఁగాన బడ కున్నను బర్మాదేశీయులగు దోపుడుకాండ్రు చీనారాజ్యములోనికిఁ జొచ్చి తఱుచుగఁ జేయు చున్నదోపుడులవలనఁ గలిగినతొందరయె యుద్ధకారణమయియుండవ చ్చునని చరిత్రకారు లూహించిరి. కారణ మే మయియున్నను చీనాచక్ర వర్తికొంతసైన్యమునుబర్మారాజ్యముమీఁదికిఁ1768సం॥లోఁబంపెను. ఆయు

ద్ధయాత్ర ప్రథమమున చీనా వారికి జయోదర్కముగ నుండెను; ఎట్లనఁగా బర్మా వారు చీనా వారి దైనయూనాన్ జిల్లాను దౌర్జన్యముగ ముట్టడించి యుండిరి. అంతట చీనా సైన్యము వారిని నూచముట్టగ నోడించి వెడలఁగొట్టెను. ఆజయముచే చీనా సేనానాయకుఁడు ప్పాంగి మీఁ దరయక వారిఁ దఱుముకొని పోయి వారిస్వదేశములో నే వారిని మఱల నోడించెను; కాని చీనా దేశమునకును బర్మా దేశమునకును నడుమను బడమటిదిశ నున్న పర్వతపంక్తులమార్గమున చీనా దేశమునుండి భోజనసామగ్రులు వచ్చుట బహుదుస్తరమగుటచే నవి సకాలములో నందకపోఁగా చీనా సేన కలగుండు పడుచుండెను. ఆ సమయంబున బర్మా వారు తమ సేనలను బలపఱుచుకొని చీనా సైనికులనుముట్టడించి బిట్టుగ నోడించి వారిని నురుమాడిరి. మీ ప్రాణములను "మీరు దక్కించుకొనుఁడు" అని చీనా సేనాని యుత్తరువు చేసెను; హతశేషులైన చీనా సైనికులు తప్పించుకొని చీనా దేశమునకు మఱలి వెళ్లిరి. ఆ యుద్ధమందు చీనా సేనానాయకుఁడు తన ప్రాణములఁ గూడఁ గోల్పోయెను.

చీనా వారు బర్మా పై మరల దండెత్తి జయ మొందుట.

ఈ యపజయమును వినినతోడనే చీనా చక్రవర్తి ప్రబలసైన్యము నాయత్తపఱచి "ఆలికన్" (Alikan) "ఆక్వి" (Akwei) అను వారిని సేనానాయకులను జేసి శత్రువు నోడించి పగఁదీర్చుకొని రావలసినదని యుత్తరువు చేసెను. వారు నిమ్నోన్నతములై యుపద్రవకరము లగు కొండలవరుసల దాటి "భామొ" (Bhamo) దుర్గమందు దండు విడిసిరి. బర్మా రాజు వారితోఁ బోరఁ జాలిన సేన గలవాఁడై యున్నను నేమి కారణముననో ధైర్యము చెడి సంధి చేసికొనెద నని వర్తమానము పంపఁగా ఆ సేనాని తన పురోభాగమున నున్న యధిక సంఖ్యకల బర్మా సైన్యమును జూచుచుఁ దనకు వెనుకభాగమందున్న దుర్గమంబులయిన కొండలవరుసల దలఁచుకొనుచుఁ

దనకే యపజయము కలుగునేమో యని లోలోపల భీతినొందుచు ఆసంధి కియ్యకొనెను. మంత్రాంగశక్తియందు చీనావారిని మించినవారు లేరని యే వచింపవచ్చును; ఎట్లనఁగా యుద్ధము ప్రవర్తిల్లెనేనిఁ దానోడిపోదునేమో యనిసంశయపడుచు చీనా సేనానాయకుఁడు తనతో సంధి విషయముల మాటాడ వచ్చినబర్మారాయబారులను మోసపుచ్చి తమకు లాభకర మయినసంధినిబంధనల కొప్పించెను. చీనాబర్మారాజ్యములు సఖ్యముగా నుండవలయు ననియు, బర్మారాజు మూఁడుసంవత్సరముల కొకసారి చీనాచక్రవర్తికిఁ గప్పము చెల్లింపవలె ననియు, ఆసంధినిబంధనలు. ఇంగ్లీషువారు బర్మారాజ్యములో నెగువబర్మాను స్వాధీనపఱుచుకొని 'మండలే' పట్టణమందుండి ప్రభుత్వ మారంభించునంతవఱకు ఆకప్పము అప్రికారము చెల్లింపఁబడు చుండెను. చీనావారిసామర్థ్యమును గుర్తెఱుఁగకయును నేస్తపు కట్టుబాటుయొక్క ప్రాముఖ్యతనుబట్టియును ఇంగ్లీషుదొరతనము వారుకూడ బహుకాల మటులు కప్పమును జెల్లించుచుండిరి. ఇంగ్లీషువారు చీనావారితోఁదుల్యమైన యధికారమును సామర్థ్యమును గలవార మని భావించుచుండఁగనాకప్పమును జెల్లించుటచే నింగ్లీషువారు తమకు లోఁబడినవా రని చీనావా రహంబ్రహ్మత్వము కలిగియుండిరనియుఁ దమతెలివిలోపమువలననే తమ కట్టియగౌరవము ప్రాప్తించె ననియు ఇంగ్లీషువారు తుదకు గ్రహించిరని పాశ్చాత్య చరిత్రకారుఁడు విచారముతో వ్రాసెను.

"మియోటుజు" అన బడుమూఢజనులు.

చీనాదేశీయులయొక్క యాదిపురుషులు చీనాదేశమందుఁగాపురములు కుదుర్చుకొనుటకుఁ బూర్వమున నాదేశమందు నివసించుమూఢజనులలో నొకతెగవారిపేరు "మియోటుజు" చీనాదేశీయులపూర్వులు చీనాదేశమునుండి వారిని దఱిమివేయఁగా వా రాదేశమునకుఁ బడమటను వాయవ్యమూలను నున్న పర్వతములయందు నివాసములు కుదుర్చుకొని తమమూఢాచారములతో

జీవించుచుండిరి. వారియూధాచారమొకటి సంగ్రహముగా నుడువఁబడును. స్త్రీ ప్రసవించినతోడనె దానిమగఁడు పురిటిమంచమెక్కును. బాలింతరాలికిఁ జేయవలసినపను లన్నియుఁ వానికిఁ జేయఁబడునఁట. వారలెట్లు జీవించినను వారితెరువునకు చీనా రాజ్యము వారు వెళ్లలేదు. వారుతమరాజ్యమునకుఁ జెఱుపు సేయుదనుక వారిని బాధింపఁగూడ దని చీనావారు తలఁచిరి. అట్టిసహనము చీనా రాజ్యముయొక్క యోగ్యతలలో నొకటి యని చెప్పవచ్చును. ఆపర్వతవాసులు పొట్టిమనుష్యులును మంచియాయుధసామగ్రిలేనివారునయి యుండిరి. వారికున్నబలమంతయుఁ బరులకుఁజొరశక్యముకాని వారిపర్వతనివాసములే. కొంతకాలమునుండి వారికిని చీనావారికిని స్వల్పకలహములు జరుగఁగా వారికె (ఆయూధులకే) జయము కలుగుచుండెను.

అడవిజనులనాశము.

ఆయడవిజనుల నిర్మూలము కావించుటకు చీనాచక్రవర్తిప్రబలసైన్యముతో వారిపైకి సేనానాయకులనుముగ్గురను సిద్ధపఱిచియు, వారు సంధిచేసికొని లోఁబడుదురేమొ యని యిద్దఱు రాయబారులను శత్రునాయకునియొద్దకుఁ బంపఁగా వాఁడు వారిని వధించి వానికిఁ జంపిన లేఖను విసరిపాఱవేసెను. అంతటఁ జక్రవర్తి వాఁడు సామసాధ్యుఁడు కాఁడని సిద్ధపడి యున్నసేనతో సేనానాయకులను జక్రవర్తి పంపెను. దారిడొంక లేని వారినివాసముల సమీపించుటకు చీనాసైనికులు పడిన శ్రమలను వర్ణింప నలవిగాకుండెను. ఆముగ్గురు సేనానాయకులు సేనలనుబంచుకొని వివిధప్రదేశములయందు శత్రువులను నుట్టడింపఁ దొరకొనిరి. వారిలో జనరల్ వెన్‌ఫ్యూ (Wenfu) ప్రధాన సేనానాయకుఁడు, "ఆక్వి" (Akuei) "ఫెంగుషెన్" (Fengshene) అనువారుప సేనానాయకులు; ప్రధాన సేనానాయకుఁడు 10000 సేనతో శత్రుదుర్గసమీపమునకుఁ బోయితన సేనాబాహుళ్యముఁ జూచి శత్రువు వెఱచు ననుకొని యేమఱి యుండఁగా శత్రువులు వారిపై నకస్మాత్తుగఁ బడి సేనానాయకుని

జంపి సేనలను హతము కావించిరి. చావఁగా మిగిలినవా రుపసేనానాయకుల నెట్టకేలకుఁగలసికొనిరి. ఆ సమయంబున మంగోలియా దేశమందు వేఁటాడుచు వినోదముగ నున్నచీనాచక్రవర్తి కా యోటమి శ్రుతము కాఁగానే యుపనాయకుఁ డైన "అక్వి"ని ప్రధాన నాయకునిగాఁ జేసితినని యు శత్రువులపీచ మడంపవలసినదనియుఁ గఠినయుత్తరువును బంపెను. "అక్వి" బహుసాహసముతో నయిదు దినములు పగలును రాత్రియుఁ బోరాడి శత్రువుల నోడింపఁగా శత్రునాయకుఁడు సంధి చేసికొనెద ననియెను. ఆసంగతిని చక్రవర్తికిఁ దెలియఁ జేయఁగా ఆయన సమ్మతింపక శత్రువులఁ బట్టుకొని రమ్మని కఠినయుత్తరువులఁ బంపెను. అంతట శత్రువులదుర్గంబు లన్నియు చీనావారు పట్టుకొనుచుండఁగా నొకదుర్గమువద్ద శత్రువులు ప్రచండంబుగ ఖండనంబు కావింప నాదుర్గమును చీనావారు పట్టుకొనఁ జాలరైరి; కాని యాహారపదార్థములు లేక శత్రువులు డిల్లపడి యుండుటఁజూచి శత్రునాయకుఁడు తన్ను దనకుటుంబమును వధింప కుండు నట్లయిన లోఁబడుదు ననివేఁడుకొనఁగా మంచి దని సేనానాయకుఁడు పలికి వారిలో హతశేషులను బట్టుకొని పోయి చక్రవర్తిమ్రో లనిల్పఁగా నెట్టియభయం బొసంగియున్నను బ్రబలకలహకారుల వధించుటయే చక్రవర్తినిశ్చయాభిప్రాయము కావున వానిని వానికుటుంబమును ఖడ్గమున కర్పణచేయించి శేషించిన శత్రువులను స్థలాంతరమునకు ఖయిదీలనుగా బంపివేసి యచ్చటనే కష్టము చేసికొని బ్రతుకుఁడని విధించెను.

సేనానాయకులఁ జక్రవర్తిసన్మానించుట.

ఈ జయముచే చీనాచక్రవర్తియొక్క డంబ మతిశయించెనని పాశ్చాత్యచరిత్రకారుఁడు వ్రాసెను. ఈ చక్రవర్తి ప్రతియుద్ధయాత్రలోను దుదకు జయశాలియై నట్టు గతంబున లిఖింపఁబడిన యంశములవలనఁ గాని ముందులిఖింపఁబోవునంశముల వలనఁ గాని జయపరంపరచే మహాకీర్తిశాలియై యొప్పియుండఁగఁ దాను

జయశాలి నయితి ననుకొనుట డంబవచనమెట్లగునో! పర్వతవాసుల నటులు నిర్మూలము జేసిన "ఆక్వి" సేనానికి చీనాచక్రవర్తి "డ్యూకు" అను బిరుదొసంగి విశేషముగ సన్మానించెను. అట్టిసన్మానమును "ఆక్వి" కిం జూపి తనకుఁ జూపక యనాదరముచేసెననుకొని ద్వితీయసేనానిగ నున్న జనరల్ 'ఫ్యూటి' చక్రవర్తినినిందించెనఁట. జనరల్ ఫ్యూటీకొంచెము దుడుకుతనము కలవాఁడగుటచేఁ దనపరితాపమును వెల్లడించి యే యుండును. అతఁడే మంగోలియాయందలికలహకారుల గిట్టించిన వాఁడు; అతఁడే తూర్పుతురుష్కస్థానమును చీనారాజ్యములోఁ జేర్పించినవాఁడు. అట్టిధీరునిపై "ఆక్వి" యొక్కమిత్రులు మఱికొన్ని నేరములను గోరంతలను గొండంతలుగఁ జేసి చక్రవర్తికి శ్రుతపఱుపఁగా నాతఁడు రాజభక్తి లేనివాఁడని తలఁచి చక్రవర్తి వాని నురిదీయించెను. ఆహా! ప్రభువులు కొండెములు వినినచోఁ బ్రజలకు మానప్రాణంబులు దక్కునా! ఈ దండయాత్రకై చీనాచక్రవర్తి కెన్నోకోట్లతరబడి ధనము వ్యయ మయ్యెనఁట.

ఫార్మోజాద్వీపమందలి నెమ్మది.

చీనాదేశమున కెల్లలయందును సమీపమునందును నుండెడియనేకప్రదేశములు చీనారాజ్యములోఁ జేరియున్నవి. అట్టిప్రదేశములయందు నల్లరులును గలహములును లేకుండఁ జేయుటకుఁ జక్రవర్తి యెంత సమర్థుఁడయినను దుస్సాధ్యమనియే తలఁపవలయును. చీనాదేశమున కాగ్నేయమూలగ "ఫార్మోజా" యనుద్వీపం బొకటి కలదు. అది చీనారాజ్యములోఁ జేరినదే. దానియందుఁ గొండలవరుస లనేకములు కలవు. కావుననే యల్లరిజనంబునకును బందిపోటుదొంగలకు నది శరణస్థానముగ నుండెను. ఈ చియన్‌లుంగు చక్రవర్తికాలంబున నా ద్వీపమందు "లిన్" అనువాఁడు బందిపోటుదొంగలనాయకుఁడొకడుండెను. వాఁడు దోపుడుకాండ్రను గుమిగూర్చుకొనుట చూచి

యీ ప్రదేశాధికారి వానిని జెఱసాలయందుఁ బెట్టఁగా వానియను చరు లాయధికారిని సంహరించి యచ్చటిచీనాసేన నోడించి వా. నిం జెఱవిడిపించుకొని పోయిరి. చక్రివర్తికి వానియౌద్ధత్యము తెలియఁగానె వానిం దెగటార్చుటకై పెద్దసైన్యమును బంపెనుగాని వారును వానిచే హతులైరి; ఆసేనాధిపతి యెట్టులో ప్రాణములఁ దక్కించుకొని చీనాకు మరలఁ జేరెను. ప్రథమయుద్ధములో నోడిపోవుట చీనావారికిఁ బరిపాటిగా నున్నట్లు కన్పట్టుచున్నది. శత్రువులతో సఖ్యముఁ గావించుకొనుట యే చీనాప్రభువులముఖ్యోద్దేశము కావునఁ జక్రివర్తి రాయబారులను వానివద్దకుఁ బంపఁగా వాఁడు చక్రివర్తినిమూఁడునిబంధనలుకోరెను:— (1)తాను చెఱనుండి విడిపింపఁబడినతర్వాతఁ దన్ను సంహరింపవలె నని యత్నించిన "మందారినని" (ప్రదేశాధికారిని) వధింపవలయు ననియు, (2)పికిఙ్ రాజధానికిఁ దన్ను రమ్మని కోరఁగూడదనియు. (3)తత్పూర్వమువలెఁ గాకుండ నంతటనుండి యాద్వీపమును సౌమ్యముగ చీనాచక్రవర్తిపరిపాలింపవలె ననియు. అట్లునిబంధనలును గోరుట చీనాచక్రవర్తిని దిరస్కరించినట్లే యని యెన్నవలెఁ గదా! మఱియు నాయుద్ధములో రమారమి 2000చీనాసైన్యముమడిసి యుండెను. కావునఁ జక్రవర్తి 100000సైన్యమును వానిపైఁ బంపఁగా చీనావారు బర్మాదేశీయులయుద్ధకౌశల్యము నేర్చి, పర్వతవాసుల జయించినప్పుడు పర్వతసంచారకష్టముల కలవాటుపడి యుండుటచే నా బందిపోటునాయకుని వానియనుచరులను నిర్మూలంబుకావించిరి. చీనాసేనానాయకుఁడాద్వీపము నెడారిగఁ జేసియు దానియందు నెమ్మదిని గలుగఁ జేసితి నని చక్రవర్తికిఁ దెలియఁ జేసెను. అది యెట్టి నెమ్మది యనవచ్చును?

ఈచక్రవర్తి స్వదేశము నవక్రవిక్రమంబుతోఁ బరిపాలించువాఁడుగా నుండుటయే కాక పొరుగు రాజ్యముల వివాదములను గలహములను దీర్ప మధ్యవర్తిగాఁ గూడ నుండెను. చీనావారి నాగరికమును సేనాపటుత్వమును, దూర్పురాజ్యములలో నిరుపమానముగ నుండెడి యాయన యుద్ధోపకరణములును ఆయన కెంతకీర్తిదాయకములయ్యె ననిన ఆయనయొక్క నామమే స్వపరరాజ్యముల కొక యానగా నుండెను. చీనా రాజ్యమునకుఁ బొరుగు రాజ్య మయిన కొచ్చిన్ చీనాయందు మంత్రిత్వమునుండి తొలగింపఁబడిన "యూయన్" (Yuan) అనునతఁడు తన రాజును సింహాసభ్రష్టునిజేసి తాను సింహాసన మెక్కెను. అంతట నారాజు తన రాజ్యమును దన కిప్పింపుఁ డనియుఁ దనశత్రువును దెగటార్పుఁ డనియు, చీనాచక్రవర్తిని బ్రార్థింపఁగా ఆయన తన సేనానాయకుని దగుసైన్యముతోఁ బంపుచుఁ దత్కార్యమును నిర్వహింపుమని యుత్తరువు చేసెను. ఆ సేనాని యటులొనరించి మఱలి పోవుచుండఁగా శత్రువయిన యామంత్రి తన సేనాబలము చేతను, వ్యూహరచన చేతను, మార్గమధ్యమున చీనా సేనాని నవమానకరముగఁ బిట్టుగ నోడించెను. ఆ సమాచారము తెలిసి లక్షసైన్యమును చీనాచక్రవర్తి యతనిపైకిఁ బంపఁగా నతఁడు హడాక్రాంతుఁడై తనను రాజుగఁ జేయుఁ డని పలువిధంబులఁ జక్రవర్తిని బ్రార్థించె నని యాయన కరుణించి యతనినే మఱల రాజపదంబున నిల్పెను. మఱియుఁ దనకుఁ గప్పముకట్టు రాజులలో నొకనిగ నతని బరిగణించెను.

చక్రవర్తి మధ్యవర్తి యగుట.

అట్లు కొచ్చిన్ చీనారాజ్యమును స్వస్థపఱచినతోడనె తిబెటుదేశమందుఁ జిత్ర మయిన కలహ మొకటి యుదయించెను. తిబెటు దేశము చీనాదేశమునకుఁ బడమట నుండెను. అది చీనా

తిబెటునందలి కలహము.

రాజ్యములోనిదే. అచ్చట చీనావారి రెసిడెం టుండును. అచ్చటిమఠాధిపతికి 'గ్రాండుకామా' అనిబిరుదు. ఆయన చీనాచక్రవర్తిని దర్శించి యాశీర్వచన మొసంగుటకై వచ్చి పికిన్ రాజధానియందుండఁగ మశూచకవ్యాధిచేఁ గాలధర్మ మొందెను. ఆయనయొద్ద నున్నయపరిమితసొత్తును ఆయనయనంతరసోదరు డైన "సుంగుపా"కు చీనాచక్రవర్తి యిచ్చి వేయఁగా ఆయన కనిష్ఠసోదరుఁడు తనకుఁ గూడ నాసొత్తును బంచి యియ్యనందునకు ద్వేషము పూని యుండెను. వాఁడన్యమతం బవలంబించి యుండుటచే మతబహిష్కారమును బొంది యుండె నని వానికిఁ బంచిపెట్టకుండుట సంభవించి యుండును. వాడు నేపాళరాజ్య మందుండు ఘూరుకాలతో (Gourkhas) గుట్రచేసి తనయన్నయొద్ద నున్నసొత్తును దోచుకొని పోయి భాగ్యవంతులు కండని ప్రోత్సాహపఱిచెను.

ఘూరుకాలుతిబెటుపై దండెత్తుట.

ఘూరుకాలు ప్రసిద్ధు లయినదోపుడుకాండ్రు; కావున వారు వల్లెయని గుమికూడి వానిసోదరునిసొత్తు నపహరించుటకు వెడలిరి. నేపాళరాజ్యము తిబెటుదేశముయొక్క దక్షిణపుటెల్ల నానుకొని యుఁడును. చీనారాజ్యము బహువిస్తీర్ణముగ నుండుటచే దానిపొలిమేరలయందు రక్షకసైన్య ముండెను. తిబెటుయొక్క యెల్ల యందుండినసేనాధిపతులు "జనరల్ పాంచంగు" మొదలయినవారు ఘూరుకాలయొక్క ప్రబలసైన్యముఁ జూచి పోరాడలే మని జంకి తిబెటుమఠాధిపతులవలన ప్రతిసం॥ 10500 ఔన్సులబంగారము కప్పముగా నిప్పించెద మని యొప్పుకొని వారిని బంపివేసి ఘూరుకాలు చీనారాజ్యమునకు లోఁబడియుందు మని యొప్పుకొనినట్లు చీనాచక్రవర్తికిఁ దెలియఁ జేసిరి. ఒకసంవత్సరము గతింపఁగా నే ఘూరుకాలు తమకప్పము చెల్లింపు మనికోరఁగా తిబెటులోనున్న రెసిడెంటు ముందుసంవత్సర మిప్పించెద నని తంత్రము

చేసి తప్పించుకొనెను. తర్వాతిసంవత్సరంబున వారు తమ కప్పము నంతయుఁ జెల్లింపు మని రెసిడెంటును నిరోధింపఁగా లాలింపుమాటలచేఁగడపివేయవలెననియాతఁడుమఱలఁజూచెనుగాని వారామాటలకులోఁబడక "సుంగుపా"యొక్క పీఠమునుముట్టడించిరి. అప్పటి బౌద్ధమతాచార్యులు వేలకొలఁది కలరు. వారలందఱు కలసి పోరాడినచో ఘూర్కాలను జయింపఁ గలిగియుండిరి. కాని వారు బుద్ధధర్మోపాసనలచేఁ గృశించి యుండుట యే కాక తమపీఠములు స్వర్గమాతృపరిపాలితము లని దృఢవిశ్వాసముకలవారై యుండిరి. ఘూర్కాలు "సుంగుపా"(Tsungpa)ఋషియొక్క సర్వస్వంబును దోచుకొనిరి. ప్రధానపీఠాచార్యస్థాన మయిన "లాసా"(Lhasa)పట్టణమును గూడ ముట్టడించెద రేమో యని "డాలైలామా" బహుభీతిచే చీనాచక్రవర్తికిఁ దనయాపదఁ దెలియఁజేసెను.

*చక్రవర్తికి నేపాళరాజు కప్పముకట్టుట.*

ఘూర్కాలకు లంచమిచ్చి సమాధానపఱచుకొని యుండుటయు వారు చీనారాజ్యమునకు లోఁబడి రని తనకుఁ గపటసమాచారము బంపి యుండుటయుఁ జక్రవర్తికిఁ దెలియుటచే నిజము విచారింపఁ బూనెను. అప్పుడుచక్రవర్తియొక్క సన్నిధానమందున్న "జనరల్ పాచంగు" తానె యీపనినంతయుఁ జేసియుండెనుగావున చక్రవర్తికిఁ దనముఖము చూపఁజాలక యాత్మహత్యచేసికొనెను. అంతటఁ జక్రవర్తి ప్రబలసైన్యమును సిద్ధపఱచి తిబెటులో నున్నరెసిడెంటు ఘూర్కాలసంగతి దాచిపెట్టినందునకు మెడకు గుదికొయ్యఁ గట్టుకొని యాసేనను నడిపించుకొనిపోయి నేపాలరాజ్యమును ముట్టడింపు మని యాతనికిఁ గఠినయుత్తరువుచేసెను. ఎట్లయినను చీనానుండి యాసేనతోఁ బంపబడిన సేనానాయకుఁ డంతకుమున్ను ఘూర్కాలు తిబెటుదేశపుదక్షిణపుటెల్లయం దుంచిపోయిన 1000మందిఘూర్కాలను దత్ప్రదేశమం దున్న

రక్షకసైన్యము జయింపలేక యుండఁగాఁ దాను జయించి తఱిమివేసి బహుశ్రప్రయాసముతో నేపాళదేశమును బ్రవేశించి ఘూర్కు లెన్నియిబ్బందులు కలుగఁజేసినను మార్గ మెంతసంకటపెట్టినను లక్ష్యపెట్టక రాజధాని యైన 'కాఠ్మాండు'లోఁ బ్రవేశించి యంతట నేపాళరాజులోఁబడఁగాఁ బ్రతిసంవత్సరము చీనారాజ్యమునకుఁ గప్పము చెల్లించునట్లొడంబడికఁ జేసికొని చీనారాజ్యమునకు మరలివెళ్లెను. ఆయొడంబడిక ప్రకారమిప్పటికినిఁ గప్పము చెల్లింపఁబడుచున్నది.

## 6-వ అధ్యాయము.

### చియన్‌లుంగు చక్రవర్తియొక్క పరిపాలనాశేషము.

#### చీనాదేశమం దన్యదేశీయ రాయబారుల వ్యవహారములు.

విదేశీయుల వర్తక వ్యవహారములు.

గతాధ్యాయమందు లిఖింపఁబడిన చియన్‌లుంగు చక్రవర్తి సింహాసన మెక్కుటకుఁ జాలఁబూర్వమున నే యూరోపుఖండవాసులు చీనాదేశములో వర్తకముచేసికొనుట కంగీకరింపుమని చక్రవర్తులవద్దకు రాయబారులను బంపుచుండుటయు నది నిష్ఫలంబగుటయును గతంబున సంగ్రహముగ లిఖింపఁబడియున్నది. పరదేశవర్తకులకు నుండవలసిన యధికారములును స్వాతంత్ర్యములును దమదేశప్రజలకుఁ గలుగజేయవలయునని యింగ్లాండునుండి "ఇలిజబెత్" అను రాణికాలమందు. చీనారాజ్యమునకు రాయబారులు పంపఁబడిరి కాని వినియోగింపలేదు. పిమ్మట ప్రథమ "చార్లను" ప్రభువు ఇంగ్లాడుదేశీయులలోఁ గొందఱు పోయి చీనారాజ్యములో వర్తకముచేసికొనుటకు నధికారపత్త్రిమొకటి వారికిచ్చెను. దానింబట్టి 1635 సం॥ములో "కెప్టెన్ వెడ్డెల్ ఓడల సమూహముతో చీనారాజ్యములోనిదైన "మెకాయొ" ద్వీపముచేరెను. అంతకుమున్నే పోర్తుగలు దేశీయు లచ్చట వాణిజ్యము చేసికొనుచుండిరి. వా రింగ్లీషువారికిఁ దోడ్పాటుగ నుండెదమని చెప్పియు నిబ్బందులు కలుగఁజేయసాఁగిరి. అచ్చటనుండు చీనావారును ఇంగ్లీషువారిని వెళ్లగొట్టు

ఆంగ్లేయుల యోడలసమూహము మెకాయో ద్వీపము చేరుట.

టకు నశుము కట్టుకొనియే యుండిరి. కావున నా "కెప్టెన్" వారితోఁ బడలేక కాంటన్ పట్టణము (ఇది చీనారేవు పట్టణములలో ముఖ్యమయినది.) నకు నదిమీఁద బడవలలోఁ బోవుచుండఁగా "బోగు" దుర్గములనుండి చీనావారు ఇంగ్లీషు నావికా సమూహముపై ఫిరంగులు కాల్చిరి. అంతట నాకెప్టెన్ మరల ఫిరంగులతోనే ప్రత్యుత్తరమిచ్చి మెట్టకుఁ దిగి యాకోటలను ఫిరంగులను స్వాధీనపఱచుకొనఁగా చీనావారా యనతో నొడంబడికఁ జేసికొనిరి. దానంజేసి చీనావారికి వారిఫిరంగులు మరల నిచ్చివేయఁబడెను. ఇంగ్లీషువారు వర్తకము చేసికొనుట కంగీకరింపఁబడెను కాని యెగుమతి దిగుమతి సరుకులమీఁద చీనావారు కట్టినపన్ను లపరిమితముగ నుండుటచే వర్తకము లాభకారిగఁ గనుపింపకుండెను. కావున నాయొడంబడిక నిష్ప్రయోజన మయ్యెను. తదనంతరము ఫార్మోజాద్వీపమందును "ఏమాయి" రేవుపట్టణమందును ఇంగ్లీషువర్తకులు కొన్ని స్వాతంత్ర్యములంబడసి వాణిజ్యముసేయఁగా 1678 సం. లో నారెండు స్థలములయందును 600,00 * డాలరుల వర్తకముజరిగెను. పదపడి మఱియొక ఆంగ్లేయరాయబారి చీనారాజ్యమునకువెళ్లి "నింగుపో" అనురేవుపట్టణమందు వర్తకము చేసికొనుట కధికారమును బొందెను. ఏదియెట్లున్నను, మండారినులు (చీనావారిలో గొప్పయధికారులు) బలాత్కారముగ సుంకములు కొనుటచే నప్పటివర్తకము నిరర్థకం బయ్యెను.

ఆసమూహము కాంటన్ నగరమునకుఁ బోవుట.

ఇంగ్లీషువారి వర్తకము నిష్ఫలముగా నుంటకుఁ గారణములు.

కాంటన్ నగరాధికారికి ఇంగ్లీషువర్తకులు తమనష్టములను గుఱించి తెలియఁజేసికొనఁగా చీనావర్తకులలోఁ గొందఱ నొక సంఘముగఁజేసి, వారే విదేశీయులతో వాణిజ్యము చేయవలసినదని యుత్తరవుచేయుచు నెగుమతిసరకులపై 100కి 10 చొ, హెచ్చుసుంకము కట్టిరి. చియన్‌లుంగు చక్రవర్తియోగ్యుఁడయినను బరదేశీ

---

* డాలరు. ఇదిచీనావారినాణెము. 6 షిల్లింగులకుసమానము. షిల్లింగు ఇప్పటిలెక్కను 12 అణాలకు తుల్యము.

యోలవర్తకమంత దుస్తరముగను, నిస్సారముగ, నుండెను. ఆచక్రవర్తి యాయధిక పుసుంకమును గొట్టివేసి ప్రథమోపకారము చేసెను. కాని తానుపంపువర్తమానమును ఆంగ్లేయవర్తకులు మోకాలించివినవలెననియు, వారివద్దనున్న ఫిరంగులను తుపాకులు మొదలయినవానిని తనవశముచేయవలయుననియు, రెండునిబంధనల నాయుపకారమునకు జతపఱచెను. ఆంగ్లేయవర్తకు లానీచనిబంధనలకు సమ్మతింపక యీయుపకారమును ద్యజించిరి. ఎన్నినష్టములు, నెన్నికష్టములును సంభవించుచున్నను 'కాంటన్' నగరమం దాంగ్లేయులు వర్తకము కొనసాగించుచు నేయుండిరి. చియన్‌లుంగు సింహాసనమెక్కినవత్సరంబులో 'కాంటన్' నగరతీరమందు ఇంగ్లీషువారివి 4 పడవలును, ఫ్రెంచివారివి 2, డచ్చివారివి 2, డానియులది 1, స్వీడెనువారిది 1, యుండెను. 1742 సం. లో మఱియొక యోడలసమూహము వచ్చెనుగాని చీనావారు పరదేశవర్తక ప్రయోజనమెఱుంగుటయందు మందప్రజ్ఞులగుటచే నదియు నిరర్థకమయ్యెను. కాంటన్ నగరమందున్న యాంగ్లేయవర్తకులు 'ఫ్లింటు' అనునాతని తమవర్తకమునకు మార్గదర్శిగా నెంచి "నింగుపో" రేవునకుఁబంపఁగా, నచ్చట విఫలమనోరథుఁడై టీస్టిను రేవునకుఁబోయి చక్రవర్తికి లిఖితపూర్వకముగ నొకవిన్నపము పంపెను.

ఫ్లిన్టు అను నాంగ్లేయునికిఁ గలిగినపరాభవము.

అట్టిసాహసుని వదలించుకొనుట మేలనితలఁచి యాయనను వెంటఁబెట్టుకొని కాంటన్ నగరమందుండుగవర్నరుపాలికిం గా నిపోష్పుని యొకమందారుని కాజ్ఞాపించెను. కాని యా విన్నపమాలించి సుంకము 100-కి 6 కంటె మించఁ గూడదనియు నధర్మపుసుంకములుకొట్టివేయఁబడినవనియు, నుత్తరువుచేసెను. ఆయధికారి యాయనను కాంటన్ గవర్నరుగారిసన్నిధికిం దోడ్కొనిపోయి రాజాజ్ఞనువినుటకు మోకాలింపుమని చెప్పెను. ఆయనయట్లు సేయననితిరస్కరింపఁగా నాగవర్నరాయనను బలఁవంతపెట్టవద్దనిచెప్పి చక్రవర్తియొక్క యనుమతిలేనిదే "నింగుపో" రేవునందు వర్తకముచేసికొనుటకు యత్నించుటంజేసి మిష్టుల "మెకావొ" ద్వీపమునకు వెడలఁగొట్టి యచటనుండి యింగ్లాండునకుఁ బంపివేయవలసినదని చక్రవర్తిగారియాజ్ఞయయినదని నుడివి. యక్షరాల యంతపని నేచేసెను. ఆయ

నకు అర్జీవ్రాసియిచ్చిన చీనాజనుఁడు విదేశీయులకుఁ దోడ్పడెనని యాతని నురితీసిరి.

కాంటక్ నగరమందాంగ్లేయులకుఁ గలిగిన శ్రమలు.

కాంటక్ నగరమందున్న యాంగ్లేయవర్తకుల సంఖ్య యత్యల్పముగ నున్నందున చీనావారిచే వారు పడిన శ్రమలును వంచనలు నిన్ని యన్ని యని లిఖింపనలవి కాదఁట. వాని నెట్లు సహించి యావర్తకు లచ్చటనుండిరో యని పాశ్చాత్యచరిత్రకారుఁడు విచారపడుచు లిఖించెను. చక్రవర్తికి వందనసూచకముగా నొకప్పు డాంగ్లేయులు ఫిరంగి కాల్పఁగాఁ బ్రమాదవశమున గుండు దెబ్బతగిలి చీనాజనుఁడొకఁడు మరణించెను. తత్ప్రదేశాధికారులు కాల్చినవానిని బట్టియిండని నిరోధింపఁగా వారు వానిని నప్పగించిరి. అంతట వానిని వారు క్రూరహత్యచేసిరి. పరదేశీయులు తమదేశమందు వర్తకము జేసికొనుటకు చీనావారికి లాభనష్టము లున్నను లేకున్నను వారికి లేశమాత్రమయినను సమ్మతియే కాకపోయెను. కావున నన్ని దుష్కృత్యముల నొనరించుటకు వారు పూనిరని తోఁచుచున్నది.

ఇంగ్లాండుదేశపురాజు గొప్ప కానుకలతో రాయబారిని బంపుట.

వర్తకము సాగకపోఁగా మానప్రాణములకుఁగూడ గీడుగలుగుటం జూచి యాంగ్లేయరాజ్యాధిపతి చీనాచక్రవర్తిపాలికి గొప్ప కానుకలతో రాయబారి నొకనిఁ బంపి వర్తకవిషయమై సరసమయిన పద్ధతుల నేర్పఱచుకొనఁబూనెను. ఆప్రకారమె మెకార్ట్ని ప్రభువు (Lord Macartney) ను దగు పరివారముతోను ఆరాజ్యాధిపతి 1792 సం. ములోఁ బంపెను. అప్పటి రాజ్యాధిపతి పేరు మూడవజార్జి. మెకార్ట్ని ప్రభువు "చీనాతీరము చేరఁగానె యచటి యధికారులు తగుసన్మానము కావించి "పీహో" (Peiho) నదీ ముఖద్వారముపర్యంత మాయనపడవల వెంటఁబోయిరి. ఆయనను మర్యాద చేయుటకు నియమింపఁబడియున్న కమిషనరాయనకును బరిజనమునకును వలసినవన్నియు సిద్ధపఱచి టియన్ట్సిక్ నగరమునకు వారిని బడవలెక్కించి తీసికొని వెళ్లెను. అచ్చటనుండి మెట్టదారిని పికిక్ రాజధానికిఁ దీసుకొనిపోయెను.

ఆరాయబారి చీనాచక్రవర్తికిఁ గానుకగాఁదెచ్చినవి పెద్దబండ్లు మొదలుకొని చిన్నగడియారము దనుక ననేకవస్తువులుండుటంజేసి వానిని బహుళప్రయాసముతో. రాజధానికింజేర్చిరి. వానింగొంపోవుటకు 90 వాగనులును (రైలుబండికి జోడింపఁబడెడి యినుపతొట్లు)ను. 40 ఒంటిచక్రపు చేతిబండ్లును. 200 గుఱ్ఱములును, 3000 జనమును గావలసియుండెను. కాఁబట్టి యాకానుకలెన్నియొ, యవి యట్టివో చదువరులే యూహింపఁగలరు.

కానుకల వివరము.

ఆరాయబారికి మర్యాదసూచకముగాఁ గొన్ని ఫిరంగులు కాల్చిరి. ఆయనకును బరిజనమునకును దగిన విడిదిగృహ మేర్పాటు చేయఁబడెను. ఆసమయంబున చీనాచక్రవర్తి రాజధానియందు లేఁడు. జిహోల్ ? (Jehol)నగరమందు విలాసార్థముగ నుండెను. కావున నాకానుకలు చక్రవర్తియొక్క సింహాసన మందిరంబున గౌరవసూచకంబుగ నుంపఁబడినవి. కాని యామందిరము నారాయబారి ప్రవేశించినపుడా సింహాసనమున కాయనను మోఁకాలించి ప్రణమిల్లుమనిరి.

రాయబారికిఁ జేయఁబడిన సన్మానము.

అటులఁ జేయఁగూడదనియు నాంగ్లేయరాజుయొక్క ప్రతిమకు చీనావారు వందనంబాచరించిన యెడల నాంగ్లేయ రాయబారియు వారు కోరినటుల బ్రణమిల్ల వచ్చునని యు నాంగ్లేయ రాజారాయబారికి గట్టియుత్తరువు చేసియుండెను. కావున నారాయబారి యాసంగతిని చీనాకమీషనరునకు విస్పష్టముగఁ జెప్పి ప్రణమిల్లఁడయ్యెను. ఆకమీషనరుతో మఱియు నారాయబారి యిట్లు నుడివెను.

చక్రవర్తి సింహాసనమున కాంగ్లేయ రాయబారి ప్రణమిల్ల కుండుట.

“అయ్యా రాయబారి యొనరించు నగౌరవకృత్యమాయనప్రభునకు నమర్యాద గలుగఁజేయును. పూర్వము గ్రీకుదేశ రాయబారి పారశీక రాజ్యప్రభువు నెదుట నీచకృత్యమునకు లోఁబడినందున నారాయబారి స్వదేశమునకు మరలఁబోయినప్పు డురిదీయఁ బడెను. అదికాక యాపడవలను పీహోనదీ ముఖద్వారము

ఆరాయబారివచనములు.

నను వీరు గొంపోవునపుడు వాని పైఁగట్టఁబడిన మీఁధ్వజము మీఁద "ఇంగ్లాండు నుండి కప్పము తెచ్చినవాఁడు" అనిలిఖించితిరి. అట్లువ్రాయుట ధర్మమేనా."

ఆవివాదమును చీనాచక్రవర్తికిఁ దెలియఁజేయఁగా వారిని బలవంతపెట్ట వద్దని యాయన తెలియఁజేసెను. 1793 సం. సెప్టెంబరు 2 తేదిని ఆరాయబారి తగుపరివారముతో చక్రవర్తినిదర్శింప "జిహోల్" నగరమునకు వెళ్లెను. చీనారాజ్యమునకు లోఁబడియున్న రాజ్యములనుండివచ్చియున్న రాయబారులతో నాంగ్లేయరాయబారి యానెల 6 తేదీని చక్రవర్తి సముఖమునకుఁ గొనిపోఁబడెను. ఆంగ్లేయరాజు నారాయబారి యేమర్యాదతో సందర్శించునో యట్లే చక్రవర్తిని దర్శించునట్లేర్పాటు చేయఁబడెను.

రాయబారి జిహోలునగరమునకుఁ బోవుట.

కావున నారాయబారి యొక్క కాలితో మోఁకాలించి తనరాజొసంగిన పత్త్రికలం బెట్టియున్న బంగరుపెట్టెను హస్తద్వయముతో శిరంబుననిడికొని యంతట దానిని చక్రవర్తి కరంబులయం దుంచెను.

పత్రికల నిచ్చినవిధము.

బహుదూరదేశమునుండి యాంగ్లేయరాజు తనవద్దకు రాయబారిని బంపినందుకు మిగుల సంతసించి చక్రవర్తి యాయన కుశలప్రశ్నంబు లడిగెను. పదుమూఁడేండ్లప్రాయముగల యాంగ్లేయ బాలుఁ డొకఁడు చీనాభాషను గూడ నేర్చియున్నందున వారి కుభయులును దుబాసిగ నుండుటఁజూచి చక్రవర్తి యాబాలుని చాకచక్యమునకును సామర్థ్యమునకును, మిగుల నానందమొంది తనయొద్దనున్న రూకలసంచిని నాతనికి బహుమానమిచ్చెను.

చక్రవర్తిచేసినసన్మానము

చక్రవర్తి యారాయబారికి రెండు గొప్పవిందులఁ జేసెను. రాజసమానునిగ భావించి గౌరవించెను. పిమ్మట నాసంవత్సరమే సెప్టెంబరు 21 తేదిని ఆరాయబారి పికిఙ్ నగరమునకు జిహోలునుండి వచ్చి కొన్నివారములచ్చటనుండి చీనావారు దురుద్దేశముతోఁ జూపిన బహుదీర్ఘప్రయాణము చేసి చేసి తుదకు కాంటన్

ఆరాయబారి మఱల నింగ్లాండునకుఁ బోవుట.

చుట్టు దారిని మెట్టను

నగరమునకు డిశంబరు 19 తేదిని జేరి ఇంగ్లాండుదేశమునకు మరలి పోయి 1794 సం. సెపిటెంబరు 5 తేది నచ్చటఁ బ్రవేశించెను.

ఆరాయబారము వలన నాంగ్లేయులకుఁ గలిగిన లాభము.

ఆరాయబారము వలన నాంగ్లేయులకుఁ గలిగిన లాభమంతయు కాంటన్ తీరమందుండెడి యధికారులయాజ్ఞలకు లోఁబడి యుండునంత దనుక యాంగ్లేయులువర్తకము చేసికొనవచ్చునని మాత్రమయి యుండెను. ఆంగ్లేయరాజ్యము తమకుఁ గప్పము చెల్లించురాజ్యములలో నొకటియనియు, రాయబారియుఁ దమకు లోఁబడిన వాఁడనియు చీనావారు భావించిరి. రాయబారి చక్రవర్తిని దర్శింపఁబోయినప్పుడు రాజధానియందుంచి పోయిన పరిజనముపై చీనాదొరతనము వారు కావలియుంచి వారి నించుమించుగా ఖయిదీలవలెఁ జూచిరి. చీనావారికి సర్వాతిశాయిత్వము మెండని యీచర్యవలన గన్పట్టుచున్నది. చీనా చక్రవర్తి యీరాయబారిని మాత్రము మిగుల గౌరవించెను. అచ్చటి యుద్యోగులు తన నుల్లంఘనముగఁ జూచినను ఆరాయబారి లక్ష్యపెట్టలేదు.

చీనావారు దండోపాయ సాధ్యులేకాని సామసాధ్యులుకారనియాంగ్లేయులు గ్రహించిరి.

చక్రవర్తియొక్క మరణము. చియాచింగు చక్రవర్తియగుట.

1796 సం. లో చియన్‌లుంగు చక్రవర్తి తనరాజ్యమునకుఁ దన తనయుఁడైన "చియాచింగు" (Chiaching) నధిపతిగాఁజేసి 1799 సం. ఫిబ్రవరి 8 తేదీని స్వర్గస్థుఁడయ్యెను. ఆయన పరిపాలించిన యరువదివత్సరంబులలో చీనారాజ్యము మహోన్నత పదవిం జెందెనని యీదేశ చరిత్రకారులు వచించియుండుట న్యాయముగానే యున్నది. మంగోలియా మిట్టభూములనుండి కొచ్చిన్ చీనా పర్యంతమును ఫార్మోజాద్వీపమునుండి నేపాళరాజ్యము దనుకను చీనావారి సేనలు బీరంబుతోఁ బోరి జయంబునొందెను.

ఆయన పరిపాలనలోనున్న ప్రజాసంఖ్య 40 కోట్లు. వారందఱాయ నయాజ్ఞను శిరంబులఁ దాల్చిరి. శత్రువులప్పుడప్పుడు జయమొందినను దుదకుఁ బరాజితులే యైరి. ఈ చక్రవర్తియొక్క పితామహుఁడైన కాంగిషి చక్రవర్తి పాండిత్యమందును పరిపాలనా సామర్థ్యమందును దననుబోలినవాఁడు తనపుత్రుఁడైన "యూంగుచంగు" అని భావించెను గాని యాయన తనపాండిత్యమందే తనతండ్రింబోలెను. పరిపాలనయం దసమర్థుఁడై సాటికాఁజాలఁడయ్యె. ఆకొఱతను కాంగిషి చక్రవర్తి మనుమఁడయిన యాచియక్లలుంగు చక్రవర్తి సంపూర్తిచేసెను. ఈయన పాండిత్యమెంతయో చరిత్రకారులు నుడువలేదు. ఈచక్రవర్తి పూర్వాచారము ప్రకారము శత్రువులు చేఁ జిక్కినపుడును, దనయుద్యోగులయందు దీవ్రకోపముకలిగినప్పుడును నురిదండనలను విధించునంతటి దారుణస్వభావుండయ్యును శత్రువులతో సఖ్యముచేసికొనుటకె ముందుగఁ దలపెట్టి యదివిఫలంబయినపుడు వారిని హతముకావించెను. ఎట్లనయినను ధైర్యసాహస విక్రమాదులయందు మిగుల గణుతికెక్కినవాఁడనియె నుడువవలయును. పరమత సహనమును గొంతవట్టునకుఁ గలవాఁడె.

చియక్లలుంగు యొక్క పరిపాలనావిశేషములు.

## 7-వ అధ్యాయము.

చియాచింగుయొక్క పరిపాలన 1796-1820 టోక్వాంగుచక్రవర్తి 1820 1850 చియక్లలుంగు చక్రవర్తి తాను జగద్విఖ్యాతంబుగఁ బరిపాలించినరాజ్యమును దనపుత్రుఁడైనచియాచింగుచేతిలోఁ బెట్టుట రాజ్యమునకు క్షేమకరము కాకపోయెను. ఆచక్రవర్తి దయామయుఁడును, నాగరికలక్షణములు కలవాఁడును బ్రసిద్ధసామర్థ్యము కలవాఁడునై యుండఁగాఅయనపుత్రుఁడు నీచస్వభావమును, అమర్యాదలక్షణంబును, వికారస్వరూపంబును గలవాఁడయియుండెను. అఱువదివత్సరంబులు న్యాయముగఁ బరిపాలింపఁబడినరాజ్యము చియాచింగు పాలఁబడఁగానె యల్లరులు నక్రములును దలయెత్తిచూడసాగెను.

చియాచింగు యొక్క యయోగ్యతలు

తోఁకచుక్క యుదయించినయెడల దేశమునకుఁ గీడుమూఁడునని చీనాదేశీయుల కొకనమ్మకము కలదు. వారికిఁదగినట్లే

రాజ్యమందల్లరులు చెలరేఁగుట.

చియాచింగుపరిపాలనారంభమందు, దోఁకచుక్క యుదయించి, పండ్రెండుమాసములదనుకఁ గన్పట్టుచుండెనని చరిత్రకారులు లిఖించియుండిరి. వారు నమ్మినట్లే రాజ్యోపద్రవములు సంభవించెను. వ్యాధిగ్రస్తులకును దిక్కులేని వాండ్రకు నుపకారార్థముగా నొకసంఘము చీనారాజ్యమందక్కాలంబున నుండెను. ఆసాంఘికులు గొప్పతనము సంపాదింపవలయునని యతిశయకృత్యంబులఁజేయఁదొడంగుటచేఁ బ్రదేశాధికారులడ్డగించిరి. ఆసాంఘికులంతటఁగోపావేశముకలవారై తోఁకచుక్క తమకుఁదోడ్పడునని యాశపడి చక్రవర్తితోఁ గలహింపఁబూనిరి.

అల్లరుల నడంచుట.

అక్కాలంబుననే "హోనాన్" (Honan.) మొదలయినవాల్గుజిల్లాలయందు నల్లరులు చెలరేగెను. నేపాళరాజ్యమునుండి వెడలఁగొట్టఁబడినకొందఱుసైనికులు వచ్చియాకలహకారులలోఁజేరిరి. దీర్ఘకాలరణంబొనర్చి చక్రవర్తి యాకలహకారుల హతముకావించి, దేశమందు నెమ్మదిని మరలఁ బాదుకొల్పెను. యుద్ధసమాప్తియగునంతకు 450 కోట్లరూపాయలు వ్యయమయ్యెను.

చక్రవర్తియెడల జనుల కనురాగములేదు.

ఈచక్రవర్తి జనానురాగరహితుఁడై యుండెననుటకు రెండుగొప్పదృష్టాంతములు కలవు. వీథివెంబడి నడచుచుండఁగా ఘాతుకజనులు కొందఱాయనను జంపనుంకించిరి. అప్పుడు రక్షకభటులు మఱికొందఱును సహాయంబుచేసి యాగండమును దప్పించిరి. మఱియొకప్పుడాయన తనభవనమందుండఁగా ముప్వురు హింసకులు చంపఁబోవ వారిలో నిద్దఱు చక్రవర్తియొక్క ద్వితీయపుత్రుఁడును మూఁడవవానిని ఆయనసన్నిహితబంధువును బరిమార్చిరి. కాని వారిని ఆయన తనస్వశక్తివలన నివారింపలేకపోయెను.

చక్రవర్తి యొక్క దుర్నయము. నసమర్థతయు

ఆచక్రవర్తి తనప్రజలయనురాగమును దాను బడయఁజాలనప్పుడు విదేశీయులసహాయమయినను బొందుటకువారికి నవను కూలుఁడైయుండఁ డయ్యెను. విదేశీయులయెడలఁ దనతండ్రియాదరముకలవాఁడైయుండఁగ నాచక్రవర్తి వారిని దనసన్నిధానమునుండి వెడలఁగొట్టెను. 30 సం. ల నుండి పికిఙ్ నగరమందున్న" ఏమియటు (Amiot.) అనుక్రైస్తవమతాచార్యుని బహిష్కారంబుచేసెను. కాంటన్ నగరమందున్న వర్తకులను వాణిజ్యము మానివేయుఁడనియాజ్ఞాపించెను. యూరోపుఖండవాసులయెడలఁ బ్రబలద్వేషమావహించెను. చీనారాజ్యమునకు దక్షిణతీరమందున్న ఫార్మోజా మొదలయినద్వీపము లల్లరి జనంబులకు రక్షకస్థానములుగ నుండుటచే నక్కాలంబు ననేకఁడల్లరిగుంపులఁ జేర్చుకొనినాయకుఁడై దక్షిణతీరమందున్న రేవుపట్టణములలో నివసించువర్తకుల కుపద్రవము కలుగఁజేయుచుండి, యొకప్పు డాంగ్లేయులవర్తకపుఁబడవపై వలవేయించెను. అప్పుడు వారు కనుగొని దానినిద్రెంచివేసి యాదోఁపిడికాండ్రను బాఱఁదోలిరి. అట్టితొందరలు వారొనరించుచుండినను చీనాచక్రవర్తికిఁ గాని యీయనయుద్యోగులకుఁ గాని చీమకుట్టినమాత్రము లేకపోయెను. అట్లు గాఢసుప్తిం జెందియున్నవారి గౌరవము సంభవించిన యొక్క గొప్పవిపయముచే మేలుకొల్పఁబడెను. చీనారాజ్యమునకు లోఁబడియున్నసయాం రాజ్యాధిపతి కప్పము చెల్లింపవలసినసమయమయ్యెను. అది యెటింగి యోడదొంగలగుంపు సయాం రాజ్యమునుండి చీనాకుఁబోవుచున్న పడవలోఁ గప్పపుద్రవ్యాదులుండునని దానిని ముట్టడించిరి.

సయాంనుండి కప్పము తోవచ్చుచున్న పడవను ఆంగ్లేయులు కాపాడుట.

అంతట రాజకీయోద్యోగులు తమ పరువుపోవునని తల్లడిల్లి యాకప్పము రదొంగలపాలుకాకుండునట్లురక్షింపుఁడని 'కాంటన్' నగరమందున్న యాంగ్లేయులను బ్రార్థింపఁగా వారు యుద్ధనావలతో వెడలి యాదొంగలపడవలను జెల్లాచెదరుచేసి కప్పము సురక్షితముగ చీనాచక్రవర్తికిఁ జేరునట్లొనర్చిరి.

*చీనాదేశీయులు దుర్నయులని చరిత్రకారుఁడాక్షేపించుట.*

చీనావారిపరువునిల్పుటకాంగ్లేయులు చేసినప్రథమసహాయమిదియె. అట్లనేకపర్యాయములు తోడ్పడి తుదకు "తైపింగు" కలహ మాంగ్లేయ సహాయమువలననే నివారింపఁబడెను. చీనావారు తమకనుకూలకాలమందు దమంతవారులేరన్నట్లుగర్వితులై ప్రతికూలస్థితి సంభవించినప్పుడు తమగర్వమును బోనాడి ధైర్యముచెడి తలవంచుకొందురని పాశ్చాత్యచరిత్రకారుఁడు వ్రాసెను. గతాధ్యాయములందు లిఖించియున్న కాంగిషి, చియాఙ్లుంగు మొదలయినచక్రవర్తులు పిఱికివియని శూరులయి పరాపేక్షలేకయేపోరి జయంబులు వడసిరని యాచరిత్రకారుఁడే వ్రాసెను.

*ఖండనము.*

చక్రవర్తియసమర్థుఁడగుటచేఁ దమసహాయంబుఁ గోరుననియనక చీనావారి నాక్షేపించుచు నట్లేలవ్రాసెనో తెలియఁబడకున్నది. ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని యూరోపుఖండమందు యుద్ధము సంభవించినందున చీనాతీరమందున్న మెకావొద్వీపమును ఫ్రెంచివారు వశపఱచుకొనకుండుటకై యాంగ్లేయులయుద్ధనావలధికముగా "కాంటఙ్" నగరతీరమునకువచ్చుచుండుటఁజూచి చీనారాజ్యమందలియధికారులు తమకాపత్సమయములయందాంగ్లేయులు తోడ్పడుచున్నప్పటికి సహింపఁజాలక యానగరమందు వారివాణిజ్యమును మానివేయుఁడని యుత్తరువు చేసిరి.

*వర్తకమాపివేయుఁడని యాంగ్లేయులను నుత్తరువు చేయుట.*

మఱియు నాంగ్లేయులయందు మిత్రభావముకలవానివలె నటించుచు తనయతిశయమును బ్రకటించుచు చీనాచక్రవర్తి యాంగ్లేయ రాజయిన మూఁడవజార్జి కిట్లు లిఖించెను.

*చక్రవర్తియాంగ్లేయరాజునకు వ్రాసినలేఖ.*

"మీరాజ్య మనేక సముద్రముల కవ్వల నుండియున్నను మారాజ్యమహిమను మాసంపూర్ణపరిపాలనావిధానమునకు నద్భుతపడుచు మారాజ్యము పట్ల నడుచుకొనవలసినరీతిని నడుచుకొనుచు మాచట్టములకులోఁబడుచున్నారు. మేముచిత్తగించుటకై లేఖలను రాయ

బారులచేతఁ బంపుచున్నారు.మాయందు మీకుఁగల గౌరవమును సన్మానమును బ్రకటింపుచు మీరువ్రాయించిన యీలేఖలను జూచి మిమ్ములను సఫలమనోరథులను గాఁ జేయుటకుఁ గుతూహలము కలిగి, మీరంపిన కానుకలనందుకొంటిమి. మీ దేశపు ప్రజలు బహుకాలమునుండి మారాజ్యమందు వాణిజ్యము చేసికొనుచున్నారు. మీప్రజలనె కాక యేజాతివారినైనను నేమనుష్యులనైనను ఈస్వర్గప్రభుత్వము ధర్మబుద్ధితో నుపకారబుద్ధితోనుజూచునని మీరెఱుంగవలయును. మీప్రజలను దయతోను బ్రేమతోను నాదరించుచుందును. కాఁబట్టి యిచ్చటనున్న మీప్రజల విషయమై మీ రేమియు శ్రమపడ నక్కఱలేదు.

చక్రవర్తియొక్క దురతిశయము.

చియాచింగు చక్రవర్తి తనతండ్రివలె విశేషబుద్ధిలేనివాఁడగుటంజేసి విదేశీయులయెడల సహనమును మర్యాదయును వీటిబుచ్చి యట్లు దురతిశయముగ లిఖించియుండెను. తనసందర్శనమునకు వచ్చువారు వందనము చేయుటను గుఱించి చియాలుంగు చక్రవర్తి సమయానుకూలముగఁ బ్రవర్తించె నేగాని మూర్ఖపుపట్టుపట్టినవాఁడుకాఁడు. ఆయన పుత్రుఁడైన యీచక్రవర్తి తగని పట్టుదల కలవాఁడై తనకుఁ దనప్రజలు కాని యితరులుకాని చూపవలసిన మర్యాదలలో లేశమయిన లోపమును సహింపనివాఁడయ్యె.కావుననే రుషియారాజ్యమునుండి 1805 సం. లో వచ్చిన రాయబారి చీనాగోడదనుకవచ్చి చక్రవర్తి నీచవందనస్వీకారమందుఁ బట్టుదల కలవాఁడని విని మరలిపోయెను. పిమ్మటఁ బదునొకండు వత్సరంబులకు ఇంగ్లాండురాజయిన మూఁడవజార్జి యొకరాయబారిని బంపెను.

లార్డు ఆహంరెస్టు అను రాయబారికిఁ గలిగిన శ్రమము.

ఆయనపేరు "లార్డుఆంహరెస్టు" (Lord Amhorest.)లార్డు మకార్టనియొక్క రాయబారమును గుఱించి గతంబున లిఖింపఁబడియున్నది. ఆరాయబార మించుమించుగా నిష్ఫలంబైనందున దానిని నెఱవేర్చుటకై యీరాయబారిం బుత్తెంచెను. ఈయన సవ్యముగా పికిన్ నగరముచేరెను గాని చక్రవర్తికిఁ జేయు వందనవిషయమై నిరంతరము చక్రవర్తియొక్క యుద్యోగులు లా రాయబారితో

వివాదపడుచుండిరి. "మెకార్టని" రాయబారివలెనే యాయనయు సమాధానము చెప్పచుఁ దనరాజునకుఁ బ్రతివందనమును గోరెను. అందులకాయుద్యోగులు సమ్మతింపక రాజధానికి 20 మైళ్లుదూరముననున్న యుయాక్ మింగు యుయాక్ ( ) నగరమునకు రమ్మనుమని చక్రవర్తి యుత్తరువయినదని యాయనకుఁ జెప్పి,యసందర్భ కాలమందాయనను బ్రయాణముచేసిరి. ఆప్రయాణములో బహుసంకటపడి యాయాసము నొందియుండఁగా జక్రవర్తి తనదర్శనమున కిప్పుడే రమ్మనుమనె నని యాయనకు హో (Ho) అను కమీషనరు చెప్పఁగా నారాయబారి యప్పుడు దర్శింపనలేననెను.ఆకమిషనరు మఱియు బలవంతపెట్టి తీసుకొని పోఁదలఁచుటఁజూచి, చక్రవర్తిం దర్శించుటకు దుస్తులు తనకింకఁజేరలేదనియుఁ జేరునంతదనుక యవకాశమీయవలయుననియు నారాయబారి చక్రవర్తికి నొకలేఖ వ్రాయఁగాఁ దక్షణమె బయలువెడలి "కాంటన్" నగరమునకుఁ బోవలసినదని చక్రవర్తి ప్రత్యుత్తరమిచ్చెనని యాకమిషనరు వచించెను. అంతట నారాయబారి నిరాశుఁడై బహుశ్రాయాసముతో వెడలిపోయెను.

ఆయవమాన కృత్యమునకు చక్రవర్తియొక్క దురుద్దేశమె కాక యాయన యుద్యోగుల ద్రోహచింతనయుఁ గారణమయ్యెను " హో (Ho.) అనుకమీషన రా రాయబారి ప్రయాణాయాసముచే చక్రవర్తిని దర్శించుటకు రాఁజాలకుండెనని చెప్పక వందనముచేయుట కిష్టములేకుండుటచే నట్లు పల్కెనని చక్రవర్తితోఁ దంత్రముచెప్పెను. పిమ్మట నాకమీషనరుయొక్క ద్రోహకృత్యమరసి యాయనను చక్రవర్తి కఠినముగ శిక్షించెను.

మానింగుఅను రాయబారినీచవందనము చేయనొల్లక మరలి పోవుట.

1814 సం. లో "మానింగు" (Maning) అనునాంగ్లేయుఁడు కాంటన్ నగరము చేరెను.ఆయన చీనాభాషయందుఁ దనకుఁగల పాండిత్యమును బట్టిచక్రవర్తివలన సన్మానింపఁ బడుదునని యుల్లాసము కలవాఁడై నీచవందన కృత్య నిర్బంధమును విని, యాదేశమును విడిచి టిబెటువెళ్ళి యచ్చట గౌరవముం జెందెను. (విదేశీయవాణిజ్యము లాభకరమని చీనావారేల గ్రహింపరైరో విదేశీయ రాయబా

రులను నీచవందన కృత్యమున కేల బలవంతపెట్టిరో యూహింప నలవిగాకున్నది.

చక్రవర్తియొక్క దురభ్యాసములు.

ఈచియూచింగు చక్రవర్తియొక్క చిన్నతనాలను యోగ్యముగానే గడుపఁబడెను. ఈయన 1821 సం. లో నరువదియొకటవయేఁటఁ గాలధర్మమునొందెను. ఈయనతనబాల్యమందుగొంచెము విద్యావ్యాసంగము కలవాఁడేకాని వయసుగకాలమందు నాటకాదులయందుఁ బ్రబలోత్సాహము కలవాఁడయ్యెను. ప్రతిదినముదయమునఁ గొలువు కూటముఁదీర్చి పిమ్మట నంతఃపురములోనికిఁ బోయి నాటకసామాజకులతో వినోదపడుచుండెను. మఱియు దేవళంబునకు పూజార్థము పోయినప్పుడుకూడ వారిని వెంటఁగొనిపోయి యుండెను. ఆనీచసాంగత్యము కూడదని యాయనయుద్యోగులలో "సుంగు" (sung) అనువాఁడు వెఱవక చక్రవర్తిని కఠినముగా మందలించి లిఖితపూర్వకముగాఁగూడఁ దెలియఁజేసెను. అందువలన చక్రవర్తికిఁ గోపము హెచ్చెనేకాని యాసాంగత్యము నాయన త్యజింపఁడయ్యె. మఱియు ఆయన యాయుద్యోగిని దనసమ్ముఖమునకు రమ్మనుమని తెలియఁజేయఁగా నతఁడు గడగడవడఁకుచు సన్నిధికిఁ బోయెనఁట.

మందలించినయుద్యోగిని చక్రవర్తి దండించుట.

తనకు మందలింపుగా వ్రాసినందుకు చక్రవర్తి యాయనను చివాట్లుపెట్టుటయేకాక స్వర్గపుత్రుఁడైన తనను నిందించినందుకే మిశిక్షవిధింపుమనెదవని మూఁడుసారు లాయననడుగఁగా మొదటిసారి తననొకమూలకు త్రోసివేయుమనియు, రెండవసారి తనను దలఁగొట్టించుమనియు, మూఁడవసారి తనను మట్టగింపుమనియుఁ బ్రత్యుత్తరము లిచ్చెనఁట. ఆతనినిదూరదేశమున కధికారిగాఁ బంపివేసినయెడలఁ దనగుట్టు రట్టుగానేరదని తలఁచి యాయనను మంగోలియా దేశమందున్న యొకజిల్లాకు గవర్నరుపనికి నియమించెను.

చియాచింగుచక్రవర్తి యొక్క మరణానంతర లేఖనము.

చియాచింగుచక్రవర్తి బద్ధకుఁడును మద్యపానాసక్తుఁడునయి యుండెను. ఈయన పరిపాలించిన యిరువదియైదుసంవత్సరంబులును రాజ్యమందుఁ గల్లోలములేగాని నెమ్మదిలేకుండెను. ఈయనయం దీయన తండ్రియొక్క దుర్గుణములు ప్రబలించెనేకాని యాయనకుఁ గీర్తితెచ్చినయోగ్య లక్షణంబులలో నొకటియు నీయనకు లేదయ్యె. గతించినవారిని గుఱించి స్తోత్రరూపకమయిన ప్రకటనను దదనంతరచక్రవర్తియొనర్చునట్టి యాచారమొకటి చీనారాజ్యమందున్నది. అట్టిప్రకటనలలో వ్రాయఁబడు స్తోత్రవాక్యము లసత్యములయి కొన్నియెడలఁ గన్పట్టును. ఏలయన దుష్టచక్రవర్తినయినను మరణానంతరము యోగ్యుఁడనియే కొనియాడెదరు. ఈచక్రవర్తి కనంతరమీయన ద్వితీయపుత్రుఁడే రాజ్యాధిపతి యయ్యెను. ఆయన జన్మనామము "మియమ్మింగు" (miemming). ఆయన చక్రవర్తియై "టోక్వాంగు" (Toakwong) అనిపేరువెట్టుకొనెను. ఆయనతనతండ్రినిగూర్చి మరణానంతర ప్రకటనయం దిట్లు వ్రాసెను.

"స్వర్గస్థుఁడైన చియాచింగు చక్రవర్తి చీనారాజ్యము బహుశ్రద్ధాళువయి కాయక్లేశమున నోర్చి 25 వత్సరంబులు పరిపాలించెను. ఆయన యెల్లప్పుడు జాగరూకుఁడై యుండెను. సలక్షణముగ రాజ్యమును బరిపాలించుటయే యాయన ముఖ్యోద్దేశముకావుననే యాయనచక్కఁగా నేలెను. ఆయనయుద్యోగులును, ప్రజలును ఆయినను త్రికరణశుద్ధిగా గౌరవించిరి. మఱియును ఆయనయెడల బహుభయంబుగలిగి నడుచుకొనిరి. ఆయన తన కారుణ్యరసమును రాజ్యమునందెల్ల యెడలఁ బ్రవహింపఁజేసెను. చీనాదేశమందును వానికి లోఁబడియుండెడి బాహ్యదేశములయందును క్రమపద్ధతిని నెమ్మదిని గలుగఁజేసెను. లక్షల కొలఁదిగ నుండుజనులందఱు సుఖంబుండిరి! ఇంక బహుకాలము జీవించి ప్రజలను సుఖపెట్టుటకు దైవ మనుగ్రహించునని యాశపడుచుండఁగా నాకస్మికముగ నాయన స్వర్గస్థుఁడయ్యెను." గతంబున లిఖింపఁబడిన యాచక్రవర్తియొక్క యయోగ్య పరిపాలనమునకును ఆయన మరణానంతర లేఖనమునకును గల వ్యత్యయమును జదువరులే గ్రహింపఁగలరు.

టోక్వాంగు చక్రవర్తి యగుట.

1820 టోక్వాంగు చక్రవర్తియయ్యెను. ఈయన చియాచింగు చక్రవర్తికి ద్వితీయ పుత్రుండైనను తనప్రాణమును గాపాడినవాఁడనియు, నీయనధైర్యమును నేర్పును బట్టియే తాను చివర యేడువత్సరంబులును జీవించితిననియు, చియాచింగు చక్రవర్తి సంపూర్ణకృతజ్ఞతఁగలవాఁడై యీయనకే చక్రవర్తిత్వ మొసంగునటుల మరణశాసనమందు లిఖించెను. ఈ చక్రవర్తియగు నప్పటికి ముప్పదితొమ్మిది సంవత్సరముల ప్రాయముకలవాఁడు. ఈయన తనతండ్రికి నంతయిష్టుఁడుగా నుండినను అంతఃపురస్త్రీలకు నిర్ద్వందుకాఁడయ్యెను. మఱియుఁ దనతండ్రియొక్క యుపభార్య పిమ్మట రాణియయినను నామెకు హితుఁడు కాఁడయ్యెను. ఈచక్రవర్తియొక్కజననికి ఆయుంపుడు కత్తెకును సవతులకొట్లాట యతిశయముగా నుండుటచే నొకప్పుడు ప్రబలకోపావేశంబున నీయనజనని యాత్మహత్య చేసికొనెను. ఈచక్రవర్తి బాల్యంబున నాయుధాభ్యాసమందును దేహపరిశ్రమమందును మిగుల గుతూహలముఁగలవాఁ డగుటచేఁ దనదేహము పుష్టిగ నుండుటకై యౌషధంబులఁదినగా దంతభగ్నుఁడయ్యె. అందువలన నీయనదవడ లందవికారముగనఁటుకొని పోయెను. దానికిందోడుగ. బలహీనమైపొడుగుగనుండు శరీరముకలవాఁడు. అదియటుండ రాజ్యమేలంజాలిన సమర్థత లేనివాఁడు. అయినను మంత్రులసహాయమువలన రాజ్యము నేలఁగలవాఁడయ్యెను.

చేసిన మార్పులు

మరణానంతరప్రకటనయందుఁ దనజనకునంతగాఁ గొనియాడియును ఆయనచర్యలు సరియైనవికావని యీదిగువమార్పులను సింహాసనమెక్కినతోడనే యొనరించెను. ఆమార్పులేవియనిన (1) మంత్రిపదమునుండి తొలగించి "ఇలి" పరగణాకు గవర్నరుగాఁదనతండ్రి పంపివేసిన "సుంగు" ను మరలరావించి మంత్రిపదం బొసంగెను. (2) నాటకసామాజికులను రాజభవనంబునుండి వెడలఁగొట్టెను. (3) తనమంత్రియొక్క యంతఃపురస్త్రీలను వారివారి బంధుగృహంబులకుఁ బంపివేసెను. పిమ్మట తనగృహిణిని బట్టమహిషింజేసెను.

లోకమందొకఁడుచేయుదోషము వాఁడునశించిన నది నశింపదందురు. అటులనే తనతండ్రిచేసిన యక్రమపుపరిపాలనవలం గలిగినదోష మీచక్రవర్తిం జుట్టుకొని మిగులనె గులంజేయఁదొడఁగెను. మహామారిజాడ్యము,కరువు, యుద్ధము లీచక్రవర్తియొక్క నెడమలఁ ద్రొక్కుచుండెను. ఈయనతండ్రి పరిపాలనలో దేశీయన్యాయచట్టములు సక్రమముగను విధ్యుక్తముగను వినియోగింపఁ బడియుండలేదు. చీనాదేశమునకు నుత్తరపుటెల్లకవలనుండెడి యడవిజనులు చీనారాజ్యదౌర్బల్యముంగని యల్లరులు మొదలుపెట్టిరి. వాండ్రను కాంగిషి చక్రవర్తి తొక్కిపట్టి రెక్కనకుండఁజేసెనని గతంబున లిఖింపఁబడియె.

*గతచక్రవర్తిపాలనదోష మీచక్రవర్తిని బాధించుట.*

ఈచక్రవర్తికాలంబున "జిహాంగిరు" (jehangir) అనువాఁడు ప్రబలి యాయడవిజనంబుఁగూర్చుకొని నాయకుఁడై కాష్గరుపట్టణమును ముట్టడించి యచ్చటి చీనాసేనను హతముకావించెను. పిమ్మట చక్రవర్తి ప్రచండసైన్యమునుబంపి యాశత్రువులపీఁచమడంచి యానాయకు నురి దీయించెను.

*జిహాంగీరను కలహానాయకుని నిర్జించుట.*

కాంగిషిచక్రవర్తి "అల్బాజిన్" నగరమందు రుషియావారినోడించి "పికిన్" రాజధానికి ఖయిదీలనుగఁబట్టుకొనిపోయి వారి నచ్చటనివాసులను జేసియుండెనని గతంబున లిఖింపఁబడియున్నది. వారా రాజధానియం దిండ్లుకట్టుకొని నివసించుచు,చీనాజనులతోఁగలసిమెలసి నేఁటివఱకును జీవించుచుండిరి. వారిజీవనార్థము రుషియాచక్రవర్తి తనదూతలచే ద్రవ్యము నియమితకాలములయందుఁ బంపుచుండెను. ఈచక్రవర్తికి దేశీయుల వాసన గిట్టనప్పటికి నీయనకాలమందు వచ్చినయొకదూత నేలయోమన్నించెను. కాని తనకొలువునందు జ్యోతిషోద్యోగు లయియున్న పోర్తుగలు దేశీయులను గొలువునుండి యకారణముగఁ దప్పించెను.

*చక్రవర్తికి విదేశీయులు గిట్టకుండుట.*

చీనాచక్రవర్తికి దనద్వీపములయందు లక్ష్యము లేదనుట.

చీనాదేశమునకు వెలుపలనుండు ద్వీపములును దేశములును చీనారాజ్యములోఁ జేరినవయినను చీనాదొరతనమువారికివాని యందు లక్ష్యములేదు. స్వర్గలోకములనివారెన్నెడి పదునెనిమిదిపరగణాల కేమాత్రమయిన నిక్కట్టు వచ్చెనేని వారికిఁ జులుకుపుట్టును. దానికిఁ దార్కాణముగ ఫార్మోజా, (Formosa) హైనన్ (Hainan) ద్వీపములయం దల్లరు లేకకాలమందు సంభవింపఁగా చీనాసేనానులు కలహకారులను గొందఱను సంహరించి, కొందఱివలన లంచములుగొని తాత్కాలికోపశమనమును గలిగించిరేకాని శత్రునిర్మూలనంబు కావించి స్థిరమయిన నెమ్మదిని నెలకొల్పరైరి. పిమ్మట మఱియొక యడవిగుంపులతెగ తలయెత్తి కలహింపఁ దొడఁగఁగా చక్రవర్తి తనమామను సమర్థమయిన యొకసేనకధిపతింజేసి వారిపయికిఁబంపఁగా వారినినోడించి లోబఱచుకొనెను.

చక్రవర్తికిఁ గలిగిన స్వకుటుంబదుఃఖములు.

ఈచక్రవర్తి రాజ్యపరిపాలనయందేకాక స్వగృహపరిపాలన యందుఁ గూడ నలజడిం జెందెను. 1831 సం. లోఁ హైనను దువఁబడిన కలహములు ప్రవర్తిల్లెను. ఆవార్తలు చక్రవర్తికిఁ దెలిసిన సమయమందు చక్రవర్తి తనభార్యయు నేకపుత్రుఁడును జనిపోయి యుండుటఁజేసి దుఃఖాబ్ధిలోమునిగియుండెను. ఆపుత్రుఁడు దుశ్శీలుఁడై దురాచారసంపన్నుఁడై యుండుట ప్రసిద్ధవిషయమఁట. అతఁడు నల్లమందు పొగద్రాగుటచే జచ్చెనని కొందఱు, నాతని దుశ్చేష్టలఁజూచి సహింపఁజాలక చక్రవర్తి గుద్దుటచే మరణించెనని కొందఱు చెప్పెదరఁట.

కాంటన్ నగరమందున్న యాంగ్లేయవర్తకసంఘపు రెసిడెంట్లునుగుఱించి, యీచక్రవర్తి తాను రాజ్యమందునను సంసారమందున నట్టి బెడిదంబులగుగొడవలఁ బడియుండుటచే నేమియు విచారింపఁడయ్యె. ఆంగ్లేయవర్తకులు చీనావారిచేఁదమకుఁదొందరలు కలుగుచున్నను సహించి వాణిజ్య మభివృద్ధిజేయుచుండిరి. ఈచక్రవర్తివలన నూతనకష్టములు మాత్రము వారికి సంభ

చింపలేదు. చీనాదొరతనమువారితో వారికిఁ గలయుత్తరప్రత్యుత్తరములు చీనావర్తకసంఘముమూలముగ జరుగుచుండె. కాంటన్ నగరమందు నాంగ్లేయుల స్త్రీలు నివసింపఁగూడదనియు వారానగరసమీపమందున్న "మెకాయో" దీవియం దుండవలెననియు, ఆంగ్లేయవర్తకులు తమకుటుంబములఁ జూచుటకై యాదీవికిఁ బోవుటకు 70 మొదలుకొని 100 పౌండ్లలోగా విధింపఁబడు సుంకము చెల్లించి లైసెన్సుపొందవలయుననియు చీనాదొరతనమువారు నిర్బంధపునిబంధనలు జేసియుండిరి. అవియును మఱియెన్నియో యిబ్బందులును గలుగుచున్నను కాంటన్ నగరమందు ఆంగ్లేయవర్తకులసంఖ్య యంతకంతకు బెరుగుచుండెను. అన్యదేశములయందు వాణిజ్యముచేసి స్వదేశవాణిజ్యము నభివృద్ధి చేయుటకును స్వదేశము పెంపొందుటకును ఆంగ్లేయవర్తకులు చీనాదేశమందుఁ బడరానియిడుమలుపడుచుఁ బట్టుదలతో నిర్వహించుచుండుట యెంతయు స్తవనీయముగనున్నది. హిందూదేశమున కట్టిభాగ్య మెప్పుడు కలుగునో కదా.

---

## 8 వ అధ్యాయము.

### టోక్వాంగు చక్రవర్తియొక్క పరిపాలనాశేషము.

చీనాదేశీయులతో నన్యదేశీయులకు జరిగినవ్యవహారములు. ఇంగ్లాండుదేశపురాజయిన ప్రథమచార్లెసు తనప్రజలలోఁగొందఱు తూర్పుదేశములలో వాణిజ్యము చేసికొనుటకొసంగిన లిఖితాంగీకారముయొక్క కాలపరిమితి 1834 ఏప్రియలునెలతో సాంతమగుచుండెను. తూర్పుదేశవాణిజ్యము మిగుల నభివృద్ధిగ నుండినందున నక్రమములు లేకుండ దానిని జరుపుటకు వర్తకు లసమర్థులనియు వాణిజ్యమును సొంతముగాజరుపుకొనుట యుక్తమనియుఁదలఁచెను. అన్యదేశీయవాణిజ్యవిషయమై చీనాదొరతనమువారి ప్రాంతకట్టుబాటులఁ దొలఁగించి ప్రదేశాధికారులతో నాంగ్లేయవర్తకులు స్వయముగానే వ్యవహరించునట్లు చేయుటకు "లార్డు నేపియరు" (Lord Napier) అనెడియాయనకాంగ్లేయదొరతనము

ఇంగ్లాండురాజు లార్డు నేపియరును చీనాకుఁ బంపుట.

వారు 1833 స. డిశంబరు 10 తేదీని లిఖితపూర్వకమయిన యధికారమిచ్చిరి. ఆలేఖయందు వారు వ్రాసినదేమనఁగా.

"మీరు సూటిగ కాంటను నగరము ప్రవేశించి మీరాక నచ్చటి రాజప్రతినిధికి లిఖితమూలముగఁ దెలియఁబఱచవలెను. మీరు కాంటను నగరవాణిజ్యమునురక్షించి వృద్ధిచేయుటయేకాక చీనాదేశమందే యితరస్థలములయందుఁగూడ వాణిజ్యముచేయుట కర్హ్వముగనుండునో యదియువిచారింపవలెను. ఈసంకల్పము సిద్ధించుటకై చీనాదొరతనమువారితో స్వయముగ వ్యవహరించుటయావశ్యకమని మేము వేఱ చెప్ప నక్కఱలేదు కదా"

లార్డు "నేపియర్ అప్రకారమే చీనాతీరముఁజేరి కాంటను నగరమునకు స్వతంత్రించి పోయి తనప్రవేశమును రాజప్రతినిధికిఁ దెలియఁజేసెను. ఆయన యొనర్చినస్వతంత్రప్రవేశమున కచ్చటియుద్యోగులు మిగులఁగినిసిరి. మఱియు నచ్చటసుంకములఁబుచ్చుకొను సూపరిన్ టెండెంటు లార్డు నేపియరు యొక్క స్వాతంత్ర్యము సహింపఁగూడకుండుటంజేసి కాంటను నగరమందలి విదేశీయవాణిజ్య మాటంక పఱపవలసినదని రాజప్రతినిధికి విశదపఱచెను. లార్డు నేపియరువ్రాసిన లేఖను రాజప్రతినిధి నిరాకరించి చీనాదొరతనము వారాంగ్లేయునినొక పెద్దవర్తకునిగ భావించెదరనియు, అనాగరికజనముతో వారువిశేషకార్యావసరములయందుఁదప్ప సాధారణముగ నుత్తర ప్రత్యుత్తరరూప వ్యవహారము పెట్టుకొనరనియుఁ దెలియఁజేసెను.

## నల్లమందువర్తకమాంపులకు చీనాదొరతనమువారు యత్నించుట.

లార్డు నేపియరు చీనాదేశమును వెళ్ళినకాలముకూడఁ గొన్నివ్యవహారములనుబట్టి ప్రతికూలముగ నుండెను. పరదేశములనుండి ముఖ్యముగా హిందూదేశమునుండి దిగుమతి యగుచున్న నల్లమందును బ్రజలు విశేషముగాఁ గొనుటచేతను దానితో చీనాదేశపుసరుకులకు వినిమయము లేకపోవుటచేతను, చీనాదేశమందలి వెండినాణె మమితముగ వ్యయపడి పరదేశమునకుఁ బోవుచుండెను. దొరతనము వారానష్టముంగనుంగొని నల్లమందువర్తకమాటంక పెట్టుటకు

యత్నించుచుండిరి. చియాంచింగు చక్రవర్తికదివఱలో మహాజర్నామాయియ్యఁబడియుండెను. నల్లమందువలనఁ గొడరు చెడుగులనాయర్జిలో విశదంబుగఁ దెలియజేయఁబడెను. ఆవర్తకమును నివారించుటకు దొరతనమువారికి శక్యముకాకుండెను. ఏలయన సర్వజనులు నల్లమందు పొగద్రాఁగుటయం దాసక్తిఁగలవారయిరి. నల్లమందు గసగసాల గింజలవల్ల చేయబడునుగనుక యాచెట్లను బహుప్రదేశములయందుఁ బయరు చేయుచుండిరి.

యూనాన్ పరగణాలయందు సాలు 1 కి 7000 డచ్చాలనల్లమందు సిద్ధమగుచుండెను. నల్లమందు బహుకాలమునుండి పొగద్రాఁగుచుండినను చీనావారికి దానివలనిచెఱుపులు గలిగినట్లుకనుపించలేదు. చియాంచింగు చక్రవర్తి నల్లమందువర్తకము నంగీకరించెను. అందువలన సుంకము వసూలుచేయఁబడుచుండెను.

పిమ్మటఁ గొంతకాలమునకు నల్లమందువర్తకము దొరతనమువారు నిషేధించిరికాని చాటునోమాటునో యావర్తకముప్రబలమున జరుగుచునే యుండెను. ఆనిషేధము నాధారముచేసికొని, చీనాదొరతనము వారియుద్యోగులు చాటువర్తకులను బెదరించి యదలించి తమసంచులు నింపుకొనసాగిరి. ఉద్యోగులు ప్రజలు నందఱు నల్లమందువర్తకమును ప్రోత్సాహపఱచువారే యైరి. కాఁబట్టి చక్రవర్తియొక్క నిషేధపుచట్టములును ఆయనయాజ్ఞలును గాలికిఁబోవుచుండెను.

## లార్డునేపియరునందు లేనితప్పుఘటించుట.

స్వదేశవర్తకులు నల్లమందువర్తకము చేయకుండ వారినాపుటకు చీనాదొరతనమువారసమర్థులగుచు కాంటన్ నగరమందు విదేశీయులన్యాయవాణిజ్యము చాలింపవలసినదని యాజ్ఞాపించి యందునకు గారణములార్డునేపియరు స్వతంత్రించి "కాంటన్" నగరమునకుఁబోవుటయే యని ప్రతిపాదించిరి. అట్లాయనను నిందించి యాయనను ఆయనపరిజనమును ఖయిదుచేసినట్లు కాంటన్ నగరమునుండి వెలువడి రాకుండఁజేసిరి. వారిసేవకులు వారిని విడిచి పోవునట్లును బడవవాండ్రు పలుకకుండునట్లును జేసిరి. విదేశానాగరికుల కొఱకుఁ గొన్నిచట్టములు చేయఁబడెను. చీనాదేశీయులు తాము స్వర్గవాసు

లమనియు తమ రాజ్యము స్వర్గ రాజ్యమనియు విదేశీయు లనాగరిక జనమనియుఁ భావించెదరని చదువరులు గ్రహింపవలెను. ఆచట్టములలో నొకటి చీనాదేశ తీరములయందు విదేశీయుల యుద్ధనావలాడఁగూడదనియు, రెండవది విదేశీయు లాయుధసామగ్రుల నొకచోట నుండి మఱియొకచోటికిఁ గొనిపోఁగూడదని యు, తమయోఁదువాండ్రను, నావికులను చీనాదేశములలోనికి దౌర్జన్యముగఁ దీసి కొనిరా వలను పడదనియు నిషేధించెను. అందుమీఁదట లార్డు నేపియరు చీనావర్తకులకు బాహాటమైన లిఖితమువలన నిట్లు తెలియఁజేసెను.

"అన్యోన్య దేశాభివృద్ధింగోరి యాంగ్లేయవర్తకులు చీనాదేశమందంత ట వాణిజ్యము చేయ నిశ్చయించుకొనయున్నారు. ఉభయదేశములకును లాభముచేకూఱుదనుక వారు తమపూనికను సడలించు వారు కారు. మీ రాజప్ర తినిధికి నదీవేగప్రవాహమును నిరోధించుట యెంతయసాధ్యమో చక్రవర్తియొ క్క యవ్యక్తములయిన యాజ్ఞలను జెల్లించుట యంతయసాధ్యమే యని తెలి సికొనుఁడు."

## లార్డు నేపియరుయొక్క మరణము.

వ్యవహారము లంత చిక్కగను ఆ వేళకరముగనుడంగ "లార్డు నేపియరు" వ్యాధిగ్రస్తుడై మరణమొందెను. కాంటన్ నగరమందున్న యాంగ్లేయవర్తకులు చీనాదేశమందు వర్తకమంతటను విరివిగా జేసికొనునట్లును చీనాదేశవర్తకులను దమకును వాణిజ్యనిబంధనలు సమముగనుండునట్లును జేయుటకు తగినయత్న ములు చేయుఁడని ప్రార్థించుచు స్వదేశాధిపతికి వ్రాసికొనిరి.

అంతట నాంగ్లేయరాజు లార్డు నేపీరుస్థానమునకు "కెప్టెన్ ఎలియెట్" (Captain Eliot) ను నియమించిపంపెను. ఆయన లార్డు నేపీరువలె స్వతం త్రముగ కాంటన్ నగరమునకు వెళ్లక "మెకయో" (Mecao) ద్వీపముచేరఁ గానె కాంటన్ నగరము బ్రవేశించుటకిచ్చటిగవర్నరు యొక్క యంగీకారము నువేడెను. ఆగవర్నరంగీకారమిచ్చెనుగాని యాయన నొక పెద్దవర్తకునిగ భా వించెనేకాని గొప్పయాంగ్లేయోద్యోగిగఁదలంపలేదు. ఆయన తమకుఁ జెప్పఁద లఁచినది యజీన్ మూలకముగఁ దెలియఁబఱచుకొనవలసినదనియు, సమానుని

వలెఁ దమ కుత్తరములు వ్రాయఁగూడదనియు చీనాదొరతనమువారు చెప్పిరి అందుకు "కెప్టెన్ ఎలియట్" సమ్మతింపక కాంటనునగరమందున తానుండినను బ్రయోజనములేదని "మెకయో" కు మరలి వెళ్లెను. వర్తకమాపివేయఁబడెను. కాంటన్ నగరమందుండఁగోరిన యాంగ్లేయు లస్వతంత్రులయి యూఱక యుండిరి.

## నల్లమందు వర్తకమును గుఱించి వివాదములు.

ఆకాలంబుననే పికిన్ గెజటియందు నల్లమందువర్తకమును గుఱించి ప్రబలవివాదలు ప్రకటింపఁబడెను. నల్లమందువర్తకము చేయఁగూడదని యెన్నియుత్తరువులు చేసినను వినియోగింపనందున దానినంగీకరించి దొరతనము వారు స్వయముగా నావర్తకమును నడిపించిన యెడల రాజ్యమునకు విశేషద్రవ్యదాయకమగునని వ్యవహారదక్షులయిన యచ్చటి యుద్యోగులు కొందఱు వాదించిరి. నల్లమందువలన బలుతెఱంగులయిన చెఱుపులు సంభవించుననియు చీనాదేశీయుల తెలివితేటల దానివలన మట్టుపఱచి తమరు చినారాజ్యమును వశపఱచుకొనుటకై యాంగ్లేయవర్తకులా మత్తుద్రవ్యమును దేశములోఁ బ్రవేశపెట్టిరనియు, గాఁబట్టి యావర్తకమూఁచ ముట్టుగ నశింపజేయవలయుననియు రెండవకక్షివారు ప్రతిపాదించిరి. పడమటి దేశీయు లీదేశమునకు రాసాఁగినారు. వానితో ముందుకాలమందు చీనాదేశీయులకుఁగలహములును యుద్ధములును చీనారాజ్యమున కుపద్రవమును సంభవింపగలవని కాంగిషి చక్రవర్తి మున్నెపలికియుండెను. అది పైనఁజెప్పిన రెండవకక్షివారి ప్రతివాద వచనముల కనుకూలించియే యుండెను.

ఈరెండవకక్షివారి వాదము సహేతుకముగానే యున్నదనియింగ్లాండు దేశమందుగొందఱు ప్రముఖులుకూడ వాదించిరి. కానియీదిగువ కారణములతో నాంగ్లేయవిచారణ సభలయందది పూర్వపక్షము చేయఁబడెను.

(1) ఆంగ్లీయులవర్తకముకొఱకుఁ జినాదేశమునకుఁబోవుటకుఁబూర్వమే యీదేశమునందు నల్లమందులుగ్రాగుటవాడుకలోనున్నది.

(2) చినాదేశమందు నల్లమందుపైరుఅధికముగా జేయఁబడుచున్నది.

(3) నల్లమందు మితముగా నుపయోగింపఁబడిన యెడలఁ జెఱుపు చేయదు.

ఈవిషయమై యాంగ్లేయ చరిత్ర కారుఁడిట్లు వ్రాసెను. విదేశీయులఁ తమదేశమందుండుట కిష్టపడక నల్లమందువర్తకము తమకుహానికరమని చీనాదొరతనమువారొక నెపము కల్పించిరి. నల్లమందుమీఁదఁ బ్రజలు నుద్యోగులును బ్రబలాపేక్షగలవారై యుండుటచే దేశీయవర్తకులు నల్లమందు వర్తకము సమృద్ధిగఁ జేయుచుండిరి. అదిగాక కాంటన్ గవర్నరానగరమందు నల్లమందు వర్తకము చేయవలదని చండశాసనంబు ప్రవర్తింపఁ జేయుచుండఁగా ఆయన కుమారుఁడే యావర్తకమును విరివిగనొనర్చుచుండె. ఆయన తనపుత్రునె నిరోధింపఁజాలఁడయ్యె. చక్రవర్తితనూజుఁడే నల్లమందు పొగద్రాగుచుండెను. చక్రవర్తి తనకోపానలమును విదేశీయులపైఁ గురిపించుటకంటెను నిషేధశాసనములను నిరంతరమును బ్రకటించుచుండుటకంటెను దనకుమారుని యలవాటు మాన్పించినయెడల నెంతయు లాభకారిగానుండియుండును. అయినను నల్లమందుపొగఁ ద్రాగుటవలన చీనావర్తకుల తెలివి తేటలకేమియుఁ గొఅంతకలుగలేదు. పండితుల సామర్థ్యము క్షీణింపలేదు. వృత్తికారుల పరిశ్రమలు సుక్కియుండను లేదు."

వివాదనివారణార్థము చక్రవర్తి కమిషనరును బంపుట.

కాఁబట్టి నల్లమందు వర్తకము కూడదని వాదించుకక్షీవారి వాదము పైని నుడువఁబడిన విషయములవలన నిర్హేతుకముగాఁ గన్పట్టుచుండెను. అయినను చక్రవర్తి కాంటన్ నగరమందలి యావివాదాంశములఁ బరిష్కరించుటకై "లిన్" అనుకమిషనరును బంపెను. ఆయన మహోద్రేకముతో కాంటన్ నగరమునకుఁబోయి వారివద్దనున్న, నల్లమందు డబ్బీలను దనవశము చేయవలయునని ఖండితమైన యుత్తరువు విదేశీయవర్తకులకుఁబంపెను. ఆయుత్తరువధర్మమైనదైనను చీనాదొరతనమువారు బలవంతులగుటచే, 1000 బరిణెలను వర్తకులు కమిషనరు వశముచేసిరి. అంతటితో సంతుష్టిఁ జెందక యచ్చటి యాంగ్లేయవర్తకులలో ముఖ్యుఁడయిన "డెంటు" అను నాతనిని దనకుఁగలసికొని మాటలాడుమని యుత్తరువుచేసెను. తనకాయుద్రోహము కావించుననియెంచి యాయన పోక

నిరాకరించెను. చీనాదొరతనమువారికి నాంగ్లేయులకును సఖ్యత యటుల దుర్ఘటముగనుండఁగ నెటులనైన నొడంబడిక గలుగఁజేయుటకై 'కప్టెన్ యెలియట్' కాంటన్ నగరమునకుఁ బోయెను. ఆయన రాకఁ జూచి చీనావారు తమ మనంబు లెఱియ నాంగ్లేయుల వర్తకస్థానముల ముట్టడించి బయలివారితో వారికి సంబంధము లేకుండుటకై దారులరికట్టి బిట్టుగఁ జెట్టనొనర్పం దొడగిరి. ధైర్యసాహసములలోఁ గొఱంతగల "కప్టెన్ యెలియట్టు" ఆకమిషనరునకు లోఁబడి యాంగ్లేయవర్తకులు తమయొద్దనున్న నల్లమందు బరిణెలన్నియు నాకమిషనరుకు నప్పగింపవలసినదని యుత్తరువుచేసెను. ఆయన లోఁబడుట కనుంగొని యాకమిషనరాంగ్లేయులు తమవద్దనున్న నల్లమందులో నాల్గవవంతు తనవశముచేసిన యెడల వారిని విడిచిపెట్టి పొమ్మని యంతకుమున్ను తాను తఱిమివేసియున్న నవుకరులను మఱల వారియొద్దకు రానిచ్చెదననియు, సగముమందు తనవశమందుంచిన యెడల ప్రయాణపు పడవల నాడనిచ్చెదననియు, మూఁడువంతులు తనపరము చేసినచో నాంగ్లేయులు మఱల వర్తకము చేసికొనుట కంగీకరించెదననియు, నట్లొనర్చుటకు మూఁడు దివసంబులు గడువనియు నట్లు చేయని పిమ్మట వారికి నెన్నియే నిబ్బందులు కలుగఁజేసెదననియు ఆకమిషనరు తెలియఁబఱిచెను.

## ఆంగ్లేయులు లోఁబడుట.

ఆనిర్బంధమును సహింపఁజాలక యాంగ్లేయవర్తకులు 20283 నల్లమందు బరిణెల నాకమిషనరు పరముచేసిరి. వంగినవారిని మఱియు వంగదీయుటకు చీనావారుల్లాసపడుదురఁట. అంతదనుక నాంగ్లేయులు లోఁబడఁగాఁ జీనాదేశమందాంగ్లేయులు నేరములు చేసిరేని ఆకమిషనరు తానె శిక్షించెదనని చెప్పుచు నాంగ్లేయనావికులకును చీనాజనులకును జరిగిన స్వల్పకలహములో చీనాజనులు ముగ్గురు వచ్చియుండఁగా ఆనావికులను బట్టి యిమ్మని యాకమిషనరు కోరెను. ఆంగ్లేయులు నిరాకరించిరి. విదేశీయులతో యుద్ధము చేయుట కాకమిషనరు తన ప్రజలను బురికొల్పెను కావున 1839సం. నవంబరు 3 తేదిని "చ్వాంపి" (Chwampi) అనుచోట నావికాయుద్ధము జరుగఁగా చీనావారి పడవలు కొన్ని ముంచివేయఁబడినవి.

పైనిఁ జెప్పఁబడిన కమిషనరు చీనారాజ్యమునకు దైవానుగ్రహము కలదనియు,దానికిఁ జేటొనరించు వారిని దేవుఁడే నాశముచేయునని దానెఱుఁగుదుననియు జనులకుఁ బ్రకటముగఁ దెలియఁజేసెను. ఆకమిషనరుయొక్క దార్ఢ్య ప్రవర్తనమున చీనావారి కపజయములు కలుగుటయేకాక నల్లమందు వర్తకము మునుపటికంటె బ్రబలమయ్యెను.

## ఆంగ్లేయులయుద్ధ వ్యాపారములు జయములు.

**1841** సం. వేసవియందు "సర్ గార్డను బ్రిమరు" (Sir Gordon Bremer) అను నాంగ్లేయ సేనాని కాంటన్ నగరమును ముట్టడించి టుంగాయి" నగరముపైకిఁబోఁగా నచ్చట చీనా సేనకొంచెమెదిరించి పోరి పాఱిపోయెను. అంతట నాయన పీహోనదీ ముఖద్వారమునకుఁబోయెను. అచ్చటకు సమీపముననుండు పికిన్ రాజధానిపైకిఁ బోసుంకించి యుండఁగా ఆంగ్లేయ సేనానాయకుఁడుగా నుండిన "కెప్టెన్ యెలియటు"ను "చిహ్లీ" పరగణాపరిపాలకుఁడైన "కిసెన్" అనుమందారినుఁడు కలసికొనెను. మందారినుఁడనఁగా చీనాదొరతనములో నొకగొప్పయధికారి. తూర్పురాజ్యముల యందు గొప్పయధికారపదంబున నుండు వారి జీవితము నూతియొడ్డు బిడ్డవలె నుండునని పాశ్చాత్యులు దలఁచిరి. పైనిఁజెప్పఁబడిన "కిసెన్" చిన్నయుద్యోగములనుండి క్రమక్రమంబుగ వృద్ధియయి గొప్పయుద్యోగి యయ్యెను. వక్ష్యమాణరీతిగ 'లిన్' ఆంగ్లేయులచేఁ బరాభవము నొందగ 'కిసెన్' ను ఆతని స్థానమునకు చక్రవర్తి నియమించెను. కాని యాతఁడును కాంటన్ నగరవివాదములఁ ముందుచెప్పఁబోవురీతిని బరిష్కరింపఁజాలడయ్యె. కావున నాతనిపైఁ జక్రవర్తి యపరిమిత కోపముఁబూని యేమోవిచారణచేసి బహుదూరమున నున్న 'యిలి' పరగణాలోఁ గఠినవరకముచేయుమని దండన విధించుటయె కాక యతని యాస్తినంతయు దనవశము చేసికొనెను. ఇది మిగులఁ బరితాపకరమయినవిషయము. పీహోముఖద్వారమునను నాంగ్లేయనావికా సైన్యముపోఁగా చీనా చక్రవర్తికి భీతిగలుగుట యెఱింగి "కెప్టెన్ యెలియటు" ను మఱలి పొమ్మని "కిసెన్" సరసముగఁ గోరి యుండుటచే నాయన కాంటన్ నగరమునకు మఱల వెళ్లి వ్యవహారములఁ జక్కఁబఱచుటకు యత్నించెను. కాని యచ్చటి వ్యా

V. Rao V. Subba Rao - V. S. Subba Rao

వహారములు మఱియు దుస్థితిలోనికిం బోవుచుండె. లిన్ యుద్ధప్రయత్నము లు చేయుచుండెను. ఆంగ్లేయులు "మెకాయొ" వద్ద చీనావారి సైన్యము నోడించిరి. వ్యవహారములు చక్కబడక పోగా నపజయములు కలుగుటంజూచి చక్రవర్తి "లిన్" కు నిటులవ్రాసెను.

"నీవాడంబర వచనములం బల్కి మమ్ముల మోసపుచ్చినావు. నీవు పోయి వ్యవహారముల నేమియు సమర్థింపలేక పోగా గలహ సముద్రతరంగముల బెంపొనరించితివి. అంతములేని యక్రమముల నెన్నియో యంకురింపంజేసితివి. కర్తవ్యాంశ మెఱుంగక నిజముగ నీవిప్పుడు బద్ధహస్తుండవుగ నున్నావు. దారుప్రతిమకును నీకును భేదము కానంబడదు.

చీనాచక్రవర్తి తానాంగ్లేయులతో నెడంబడిక చేసికొనుట కగత్యముక గలిగి యున్నను తనఘనతయుం బరాక్రమమును గోలుపడునని తలంచుచుండెను. కాని ఆంగ్లేయులు కాంటన్ నగరమునకు పీహోనదీ ముఖద్వారమునుండి మఱలి దక్షిణముగం బోవుచు మార్గమందున్న యనేక దుర్గముల వశపఱచుకొనుటను "కిసెన్" చూచి వారితో సంధికావించుకొనెను. సంధి నిబంధనలేమనగా,

ఉ

## సంధినిబంధనలు.

1 "హాంకాంగు" ద్వీపమాంగ్లేయులకిచ్చి వేయవలెననియు

2 చీనాదొరతనమువారు నష్టపఱచిన నల్లమందునకు మాఱుగ 6000000 డాలరుల నాణెములు చెల్లింపవలెననియు

3 ఆంగ్లేయులు చీనాదొరతనము వారితో సమానస్కంధముగా నుత్తర ప్రత్యుత్తరములు జరుపవచ్చుననియు

4 కాంటన్ నగరమందు యథాప్రకారముగా నాంగ్లేయులు వర్తకము చేసికొనవచ్చుననియు

5 పైనజెప్పంబడిన నిబంధనలు చెల్లినయెడల "చుసాను" ద్వీపమును "చ్వాంపి" దుర్గమును చీనాదొరతనమువారి కాంగ్లేయు లిచ్చివేయవలెననియు, నింగుపో నగరమందుం జెఱసాలలోనున్న యాంగ్లేయులను విడుదలం జేయవలయుననియు

చెఱసాలలోనున్న యాంగ్లేయు లదృష్టవశమున నాయొడంబడిక ననుసరించి విడుదలఁజేయఁబడిన పిమ్మట చక్రవర్తి యాయొడంబడిక కాగితమును జింపివేయించెను. కాంటక్ నగరమందు విదేశీయులను చినాదొరతనము వారుపెట్టినశ్రమలును నిర్బంధములును మేరమీఱియుండెను వర్తకము బొత్తిగాఁ జాలింపఁబడెను.

విదేశీయుల నిర్మూలము కాపంపవలెనని నిశ్చయించుకొని ప్రచండ సైన్యమును కాంటక్ నగరము పైకిఁబంపి యాంగ్లేయ సేనానాయకులను బట్టియిచ్చినవారికి 50000 డాలరుల బహుమానము చేసెదనని చక్రవర్తి ప్రకటించెను. సౌమ్యముగా చినావారితో వ్యవహరించుట సంభవించినదని తలఁచి కెప్టెక్ యెలియాటు సేనలను సర్ గార్డను బ్రిమరుకు వశపఱచి యుద్ధకృత్యములు నీయిష్టము చొప్పునఁ జేయుమని చెప్పెను. ఆయన బోగ్యదుర్గముల యొద్దనున్న 3000 కావలి సైన్యమును జయించి యాదుర్గములను వశపఱచుకొని తిత్వరిసరదుర్గములను లోఁబఱచుకొనుచుండెను.

## చీనావారు సంధిఁగోరుచు యుద్ధప్రయత్నములు చేయుచుండుట.

ఆశీఘ్రజయంబులఁజూచి చినావారు వెఱఁగొంది సంధికేవలమును ఆంగ్లేయులకుఁ జూపి మూఁడుదినంబుల యవధిఁగోరిరి కాని సంధిచేసికొనరైరి. ఆంగ్లేయులు కొన్నికోటల మఱల ముట్టడించి విజయులైరి. పిమ్మట కాంటక్ నగరమందు వర్తకము నిరాటంకముగాఁ జేసికొనవచ్చునని యొడంబడిక చేసికొనఁబడెను. సంధిచేసికొనుట కాంగ్లేయులిచ్చిన యవకాశములో చినాదొరతనము వారు ప్రబలయుద్ధమునకై సన్నద్ధులగుచుండిరి.

**1841** సం. మేయినెల 15 తేదీని కాంటక్ నగరపరిసరమందు 50000 చినాసైన్యమాయత్తమయి యుండెను. వ్యవహారములయందు కెప్టెక్ యెలియాటు నకనుకూలుండుగనుండిన "కిసెక్" తన చక్రవర్తియొక్క యాజ్ఞానుసారముగ ఆసేనకధిపతియై యాంగ్లేయులతోఁ బోరందొడంగెను. చినావారు ప్రథమమున గొంతవట్టున కెదిరించి పిమ్మట సంధికావించుకొనిరి. సంధి నిబంధనమేమనఁగా.

1 కాంటక్ నగరము నాంగ్లేయులు వదిలిపెట్టినయెడల వారికి 3600000 డాలరులు చినాదొరతనము వారీయవలయు.

2 ఆంగ్లేయుల వర్తకశాలలనుండి కొల్లపెట్టఁబడిన సరుకులకుఁగాను నష్టపూర్తి చేయవలయును.

3 చినాసైన్యము కాంటక్ నగరమును విడిచిపోవలయు.

4 ఆంగ్లేయుల నిర్మూలంబు చేసెదమని వచ్చిన చినాదొరతనము వారి కమిషనర్లు మువ్వురును దమసైన్యములతో కాంటక్ నగరమునుండి 60 మైళ్లదనుక వెడలిపోవలయును.

## ఇంగ్లాండునుండి నూతనమంత్రి వచ్చుట.

చీనాదొరతనమువారితో శాశ్వత సంధికావించుకొని సమాన స్కంధముగా వ్యవహరింపవలెనని భావించి "సర్ హెన్రిపాటింగరు"ను మంత్రిగాను సర్ విలియము పార్కరును సేనానిగాను నియమించి తగుసైన్యముతో చినా దేశమునకు ఆంగ్లేయరాజుపంపెను. వారు ఇగ్లాండు దేశమునుండి 1842 సం. ఆగస్టు 21 తేదీని బయలుదేరిరి. వారు చినాదేశమునకు వచ్చుచునే "ఏమాయి" నగరమును వశపఱచుకొని పిమ్మట టింగాయి మొదలయిన నగరములలోఁబఱచుకొనిరి. తదనంతరము నాన్కిక్ పట్టణమునకు సమీపమందున్న చింకియాంగు కోటను నాంగ్లేయులు ముట్టడించిరి. అచ్చట ఘోరయుద్ధము ప్రవర్తిల్లెను. ఆకోట దుర్గములచేత నగడ్తలచేత సురక్షితముగ నుండెను. అచ్చట 1200 మంచూరిగూ సేనలు 800 మంగోలియనులు, అంతమందియే చినావారునుండిరి. కోటగోడలకు రంధ్రములు చేయ వలనుపడనందున నిచ్చెనలు వేసికొని యాంగ్లేయులు కోటపైకెక్కుటఁ జూచి యారక్షకసైన్యము భీతిఁ జెంది చెదరిపోయిరి. వారిలో ననేకుల నాంగ్లేయులు వధించిరి. కొందఱాత్మహత్యకావించుకొనిరి. రణరంగము పీనుఁగుపెంటలతో నిండెను. కొందఱు బావులలోఁబడిరి. శత్రువశమయి పోదురని తమతమ కుటుంబములను చినాసైనికులు స్వహస్తములతో హతము చేసికొనిరి.

అనంతర మాంగ్లేయులు నాక్కిక్ నగరము ముట్టడింపఁ బోయిరి. అచ్చటి గవర్నరయిన "న్యూకియక్ (Nieu Kien) తనగొంతులో నూ

సేరి యుండుదనుక దానిని గాపాడెదనని ప్రతిజ్ఞ పట్టెను కాని యాంగ్లేయుల యుద్ధనావలు సమీపింపఁగానే మనసును మార్చుకొనెను.

చీనాచక్రవర్తి యాంగ్లేయుల యనివార్యజయంబులంజూచి వారితో సఖ్యంబేముఖ్యంబని యెంచి వారితో నొడంబడిక జేయుటకై ముగ్గుర కమిషనర్ల కధికారమిచ్చెను. ఆముగ్గురలో "ఇల్లిపు" అను కమిషన రాంగ్లేయులకుపకారిగానుండి యుండెను. కావున నాంగ్లేయ మంత్రి సంధికొడంబడెను. అంతట నేర్పఁబడిన సంధి నిబంధనలేమనగా,

1 ఏమాయి (Amoy) ఫూచౌఫూ (FoochowFoo) నింగ్పో (Ningpo) షాంఘాయి (Shanghai) ఈనగరములయందుని రాటంకముగా నాంగ్లేయులు వర్తకము చేసికొనవచ్చును.

2 హాంకాంగు (Hong kong) దీనిని శాశ్వతముగా నాంగ్లేయుల కీయఁబడవలెను.

3 ఆంగ్లేయులకు 21000000 డాలరులును,

4 కాంటన్ నగరమందు లిన్ పాడుచేసిన నల్లమందునకు గాను, 3000000 డాలరులును,

5 ఆంగ్లేయుల కీయవలసిన బాకీలకుగాను 3000000 డాలరులును,

6 యుద్ధవ్యయముల కొఱకు 1200000 డాలరులును చీనాదొరతనము వారాంగ్లేయుల కీయవలయును.

## చీనావారి ద్వేషభావము.

ఈయొడంబడికమీఁద 1842 సం. ఆగస్టు 29 తేదిని చక్రవర్తి సంతకముచేసెను. చీనాదొరతనము వారాంగ్లేయులతో ననుకూలముగ నుండఁదలఁచినట్లాయొడంబడిక వలనఁ గన్పట్టినను వారిని దమదేశమునుండి వెడలఁ గొట్టవలె ననెడి యభిప్రాయమును దెల్లము చేయుచునే యుండిరి. చీనాతీరమందుగాక దేశమధ్యమందలి నదులమీఁద నాంగ్లేయ పడవలుండుటకు వలనుపడదనియు సెప్టెంబరు 14 వ తేది నాఁటికి ననాగరికులయిన యాంగ్లేయుల పడవ లచ్చటనుండి తీసికొనిపోవలెననియు చక్రవర్తి ప్రగల్భముగా నాజ్ఞాపించెను. పిమ్మట నాతేది నతిక్రమించి యాంగ్లేయులు అక్టోబరు నెలచివఱ నాపడవలం

గొంపోయిరి. ఆయొడంబడిక ప్రకారము చీనాదొరతనము వారాంగ్లేయులకుఁ జెల్లింపవలసిన సొమ్మునకు గుదువగా "చుసాన్" (Chusan) ద్వీపము నాంగ్లేయు లుంచుకొనిరి.

చీనాదేశము బహువిస్తీర్ణమై యుండుటచే నొకప్రదేశమందలి వ్యవహారములు మఱియొక ప్రదేశమందుండువారికి తెలియకపడవు. కాఁబట్టి యాదేశముయొక్క మధ్యభాగమం దాంగ్లేయులుపడసిన జయములు నుదుదకు జరగబడిన యొడంబడికయును 'కాంటన్' (Canton) నగరమందలి వారికి నేమియుఁ బట్టియుండవయ్యెను. అచ్చట నెప్పటివలెనే కలహములు జరుగుచుండెను. ఆనగరాధికారు లాంగ్లేయులను వెడలఁగొట్టుటకై ప్రయత్నములు చేయుచుండిరి. కాని చీనాచక్రవర్తి యచ్చట నెమ్మదిని గలుగఁజేయుటకై 'ఇలిపు' (Ilipu) అను కమిషనరును బంపెను. ఆయన యాంగ్లేయుల సమర్థమైన యుద్ధవ్యాపారములను దెలిసికొనినవాఁడై యాప్రదేశాధికారులకు నిట్లు త్తరువుచేసెను.

"ఆంగ్లేయులతో చీనాదొరతనము వారుచేసికొనిన యొడంబడికను బట్టి యాంగ్లేయు లీదేశమందు నెమ్మదిగ వర్తకవ్యాపారము చేసికొనుచుండు నట్టుకు చీనాదేశీయులు వారికేమియును దొందరఁ గలుగఁజేయఁగూడదు."

## ఫార్మోజా ద్వీపవాసుల యక్రమములు.

'ఫార్మోజా' (Formosa) ద్వీపమందుండు చీనావారు విదేశీయులయెడల ద్వేషముకలవారై యాంగ్లేయనావికులను వందమందిని క్రూరముగ క్రమందించిరని యాంగ్లేయసేనానికిఁ దెలిసి చీనాదొరతనమువారిని గఠినముగ మందలింపఁగా నేరస్థులను విచారించుటకై యొకకమిషనరును చక్రవర్తి పంపెను. ఆయన యచ్చటి యధికారు లావధకుఁ గారకులని నిశ్చయించి శిక్షార్థము రాజధానికిఁ బంపివేసెను.

ఒడంబడిక సంపూర్తియగుటంజేసి యాంగ్లేయుల వాణిజ్యమునకుఁ దగు నిబంధనలను ఆంగ్లేయరాజప్రతినిధి యేర్పాటుజేసి 1843 సం. లో నింగ్లాండునకు వెడలిపోయెను. ఆయనస్థానమునకు "సర్ జాన్ డేవిస్" (Sir John Davi's) వచ్చెను.

కాంటన్ నగరమందు విదేశీయ ద్వేషాంకురము నశింపనే లేదు. ఆంగ్లేయులకు దత్ప్రదేశవాసులు తొందరలను గలుగఁజేయుచునే యుండఁగా చీనాదొరతనమువారు వారియల్లరులను నివారించిరి.

చీనా దొరతనమువారు ఆంగ్లేయులతో నొడంబడికఁ జేసికొనుటనెఱింగి ఫ్రాన్సు దేశపుమంత్రియు, అమెరికాదేశపు మంత్రియు, కాంటన్ నగరమునకు వచ్చి తాము కూడ చీనాదేశమందు వాణిజ్యము చేసికొనుటకై యీదొరతనమువారితో నొడంబడికలు కావించుకొనిరి. ఆసమయమందే రోమన్ కాతోలిక్ మతాచార్యుఁడొకాయనవచ్చి పూర్వమందు చీనాదేశములో మూర్ఖజనులు నాశమొనరించిన దేవాలయములను నిండ్లను మఱలఁ గట్టుకొనుటకు చక్రవర్తియొక్క యంగీకారమును వేఁడఁగా దన్మతాభివృద్ధిఁ జేయకుండు నిబంధనమీఁద యంగీకారమొసఁగెను.

## కలహ సంఘములు.

చీనాదొరతనమువారు విదేశీయులతోఁ బోరి పరాజితులైనప్పుడా దేశమందలి యల్లరిజనము దొరతనమువారసమర్థులనియెంచి కలహింపఁబూనుట యాచారమైయున్నది. ఆయల్లరిజనము రహస్యసంఘములుగా నేర్పడి యుండుటఁజూచి మున్నుచియన్ లుంగ్ చక్రవర్తి తనపరాక్రమంబుచే నివారించియుండెను. 1842 సం. రములోజరుగఁబడిన యుద్ధమున కనంతరమారహస్యసంఘములు నానాటికిఁ బ్రబలి రాజ్యమున కపాయకరంబుగ నుండెను. ఆ సంఘములలో "ట్రియడ్" (Triad) సంఘమొకటి. ఇదియే ముందుజెప్పఁబోవు 'టాయిపింగ్' (Taiping) కలహజనకంబై యుండెను. ఈ సంఘమునుజూచి యుత్తరచీనాయందు నకాలంబుననే 'వైట్ లిలీ' (white Lily) అను మఱియొక రహస్యసంఘమంకురించి ప్రబలెను. చీనాకు దూరప్రదేశమైన 'కాష్గేరియా' (Kashgaria) యందున్న మహమ్మదీయులు కలహింపఁబూనిరి. అంతట చక్రవర్తి తనసైన్యములను బంపి కలహకారులనోడించి యల్లరుల నడంచెను. అప్పుడు చీనాసేనలు విల్లునమ్ములను ధరించియే జయమొందెను. కాఁబట్టి కలహకారులెంత యసమర్థులో చదువరులే యూ

హింపఁగలరు. చక్రవర్తియొక్క బలపరాక్రమములాజయములచే దత్ప్రదేశవాసుల కతిభయం బొనరించెననుటకు "కాష్గేరియా" యందు నివసించు 12000 కుటుంబములాయన యాజ్ఞాబద్ధులయి స్వదేశమును విడిచి 'ఇలి' (Ili) పరగణాకు వెడలిపోవుటయే దృష్టాంతమై యుండెను.

"కాంటన్" నగరమందు హత్యలు నల్లరులును జరుగుచునే యుండెను. ఆంగ్లేయులలోఁ గొందఱు తత్సమీపనగరమునకుఁ బోవుచుండగా వారిని చీనావారు హితము కావించిరి. అంతట నాంగ్లేయసేనానాయకుఁడు యుద్ధసన్నద్ధుఁడై మఱల చీనావారి కోటలను ముట్టడింపఁగా చీనా దొరతనమువారి కమిషనరయిన 'కియుంగు' వెఱగొంది యాంగ్లేయప్రతినిధి కోరిన నిబంధనలకు లోఁబడెను.

నిబంధనలేమనఁగా,

(1) 1847 సం. ఏప్రియలు 6 తేది మొదలుకొని రెండు వత్సరముల లోఁగా కాంటన్ నగరము విదేశీయవాణిజ్యమునకు నిరాటంకముగా చీనా దొరతనము వారంగీకరింపవలెననియు,

(2) కాంటన్ నగరపరిసరముం దాంగ్లేయులు యథేచ్ఛగా సంచరింపనీయవలెననియు,

(3) ఆంగ్లేయులకు దైవప్రార్థనామందిర మొకటి నిర్మింపఁబడవలెననియు,

(4) కాంటన్ నది కవలియొడ్డున గృహములను, ఆవరణలను నేర్పఱచుకొనుటకు సమ్మతింపవలెననియు,

## చీనావారు మిషనరీలను జంపుట.

పిమ్మట ముగ్గురు మిషనరీలు చీనావారిచే బాధింపఁబడఁగా చీనాదొరతనము వారి 14000 ధాన్యపు పడవలు రాజధానికిఁ బోకుండ నాంగ్లేయసేనాని యాటంకపఱచి నేరస్థులను దనకుఁబట్టి యివ్వమని నిరోధించెను. అంతట చీనాదొరతనము వారు నేరస్థులను తామే పట్టుకొని శిక్షించిరి. అంతటనుండి చీనావారు విదేశీయులతో సఖ్యముగానుండిరి.

"కాంటన్" గవర్నరైన 'యే' (yeh) యనువాఁడు శత్రుభయంకరుఁడై యాంగ్లేయులకు పదిపండ్రెండు వత్సరములనుండి విద్వేషియై బాధించుచుండెను. ఆతనియందు పరిపాలనా సామర్థ్యము లేశమైనను లేకుండెను. మఱియు నాతఁడు ప్రజలలో నొండొరుల కైకమత్యమే లేకుండఁజేసెను కాఁబట్టి యాతనిని ఖైదుచేసి యాంగ్లేయసేనాని కలకత్తానగరమునకుఁ బంపివేసెను. వాఁ డచ్చటనే మృతినొందెను. చీనాచక్రవర్తి యాతనిని తానే శిక్షింపక యాంగ్లేయుల వశమేలచేసెనో తెలియదు. ఆగవర్నరుయొక్క దుష్టపరిపాలనను బట్టి యోడదొంగలు చెలరేఁగి రేవుపట్టణములయందుండు వర్తకులకు మిగులఁ జెఱుపు చేయసాగిరి. ధనప్రాణముల కాశవదలుకొని వర్తకులు సముద్రయానము చేయవలసివచ్చెను. అదియటుండ "మెకయో" ద్వీపమునందు విదేశీయద్వేషము ప్రబలమై ఆంగ్లేయగవర్నరును వధింపఁజేసెను. అచ్చటిజనులు విదేశీయులను దమతీరమం దడుగుపెట్టనియ్యరైరి. దానికిఁదోడుగచక్రవర్తి జనులకందఱ కభిప్రాయ మెటులుండునో దేవుఁడు దానికనుకూలించియేయుండుననియు "క్వాంగ్‌టంగ్" (Kwangtong) ప్రదేశవాసులందరు నేకాభిప్రాయులైదమనగరములోనికి విదేశీయులను రానియ్యమని కృతనిశ్చయులైయుండఁగా వారి నిశ్చయమునకు వ్యతిరేకముగా నేనెట్లుశాసింపగలననియు నొక రాజశాసనమందులిఖించెను.'

ఈ వచనములచే? 'కాంటన్' నగరవాసులును దత్సమీపనగరవాసులును బురికొల్పఁబడి ఆంగ్లేయుల నాలుగుర నొకదినంబున క్రూరముగ వధించిరి. అంతట నాంగ్లేయులు మఱల యుద్ధసన్నద్ధులు గావలసియుండెనుగాని "కియింగ్" (Kying) అను కమీషనరు తత్కాలంబున నచ్చటనే యుండినందున ఆయన వెంటనే విచారణచేసి నేరస్థుల నుఱిదీయించెను.

## హాంగ్సియట్సువాన్ అను ప్రబల కలహనాయకుఁడు.

చీనాదేశస్థులు తమదేశప్రభుత్వవిషయమై తృప్తిఁజెందినవారుగ నొకప్పుడైన నుండరు. కావున కలహనాయకుఁ డొకఁడు బయలువెడలునేని వానింగూడి దొరతనమువారితోఁ గలహింపఁదొరకొందురు. "కాంటన్" నగరవా

సులు ప్రాయికముగా కలహకారులుగ నుండిరని గతంబున లిఖింపఁబడియే యున్నది కదా. అచ్చట హక్కా అనుకుటుంబమునందుఁ బుట్టినవాఁడొకఁడు కలహనాయకుఁడయి తలయెత్తెను. రాజభక్తియొక్కయభావమును బ్రకటించుటకును రాజ్యము నూటాడించుటకును వాఁడు తగినవాఁడై యుండెను. వానిపేరు "హంగ్ సియట్సువాన్" వాఁడు ధైర్యసాహసాదిలక్షణములు కల వాఁడై దొరతనము వహింపవలెనని తివురుచుండెను. వానికుటుంబమును చీనావారు ఛండాలకుటుంబముగ నెంచుచుండిరి. వాఁడు తనదేశమందలి యపభ్రంశభాషను జదువుకొని పండితుఁడననుకొని "కాంటన్" నగరవిద్యార్థి కారులయెదుట రెండుసార్లు పరీక్షయిచ్చి యోడిపోయెను. వాఁడానగరమందు 1833 సం. లో నొకక్రైస్తవ బోధకునివలన మతబోధ వినెనుగాని యది వాని మనస్సును సంస్కరింపలేదు. పిమ్మట నాల్గువత్సరములకు మఱల "కాంటన్" నగరమునకు వచ్చినప్పుడు ఆబోధకునివలననే మఱల బోధవిని తన గృహమునకు వెళ్లి ప్రబలవ్యాధి పీడితుండయ్యెను. ఆజాడ్యములో నొకప్పుడు సంధిగన్పించెను. దేవుఁడాసంధిలో ప్రత్యక్షమై వానిహస్తములో నొకఖడ్గముంచి యీప్రభుత్వము వారిని నిర్మూలముచేయుమనియు నీకు భవిష్యత్కాలమందుమహదౌన్నత్యము కలుగుననియు చెప్పిపోయెనఁట. నలుబదిదినములు వాఁడుసంధివశుఁడై యుండెను.పిమ్మట వాఁడారోగ్యముఁజెంది బలవంతుఁడై దేవునియాజ్ఞలఁజెల్లింప నిశ్చయించుకొనెను.

## దైవ సమాజము.

అదియంతయు సంధిదోషవికారమని చదువరు లెఱుఁగఁగలరు. అయినను మూర్ఖులట్టివి సత్యమనే నమ్మెదరు. కావున వాఁడు తాను నమ్మటయే కాక తనకుటుంబమును బొరుగువారిని క్రమక్రమముగ నమ్మించుటచేఁ గొందఱు వాని కనుచరులైరి.అంతట దైవసమాజమని వానిచే నొకసంఘ మేర్పఱుపఁబడెను. అంతట వాఁడును, వానియనుచరులును పైనిజెప్పఁబడిన 'ట్రియాడ్' (Triad)సంఘముతో చేరుకొని రాజోపద్రవము గావించుచుండఁగా దొరతనమువారు వెఱగంది యీయుపద్రవమును నివారించుటకై ముప్పురకనీపన

ర్లనుబంపిరి. కలహకారులతో వ్యవహరించుటకై సర్వాధికారమును వారికొ సంగియుండినను వారు దుష్టచిత్తులగుటంజేసి శత్రువుయొక్క తెరవునకుం బోక మౌనముగనుండిరి. కావున "హంగ్" (Hung) యొక్క సేనలు విజృంభించి విగ్రహారాధనమునకువిరోధులుకూడ నగుటంజేసి తత్ప్రాంతములయందున్న బౌద్ధదేవాలయములనుబడఁగొట్టి విగ్రహములం బెల్లగించివేసిరి.

అటుల మతవిరోధకృత్యంబులఁ బెల్లుగ కలహకారు లొనరించుచుండ వారిలక్ష్యము చక్రవర్తిని దలక్రిందుచేయునంతటి యద్భుతకృత్యమునకై తిరిగెను. అంతట రాజ్యమందలి యనేకకోటలను పట్టణములను వారు ముట్టడించి వశపఱచుకొనిరి. అప్పటి రాజ్యస్థితినిగుఱించి "కాంటన్" నగరమందలి యొకయుద్యోగి చక్రవర్తి కిట్లు తెలియఁజేసెను.

"దేశము నందంతట కలహకారులు పుడమియీనినట్లు బయలువెడలిరి. మావద్ద ద్రవ్యోపపత్తి దాదాపుగఁ దుదముట్టెను. మాసేన లల్పముగనున్నవి. మాయుద్యోగు లొకరిమాటయొకరికి దెలియకుండ నుండిరి.కాఁబట్టి దొరతనము సమగ్రముగ నుండలేదు.మఱియు బండెడుకట్టెలు తగలఁబడుచుండఁగ చిన్నగిన్నెడు నీళ్లతోఁ జల్లార్పఁబోవు నట్లువ్యక్తముగ మాసేనానాయకుఁడు వ్యవహరించుచున్నాఁడు. గొప్ప యాపదసంభవించుననియు మనప్రజలే మనపైఁ దిరుగఁబడుదురనియు మనసేవకులు మనను విడిచిపోదురనియు నేను భయమొందుచున్నాను."

అల్లరిజనంబు "హంగు" తోఁ జేరుట.

"హంగ్" (Hung) అట్లనేకజయముల నొందుటచే నల్లరిజనం బపరిమితముగ వానిసేనలోఁ జేరిరి. వా రట్లుచేరుట దేశమును గొల్లబెట్టవచ్చుననియేకాని వానికి రాజ్యము సంపాదింపవలెనని కాదని యూహింపఁదగియున్నది. తనవెంటనున్న దోఁపిడికాండ్ర తనివిఁదీర్చుటకై వాఁడు నిరంతరము నూతనగ్రామములను బట్టణములను ముట్టడించి కొల్లపెట్టుచుండెను. వాఁడు "సియాంగ్" తీరమందు సురక్షితముగనుండని పట్టణములను వశపరచుకొనెను. అంతవఱకు చీనాసైన్యమువల్ల వాఁడెదిరింపఁబడియుండలేదు. ప్రభుత్వమువారిశౌర్యధైర్యంబు లేమయ్యెనో తెలియదు.

కుదను "ఛాంఘా" అను చీనాసేనాని యొక్కఁడు రాజధానిని శత్రువుల వశముకాకుండ సంరక్షించెను. అతనితోఁ బోరలేక యామూకలు మరలి యావలం గొన్ని పట్టణములను కలహకారులు వశపఱచుకొనిరి.

పిమ్మట "హంగ్" తనకుఁ గలిగిన విజయంబునుఁబట్టి దేవునివాక్యంబులు సత్యమని నమ్మి "స్వర్గముయొక్క తీర్పులు" అను పేరితో నొకగ్రంథము ప్రచురించెను. నిష్పక్షపాతబుద్ధితోఁ జదువువానికి నాగ్రంథ విషయములన్నియు బూటకములని తేటపడఁగలవు. దేవుఁడు ప్రజలతో నిట్లనెనని వాఁ డాగ్రంథమందు వ్రాసెను. "జనులారా మిమ్ముల బరిపాలించుటకై స్వర్గప్రభువును మీకుఁ బంపినాను) ఇచ్చట "హంగ్" అనువాఁడే స్వర్గప్రభువని గ్రహింపవలెను. వీఁడు పదంపడి "టియన్‌వాంగ్" (Tien wang) అను పేరుఁ బెట్టుకొనెను. అతఁ డుచ్చరించు ప్రతిశబ్దమును దైవాజ్ఞగా మీరు నమ్మి లోఁబడవలెను. మీ రతనికి త్రికరణశుద్ధిగా సాహాయ్యులై యతనిని మీప్రభువుగా మన్నింపవలెను. మీ రక్రమముగ నడచుటకుఁ గాని యతని నగౌరవముజేయుటకుఁగాని సాహసింపఁగూడదు. మీప్రభువును నిర్లక్ష్యము చేసినయెడల మీరిక్కట్టులఁ జిక్కుకొందురని నొక్కి వక్కాణింపుచున్నాను."

## నాన్కిన్ నగరమందలి హత్య.

అట్టి యసంగతములైనట్టియు నసంభవములైనట్టియు మాయాకల్పనలచే "హంగ్" తన మూఢానుచరులను వశపఱచుకొని చీనాదేశముయొక్క ప్రాచీనరాజధానియైన "నాన్కిన్" (Nankin) నగరంబుపై దండువెడలెను. అచ్చటనున్న చీనావారిసేనలు వానితోఁ బిట్టుగఁ బోరరైరి. కావున సురక్షితమైయుండు నానగరమును వారు శత్రువునకర్పణంబు జేయుటయేకాక తమ్మను జంపవద్దని శత్రువులను బ్రతిమాలుకొనిరి. కాని కలహకారులు శరణాలను రక్షించుట యెట్టిదియో యెఱుంగనివారగుటచే వారినందఱను దుడిచిపెట్టిరి. హతశేషులు నూఱుమందియైనను లేకపోయిరి.

చీనారాజ్యమందు ద్వితీయరాజధానిగఁ బ్రసిద్ధినొందినయా 'నాన్కిన్' నగరమం దాస్వర్గప్రభువు "హంగ్" ప్రభుత్వము వహించి పరిపాలనచట్టముల

నిరూపింపఁదొడఁగెను. తాను చీనాచక్రవర్తి నని పేరు పెట్టుకొనెను. తనవంశము నకు "టాయ్పింగ్" (Taiping) వంశమని పేరుపెట్టెను. తాను జయంచిన ప్రదేశములలో నాలుగుదిశలకు నలువుర ప్రభువుల నియమించెను. అట్టియసంపూర్ణపద్ధతులచేఁ బరిపాలన చేయలేకవిసికి వేసరి యంతటనుండి వాఁడంధకారమగ్నుఁడైనట్లుండెను. వాఁడంతఃపుర స్త్రీలలోలుఁడై రాజభవనమునుండి వెలువడక సోమరియై సుఖోల్లాసుఁడై జీవించుచుండెను. అతఁడు నియమించిన ప్రభువులు తమయిష్టము వచ్చినట్లు పరిపాలనచేసిరి. వారిలో తూరుపుదిశ నేలురాజు తన ప్రభువునకువలెనె తనకును దేవతావేశములు కలుగునని నటించుచు "టియన్‌వాంగ్" (హంగ్) యొక్క దుష్ప్రవర్తనను బట్టి వానిని మందలించి శిక్షింపవలసినదని దేవుఁడు తనకువర్తమానముఁ బంపినట్లు మాయాకల్పన నొకటిజేసెను. వానిపేరు "యాంగ్" (Yang) "టియన్‌వాంగ్" వానికి జడిసి వానిపాదంబులపైఁ బడి వాఁడు విధించిన శిక్షననుభవించుటకుఁ జేతులు కట్టుకొని నిలిచెను. వానికి "యాంగ్" దెబ్బల శిక్షచేయఁదలఁచినను వాఁడంతవట్టునకు దీనుఁడగుటకేత్రృప్తిజెంది వాఁడు తనభార్యలను నుంపుడుకత్తెలను బానిసలను హింసించుటకూడదని వానిని కఠినముగ మందలించెను. 'టియన్‌వాంగ్ యాంగ్'కు గొంతకాలములోఁబడి వానిని దేవదూతగ భావించెను. తుదకు వానిచే బాధనొందజాలక రాజద్రోహియని వానిపై నొక నేరమేర్పడఁగ వానిని విచారించిదోషియని యెంచి యురితీయించెను.

## విదేశీయుల యుపేక్ష.

"టాయిపింగ్స్" అనఁబడెడి యాకలహకారుల యాధ్యత్యములను చర్యలను జయములను విదేశీయులు వింతగఁ జూచుచు వారి సామర్థ్యమునంతయుఁ దెలిసికొనఁ గోరియుండిరి. మఱియు రాజ్యమర్యాదయుఁ బ్రజలదుర్న్యయమును దెలిసెనేనిఁ దాము చీనాదేశమందెట్లు వ్యవహరింపవలెనో గ్రహింపఁగలమని విదేశీయు లూరకచూచుచుండిరేగాని యేజోక్యమును గలుగఁ జేసికొనరైరి.

"టియన్‌వాంగ్" అంతవట్టుకు భాగ్యశాలిగానుండినను "పికిన్" రాజధానిని జయించి అచ్చటసింహాసన మెక్కవలెననెడి కోరిక యింక

వానికి దీరవలసియే యుండెను. కావున వాండా రాజధానినిముట్టడించుటకు 1850 సం. మార్చి నెలలోఁ గొంతసైన్యమును బంపెను. పసుపుఏటి నదీతీరమందుండు పట్టణవాసులు వానిపేరు వినినంతనే తల్లడమొందుచుం డిరి. కాఁబట్టి యాపట్టణములను వానిసైన్యమవలీలగ లోఁబఱచుకొనెను. "టియంటిసిను" (Tientsin) నగరమున కిరువదిమైళ్లదూరమున నున్న "సింఘాయి" (Singhai) నగరమందు వారు దండువిడిసిరి. ఆఱుమాసములలో వారు 26 పట్టణముల ననాయాసముగ లోఁబఱచుకొనిరి. పిమ్మట 'టియంటుసిను' నగరమును వారు ముట్టడింపఁబోయిరి. కాని యిచ్చట రణవీరుఁడైన చీనాసేనాని యొకఁడు దానిని శత్రువశముకాకుండ రక్షించెను. అంతట కలహకారులసైన్యము బహుకష్టముతో నాన్కిన్ నగరమునకు మరలి వెళ్లెను.

## కలహకారులక్షీణదశ.

పికిన్ రాజధానిపైఁ జేయఁబడిన దండయాత్ర యపజయంబొందుటచేఁ గలహకారుల మగటిమికిఁ గొంతవాటిల్లెను. నూతనపరగణాలను ముట్టడించుటకును దోఁచుకొనుటకును బలహీనులయిరి. నూతనకలహకారులు వారిం గూడరయిరి. కావున పసుపుఏటి ప్రాంతములయందే హంగు తనరాజ్యమును బలపఱచుకొని పరిపాలించెను. సాధ్యమగు నంతమట్టుకుఁ బట్టణములను గ్రామములను గొల్లపెట్టుటయు జనులహింసించుటయు వారిపరిపాలనాలక్షుమని గ్రహింపవలయును. ఆనాఁడు వారు పాడుచేసిన పట్టణాముల నిప్పుడు చూచినచో వారొనరించిన చెఱుపు లిప్పటికిని గానవచ్చునఁట. నాన్కిన్ నగరమప్పుడు కలహములకుఁ గుట్రలకు, హత్యలకు, నెలవుగనుండెను. కలహకారులు రాజధానిపై దండెత్తి యోడిపోవుటచే చీనాదొరతనమువారు ధైర్యశౌర్యములంబూని కలహకారులు జయించియున్న నగరాదుల మరల వశపఱచుకొని వారలను నాన్కిన్ (Nankin) అన్కిన్ (Ankin) నగరములలోఁ జిక్కుపెట్టి యానగరముల ముట్టడించిరి. కలహకారుల నంతదనుక చీనాదొరతనము వారేల యొపేక్షించిరో తెలియఁబడకున్నది.

---

# 9 వ అధ్యాయము.

## సియన్ ఫింగు (Hsien fing) చక్రవర్తి 1850-1861.

### చీనాదేశపు రెండవయుద్ధము.

### టోక్వాంగు చక్రవర్తియొక్క మరణము.

చీనారాజ్యమందలి మధ్యపరగణాలలో గతాధ్యాయమందు నుడువఁబడిన రీతిని బెడిదపుఁగోడవలు జరుగుచుండఁగ వానిననుసరించి యితరస్థలముల యందును గలహములు ప్రవర్తిల్లెను. కాంటన్ నగరమందలి చీనాగవర్నరయిన "యే" పరిపాలనాసమర్థుఁడని పరమదుష్టుఁడని గతంబున లిఖింపఁబడి యున్నది. ఆతఁడు ఇంగ్లీషువారిచేఁ జిక్కనంతదనుక వారికి విరోధియై చీనా చక్రవర్తియొక్క యధికారమును బెంపొందింప వలెనని యే విదేశీయుల కనేకములయిన యపకృతులు చేయుచుండెను. రాజ్యమంతయు నట్లల్లకల్లోలముగ నుండఁగ "టోక్వాంగు" చక్రవర్తి ప్రబలవ్యాధి పీడితుఁడయ్యెను. గగనమందలి గ్రహోదయ గ్రహచారములంబట్టి శుభాశుభంబులను భావించుట చీనావారి కాచారమయి యున్నది. ఎట్లనఁగా ధూమకేతువుదయించుట వలనఁగాని సూర్యగ్రహణము వలనఁగాని రాజ్యోపద్రవము కలుగుననియు రాజకుటుంబమునకుఁ గష్టములు సంభవించుననియు వారునమ్మెదరు. 1850 సం. లో సూర్యగ్రహణము వారిసంవత్సరాది పండుగదినమున సంభవించెను. అట్టిసంభవము వలన ననేకోపద్రవములు కలుగునని మూఢునివలెభయపడి చీనాచక్రవర్తి యాపండుగను గ్రహణ దినముయొక్క మరుదినమున జరుపుకొనవలయునని ప్రజలకాజ్ఞాపించెను. గ్రహచారమును బట్టికాని మఱియేకారణముచేతఁగాని శీఘ్రకాలములోనే 69 సంవత్సరముల వయస్సునందు చక్రవర్తి పరలోకగతుఁడయ్యెను. చీనారాజ్యమున కాయన నాల్గవకుమారుఁడు చక్రవర్తియయ్యెను. ఆయన "సియన్ఫింగ్" అనుబిరుదు నామము ధరించెను. పరిపూర్ణుఁడని యానామమున కర్థము.

గతించిన చీనాచక్రవర్తికి నెనమండ్రు పుత్రులుకలరు. జ్యేష్ఠపుత్రులకే రాజ్యమివ్వవలయుననెడి కట్టుబాటు చీనావారిచట్టములలో లేదు. చక్రవర్తి

తన మరణకాలమందుఁ దనయిష్టప్రకార మేకుమారునకైనను రాజ్యమిచ్చి పోవచ్చును.గతించిన చక్రవర్తియొక్క యయిదవ కుమారుఁడు తండ్రిబ్రతికియుండఁగానే యొకపరగణాకు ప్రెసిడెంటు (అధ్యక్షుఁడు) గ నుండెను.ఆచక్రవర్తియొక్క యేడవకొమారుని పుత్రుఁడే యిప్పటి చక్రవర్తియైయుండెను. పైనిఁ జెప్పఁబడిన "సియన్ ఫింగ్" చక్రవర్తియొక్క వయస్సు పందొమ్మిదిసంవత్సరములు. సాధారణముగ నట్టి వయస్సు ననుసరించియుండెడియౌద్ధత్యము దానికిఁ దోడయ్యెనఁట.కావుననే తనతండ్రికొలువునందుఁ జిరకాలము సమర్థముగ వ్యవహరించిన మంత్రుల నిద్దఱ నవివేకియై తొలగించి వారిస్థానములయందసమర్థులను బ్రవేశపెట్టెను. వారన్యదేశీయులయెడల ద్వేషము కలవారైయుండుటయే వారిముఖ్యయోగ్యతయని యాబాలచక్రవర్తి భావించెను. మంత్రిపదమందలి యీమార్పు జనులను విదేశీయులపైఁ బురికొల్పెను. 1850 సం.లో ఫూచూనగరమందలి యుద్యోగులు కాంటన్ నగరోద్యోగులవలెనే విదేశీయులను దమనగరమందుఁ గాలు పెట్టనీయరైరి. కాంటన్ నగరములోనికి విదేశీయుల రాకుండఁజేసిన యొకయుద్యోగిని చక్రవర్తి మిగుల సన్మానించెను. జనరంజకముగఁ బరిపాలించి తాను సుఖమొందు లక్షణము లుచక్రవర్తియందుఁ గానరావయ్యెను. చక్రవర్తితోఁ బోరాడి రాజ్యమున కలజడిగావించువగత్యము విదేశీయులకుఁ గలుగుచుండెను. దానికిఁ దోడ్పాటుగఁ గాలమానముకూడ రాజ్యమునకుఁ బ్రతికూలముగ నుండెను. క్షామము సంభవించెను. అందువలన, బహుజనులు మడిసిరి. భూకంపము పుట్టెను. దానివలనఁ గొంత చెఱుపు కలిగెను. అగ్నిభయము మెండై యనేకములయిన జిల్లాలూఁచముట్టుగ దహనమయిపోయెను.

## ప్రభుత్వ దోషములు.

ఈతిబాధలు కలిగినప్పుడు ప్రభుత్వమందలి దోషములంబట్టి యవి సంభవించునని చక్రవర్తి తనయొక్కయు దనయుద్యోగుల యొక్కయు దోషపరిశీలన జేయుట ప్రభుత్వముయొక్క విధికృత్యములలో నొకటియైయున్నది. * కావున చీనాచక్రవర్తి రాజ్యమునకుఁ గలిగినయాపదలఁజూచి నివ్వెఱఁజెంది

* రెండవ యధ్యాయము చూడుఁడు.

తనజనకుని బహుదయాళుఁడనియు మహోపకారియనియుఁ గొనియాడుచు దనను దనయుద్యోగులను నిందించుచు నీక్రిందివచనములతో నొకశాసనముఁ బ్రచురమొనర్చెను.

"మేము సూక్ష్మబుద్ధిగల చక్రవర్తులము కావున్నను మాయుద్యోగుల నకారణముగ నిందింపము. అర్ధరాత్రమందు సర్వము నిశ్శబ్దముగనుండు నప్పుడు. తమహస్తములను దమహృదయములపై నిడికొని రాజ్యముయొక్క ప్రస్తుతపు స్థితి తమకుఁ దృప్తికరముగ నున్నదేమొ విచారించుకొనుటకు మాయుద్యోగులను గోరుచున్నాము. వారిప్పుడు తమయుపేక్షంగూర్చి తమ్మును దాము గాఢముగ నిందించుకొననియెడల ననివార్యములయిన యాపదలయందుఁ జిక్కుకొందురు. కాఁబట్టి మాకొలువునందున్న గొప్పవారును గొద్దివారును దమయుపేక్షం జాలించి యీశాసనమును లక్షింపని యెడల గరుణయన్నమాట లేకుండ వారి నతికఠినముగ శిక్షింపఁగలవారము. ఏలయన నిక్కట్టట్టిదిగ నున్నది."

శాసన మంత కఠినముగ నున్నను చక్రవర్తి యుద్యోగులు దానిని బెడ చెవినిడిరి. ఏలయన దేశమందల్లరులు యథాప్రకారముగ నుండెను.

## కాంటన్ నగరమును వాణిజ్యమునకు విడువుమని ఆంగ్లేయులు కోరుట.

కాంటన్ నగరమందప్పటికి "యే" అనునాతఁడే గవర్నరుగ నుండెను. అచ్చట నాంగ్లేయాధిపతియైన "సర్ జార్జిబాన్హాం" (Sir George Bonhom) కును ఆగవర్నరుకు వ్యవహారము లనుకూలముగ నుండలేదు. కాంటన్ నగరము విదేశీయవాణిజ్యమునకు 1849 సం. నుండి నిరాటంకముగా విడువఁబడునని యిదివఱలోఁ జేయఁబడియున్న యొడంబడిక ప్రకారము జరుపుమని యాంగ్లేయాధికారి కోరఁగా ఆగవర్నరు దానితరుణము తప్పిపోయెను గావున నానిబంధన చెల్లనేరదని చెప్పెను. మఱియు కాంటన్ నగరవాసు లతిమూర్ఖులనియు, ఆనిబంధన నంగీకరించిన యెడల నన్యదేశీయులకును దొరతనము వారికిని జాలగ నుపద్రవముఁ గలుగజేసెద రనియు దెలియపఱచెను. తమకనుకూలింపని విషయమునుండి తప్పించుకొనుటకై చీనావారు సు

మయోచిత సమాధానములు చెప్పుటకు ఘనులఁట ఆంగ్లేయుల బలపరాక్రమములఁ జూచి కాంటన్ నగరవాసులు వారికి మంత్రులుగా నేయుండిరి. అయినను పైనిఁ జెప్పఁబడిన నిబంధనను చీనాదొరతనమువారు చెల్లించెదరో లేదో యాసంగతిని గనుగొనుటకై యాంగ్లేయాధికారి పట్టుపట్టెను. సర్ జానుబౌరింగు (Sir John Bowring) ఆంగ్లేయులకుఁ గ్రొత్తయధికారిగా నేర్పడెను.

ఆక్రొత్తయధికారి తాను నూతనముగ వచ్చితినని కాంటన్ గవర్నరుకు వ్రాయుచుఁ దనకు దర్శన మీయుమని యాయనను గోరఁగా ఆయన యధికారిగ వచ్చినందుకు తాను సంతసించితి ననియు, తాను దర్శనమిచ్చుటకు వీలు లేదనియు నగరబాహ్యమందొకచోటఁ దనను గలయుమనియుఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఆంగ్లేయాధికారి యటుల నొనర్చుట కిష్టపడలేదు. "యే" ఆంగ్లేయుల కటుల బద్ధద్వేషిగా నుండియు రాజ్యమందలి కలహకారుల నడంచుటకు వారిసహాయమే కోరెనఁట. ఇది యెంతవిపర్యాసవిషయము.

క్రూరాత్ముఁడైన 'యే' చేఁ బురికొల్పఁబడి కాంటన్ నగరమందలి ప్రజలు చెప్ప నలవిగాని చెఱుపుల నెన్నియో యాంగ్లేయులకుఁ జేయుచుండిరి. అదిగాన యాతఁడీక్రిందివచనములతో నొక లిఖితమును ముగించి ప్రచురించెను.

గౌర్నరుయొక్క ప్రకటన.

కాబట్టి కుక్కలంబోలిన నాగరికపు విదేశీయులు మనదేశములో నడుగుపెట్టినపుడెల్ల మనమందఱ మొకటియయి మన పరగణాయొక్క ఘనతను రక్షించుకొనుటకై వారిపైఁబడి పరిమార్పవలెను. అందువలన బ్రథమమున దేవునికోపమును నివారించిన వారమును, బిమ్మట రాజభక్తియు దేశాభిమానమును జూపించిన వారమును, అటుపిమ్మట మన గృహంబులయందు నెమ్మది నుండువారము నగుదుము. అట్టిసుఖముంబడసి మన మెంతగొప్పను జెందుదుము.

కాంటన్ నగరప్రజ లనేక యక్రమంబులు చేయుచుండ వానికిఁ దోడుగ యే పండ్రెండుగుర నాంగ్లేయ నావికులనుబట్టి తీసుకొనిపోయెను. వారిని దనకు మరలఁ బంపుమనియు, జేసిన యక్రమమునకు సంపూర్ణ క్షమను వేఁడుమనియు నాంగ్లేయమంత్రి 'యే' ను నిరోధింపఁగాఁ బలుచిక్కులం బెట్టి యా

యన తుదకుఁ బంపివేసె. అంతట నాంగ్లేయులు యుద్ధముప్రకటించి కొన్ని కోటల ముట్టడించి వశపఱచుకొని కాంటన్ నగరము ముందు దండునిడిసి గవర్నరుయొక్క మందిరముపై ఫిరంగులుకాల్చిరి. అప్పటికిని 'యే' వివేకహీనుఁడై యిట్లు ప్రకటించెను.

'ఈపరగణా రాజధానియైన కాంటన్ నగరమును మూర్ఖులైన యాంగ్లేయులు ముట్టడించి మనసైనికులను జనులను బాధించి హింసించుచున్నారు. వారుచేయు నపరాధములు బహుక్రూరముగనున్నవి. మీరందఱు ఏకీభవించి వారిని నిర్మూలముకావించుటకు నే నాజ్ఞాపించుచున్నాను. యుద్ధభటులుకాని సంసారులుకాని, యితరులుకాని, మీరందఱు కలసి సముద్రతీరములయందుగాని యితరచోట్లగాని యాంగ్లేయుఁడు మీకెక్కడఁబడినెక్కడో యక్కడ హతముకావించుచుఁ బీడాకరులైన యాంగ్లేయుల నశింపఁ జేయవలెనని యాజ్ఞాపించుచున్నాను. మీరు హతమొనరించెడి యొక్కొక్క యాంగ్లేయునకుగాను మీకు ముప్పదిడాలరులు బహుమాన మీయఁబడును. ఈప్రకటనకు మీరందఱు విధేయులై సన్నాహులు కావలయును. దీనికి మీరు తిరుగబాటు చేయకూడదు. దీనిని నిర్లక్ష్య మొనరింపఁగూడదు.'

## కాంటన్ నగరము నాంగ్లేయులు ముట్టడింపక మరలుట.

గౌర్నరుయొక్క యవివేకకృత్యము లట్లు మితిమించుచుండఁగ నాంగ్లేయులు కాంటన్నగరముకోటగోడకు రంధ్రముకావించి యొకద్వారమును వశపఱచుకొనిరి. గవర్నరయిన 'యే' యొక్కవచనములును సన్నాహములును డంబములే యయ్యెను. ఆంగ్లేయసేన చాలినంతగా లేనందున నానగరమును స్వాధీనపఱచుకొనుటకు వలనుపడక మరలిపోయిరి. ఇంగ్లాండునుండి సేనలను బంపుటకై యాంగ్లేయాధికారి తనరాజునకుఁ దెలియఁజేసెను.

అంతట చీనాదేశమందలి యాంగ్లేయులకు పైయధికారిగ 'లార్డుఎల్జిన్ (Lord Eligin) అయిదువేల నావికాసేనతో చీనాకుఁ బంపఁబడెను. ఆయన **1857** సం. జూన్ నెలలో సింగపూర్ (Singapore) నగరముచేరెను. ఇండియాదేశమం దప్పుడు సిపాయిల పెద్దకలహము జరుగుచుండుటం

జేసి యచ్చటి గవర్నరు జనరల్ అయ్యిన లార్డు కానింగ్ (Lord Canning) తనకుఁ దోడ్పాటుగ రమ్మని యాయనను గోరఁగా ఆయనపోయి యచ్చటి కలహమును నివారించుటకు దోడ్పడెను. ఆంగ్లేయులు కాంటక్ నగరమును బూర్తిగ ముట్టడింపక మరలిపోవుటఁ జూచి వారినోడించి తరిమివేసితినని 'యే' ప్రకటించుకొనెను. అంతట చీనావారికిని ఆంగ్లయులకును గొన్ని నావికాయుద్ధములు జరిగెను. కాని చినావారికే యపజయమగుచుండెను. అయినను 'యే' తనమూర్ఖపు పట్టును విడువక జరుగుచుండెడి యుద్ధములను గురించి తనచక్రవర్తికి నేమో చమత్కారముగ వ్రాయుచుండెను "లార్డుఎల్జిక్" (Lord Eligin) హాంకాంగు దీవియందుండెను. అచ్చటనుండి తన రాకను "కాంటక్" గవర్నరునకుఁ దెలియఁబఱచి "కాంటక్" నగరమును విదేశీయుల వాణిజ్యమునకు విడిచెదరా విడువరాయనియు, మీయక్రమములనుబట్టి మేము యుద్ధము చేసితిమి కావున మాకయిన వ్యయములను మీరిచ్చుకొనవలెననియు నాతనికిఁ దెలియఁబఱచెను. "కాంటక్" నగరమునందు వర్తకముచేసికొనవచ్చుననియు యుద్ధవ్యయములను ఎవరివి వారు భరింపవలెననియు బ్రత్యుత్తరమిచ్చెను. 1857 వ సం.రం. డిశంబరు 25వ తేదీని "లార్డు ఎలిజిక్" "కాంటక్" నగరమునుండి చినావారి సేనలు పూర్తిగ వెడలిపోవలెననియు 48 గంటలకాలము గడువిచ్చెదననియుఁ దెలియఁజేసెను. ఆగడు వతిక్రమించునప్పటికి నట్లు జరగనందున నాంగ్లేయులు "హానాక్" (Honan) నగరమును ముట్టడించిరి. ఆముట్టడియొక్క కారణములను బ్రజలకు బాహాటముగఁ దెలియఁబఱచిరి. చినా దేశీయ మంత్రులలో నొకని నాపట్టణంబునఁ బట్టుకొని అతఁడుకూర్చుండిన కుర్చికి నతనిని కాగితములతో నంటించి యాకుర్చీని నానగరముం దూరేఁగించి యతని నవమానించిరఁట. ఎంతియవమానకరము పిమ్మట 'కాంటక్' నగరమును ముట్టడించి యందున్న ధనాగారమందలి ధనము నాంగ్లేయులు వశపఱచుకొనిరి. "యె" అను గవర్నరు దాఁగికొనఁగా నతనిని గాలించి పట్టుకొని ఖయిదు చేసిరి. అతని పెట్టెల శోధించి అతని కుట్రకాగితములను పట్టుకొనిరి. తుద కతనిని కలకత్తాకు ఖయిదీగాఁ బంపివేసిరి. అతఁడొనరించిన ఘోరకృత్యములంబట్టి యతని నాంగ్లేయులు కాంటక్ నగరమునుండి తీసికొనిపోవుచుండఁ

గాఁ బురజనులు మిగుల నపహాసించిరఁట. ఆముట్టడిలో "పికీ్వ" (Piquey) యనఁబడు గవర్నరు నాంగ్లేయులు ఖయిదు చేసియుండిరి 'యే' అను వానిని కలకత్తాకుఁ బంపివేసిన పదంపడి పైనిఁ జెప్పిన "పికీ్వ" యనువానిని కాంటన్ నగరమునకు నాంగ్లేయులు మఱల గవర్నరుగ నియమించిరి. ఆంగ్లేయులలో ముగ్గురు గొప్పవా రాతనికి నాలోచన సభికులుగ నేర్పడిరి. వ్యవహారములను సమర్థించుటకు ఫ్రాన్సుదేశీయుఁడైన యొకనావికోద్యోగి నియమింపఁబడెను. అట్లు మూడువత్సరంబు లానగరమందు నాంగ్లేయులచే న్యాయపరిపాలన చేయఁబడెను. జనులు తమ ధనప్రాణంబుల కపాయములేకుండుటఁజూచి యంతకు మున్నెన్నఁడట్టిసౌఖ్యమెరుఁగనివా రగుటచే మిగుల సంతసించిరఁట. అంతపని కాంటన్ నగరమందు జరుగుచుండగా చీనాదొరతనము వారలు తెలిసి యూరకుండిరో దెలియక యూరకుండిరో యాసంగతి ఆంగ్లేయచరిత్రకారుఁడు వ్రాసియుండలేదు. ఎట్లైన నక్కాలంబున చీనారాజ్యము దిక్కులేని దివాణముగనున్నట్లుదోఁచెడిని.

## వ్యవహార మర్యాదలు.

కాంటన్ నగరవర్తకవివాద మటులతీరిపోయినందున చీనాదొరతనము వారికిని నాంగ్లేయులకును జరుగవలసిన వ్యవహార మర్యాదలను గుఱించిన గొప్పవిషయము తెలుసుకొనుటకు "లార్డు ఎలిజిన్" పూనుకొనెను. రాజ్యము యొక్క దక్షిణభాగమునందు జరిగిన విషయంబులఁ దెలియబఱచుచు మరల సంధి యేర్పాటు చేసికొనుటకుఁ బూర్వము తమకు చీనావారొసంగవలసిన విషయంబు నుదహరించుచు "పికిన్" రాజధాని యందుండెడి రాజకార్యనిర్వాహకులలో ముఖ్యునికి 'లార్డు ఎలిజిన్' ఉత్తరము వ్రాసిపంపెను. దానికిప్రత్యుత్తరము నాయనకుబంపక యాముఖ్యుఁడు టూక్యాంగ్ (Twokiang) పరగణాలయొక్క రాజప్రతినిధికిఁ బంపెను. చీనాదొరతనము వారిస్వాతిశయ మట్లుండెను. ఆప్రత్యుత్తర మందిట్లు వ్రాయఁబడెను.

'మీరు వ్రాసినయుత్తరము చదువుకొని యందలి యంశంబుల బోధపఱచుకొంటిని. 1856 వ సం. సెప్టెంబరు నెలలో కాంటన్ నగరము నింగ్లీషు

...ట్టడించి దానియందలి గొప్ప భవనములను సామాన్య గృహములను ద హ... గావించి దానికోటలను బడఁగొట్టి యుండిరి. ఈ సంగతులను విదేశీయులందరు నెఱిగియే యున్నారు. మామంత్రి నొకనిని బట్టుకొనుటయు, మా పరగణా రాజధానిని బట్టుకొని పాలించు చుండుటయు, ఇట్టి విపరీతములు మేము మున్నెన్నఁడు నెఱిగి యుండినవి కావు. మాచక్రవర్తి యుదార బుద్ధిగలవారును నిదానము గలవారునై యున్నారు. వారు మాపేర నిటుల వ్రాసిరి. కాంటన్ నగర గవర్నరైన 'యే' అను నాతని నుద్యోగమునుండి తగ్గించితిమి. అతని పదంబునకు హోవాంగ్ (Houng)అను నాతని నియమించి క్వాంగ్‌టుంగ్ (Kuangtung) నగరమునకుఁ బంపితి. కాఁబట్టి మీ రాయన నానగరము నందుఁగలసి మీవ్యవహారములు మాట్లాడుకొనవచ్చును. షాంఘాయి (Shanghai) నగరమందు మీతోఁ గలసి మాట్లాడవలయునని మీరు కోరితిరి. ఈ దొరతనమువారి మంత్రులలో నెవరును నచ్చట వ్యవహరింపరు. ఈ రాజ్యమందలి గొప్పయుద్యోగులకు రాజకీయ వ్యవహారములు ప్రత్యేకముగ నియమింపఁ బడియున్నవి. విదేశీయులతో ప్రత్యుత్తరము జరుపుట మాకు మతవిరోధమైన కృత్యముగానున్నది. మేమాంగ్లేయ మంత్రితో స్వయముగా నుత్తరములు జరుపుట మాకుఁ దగియుండదు కావున మేము పైన నుడివినదంతయు నాయనకు మీరు తెలియపఱచవలయును. అందువలన మేమాయనకుఁ బ్రత్యుత్తర మిచ్చినవారము గుదుము.

## తక్కువతరగతియుద్యోగులను చక్రవర్తిపంపుట.

ఈ ప్రత్యుత్తరము సంధికృత్యముల కనుకూలించి యుండక పోవుటం జేసి తగిన యుద్యోగులకు సర్వాధికారమిచ్చి పంపినయెడల వారితో సంధివిషయమున మాట్లాడెదనని 'లార్డు ఎలిజిన్' ఆ కార్య నిర్వాహకునకుఁ దెలియఁబఱచెను. అట్లువ్రాసినను చీనాదొరతనమువారు మిక్కిలి తక్కువ తరగతి యుద్యోగులను ముగ్గురిని కమీషనర్లనుగాఁ బంపిరి. అందువలన ఆంగ్లేయ మంత్రికాగ్రహము కలిగి "టాకూ" కోటలను ముట్టడించి పట్టుకొనిరి.

పిమ్మట తగినరాయబారులను చీనాచక్రవర్తి పంపినను, ఇంగ్లీషువారు సంధికంగీకరింపక పోయిరి. చీనాదొరతనమువారు మిగుల ప్రార్థింపగ నెట్టకేల లకు నాంగ్లేయులు సంధికి నంగీకరించిరి. ఆసంధి యొడంబడిక లేమనఁగా.

1 పికిన్ నగరమం దింగ్లీషు దొరతనము వారి మంత్రియుండి వారిప క్షంబుగ వ్యవహరింపవచ్చును.

2 వెనుకటి నాన్కిన్ సంధి నిబంధనలలో స్వేచ్ఛావర్తకమున కంగీకరిం పఁబడిన యయిదురేవులు కాక మఱియు టాంగుచా (Tong chow) ఫార్మోజా, (Formosa) స్వాటో (Swato) హైనన్ (Hainan) దీవియందున్న 'కియంగుచా' (Kiengchow) రేవుపట్టణములు కూడ విదేశీయుల నిరాటంక వర్తకమున కంగీకరింపఁబడినవి.

3 నల్లమందు వర్తకమును చీనాదొరతనమువా రంగీకరించుట.

ఈసంధి కాగిత మా సంవత్సరము జూన్ 26 తేదీని వ్రాయఁబడినది. చక్రవర్తిచే జూలై 4 తేదీని సంతకము చేయఁబడినది.

## పికిన్ రాజధానియందాంగ్లేయ మంత్రి యుండుట.

సంధి నిబంధనల పత్రము ముగిసినతోడనే యాంగ్లేయ మంత్రితో చీనాదేశమంత్రులు, 'అయ్యా! పికిన్ రాజధానియం దాంగ్లేయమంత్రి యుండవచ్చునను నిబంధన మీకు క్షేమకరముకాదు. చీనాప్రజలు మోటువారు, చెప్పినమాట వినరు. వారివలన మీకుఁ జాలఁ దొందరలును నష్టములును సంభవించును, అని నొక్కి వక్కాణించిరి. అంతట నాంగ్లేయ మంత్రి యానిబంధనను ప్రస్తుతము తీసివేయుటయే యుచితమనియు ముందు సంవత్సరము దానిని జేర్పించి యాయొడంబడికను మార్పింప వచ్చుననియుఁదలఁచెను. చీనామంత్రులటుల దేనెలొలుకుపలుకులతో నాంగ్లేయ మంత్రికి హితోపదేశము చేయుచు నేయుపాయముచే నయిన నాంగ్లేయులను దేశమునుండి వెడలఁగొట్టుట నే చింతించుచుండిరి.ఆయొడంబడిక కనంతర మాంగ్లేయమంత్రి హాంకాంగు దీవికిఁ బోయె. కాంటన్ నగరవాసు లాంగ్లేయులకు హితులుగ నుండగ చీనాదొరతనము వారి మంత్రులాజనులను గలహమునకుఁ బురికొల్పి యాంగ్లేయులను

మథించు వారికి బహుమానము లిచ్చెదమనియు నాంగ్లేయరణవీరుఁడైన పార్కు సుయొక్క శిరంబు ఖండించువానికి 30,000 డాలరుల నొసంగెదమనియు చెప్పుచుండుట నాంగ్లేయమంత్రియెఱింగెను. కాని సంధ్యనంతరము కలిగిన దేశనెష్టది మరలఁ జెడఁగొట్టకిష్టములేక యాయన యాంగ్లేయసైన్యమును కాంటన్ నగరమునుండి వెలుపలికి రాకుండ నాజ్ఞాపించెను. ఆయనతలంపటులనుండ తన్నగర సమీపమందు యుద్ధసన్నాహములను చీనాదేశోద్యోగులు కావించుచుండిరి. రోగమంకురింపగానె నివారించుట యోగ్యతరము కావున నామంత్రియాజ్ఞవలన

## చీనావారి కోటలను బట్టుకొనుట.

నాంగ్లేయులు “షెక్టుసింగు” (Shekt sing) అనుబలిష్ఠమయిన కోటనువశపఱచుకొనిరి. పిమ్మట నల్లరులకు నెలవుగనుండిన “ఫయూయాన్” (Fayuat) పైకినాయుధపాణులై వెడలఁగ నచ్చటిజనులు కిమ్మనకయే లోఁబడిరి. అంతవట్టుకు దేశము కలహజాడ్యవిముక్తమై యారోగ్యముంగాంచెను. “వెస్టు” (Wasu) నదిమీఁద నాంగ్లేయులవర్తక నావలు నిరాటంకముగా నాడుచుండెను. ఆంగ్లే

## కాంటన్ నగరమందు నెమ్మది కలుగుట.

యుల యుద్ధకృత్యము లాప్రకారము వారుతలంచినదానికంటె నధికఫలదంబులయ్యె. వారు తమస్వదేశములలో లండన్ రాజధాని వీథులయందెట్లు వలెనే కాంటన్ నగరవీథులయందు యథేచ్ఛగా విహరించుచుండిరి.



# 10-వ అధ్యాయము.

సియన్‌ఫింగు చక్రవర్తియొక్క పరిపాలనాశేషము. టుంగుచిచక్రవర్తి (1861-1875) 1860 సం-లో జరిగినచీనాయుద్ధము.

1858 సం॥లోఁ జేయఁబడిన యొడంబడికలో చీనారాజధానియందాంగ్లేయ రెసిడెంటుండవలెనను నిబంధనఁజేర్చుట యావశ్యకమని తలఁచి "లార్డు ఎలిజిన్" తనసోదరుఁడైన బ్రూసు (Bruce) నావిషయమును గుఱించి ముచ్చటించుటకై చక్రవర్తిసన్నిధికి రాయబారినిగాఁబుత్తెంచెను. ఆనిబంధనను గోరవలదనియు నందువలనఁ బలువిధములైన చెఱుపులు వాటిల్లుననియు చీనావారెంతకపట్బోధచేసినను వినక యెంతవ్యయప్రయాసలు కలిగినను ఆవిషయమును బూనికతో సాధింపుమని విదేశీయకార్య నిర్వాహకుఁడు (Foreign secretary) అగునాంగ్లేయోద్యోగి యాయనకు నంబున నాటునటులఁజెప్పెను. ఆయన "షాంగాయి" తీరమున పడవలరేవున దిగఁగానె చీనావారిమంత్రులయిన "క్వీలియాంగు"ను (Kweiliang) వషానా (Hwashana) యును ఆయనను సన్మానించి యాగమనకారణంబెఱింగి యానిబంధనను గోరుటకూడదని బహువిధంబులఁ బ్రతిపాదించిరి. కాని యాయనవారి హితోపదేశంబులఁ బెడచెవినిడెను. పీహో నదీముఖద్వారమునఁదననావుటకై "టాకు" కోటలయందు యుద్ధప్రయత్నములు జరుగుచుండుట యాయనవిని యచ్చటనున్న యాంగ్లేయ నావికాధిపతితో సంప్రతించి తగుపాటి నావికా సమూహముతో నారాయబారి యానదీ ముఖద్వారము చేరుటకు బయలువెడలెను. అచ్చటకుఁబోయి తత్ప్రదేశాధికారికిఁ దనరాక నెఱింగించి యానదీముఖద్వారమందు నినుపఖడ్డీలను బాఁతియుండుటయుఁ నదికడ్డంబుగ నినుపగొలుసులను గట్టియుండుటయుఁ గనుంగొనెను. మఱియును చీనావారాయన నొడ్డెక్కనీయరైరి. అదియటుండ నావికాసేనాధ్యక్షుఁడు మఱుదినము యుద్ధ

ఒడంబడికలో బ్రథమనిబంధనను జేర్పించుటకై యాంగ్లేయరాయబారి పికిన్‌కుఁ బోవుట.

నావలతోఁ దన్నదీముఖద్వారమునకుఁ బోవుచుండఁగా బైనినుడువఁబడిన యినుపకడ్డీలు వారికడ్డమయ్యెను. ముందుపోవ వెఱవుకానక వారు కొందలము నొందుచుండఁగా నానదీసంగమస్థలంబుననున్న టాకుకోటలనుండి ఫిరంగిగుండ్ల వర్షమాంగ్లేయులపైఁ గురిసెను. ఆంగ్లేయయుద్ధనావలు రెండు మునిగిపోయిన వి. వారిలోఁ గొంతమందికి గాయములుపడెను.కొంతమంది మృతులైరి. శేషిం చినవారు మెట్టమార్గమున నాకోటలను ముట్టడింపఁబూనఁగా నొక బురదపట్టును దాఁటవలసివచ్చెను. అది మోఁకాటిబంటిగా నుండుటచేఁ గాలుపెల్లగిల కుండెను. కోటబురుజులనుండి చీనావారగ్నివర్షము వారిపైఁ గురిపించుచుండిరి. అటులనెన్నియో యిడుమలంబడి యంధకారంబు నాసన్నమగుటంజేసి చేయున దియేమియులేక ఖిన్నులై తమనావలయొద్దకుమఱలివచ్చిరి. ఈరణంబున నాంగ్లే యులు మూఁడుయుద్ధనావలను గోల్పోయిరి. యుద్ధనిహతులయిన వారుగాని గాయములుపడ్డవారుగాని యాంగ్లేయులు 300 తమసైన్యమటులక్షీణించుటచే షాంగాయినగరమునకాంగ్లేయులు మఱలి పెళ్లిరి.ఈయపజయవార్త యింగ్లాం డుదేశముంజేరఁగా నచ్చటి వారిమనంబులు బెడిదంబుగ నుడికెను. మిత్రుల మయితిమని యొడంబడికచేసికొని ద్రోహంబు కావించినందునకు చీనావారికి బుద్ధిచెప్పుట యావశ్యకమని యాంగ్లేయులంద రేక గ్రీవంబుగఁ బల్కిరి.ఫ్రాన్సు దేశియమంత్రితోఁగూడ చీనాదొరతనమువా రొడంబడికచేసికొని యుండుట కతంబున లిఖంపఁబడియున్నది. ఆమంత్రియుఁగూడఁ దనయొడంబడికను సవ రణచేయించుకొనుటకు పీహోనదీమార్గమునఁ బోఁజూడ చీనావా రాయన నభ్యంతరపఱచిరి.

## ఫ్రాన్సుదేశియు లాంగ్లేయులతోఁ గలియుట.

కాఁబట్టి యుభయదేశియు లొక్కటియై చీనాదేశముయొక్క మధ్యభా గమును ముట్టడింప నిశ్చయించుకొని,పైనినుడువఁబడిన మిత్రద్రోహ మాంగ్లేయుల కొనరంచియుండుటకు సమాధానము చెప్పవలయుననియు, గతసంవత్సరమందలి యొడంబడిక సమగ్రముగ జరుపవలయుననియు చీనాదొరతనమువారికి మాసము దినముల గడువుపెట్టి పైనిఁజెప్పఁబడిన "బ్రూసు" అనురాయబారి కడసారిగ్రా సెను. లార్డుఎల్జిక్ కిదివఱలో నిచ్చియున్న గర్వాతిశయ ప్రత్యుత్తరమునే

యూరాయబారికి చక్రవర్తి కియాంగుపరగణాల మంత్రిమూలముగఁబంపెను. ఈమధ్యకాలములో నింగ్లాండునుండి "సర్ హోప్ గ్రాంటు" (Sir Hope Grant) అనుసేనాధిపతి 13,000 నావికసైన్యముతో హాంకాంగుదీవికి వచ్చెను. ఫ్రాన్సుదేశమునుండి యొక సేనాని 7,000 నావికాసైన్యముతోఁజేరెను. ఉభయసైన్యమును "టలీన్వాన్" (Talienwan) రేవుపట్టణమువద్ద సమకూడెను. పీహో నదీముఖద్వారసమీపమున టాకుకోటలున్నవి. ఆనదియుత్తరతీరమున "పిటాంగు" (Pehtang) నగరున్నది. టాకుకోటకుదక్షిణమున బ్రహ్మాండమయిన బురదపట్టియొకటియున్నది. పీహోనదీసంగమమునుండి పికిన్ రాజధానికి రాజబాట యొకటియున్నది. మెట్టనుబోయి టాకుకోటలను ముట్టడించుటకు నాబురదపట్టును దాఁటిపోవలసియే యుండెను. అట్టిస్థితిలో నాంగ్లేయసేనానాయకుఁడు పన్నిన వ్యూహం బేమనఁగా ముందుగ "పిటాంగు" నగరమునుముట్టడించి పదంపడి టాకుకోటలపై దండెత్తుట. ఫ్రాన్సుసేనానాయకుని వ్యూహరచనయేమనిన, యెట్టికష్టముసంభవించినను మెట్టదారిని బురదపట్రను దాటి టాకుకోటలనుముట్టడించి రాజబాటను రాజధానిపైకి శీఘ్రముగఁ బోవుట. నదిమీఁద నావికాసైన్యమును నడిపించుచు రణమొనర్చుటయే శ్రేయస్కరమని యెన్నఁబడి యాంగ్లేయసేనానియొక్క వ్యూహరచనాప్రకారము పిటాంగు నగరము ముట్టడింపఁబడెను.

టాకుకోటలను ముట్టడించి యచ్చటనుండి పీహోరోడ్డువెంబడి పికిన్ రాజధానిపైకిఁ బోవుట కాశపడుదురని చీనావారు పిటాంగునగరమును సురక్షితముగనుంచలేదు. ఆంగ్లేయులు మెట్టదారని టాకుకోటలను ముట్టడించుటకు బురదపట్టునుదాఁటుటకుఁబడినశ్రమ లిన్ని యన్ని యనిచెప్పనలవికాకుండెను చక్రవర్తియొక్క దాయాదియయిన "సాంకోలిన్ సిన్" (Sankolinsin) టాకుకోటల కధ్యక్షుఁడై యుండెను. ఆంగ్లేయులు మెట్టదారిని యుద్ధముప్రక్రమించుటం జూచి యబ్బురపడియు చీనాచక్రవర్తి కిట్లు వ్రాసెను.

చక్రవర్తికిఁ బంపిన డంబవర్తమానము.

"విదేశీయులను జలజంతువులని మనమనవచ్చును. ఏలయన వారు నావికాయుద్ధములయందె దిట్టరులు కాని మెట్టంబోరుటకుఁ దొట్రిలఁబడుదురు. వారుయుద్ధనా

వల దిగివచ్చిరేని యేమియుఁగొఱగారు కావున వారిని మెట్టిపురప్పించినాను"

ఉభయసైన్యములును పిటాంగును వశపఱచుకొనిరని తనకుఁ దెలియఁగానే "సాంకొలిన్ సిన్" శత్రువులు రాకుండుటకై టాకుకోటలవు వెనుకతట్టునఁ గందకములు త్రవ్వించి తురంగసైన్యమును గావలియుంచెను. ఈతురంగసైన్యము నుగుఱించి యొకవింతవిషయమును నుడువవలసియున్నది. పికిన్ రాజధానికిస మీపంబున 20 000 గుఱ్ఱపుదళము సమకూర్పఁబడును. ఆసంఖ్యకాగితముమీఁదఁనగపడునేకాని లెక్కకంత సేన కనఁబడదు. అంత సేనవు నాసేనానాయకుఁడు రాజద్రోహభీతిలేక జీతములును నితరవ్యయములను దొరతనమువారివలన నెలనెలకుఁ బుచ్చుకొనుచుండును. యుద్ధసమయ మాసన్నమయినప్పుడప్పటికప్పటికి నూతనజనమును గుఱ్ఱములను గూలియిచ్చి చేర్చుకొని యాసంఖ్యనుబూర్తిచేయును. విశ్వామిత్రసృష్టిగ సమకూర్పఁబడిన యట్టి సేనయేమివిజయంబొందఁగలదో చదువరులే గ్రహింపఁగలరు. సమర్థులయిన కాంగిషి మొదలయిన పూర్వపుచక్రవర్తులకాలమందట్టి మోసకృత్యములు జరిగియుండవని యూహింపందగియున్నది. అట్టులగూలికివచ్చినవారే వింతగ గొంతవట్టుకుఁ బోరాడిరఁట.

## ఉభయసైన్యములు టాంకు గ్రామమును వశపఱచుకొనుట.

ఆంగ్లేయులు టాంకు గ్రామమునకుఁ బోఁగా నచ్చటనున్న చీనాసైనికులు ప్రాతఃకాలభోజనమును చేయుచు వారిరాకవిని విస్మయంబొంది తమ పళ్లెరంబులనన్న సహితంబుగ విడిచి పలాయనమైరఁట. ఆఁకలిగొనియున్న యాంగ్లేయులు చీనావారి కురిచీలలో గూర్చుండి యాయోదనం బారగించిరఁట.

టాకు కోటలుండు పరగణాయొక్క రాజప్రతినిధియయిన "హాంగుపు" (Hang Fu) ఆంగ్లేయులవలనఁ దమకుఁ బరాజయము కలుగుట సిద్ధమగుట యెఱింగి యాంగ్లేయమంత్రితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచుఁగాలయాపన మొనరించి యంతలో దమయుద్ధప్రయత్నములఁ బూర్తిచేసికొనఁదలచి యాయన పేర దానేమియు నెఱుఁగనియట్లివ్విధమున వ్రాసెను.

"చీనావారును ఆంగ్లేయులును జరిగియున్న యొడంబడికను బట్టి కలతలులేనివారై యన్యోన్య మిత్రులుగ వర్తింపవలసియుండఁగా నాంగ్లేయులు

పిటాంగు నగరము నేల ముట్టడించిరో తెలియకున్నది. ఏ విషయంబులయిన వివాద గ్రస్తంబులుగనుండి పరిష్కారమును గోరుచున్నయెడల వీరొక స్థలమును గాలమును నిరూపించినయెడల నచ్చట మనము సమకూడి పరిష్కరించుకొనవచ్చును.

## టాకుకోటలను చీనాదొరతనమువారు రక్షించుకొనినరీతి.

రాయబారియయిన బ్రూసు వ్రాసినయుత్తరమును చీనా దొరతనము వారు నిరాకరించుటకుఁ గారణమును దెలిపి పీహోకోటల నాంగ్లేయుల కర్పణంబు చేయుదనుక వారి యుద్ధకృత్యములు తుదముట్టవని గట్టిగఁ బ్రత్యుత్తరమిచ్చెను. అటులఁ గోరఁబడిన రెండంశములకుఁ బ్రత్యుత్తరమీయక యేమేమొ వ్రాయుచుఁ గాలము గడపుటంజేసి యుభయ సైన్యములును టాకు కోటలను ముట్టడింపంబూనిరి. టాకుకోటలు బలిష్ఠమయినవికావున వానిని సురక్షితముగ నుంచుటకై చీనావారి రణోద్యోగపు టేర్పాటులు సమగ్రముగ నీదిగువ లిఖింపఁబడుచున్నవి. అందువలన చీనావారి రణకౌశల్యము విశదము కాఁగలదు. టాకు కోటలచుట్టు మిగుల మందమయిన మట్టిగోడ యుండెను. ఫిరంగులను స్థాపించుటకై దానిపైఁ దగుపాటి రంధ్రము లుండెను. గోడలో ఫిరంగులను దూర్చుటకు రంధ్రములు కలవు. ఆగోడనానుకొని లోపల తట్టునమూయఁబడిన యిండ్లంబోలునట్టి బొంబసులు కలవు. అవి ఫిరంగిగుండ్ల నెదిరింపజాలవు. ఆకోటమధ్య నెత్తైనబురుజొకలదు. దానిపై మిగుల బరువైనఫిరంగులుమూడో నాల్గోయుండెను. వానిమూతులు సముద్రమువైపుగ నుండును గాని యేవైపునకయినను వానిం ద్రిప్పనటుల నమర్పఁబడియుండెను. ఆగోడయొక్క వెలుపలతట్టున రెండుగాని మూఁడుగాని కందకములుండెను. అవి 20 మొదలుకొని 30 అడుగుల వెడల్పు. ఆకందకములనడుమ నొకదానినుండి మరియొక దానివఱకుఁ గొయ్యకడ్డీలు భూమిలోఁ లోఁతుగను మనుష్యుఁడు దూఱుటకు సందులేనియంతదగ్గఱగను బాతిపెట్టఁబడియుండెను. ఆకోటలో నుత్తరముగనుండు కోటయొక్కగోడ నానుకొని దక్షిణముగ "పీహో" నదియుండెను. చీనావారి ఫిరంగులు వారిదేశమందు చేసినవే యయియుండెను.

## టాకుకోటలను ముట్టడించుట.

ఆంగ్లేయు లాకోటలపై ఫిరంగులు కాల్వనారంభించిన తోడనే యా కోటలలోనుండి యద్భుతమైన యగాదు బయలుదేరెను. అదిచూడఁగ చీనా వారాకోటను దగులబెట్టుచుండిరో యని యాంగ్లేయులకుఁ దోచెను. అదివల్లారినపిమ్మట చీనావారు ఫిరంగులఁ గాల్వఁదొడంగిరి కాని యాంగ్లేయులు వానిని సరకుసేయక ముట్టడింపఁసాగిరి. ఈముట్టడియందొక విశేషంబు కలదు. అంతకులోఁగడ కాంటన్ నగరమందలి కూలిజనమును వేలకొలఁది యాంగ్లేయులు తమకొలువులోఁ జేర్చుకొని యాయభ్యాసము చేయించిరి. వారు రణోద్యోగమందుఁ దీర్పుంజెందిరి. తమదేశీయులకు శత్రువులయిన యాంగ్లేయుల కొలువులోఁజేరుటచే యుద్ధకార్యములయందుఁ దమదేశీయులతోనే తాము పోరవలసివచ్చునని యెఱింగియు నాంగ్లేయులిచ్చు జీతభత్యముల కాసపడి స్వదేశాభిమానము త్యజించి మనస్ఫూర్తిగ వారికొలువు చేయుచుండిరఁట. ఆముట్టడియందు చీనావారు కొంతపట్టువు బట్టువదలక బెట్టిదంబుగ బోరిరి కాని తుదకాంగ్లేయులే జయమొందిరి. టాకుకోటలు పీహోనదియొక్క యుత్తరపుగట్టున రెండును, దక్షిణపుగట్టున మూఁడునున్నవి. ఆయుత్తరపు కోటలలో ముందుగనుండుకోట నాంగ్లేయులు స్వాధీనపఱచుకొనఁగానె యచ్చటనుండివ చీనాసైన్యము తెల్లబావుటానెత్తి యొకతుపాకినైనను గాల్వకుండిరి. అంతట నాంగ్లేయసైన్యము నిరాటంకముగ లోనికిఁ బోయి చూడ నచ్చట నద్భుతంబుగ 2,000 చీనాసైన్యము కదలక మెదలక నేలపైఁగూర్చుండెనఁట. వారు యుద్ధభటులు దుస్తులందు్యజించి యుండుటం జూచి ఖయిదీలుగ జేయబడినట్లాంగేయులకుఁ గన్పట్టెను. దక్షిణపు కోటలపైఁ గూడ చీనాసైనికులు తెల్లబావుటాల నెలకొల్పిరి. చీనావారు తెల్లబావుటాలం బట్టుట సంధిజేసికొనెదమని తెలుపుటయే యని చదువరులెఱుంగవలయును. కాని వారిలక్షణములు సంధి కనుకూలించి యుండక పోవుటచే నాంగ్లేయులకు సంశయాస్పదములుగ నుండెను. కావున నిజస్థితిఁ గనుగొనుటకై యాంగ్లేయమంత్రి "పార్కుసు" మొదలయిన రాయబారులను ముగ్గురను రాజప్రతినిధి యొద్దకు బంపెను.

ఆయనవారిని సన్మానించి విందుచేయుచుండఁగా వారిని ఖయిదుచేయుటకై యాయనభటులు "సాంకోలిన్‌సన్" కొఱకు వెతుకుచుండిరి. ఉత్తరపుకోటలు ఆంగ్లేయులవశము కాగానే యతఁడు పికిన్ నగరమునకు బోయిచక్రవర్తికావార్తం దెలిపి ప్రచండమయిన చీనాసైన్యము దక్షిణకోటలయందున్నదనియు,ఆంగ్లేయులను వారు భండనంబున నోడింపఁగలరనియు,వెఱవవలదనియుఁ జెప్పెను. అతఁడట్లుపోవుట తనభటుల వలన నెఱింగి రాజప్రతినిధి యారాయబారులకు బంపివేసెను. అంతలో దక్షిణపు కోటలుగూడ నాంగ్లేయుల వశమయ్యెను.

పీహో ముఖద్వారమందు, చీనావారు పాఁతిన యినుపకడ్డీలు మొదలయిన యభ్యంతరముల నివారించుకొని యాంగ్లేయ నావికాసేనాధిపతి "టియంటిసిను" (Tientsin) నగరమునకుఁ బోవుచుండెను. రాజప్రతినిధియు నచ్చటికి వెళ్లెను. ఆంగ్లేయులు మఱియుఁ జొచ్చుకొని రాకుండ నాపుటకు చక్రవర్తి మఱియొక మంత్రిని ఆనగరమునకె పంపెను. చీనావారికసంతుష్టికరమయినవిషయమొకటి సంభవించెను. ఏదియన. ఆంగ్లేయులు గ్రామాదుల దారిని బోవుచుండ గ్రామజనులు వారికి సలాములు చేయుచువారికిఁ గావలసిన భోజనసామగ్రులను సంతోషముగ విక్రయించు చుండిరఁట. అట్లుచేయుట దొరతనము వారికి సరిపడలేదు. అదియటుండ ఆంగ్లేయసేనలలో నెక్కువమంది కాంటను నగరవాసులయిన చీనావారేయనియు, ఆంగ్లేయమంత్రి యిచ్చుజీతములకాశపడి వారికొలువులో చేరిరనియు, వారికి చక్రవర్తి హెచ్చుజీతము లిచ్చినయెడల, చక్రవర్తి కొలువులోనే నుందురనియు సాంకోలిన్‌సను చక్రవర్తికిఁ దెలియ జేసెను.

## సంధికొఱ కాంగ్లేయులు కోరిన నిబంధనము

ఆంగ్లేయమంత్రి "టియంటిసిన్" (Tientsin) నగరము చేరఁగానే ఆయన కొఱకు వేచియున్న "హాంగుఫూ" (Hong Fu) రాజప్రతినిధి యాయనను విందుకుఁ బిలిచెను. కానియాయన సమ్మతింపలేదు. ఆంగ్లేయుల ప్రచండాగమనంబుఁజూచి బెఱగొంది చక్రవర్తి యాంగ్లేయులతో నొడంబడికచేసికొని రమ్మని తనముఖ్యమంత్రియయిన క్విలియాంగును శీఘ్రము

గంబంపెను. ఆయన హోకగుంతో సంప్రతించి యొడంబడిక చేసికొనెదమని యాంగ్లేయ మంత్రియయిన లార్డు ఎలిజిక్కుకుఁ దెలియఁజేయగా, ఆయన యీ దిగువ నిబంధనల కొప్పుకొనిన యెడల సంధికియ్యకొనెదమనియు, లేనియెడల యుద్ధప్రవాహ మాగదనియుఁ జెప్పెను. నిబంధనలేవనఁగా.

(1) పీహోనగరమం దాంగ్లేయసైన్యమును ఫ్రెంచిసైన్యమును చీనావారు నిష్కారణముగ ముట్టడించినందునకు చీనాదొరతనమువారు క్షమించుమని యాంగ్లేయులను వేడవలయును.

(2) "టీయంటుసిన్" నగరమందీవఱలోఁ గావింపఁబడిన యొడంబడికకాగితములో నావశ్యకమయిన సవరణచేసి తిరిగి వ్రాసియిచ్చుటయు.

(3) ఆంగ్లేయులకును ఫ్రెంచివారికయిన యుద్ధవ్యయములకు చీనాదొరతనమువారు భరింపవలెననియు.

## చీనావారి కపట ప్రవర్తన.

అట్లొడంబడికఁ జేసికొనుటకు వెంటనే సమ్మతించినట్లు నటింపుచు నానిబంధనలలోన సంగతాంశంబులేమి కలవని చీనామంత్రులు వాదింపఁదొడగిరఁట. అదికాక, చీనాదొరతనమువారు సంధివిషయమై రాయబారులను బంపుటలో నొకచిత్రంబు చేసెదరఁట. ఏమనిన, చక్రవర్తి రాయబారులకు సంధివిషయమై యవసరమగు నధికారములనన్నియు నీయక వారొనరించిన సంధితనకయిష్టమయినప్పుడు చెల్లదనును కావున నాంగ్లేయమంత్రి యీరాయబారుల మాటల లక్ష్యపెట్టక "టుంగుచౌ" నగరము చేరుదనుక సంధింగూర్చినప్రసంశలు జరుగవని వారికి జెప్పి పంపెను. పదంపడి సంధివిషయమై యారంభప్రసంగముల జరుపుటకై యాయన పార్కుసు, వేవు(Messrs Parkes & Wave) అను రాయబారులను ముందుగ టుంగుచౌ (Tung-chow) నగరమునకుబంపెను. వారినచ్చట చీనామంత్రులు గౌరవించిరి. 8 గంటలకాలము చర్చిజరిగిన పిమ్మట యొడంబడికవచనములు కొన్ని కుదిరెను. వానింబట్టి టుంగుచౌనగరమునకు పదిసంరెండు మైళ్లుదూరమున మిత్రసైన్యములు శిబిరముల వేయవలెననియు. ఆంగ్లేయరాయబారులు పికిన్ రాజధానికిపోయి యచ్చట రా

జనభీమలతో సంధివిషయమై ముచ్చటించి వెంటనె టుంగుచౌనగరమునకు మరలిరావలెననియు నేర్పడెను. (ఇచ్చట మిత్రసైన్యమనఁగా నాంగ్లేయులను ఫ్రెంచివారు నని గ్రహింపవలెను.)

## చీనావారు రహస్యముగ యుద్ధప్రయత్నములు చేయుట.

సంధినిబంధనలను గుఱించి చీనావారి మంత్రులు తా మానిబంధనలకు మొదటసమ్మతించియున్నవారయ్యును, ఆంగ్లేయమంత్రుల ననేక కుశంక లడుగుచు సెట్టకేలకొప్పుకొనఁగా, నొడంబడిక కాగితముయొక్క చిత్తువ్రాయఁబడినది. దానిని "పార్క్సు" రాయబారి తనజేబులోవేసుకొని తన శిబిరమునకుఁ బోయెను. అదియటుండ చీనాసేనానియైన సాంకోలిన్సన్ రహస్యముగ యుద్ధప్రయత్నములు చేయుచు మిత్రసైన్యము శిబిరములు వేయుటకు చీనావారొసంగిన స్థలము చుట్టునుండు కొండలయందును, బొదలచాటునను, దనసేనను దాఁచియుంచెను. 'పార్క్సు" రాయబారి చీనావారి ద్రోహకృత్యము నాస్థలంబునకుఁబోయి కనిపెట్టి తనవారికిఁ దెలియఁజేయుటకై తనకుఁ దోడుగానున్న "వేడీ" రాయబారిని బంపెను. చీనాసైనికులు క్రమక్రమంబుగ "టుంగుచౌ" నగరముదనుక క్రమ్ముకొని రాఁగపార్క్సు రాయబారి తనవారిం గలసికొనుటకు వెరవుకానక కొందలంబు నొందుచుండ "సాంకోలిన్సన్" దగ్గఱకువెళ్లి సెలవుచీటి తెచ్చుకొనినంగాని దాఁదొరకదని చీనాభటులాయనకుఁ జెప్పిరి. ఆయనవెంటను మఱియొక యాంగ్లేయరాయబారియు సిక్కులజాతివాడొకఁడు నుండెను. వారంతట చీనాసేనానివద్దకుఁబోఁగ వారి నిఁబరిహసించి యవమానించి యాయనయు ఆయనసైనికులును సెన్నియొ తిప్పలుపెట్టిరఁట. పార్క్సురాయబారి తలఁచుకొనినయెడల నాంగ్లేయయుద్ధమాపింపఁగలఁడని చీనాసేనానియొక్క యభిప్రాయము కావున సంధులజేయమని యారాయబారిని ఆయన కోరఁగా నారాయబారి గట్టిగ నిరాకరించెను. పిమ్మట ఆయనయు త్తరువుప్రకార మారాయబారిని ఆయనయనుచరులను సంకెళ్ళువేసి చీనారాజధానిలో నుండు చెఱసాలలోఁ బెట్టిరి.

## ఆంగ్లేయరాయబారులను జెఱసాలలోఁ బెట్టుట.

చెఱసాలలోఁ బెట్టక పూర్వమును బెట్టినతర్వాతను చీనావారు వారిని బెట్టిన యిడుములను జెఱసాలలో వారు పడినకష్టములను గ్రంథవిస్తరభీతిచే విశదీకరింపలేదు. వారుంచఁబడిన చెఱసాల రెండవయమలోక మనందగి యున్నదఁట. వారు దానిలో 10 దివసంబులున్నపిదప చీనావారు తమకు రాఁబోవు పరాజయలక్షణంబుల ముందుగఁ గనుగొని వారిని జెఱసాలనుండి తప్పించి యొక దేవాలయంబుననుండి యచ్చట దయతో వారి నాదరింపఁసాగిరి. వారలట్లిడుమలంగుడుచుచుండ “చాంగుచియావాన్” (Chang chiawan) నగరమువద్ద మిత్రసైన్యమునకును చీనావారికిని బ్రచండభండనంబు జరుగుచుండెను. ఆయుద్ధమందు తార్తారపుగుఱ్ఱపుదళమును “సాంగోలిన్సన్” నడుపించుచుండెను. మిత్రసైన్యముయొక్క తాఁకుడల నాపుటకు వారెంతయుఁ బీరంబుతోఁ బోరాడిరి. కాని తుదకాంగ్లేయులధాటి కోర్వఁజాలక రణరంగంబున డెబ్బదినాలుగు ఫిరంగుల విడిచిపెట్టి చెల్లాచెదరయిపోయిరి. వారిని మరల సమకూర్చుకొని పికిన్ నగరమువైపుననున్న సేనానితోఁ గలసి తిరిగి మిత్రసైన్యముతోఁ దలపడి చీనావారోడిపోయిరి.

చక్రవర్తి మంగోలియాయందున్న జిహాల్ (Jehol) నగరమునకుఁ బారిపోయెను. చీనారాజధానియం దాయన తమ్ముఁడయిన “కంగు” (Kung) రాజకీయవ్యవహారముల నెఱవేర్చుచుండెను. ఆయన యుయాన్ మింగు యుయాన్” నగరమందు “డవాజర్ చక్రవర్తిని”తోఁ గూడనుండి చీనావారి పరాజయ దుఃఖవార్తల డెప్పించుకొనుచుండెను. తుదకు ఆంగ్లేయులయొక్క యవక్రవిక్రమంబుం జూచి భీతినొంది సంధిచేసికొనెద నని పికిన్ రాజధానికివచ్చి యాంగ్లేయమంత్రికి వ్రాసెను. చెఱలోనున్న యాంగ్లేయ రాయబారులను దక్షణమె విడిచిపెట్టవలయుననియు, బిమ్మట సంధివిషయముల మాట్లాడుట, కలుగుననియు నటుల విడువనియెడల చీనారాజ్యమునకే కాక రాజవంశమునకును ముప్పువాటిల్లుననియు సంగ్రహముగఁ బ్రత్యుత్తరమిచ్చెను. సంధివిషయమై నిరాశుఁడై పికిన్ రాజధాని గోడలను బలపఱచుమని

యచ్చటి సైనికులకుఁ దెలియఁజేసి "కంగు" మఱల "యుయాన్ మింగు యుయాన్‌కు" వెళ్లెను. మిత్రసైన్యమా నగరమును ముట్టడింపఁగా ఆయనయు జక్రవర్తినియు వారికి జిక్కకుండ వెనుకదారిని బలాయనమయిరి. రాజభవనమందు గొందఱు కర్జాలును నిద్దరుద్యోగులును మాత్రముండిరి.

## యుయాన్ మింగు యుయాన్ యొక్క వర్ణన.

"యుయాన్ మింగుయుయాన్" చీనారాజధానికి నందనవనమువంటిది. చక్రవర్తి విశ్రాంతినొందుటకై యచ్చట నప్పుడప్పుడు నివసించుచుండును. ఆప్రదేశము బహువిశాలముగ నుండును. అనుకూలములయిన స్థలములయందెల్ల ననేకమంటపములు కట్టఁబడియుండును. పుష్పించుచుండు ననేకతరుగుల్మాదులచే యందలివనంబులు బహుసుందరములుగ నుండును. ప్రవాహములకును సరస్సులకును వింత వంతెనలుండును. ఆప్రవాహసరస్సుల కిరుప్రక్కల భవనంబులుండును. ఆభవనములయందపురూపములును నమూల్యములునయిన వస్తువులుండును. "కింటిచింగు" నుండి వచ్చిన ప్రశస్తములయిన పింగాణిదినుసులును "సూచౌ" నుండివచ్చెడు కంచుసామానులును, మధ్య ఆసియా నుండివచ్చెడి యొకవిధమయిన శిలాభరణములును, ఫ్రాన్సు దేశమునుండి వచ్చిన జేబుగడియారములును, బెద్దగడియారములును, ఇంగ్లాండునుండి పంపఁబడిన సాధారణ సామానులును, ఆభవనంబులలో నిండియుండెను.

మిత్రసైనికులు తమ యధికారుల యనుమతింబడసి రాజభవనములయందలి సమస్తవస్తువులను గొల్లఁగొనిరి. ఆదురవస్థఁజూచి "కంగు" సంధివిషయమై మఱల నాంగ్లేయమంత్రిని గోరఁగా "పికిన్" రాజధానియొక్క యుత్తరద్వారమును దమ వశముచేసినయెడల సంధికియ్యకొనెదనని చెప్పెను. గత్యంతరములేక యట్లు వశపఱచుటకు "కంగు" సమ్మతించెను.

"జిహోల్" నగరమందున్న చక్రవర్తియు ఆయన సభికులును నిర్బంధములోనున్న యాంగ్లేయ రాయబారులను వధింప యోజించుచుండిరి. కంగు మొదలయినవారు వారిని విడుదలసేసి సంధిచేసికొనుట మంచిదని తలఁచుచుండిరి. అట్లు రెండుపక్షముల వారేర్పడిరి. చక్రవర్తి తనపక్షమువారి దుర్బో

ధనేవలన వారి నురిదీయుటకు శాసనము పికిజ్ నగరమునకుఁ బంపెను. అట్లు-
పంపుట ముందుగనెతెంగి "కంగు" వారిని విడుదలఁజేసి యాంగ్లేయాధికారి
యొద్దకు బండిపైనెక్కించి పంపివేసెను. వారి యనుచరులలోఁ గొందఱనుగూడ
విడుదలచేసెను.

విడుదల యయివచ్చిన రాయబారులవలన చీనావారి క్రూరకృత్యము
లను విని చీనాదొరతనము వారికిఁ దగుశాస్తిచేసి తీఱవలెననియుఁ బ్రజలుని-
ర్దోషులుకావున వారిని బాధింపరాదనియు నిశ్చయించుకొని యాంగ్లేయమం-
త్రిరాజభవనమునకుఁ జిచ్చుపెట్టించెను. అనేకదినముల దనుక వీతిహోత్రుఁడు
తనసంగాతియగు ప్రచండవాతంబుఁ దోడుచేసికొని దనసప్తజిహ్వాల నల్లార్చు-
చుండెను. బహుదివసంబుల పర్యంతము ధూమంబు పికిజ్ రాజధానిపై నీలవ
స్త్రంబు గప్పినట్లుండెనఁట. "జిహాల్" నగరమందుండు చక్రవర్తి పక్షము
వారు విదేశీయసంహారణోపాయంబులనే నెమకుచుండఁగ "కంగు" నెమ్మదిగ
నాంగ్లేయుల సమ్మతింబడసి సంధి కావించుకొనెను. ఆసంధి నిబంధనచే చీనా
వారికిని పశ్చిమఖండ వాసులకును, నేటిదనుకను సలక్షణముగ జరుగుచున్నవి.

## చక్రవర్తి కాలోచన చెప్పువారు తెఱుగులుగ నుండుట.

మిత్రసైన్యముయొక్క బలపరాక్రమంబుల నెతెంగిన "కంగు" అమి
త్రుల (ఆంగ్లేయులు, ఫ్రెంచివారు) తో చీనావారు మఱలఁ బోరాడఁజూచు-
ట యవివేక కృత్యమని నిశ్చయించుకొనియుండె. చక్రవర్తియో దుర్మంత్రి
బోధితుండై యన్యోన్యమిత్రులయిన యాంగ్లేయులతోను ఫ్రెంచివారితోను
గలహమాడఁదలంపుఁగలవాఁడుగానే యుండెను. జిహాల్ నగరమందుండుమ
ట్టుకు చక్రవర్తి తనమాటవినఁడని తలఁచి యాయనను పికిజ్ రాజధానికి విచ్చే-
యుమని యత్యాదరముతో "కంగు" వేడినను దుర్మంత్రులాయనను బోనీయ
రైరి. "కంగు" తనవ్యవహారములన్నియు "డవాజరుచక్రవర్తిని" యొక్కయ
నుమతిం గైకొనియే చేయుచుండెను. ఆమెగతించిన చక్రవర్తియొక్క భార్య-
యై రాజ్యమందు హక్కుకలది. కావుననే యామెను "డవాజరు" అనియాం
గ్లేయభాషలో ననెదరు. ఆమె బహుసమర్థురాలు. చక్రవర్తి మిగులనసమర్థుఁ

డగుటచే ఆయన సభికులే యీయన యాజ్ఞలనుల్లంఘించిరి. 1860_61సం. లో రాజసభయందు గుట్రలు మెండుగజరుగుచుండెను. తనకు ప్రతికక్షులుగనుండి నమంత్రుల దుర్నయంబు నివారింపదనుక నెమ్మది యిమ్మగనేర్పడు నట్లు "కంగు" డుం గనంబడకుండెను. "కంగు" పక్షంబున "హాంకి" మున్నగు ప్రముఖు లుండిరి. వారు మర్యాదకలవారు. వ్యవహారసరణి నెఱింగినవారు. కాని విదేశీయులందుమాత్రము ద్వేషములేనివారు కారు. ఎల్గినంగాం బైనినుదువం డిన పార్కుసురాయబారి చెఱలోనున్నప్పు డాయనతో నొకసమయమం దా "హాంకి" యిట్లు వల్కెనంట.

## చీనామంత్రుల ద్వేషలక్షణము.

"మీరు పొరంబడవద్దు. మిమ్ము విడుదలజేయుమని చెప్పియుండుట మిమ్ము బట్టికాదు. లేశమాత్రమును గాదు. మీమరణము నాకు లాభకారిగ నున్నయెడల మిమ్మును జంపుమనియే చెప్పియుందును. మీవాం డ్రెటువంటి వారో నేనెఱుంగుదును గావున నట్లుచెప్పియుండలేదు. మీవాండ్రు తలపె ట్టినయెడల సర్వసంహారము చేయంగలరు. రాయబారులయిన మీయిద్దఱను మేము జంపుదుమేని మారాజధాని మాకు దక్కదు. మఱియు మేమును మా ప్రజలును జెడిపోవుదుము". చీనావారి యుద్యోగులలో 100కి 99మంది. విదేశీయద్వేషముకలవారై యుండిరంట.

పిమ్మట పికిన్ గేజటియందు "సాంకోలిన్సన్" "జూలిన్" అనుమం త్రులను వారియధికారములనుండి తొలగించినట్లు చక్రవర్తియొక్క శాసనము ప్రకటింపంబడెను. చీనారాజ్యమందలి గొప్పయుద్యోగులు వారివారికి నియ మింపంబడిన కార్యములను నిర్వహించుటవలనం దమ ప్రాణంబుల నిలుపుకొను టయు, నిర్వహింపం జాలనియెడలం గోలుపోవుటయును విధిగా జరుగుచుం డెను. అట్టిదుస్తరమయిన చట్టము ప్రపంచములో మఱెచ్చటను గానరాదు. "సాంకోలిన్సన్" చక్రవర్తికి బంధువవుటచే నురికొయ్య కాయనను చక్రవ ర్తి బంపియుండక పోవచ్చును.

## చక్రవర్తి వ్యాధిగ్రస్తుఁడగుట.

"కంగు" ఎంతగాబోధించినను పికిన్ రాజధానికి రాక జిహోలునందే చక్రవర్తి యుండగా నచ్చట వ్యాధిగ్రస్తుఁడయ్యెను. మితిమించిన వ్యభిచారకృత్యదోషమే యాయనవ్యాధికిఁ గారణమయి యుండెను. అప్పుడే తోఁకచుక్క-కూడ నుదయించెను. దానంజేసి ప్రజ లల్ల కల్లోలముగ నుండిరి. అట్టిసమయంబున "కంగు" చక్రవర్తిపాలికింబోయి దుర్మంత్రులపీడనుండి యాయనను దొలగింపఁజూచెను గాని వినియోగింపదయ్యె. "కంగు" పికన్ రాజధానికి మఱలివచ్చినతోడనే చక్రవర్తియొక్క జ్యేష్ఠపుత్రుఁడైన "సాయిచున్" చక్రవర్తిగ నియమింపఁబడెననియు "షూషన్" మొదలయిన యెనమండ్రు సభికు లాయనకు రాజ్యపాలనమందు సాహాయ్య మొనర్పవలెననియు నొకశాసనము ప్రచురింపఁబడెను. 1861 సం. ఆగష్టు 22 తేదీని చక్రవర్తి మృతినొందెను. ఈచక్రవర్తి దుర్నయుండును దుర్బలుఁడును దుర్మంత్రి బోధితుండునునగుటచే నీయన తనకాలంబున నాంగ్లేయులతో నిష్కారణవైరంబుపూని పూర్వచక్రవర్తులు రాజ్యమునకు బెట్టిపోయిన గొప్పమర్యాదను గోలుపోవుటయేకాక యనేక యుద్ధములయందుఁ బరాజయంబొంది భాండాగారము శూన్యాగారముగ నించుమించుగఁ జేసెను. కలహకారుల నడంపలేకపోయెను. విదేశీయులు విజృంభించునట్లు చేసెను. నూతనచక్రవర్తి వయస్సు నాలుగువత్సరంబులు. ఆయనకొఱకు నియమింపఁబడినసభికులందఱును విదేశీయవిద్వేషులే.

కొంతకాలమువఱకు రాజ్యపరిపాలన నెమ్మదిగనుండెను. విదేశీయసంబంధవ్యవహారములు "కంగు" మొదలయినవారు జరుపుచుండిరి. రాజ్యపరిపాలన జిహోల్ లోనున్న సభికులు నెఱవేర్చుచుండిరి. అటులనుండఁగ చక్రవర్తి పికిన్ రాజధానికి రావలయుననియు, గతించిన చక్రవర్తి శల్యములను సపరివారంబుగ ఆయన తనవెంట దోడ్కొని రావలయుననియు, అక్టోబరు నెలాఖరునఁ బ్రకటింపఁబడెను. అంతఃపుర వాసినులు ప్రథమమున వచ్చిరి. పిమ్మట ఆబాల చక్రవర్తి తనతల్లితోడపై కూర్చుండివచ్చెను. శల్యములనుఁ దరలించుకొని వెంట "షూషన్" అనుసభికుఁడు వచ్చెను. అనంతరము చక్రవర్తి ప్రకటిం

చినట్లుగ నొకశాసనము బయలువెడలెను. గతంబున నియమింపఁబడిన రాజసభికులందఱును వారి యుద్యోగములనుండి తొలగింపఁబడిరనియు, చక్రవర్తితల్లియుఁ బూర్వమున నడువఁబడిన "డవాజరుచక్రవర్తిని" యు, బాలచక్రవర్తికిఁ బాలకచక్రవర్తినులుగ నుండవలెననియు, ఆసభికులలో షుక్షక్ మొదలుగ ముప్వురుసభికులు చక్రవర్తిని మోసపుచ్చి యున్నందునను విచారణజేయఁబడవలయుననియు, నాశాసనమందు బ్రకటింపఁబడెను. చక్రవర్తి శాసనమునకు వారు లోఁబడుదురో, లోఁబడరోయనియుఁ గలహము ప్రవర్తిల్లునేమోయనియు శంకించి "కంగు" తగుపాటి సేనాసన్నాహము కావించియుండె. ఆసభికులలో నయిదుగురు సభనుండి తొలగింపఁబడిరి. "షుక్షక్" మొదలయిన కడమముప్వురిలో నిద్దఱు నురిదీయుటకును "షుక్షక్" ను జిత్రవధచేసి చంపుటకును దీర్పుచేయఁబడెను. ఉరిదీయుట చీనారాజ్యమందవలీల కదా. కాచి పరిపాలక చక్రవర్తినులు కరుణించి షుక్షక్ యొక్క శిరంబు ఖండించుటకును, గడమయిద్దఱిని జెఱసాలయందుంచునట్లు నుత్తరువుచేసిరి. అప్పటికి కంగుయొక్క కోర్కె సిద్ధించెను. ఆసభికులు చక్రవర్తికి "చిసియాంగ్" అని నామంబిడిరి. దానిని దొలఁగించి "టుంగ్చి" నామంబు "కంగు" పెట్టెను.

---

## 11-వ అధ్యాయము.

టుఁగ్చిచక్రవర్తియొక్క పరిపాలనాశేషము.
టాయిపింగ్ కలహము.

### టాయిపింగు కలహముయొక్క శేషము.

ఈకలహమును గుఱించి కొంతవట్టుకు 8-వ యధ్యాయమందు లిఖింపఁబడియున్నది. "యాక్గు టిసుకియాంగు" నదీప్రాంత ప్రదేశములన్నియు "హంగు" తాను స్వర్గీయ ప్రభువునని బిరుదువహించి నాన్కిక్ నగరమును రాజధానిగాజేసికొని పరిపాలించు చుండెను. 1859 సం. లో వానియధికారమంతయు

క్షీణించుటచె "నాన్కిన్" "అన్కిన్" రెండునగరములు మాత్రమె వాని స్వాధీనమందుండెను. ఆనగరములు విదేశీయుల వశముకాకుండఁ గాపాడుటకై ముందుగనే తాము మరల స్వాధీనపఱచుకొనన నుద్దేశించి చీనాదొరతనము వారు కలహకారులను నిర్జించి తరిమివేయుఁడని తత్ప్రదేశాధికారులకు గట్టి యుత్తరువులు చేసిరి. "టీన్ వాంగు" అని మఱియొక బిరుదుగల యాస్వర్గీయ ప్రభువు కామలంపటుఁడై యంతఃపురమందె యువతులతో మునిఁగి తేలుచుం డెను. "చుంగువాంగు" అను సేనానాయకుఁడు తప్ప యతనియొక్క కడమ సేనానాయకులు తమశౌర్యాదులఁ ద్యజించియుండిరి. "సెంగుక్వోపాన్" అను చీనాసేనాని ప్రబలసైన్యంబుఁ గూర్చుకొని 1859 సం. లో నాన్కిన్న గరమును ముట్టడించెను. రణవీరుఁడైన "చుంగువాంగు" తారసిల కుండెనేని కలహకారుల రాజ్యము నిర్మూలింపఁబడియుండును. చీనావారి సైన్యమునకు వెలుపలనుండి భోజనసామగ్రులు సమకూరకుండఁ జేయుటచే నాన్కిన్ నగ రముట్టడి వదలిపోవునని యోచించి "చుంగువాంగు" "యాఁగ్ టిసుకియాం గు" నదీప్రాంతనగరముల ననేకములను ముట్టడించి వశపఱచుకొని "హాంగు చౌ" అను ప్రసిద్ధపట్టణముయొక్క పురోభాగమం దాకస్మికముగ పోయిని ల్చెను. కాని నాన్కిన్ నగరమును చీనాసైన్యముయొక్క ముట్టడినుండి విడిపింప వలయునని స్వర్గీయ ప్రభువు ఉత్తరువుచేయుటచే "చుంగువాంగు" తక్షణమే వెడలి యచ్చటి చీనాసైన్యముతోఁ దలపడి ఘోరరణంబొనర్చి వారినూచము ట్టుగ నోడించి యుక్కుతునియఁవంటి 5,000 సైన్యమును హతముకావించెను.

## కలహకారులయొక్క మఱికొన్ని జయములు.

అనంతరమాతఁడు "సూచౌ" (soochow) నగరమునకు మఱలఁ బోయి తన పట్టినపట్టు నెఱవేర్చుకొనఁజూడఁగా ఆనగరమున కుత్తరముగ స మర్థుండగు సేనానియయిన "చాంగుక్వోలియాంగు". (changkwoli-ang) ప్రబల సేనాసమేతుఁడైయుంట కనుంగొని యాతనిందాఁకి 10000 మందిని నాశముచేసెను. దొరతనమువారి సైన్యము మరియొకచోట మిగుల నప జయమొందెను. చీనాసేనాని యయిన "హో" (Ho) దొరతనమువారికిఁ

గలిగినపరాజయంబులచే భీతిల్లి తన కరికోర్య్యసిద్ధమేయని యెఱింగి యాత్మహత్య కావించుకొనెను.

కియాంగు పరగణాల కధికారియయిన "హూ" పరువుతక్కువయని యనుకొనక కలహకారుల నడంచుట కాంగ్లేయులసహాయము వేడుకొనఁగా వారు సమ్మతింపక షాంగాయినగరమును మాత్రము కాపాడెదమని వాగ్దానము చేసిరి. చుంగువాంగు పదంపడి దొరతనమువారి సూచౌ మొదలయినయనేక పట్టణంబుల వశపఱచుకొనెను. తుదకు పసుపుయేరు హాంగుచౌ అఖాతములవలన నేర్పడిన సారవంతపర్యాయద్వీపమంతయుఁ గలహకారుల స్వాధీనమయ్యెను. దొరతనమువారు తమకుఁగలిగిన పరాజయపరంపరకు మిగుల సంతాపము నొంది ప్రదేశాధికారియయిన "హూ" ను పిలుపించుకొని విచారించి మరణదండన విధించిరి.

## దేశాభిమాన సంఘము.

"షాంఘాయి" (Shanghai) నగర పరిసరము దనుక కలహకారుల సైన్యము గదుముకొని వచ్చుచుండుటఁ జూచి యానగరమందలి వర్తకులు తమకు సమీపగ్రామములనుండి వచ్చుచుండు పట్టు తేయాకు మొదలయిన సరకు లిఁక రానేరవనియుఁ, దమవర్తకమునకే హాని కలుగుననియుఁ బరితపించి యాసమయంబున దొరతనమువారికిఁ దోడ్పడుట యవసరమని తలఁచి సహాయద్రవ్యమును గొంత, సమకూర్చుకొని దేశాభిమాన సంఘ మొకటి నిర్మించిరి. తత్ప్రదేశాధికారిగ నూతనముగ వచ్చిన "విహాంగు చాంగు" యొక్క యుపదేశము విని పశ్చిమఖండవాసులసహాయమును వారు కోరిరి.

అమెరికా దేశీయులైన వార్డు బూర్జివైను (Ward, Bourgevine) అనువారు వారికి సహాయులగుట కొప్పుకొనిరి. ఆంగ్లేయులయొక్కయు, ఫ్రెంచివారియొక్కయు సైన్యములలోఁ జేరియుండని యూరోపుఖండవాసులను జేర్చుకొని సేనను బ్రబలపఱచవలయుననియు, నియామకమయిన జీతము నిచ్చెదమనియుఁ, గలహకారులనగరములను బట్టుకొనినప్పుడు ప్రత్యేకముగ బహుమానముల నిచ్చెదమనియు, సంఘమువా రాసేనాధిపతులకుఁ జెప్పిరి.

షాంఘాయినగరమునకు దక్షిణముగ 20 మైళ్ల దూరమునఁ గలహకారులకు బలిష్ఠమయిన దుర్గ మొకటి యుండెను. 300 యూరోపియనులతోను "మిలాను" (Milan) నగర జనులతోను వార్డు దానిని సంఘమువారి కోరికంబట్టి ముట్టడించెను. వానికి సహాయసేనానిగ "బూర్జివైను" పని చేయుచుండెను. కాని వార్డు విశేషనష్టముతోఁ బరాజితుఁడయి షాంఘాయికి మరలి వచ్చి తన సైన్యమును సులభముగ బలపఱచికొనెను. పిమ్మట నాదుర్గమును మఱల ముట్టడించి సంపూర్ణజయ మొందెను. మఱియు, దానిని గొల్లగొనుటచే లభించిన ద్రవ్యాదులను దన సైనికులకు వార్డు పంచిపెట్టెను. అందువలన నితరు లనేకులు ద్రవ్యాశచే నాతని సేనలోఁ జేరిరి. "షాంఘాయి" తీరమందు దోపుడుకాండ్రును ద్రోహులు నయిన జనమునకుఁ గొదువలేకుండుటచే వార్డు తన సేనలో హతులైన వారిసంఖ్యను బూర్తిచేసికొనెను. పదంపడి "వార్డు" "సింగుపు" దుర్గమును ముట్టడించెను. అది కలహకారుల కొలువులో నున్న యొక యైరోపాదేశీయునిచే బలిష్ఠముగఁ జేయఁబడెను. ఆముట్టడిలో రణవీరుఁడైన "చుంగువాంగు" వార్డుసైన్యమును వెనుకతట్టునఁ దాఁకెను. కావున వార్డు నిశ్శేషముగ నోడింపఁబడెను. అతని ఫిరంగులును సామగ్రులును శత్రువశము లయ్యెను.

## ఆంగ్లేయాధికారి స్వర్గీయప్రభువును దర్శించుట.

పికిన్ దండయాత్రానంతర మాంగ్లేయాధికారులు కలహకారులచే విజితమైన ప్రదేశములయందలి వ్యవహారములను సావకాశముగాఁ గనుఁగొనుచుండిరి. షాంఘాయినగరము ప్రబలవర్తకస్థానముగానుండుటచే నది శత్రుపీడితముగ నుండఁగూడదని యోచించిరి. కాఁబట్టి యానగరమును ముట్టడించినయెడలఁ గలహకారులకును దమకును నష్టము కలుగు నని యాంగ్లేయాధికారి స్వర్గీయప్రభువును దర్శించి చెప్పఁగా నొకవత్సరపర్యంతము దానిని ముట్టడింప వలదని తనసేనానులకాయన యాజ్ఞ యొసంగెను. కాని "చుంగుచాంగు" "షాంఘాయి" ని ముట్టడించుటకే తలపెట్టి మిత్రసైన్యము తాఁకుడల కాగలేకపోయె. ఎట్లయిన నతనిజయంబుల నిన్ని యన్ని యని వాక్రువ్వఁదరము కానట్లు గనుండెను. కాని యవి దేశనాశకరంబులగుటచేఁ గొనియాడఁదగినవిగామాత్ర ముండలేదు. ఏనగరమయినను వశమయినతోడనే యందలిజనంబుల ధనప్రాణంబుల

హరించుటయే వారి కుతూహలమయి యుండెను. అది యటుండ కలహకారుల నలజడి నుపేక్షించుచు చీనాదొరతనము వారుచేయుకాలయాపనము మిగుల శోచనీయముగ నుండెను. చీనాదొరతనమువారు నాన్కిన్ నగరమును మఱల ముట్టడించిరి. ఇది వారి కాఱవసారి. షాంఘాయినగరమందు మఱల యుద్ధము జరుగఁబోవుచుండెను. అటుల వా రగ్నిద్వయమధ్యమం దున్నవారుగా నుండిరి. షాంఘాయియందు రాఁబోవు యుద్ధకార్యమేది యనిన.—

## "చుంగుచాంగు" షాంఘాయినగరమును ముట్టడించి యోడిపోవుట.

ఆనగరమును తనసేనలు ముట్టడింపకుంటకు స్వర్గీయప్రభువు ఆంగ్లేయుల కొసంగి యుండిన సంవత్సరపుగడువు తుదముట్టెను. "చుంగువాంగు" దక్షిణప్రాంతములయందుఁ బడసియున్న జయంబులతో మిన్నంది యానగరసమీపమున దండువిడిసి యచ్చోటును గంధకములచే బలపఱచుకొనుచుఁ దత్సమీప నగరాదులను గొల్లపెట్టుచుండెను. ఆనగరమునకుఁ జుట్టు 30 మైళ్లవఱకుఁ దనసేనలు పోకూడదని స్వర్గీయప్రభు వుత్తరువు చేసియుండెను. ఆయన యాజ్ఞ యెట్లుండినను "చుంగువాంగు" ఆనగరమును ముట్టడించి మిత్రసైన్యమల్పంబుగనుండినను బూర్తిగఁ బరాజితుఁడయ్యెను. గతంబున నుడువఁబడిన "వార్డు" సమగ్ధమయిన 5000 సేనంగూర్చుకొని "చుంగువాన్"ను జయించుటలో నాంగ్లేయులకుఁ దోడ్పడెను. అతఁడా సేనను స్వయముగాఁ దీర్చి చేసెను. స్వయముగా స్వర్గీయప్రభువుయొక్క సైన్యముల ననేకపర్యాయము లోడించి జయమొంది తనసేనకు "నిరంతర విజయసైన్యము" (The Ever victoriors army) అను పౌరుషనామంబుఁ బెట్టెను. కాని యతఁడొక పోరునందు గాయపడుటచే మృతినొందెను. అతఁడు విద్యావంతుఁడు కాకున్నను యుద్ధవ్యాపారములఁ జక్కగ నెఱిఁగినవాఁడు. అతఁడు చీనావారికొలువునందున్న రెండు వత్సరంబులలో లంచపంచములవల్ల 15000 పౌను లార్జించెనఁట. చీనాదొరతనమువారి పరిపాలనాదౌర్బల్యమున కది యొక దృష్టాంతమే కదా యని చరిత్రకారుఁడు నుడివెను.

"వార్డు" యొక్క మరణానంతర మతని కదివజఱకు సహాయ సేనానిగ నున్న "జార్జివైను" ను సేనానాయకునిగ దేశాభిమానసంఘమువారు నియమించిరి. అతఁడు పట్టపగ్గములేని యహంభావము కలవాఁడగుటచేఁ దనయిష్ట ప్రకారము వ్యవహరింపఁ దలఁచెను. అతనిచర్య సంఘమువారి కనుకూలింపనందున సేనలకుఁ బ్రతిమాసమిచ్చు 30000 పౌనులలోఁ గొంత తగ్గించిరి. దానిచే ఆ నూతనసేనాని కోపావేశపరవశుండై షాంఘాయినగరమందు సంఘమువారి ద్రవ్యాధికారితోఁ బోట్లాడి కొట్లాడి యతనియధీనమం దున్న సంఘమువారి ద్రవ్యమును దౌర్జన్యముగా లాగికొని తనశిబిరమునకు వచ్చెను. కావున నతనిం దొలఁగించి మరియొకనిని సంఘమువారు సేనానిగ నేర్పఱుపఁగ నతఁడు స్వర్గీయప్రభువును మార్కొనెడు మహోద్యమంబునఁ బరాజితుండయ్యె.

## "గార్డన్" అను నాతనిని సేనానిఁగా నియమించుట.

పిమ్మట సంఘమువారు "గార్డను" అను నాతనిని సేనానిగ నియమించిరి. అతఁడు బహుసమర్థుఁడు, నధికధైర్యశాలి, న్యాయవర్తనుఁడు. సేనాధిపత్యమును వహించినతోడనే స్వర్గీయప్రభువునైన "ఫుషాన్" (Fushan) నగరమును ముట్టడించి వశపఱచుకొనెను. దానిచే "చాంగుషూ" నగరమందున్న కలహకారులు దానిని విడిచిపెట్టి పాఱిపోయిరి. ఒక్కదెబ్బకు రెండుపండ్లు పడినట్లు గార్డను కట్లు రెండు జయములు కలిగెను. తత్ప్రదేశాధికారియయిన "లిహంగుచాంగు" (Li Hung Chang) గార్డనుయొక్క ప్రబలసామర్థ్యమును గొనియాడుచుఁ జక్రవర్తికి నాతనిగూర్చి తెలియఁజేయఁగా చక్రవర్తి యాయధికారి కిట్లువ్రాసెను.

"గార్డను" నిరంతరవిజయసైన్యాధికారియయినతోడనే తనసామర్థ్యమును జాకచక్యమును బ్రకాశించునటుల ఫుషాన్ నగరమును జయించుటంజేసి మాదొరతనమందు సేనానియొక్క హోదానిచ్చినారము. మేమిట్లు వ్రాసితిమని యాతనికిఁ దెలియఁజేయుము. ఆసైన్యమందుఁ గ్రమశిక్ష లోపించియుండెంగావున గార్డను దానిని గట్టుబాటులోనికిఁ దేవలయును. ఆసేన పూర్వపు దుస్థితిలోనికి మఱల రాఁగూడదని కూడ నతనికిఁ దెల్పవలయు."

పిమ్మట గార్డను "సూచా" (Soochow) నగరమును ముట్టడించుటకు ముందుగ "కుషాన్" (Kushan) నగరమును వశపఱచుకొనుట యావశ్యకమని దానిపైకిఁ బోవ సంకించుచుండఁగా నిదివఱలో "తాయిట్ సాంగు" నగరమందు చీనాసైన్యమును గలహకారులు బిట్టుగనోడించి యుండుటంజేసి యాపగఁ దీర్చుకొనుటకై దానిని ముట్టడింపుమని యాతనికిఁ బరగణాధికారి తెలియఁజేసెను. కాఁబట్టి యతఁడు దానిపైకిం బోవ సన్నహించుచుండెను. అంతకులోఁగానే స్వర్గీయప్రభువుయొక్క మంత్రులు సంధిచేసికొనెదమని నమ్మించి యాపట్టణములోనికి 1500 చీనావారి యుద్యోగులను రావించి వారినందఱను నిశ్శేషముగా హతము కావించిరి.

గార్డను ఆనగరమును ముట్టడించి మొదటయోడి పిమ్మట మరల ముట్టడించి దాని నిరాఘాటముగ వశపఱచుకొనెను. కాని యాముట్టడిలో తనవశులయిన యేడ్వుర కలహనాయకులను దత్పరిదేశాధికారికి వప్పగింపఁగా ఆయన వారి నతిక్రూరముగ హింసించి చంపినందునకు మిగుల జింతించెనేకాని తన జయంబునకు సంతసింపఁడయ్యె. అట్లు చంపుట చీనాదొరతనపు మర్యాదయే కావున గార్డ ననుమతించినవాఁడే యయ్యెను.

## కుషాన్ నగరమును గార్డన్ ముట్టడించుట.

తానంతకు మున్ను తలపెట్టియున్న కుషాన్ నగరము ముట్టడించుటకు గార్డన్ వెడలఁగాఁ బైఁజెప్పిన నగరమును వశపఱచుకొనినపుడు సేనలను వారి యాచారప్రకారము దోఁచుకొన నీయనందునకుఁ గినిసినవారై గార్డను మీఁద సైనికులలోఁ గొందఱు తిరుగఁబడిరి. గార్డనుయొక్క సేనలలోనున్న భటులు నగరములను దోచుకొని మూటలు కట్టుకొనఁ దలఁచినవారే కాని, కేవలము శూరులై పోరి కీర్తిం జెందఁగోరినవారు కారు. అయినను దిరుగఁబడినవారిని మాత్రమే చేకొని కడమవారు వెంటనే తమ్మును దారిలోఁగలియని యెడలఁ గొలువులోనుండి వారిని దప్పించెదనని యుత్తరువుచేయఁగా వారు మఱలఁగలసిరి. ఆయనకుఁ దోడుగ చీనావారి సేనానాయకుఁడు కొంత సేనతో బయలువెడలెను. ఆయన యానగరమును దూర్పుదెసయందు ముట్టడించుట మే

లని యెంతయో పరిశీలించి చెప్పెను. కాన నాదెస బలిష్ఠముగ నున్నదని యెఱింగి యట్లుచేయక బలహీనముగా నున్న దెస గార్డన్ ముట్టడింపఁగా శత్రువులు నగరమువిడిచి పాఱిపోయిరి. ఆనగరమునుండి సూచౌనగరమునకు వారు బహిరంగముగాఁ బలాయన మొనరించుచుండఁగా వేలకొలఁది ఫిరంగులచే మడిసిరి. గార్డను సేనలో నయిదుగురుమాత్రము చనిపోయిరి. ఇట్లు "సూచౌ" నగరమునకుఁ దాళపు చెవివలెనున్న కుషాన్ నగరము చీనాదొరతనమువారికి సంపాదించినవాఁడయ్యెను.

కుషాన్ నగరమందుఁ దనసేనల నుంచినయెడల వ్యూహములను బాగుగఁ బన్నవచ్చుననియు, సేనలను కట్టుదిట్టములలో నుంచవచ్చుననియు గార్డను దలఁచెను. కాని యాయనసేనలు నగరాదులను దోచుకొని యాద్రవ్యాదులను సేనానివేశస్థానమైన "సుంకి యాంగు" (Sungkiang) నగరమునకంతకుమున్నె గొంపోవుట వీలుగనుండెను. కాఁబట్టి యానగరమును విడిచి కుషాన్ నగరమునకుఁబోవుట కిష్టములేక తిరుగఁబడఁగాఁ గలహకారకుఁడయినవానిని గార్డను ఫిరంగివాతఁ బడవేసెను. అంతటఁ గడమవా రాశనికి లోఁబడిరి.

## గెల్చిన సేనలకు దొరతనమువారు బహుమాన మిచ్చుటను గుఱించి.

గార్డను చీనాదొరతనమువారి కంత మహోపకారిగ నుండఁగా కుషాన్ నగరమును ముట్టడించునపుడు దనయేర్పాటు నాయన యంగీకరింపలేదని చీనాసేనానియైన చెంగు క్రోధముఁ బూని యొకప్పుడు గార్డను సైన్యముపై ఫిరంగులఁ గాల్పించెను. అది యటుండ ముట్టడియొక్క యనంతరము నగరాదులను దోచుకొనుట కంగీకరించుటచే సేనలయొక్క కట్టుబాటును విచ్ఛిన్నములగునని తలఁచి ముట్టడిలో గెల్చిన సైన్యమునకు దొరతనమువారు బహుమానమిచ్చుటమేలని "లిహంగుచాంగు" కు ఆయన తెలియఁజేయఁగా నందువలన దొరతనమువారికి వ్యయమధికమగు ననియుఁ దమశక్తికొలఁదిని సేనలు దోఁచుకొనుటయే మేలనియుఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఇది మిగుల నింద్యమయిన వ్యవహారమని యెన్నవలెను. ఆవిధముగ లిహంగు చాంగునకును గార్డనుకును బ్రతికూ

ళస్థితి ప్రబలమయ్యెను. కావున గార్డను దనకుఁ గలిగిన యిబ్బందులను "లి" కిఁ దెలియఁబఱచి సేనాధిపత్యమును వదులుకొనెను.

## గార్డన్ చీనారాజ్యమునకు మఱల గొన్ని జయముల సంపాదించుట.

అంతట గార్డన్ కుషాన్ నగరమునుండి షాంఘాయినగరమునకుఁ బోయెను. ఈవఱలో చీనాదేశాభిమానసంఘమువారి కొలువులో సేనానిగనుండిన "బూర్జివైను" (Bourgevine) కలహకారులలోఁ జేరి వారు సూచౌనగరమును మఱల వశపఱచుకొనుటకుఁ బ్రోత్సాహించుచున్నట్టు గార్డను వినెను. మఱియు, "నిరంతర విజయసైన్యమందలి భటులలోను నుద్యోగులలోను ననేకులు 'బూర్జివైను' సందెయనురాగము కలవారనియు నాతఁడెఱింగియుండెను. కావున చీనాసేనాని యొనరించియున్న ద్రోహకృత్యమును గాని, లిహాంగుచాంగుయొక్క లౌభ్యమును గాని పాటింపక రాజభక్తిచేఁ బ్రేరితుండై దేశాభిమానముకలవాఁడై వీరావేశుఁడై సమకూడిన సైన్యముతో గార్డన్ కుషాన్ నగరమునకుఁ బోయి శత్రుసన్నాహముల నరయుచుండెను. వారిసన్నాహంబు లేమియుం గానరామిచే సూచౌ నగరపు కోటయొక్క బయిటనున్న యొక కట్టడమును ముట్టడించి యాయన దానిని లోఁబఱచుకొనెను. గార్డనుయొక్క లెక్కలేని గెలుపులంజూచి తలఁకి యతండుక్షమియ యనుగ్రహించి సంధిచేసికొనెదమని శత్రునాయకులు రాయబారులఁ బంపసాగిరి. ఆ రాయబారులు గార్డన్ దర్శనమునకు వచ్చినప్పుడెల్ల "బూర్జివైను" వారివెంట నుండెను. తా మొనరించిన యపరాధముల మన్నించి తమ్ము శిక్షింపవలదనియే వారి ముఖ్యప్రార్థన. అటియటుండ బూర్జివైను శంకింపక గార్డనుతో రహస్యాలోచనయొకటి చేసెను. అదేమనిన, దానును గార్డను నేకీభవించి చీనాచక్రవర్తిని జయించి చీనారాజ్యము నేలెదమని యోచించెను. సత్యమయిన రాజభక్తికలవాఁడగుటచే గార్డను అట్టి ద్రోహకృత్యము నంగీకరింపఁడయ్యె. సంధియొక్క ముచ్చటలటుండ "సూచౌ" నగరమందు విచారకరమయిన విషయమొకటి యాకస్మికముగ సంభవించెను. దానియందుండు శత్రుసైన్యమునకు "మువాం

గు'' అనునతఁడు నాయకుఁడుగ నుండె. సంధివిషయమై యత్నించుచున్న నాయకులలో నతఁడు చేరియుండలేదు. అతఁడు మర్యాదకలవాఁడు. సంధిగోరిన నాయకులనందఱను గోటలోనికి రావించి యావిషయమై సాధకబాధకముల వారితో విచారించుచుండ వివాదావేశంబుచే నొకఁడాయనను బొడిచివేసెను. కడమనాయకు లందఱు గార్డను సేనయొక్క ద్వారము వెళపఱచుటకును దాము లోఁబడుటకు నొప్పుకొనిరి. వారి ప్రాణముల రక్షించెదనని గార్డను వాగ్దానముసంగెను. సంధికృత్యమంతయు గార్డనుయొక్క సమర్థతవలన నెఱవేఱుచుండఁగా ఆకీర్తిని దానుబొందవలెనని "లిహాంగుచాంగు" అచ్చటఁ బ్రత్యక్షమై యా ద్వారమును వెళపఱచుకొని యానాయకులకు గార్డనొసంగిన యభయదానమును దాను చెల్లించెదనని నుడువుచు వారినందఱను దీసికొనిపోయి దొరతనమువారి యాచారప్రకారము వధింపఁజేసెను. సూచౌలోనున్న గార్డను కా క్రూరకృత్యము తెలియఁగానే యాయనను గుండువేసి చంపుటకు గార్డను తుపాకింగొని శరవేగంబునఁ బోయెనుగాని యాజాడనెట్లనో ముందుగ నెఱింగి యతఁడు పలాయితుఁడయ్యెను. ద్రోహముగ వధింపఁబడిన యానాయకుల కండతుండెంబుల జూచి కన్నీరు మున్నీరుగాగ దుఃఖించి "లిహాంగు చాంగు"ను అతని ద్రోహకృత్యంబుఁగూర్చి యెంతయు నిందించి తుదసారిగ సేనాధిపత్యమును వదులుకొనెను.

చక్రవర్తిపంపిన బహుమానమును గార్డను నిరాకరించుట.

పైన నుడువఁబడిన రీతిని గార్డనువల్ల సంపాదితమయిన జయంబంతయు తానార్జించినట్లు చక్రవర్తికి "లిహాంగుచాంగు" వ్రాయఁగా, ఆచక్రవర్తినమ్మి కాఁబోవుచక్రవర్తికి రక్షకుఁడని యాయనకు బిరుదొసంగి పసుపుపట్టిని ధరింపసెలవిచ్చెను. గార్డను సేనానిగనుండి చూపినబలపరాక్రమములకును రాజభక్తికిని మెచ్చి యాయనకు 10000 "తాయిలు" నాణెములను బహుమానము పంపెను. లిహాంగుచాంగు కావించిన ద్రోహకృత్యముంబట్టియు, చీనా దొరతనమువారి గార్డన్ పరిపాలనను బట్టియు, గార్డను కోపావేశపరవశుండై చేతికఱ్ఱతో వారిని నెత్తురు వఱదలగునట్లు కొట్టి యాసొమ్ముతో వారిని బంపివేసెను.

## చీనాదొరతనమువారు ప్రార్థింపఁగా గార్డను మఱల సేనానియగుట.

రెండుమాసములు దనుక గార్డను నిరుద్యోగిగ నుండెను. పిమ్మట చీనా దొరతనమువా రాయనను సమ్మతిపఱచి మఱల సేనాధిపత్యము వహించునట్లు చేసిరి. చీనావారిసేనలు నాన్కిఙ్ నగరమును మఱల ముట్టడించుచుండిరి. ఆ సేనానికిఁ దోడ్పడఁబోవుచు దారిలోనున్న రెండుకోటలను "గార్డను" పట్టుకొనెను. మఱియొకచోట శత్రునగరమును ముట్టడించుచున్న చీనాసేనానియైన "చంగ్" గాయపడి మృతినొందినందున నచటికిఁ బోయి యాముట్టడి నిర్వహింపవలయునని "లి" కోరినందున, నది యత్యవసర మని తలఁచి గార్డను వెళ్లి జయంబొంది "నాన్కిఙ్" నగరమును బదంపడి ముట్టడించెను. ఆముట్టడిలో చీనాసేనానియైన "సెంగు క్వోఫాను" (Tsang kwofan) ను గూడ గలసెను. ఆనగరసంరక్షణకై శత్రువులు సేసిన యేర్పాటులు శిథిలములయ్యెను. కోటలోనున్న శత్రువుల కాహారపదార్థములు కొఱవడుచుండెను. కోట గోడలను చీనాసైన్యము పెద్దసొరంగములుచేసి కోటలో వఱద పొల్లుగ దొరబడెను. స్వర్గీయ ప్రభువు తనచావు నిక్కమనుకొని తన యంతఃపురస్త్రీలను చీనాసేనాపికి నప్పగించెను. వారి యదృష్టమేమొ చీనాసేనాని వారిం జంపక యాదరించెను.

స్వర్గీయప్రభువు విషము త్రాగి మరణమొందెను. అతనిపుత్రునిచే చీనారాజ్యమందే మఱియొకటచోటఁ బరిపాలన చేయింపవచ్చునని తలఁచి కేవలపరోపకార చింతనతో వానిని దనగుఱ్ఱముపై నెక్కించుకొని రాజభక్తిగల "చంగువాంగు" పరువిడుచుండెను. కాని యాహయం బాకష్టకాలమున కుఁ దోడుగ మందగమనంబు కలది యగుటచేతను, చీనాసైన్యమతివేగముగఁ దఱుముకొని వచ్చుటచేతను, వారిరువురును చీనాసేనానిచేతిలోఁ జిక్కిరి. ఆ బాలునిశిరంబు దక్షణమె యుత్తరించిరి. చంగువాంగును చీనాసేనానాయకుఁడు వారము దినములు గడువిచ్చి యతని జీవచరిత్ర వ్రాయుమనెను. తన కు మృత్యువాసన్నంబై యున్నను వాఁ డాచరిత్రను సలక్షణముగ వ్రాసియుం

డుట యెంతయు నబ్బురంబుకదా. స్వర్గీయప్రభువునందు నిష్కళంకమైన రాజభక్తిగలవాఁ డతఁడొక్కఁడే. ఆతనియుద్ధ నైపుణ్యమును బరాక్రమంబును నతఁడొందిన జయంబులే చెప్పక చెప్పుచున్నవి. అతనితోఁబాటుగఁ గడమ సేనానాయకులు విశ్వాసంబుతోఁ బోరాడిన యెడల స్వర్గీయప్రభువునకు దుర్దశ యంత శీఘ్రముగఁ బాటిల్లకుండును.

## నిరంతరజయసంపాదకసైన్యమును దీసివేయుట.

నిరంతరజయసంపాదక సైన్యముయొక్క యేర్పాటె యిష్టముకాకుండిన "లిహంగు చాంగు" కలహకారులు నిర్మూలింపఁబడుటచే నిఁక నాసైన్యముతోఁ బనిలేదని యభిప్రాయుఁడై దానిని విచ్ఛిన్నముచేసెను. ఆసేనాని ప్రత్యుత్పన్నమతివలె నాపదవచ్చి నప్పుడు దడబిడలాడి దానిని వారించుకొనువాఁడఁట. 1858 సం. లో జరిగిన యుద్ధము మొదలుకొని ముందు చెప్పఁబోవు జపానుయుద్ధమునకును చీనాదొరతనమువారి రాజ్యపరిపాలనాసరణిం జూడఁగా వారు దూరదృష్టి లేనివారనియు లాభింప నిండు. లాభింపకపో నిండు. ఆపద వాఁకిటిలోనికి వచ్చినప్పుడె యల్లాడువారనియుఁ బల్కుటకు బహుదృష్టాంతములు కలవు. గార్డనుచే తీర్చనొందిన సైన్యమంత దిగ్విజయము నొందుటయుఁ బ్రబలకలహకారు లతనివలననే నిర్జింపఁబడుటయు నెఱిఁగియుండియే దొరతనము వా రట్టిసమర్థసేనాధిపతిని సైన్యమును మా కగత్యము లేదందురు? షాంఘాయి నగరమంత నొక సేనానివేశస్థానమేర్పఱచి యచ్చట చీనాసైన్యమునకు నాంగ్లేయులయొక్క యుద్ధ కౌశల్యపురీతిని నేర్పించుట రాజ్యమునకు క్షేమకర మని గార్డను బోధించెను. కాని "లీ" విదేశవాసన గిట్టనివాఁడగుటచే నాబోధను జెడచెవి నిడి తనపరగణాను గల్లోలములకును నధర్మమునకును యథాపూర్వముగఁ బుట్టినిల్లుగఁ జేయుటయే కోరెను. తమంత వారు జగత్తులోనే లేరనెడి దురతిశయకవచమును దొడిగికొనిన చీనాదొరతనమువారు తమకొక్క లెక్కగానుండని జపానీయులచేతఁ బూర్తిగ ముందోడింపఁబడి సిగ్గుం జెందినప్పటినుండి కొంతజాగ్రత్త గలవారుగ నుంచున్నారు. మంచూరియా కొరియాదేశములను జపానువారు దోఁచుకొనుచుండఁగా వారట్లుచేయుట యధర్మమని పలికి యటులపల్కుట చాలదా యని చీ

నాదొరతనమువారు మెదల కూరకుండిరి యని చరిత్రకారుఁడు ఘోషింపుచు వ్రాసెను. పైన నుదాహరింపఁబడిన స్వర్గీయప్రభువుతోఁ గలహించుచునప్పుడు ఇంగ్లాండునుండి యుద్ధనావలు కావలెనని దొరతనమువారు వ్రాసిరి. అవి చీనాదేశమునకు వచ్చునాటికా కలహము ముగిసెను. కావున చీనావారా నావలు మాకగత్యము లేదనిరి. వానిందెచ్చిన యాంగ్లేయుఁ డుస్సురని మఱలిపోయెను. పైన నుడువఁబడిన లోపములన్నియు నిటీవల వచ్చిన యసమర్థులయిన చీనాచక్రవర్తులకాలమందు సంభవించుచుండె నని గ్రహింపఁదగియున్నది.

---

## 12-వ అధ్యాయము.

## యింగుచి చక్రవర్తియొక్క పరిపాలనాశేషము.

## "నియఙ్ఫీ" కలహకారుల నడఁచుటకు లిహాంగు చాంగు పంపఁబడుట.

ఒక యవసరకార్యము తటస్థింపఁగా చక్రవర్తి "లిహాంగుచాంగును" బిలిపించెను. అదెట్టిదనిన, టాయికింగు కలహకారు లెట్లు నివారింపఁబడిరో గతాధ్యాయమందు విశదీకరింపఁబడియున్నది. అటుల నివారింపఁబడినను వారి హృదయములయందలి కలహబీజములు నశింపలేదు. వారికి రాజ్యము లేకపోయినదే కాని గ్రామాదులఁ దోచుకొను పనులు లేకపోలేదు. వారు కష్టపడి మర్యాదగ జీవించుట యెఱుఁగరు. కావున నట్టివారందఱు మఱల సమకూడి యొక సంఘముగ నేర్పడి సాఁటంగు (Shan tung) "హోనాన్" పరగణాలను దోచుకొనసాగించిరి. వారి సంఘమునకు మునుపు టాయిపింగు అని పేరు పెట్టుకొనిరి. ఇప్పుడు "నియన్ఫీ" (Nienfie) అని పేరిడికొనిరి. టాయిపింగు కలహకారుల మట్టగించితి నని కీర్తివహించిన లిహాంగు చాంగే యాకలహకారులఁ బీచమడంపఁజాలినవాఁ డని చక్రవర్తి తలఁచి యాయనయందే యాదుర్వహకార్యభారం బుంచెను.

విదేశీయులసహాయమువలనఁ దా నట్టికీర్తిని సంపాదించిన వాఁడగుటం జేసి దొరకినంతమట్టునను యూరోపియ నుద్యోగుల సమకూర్చుకొని వారి బలంబు చూచుకొని షాౝటంగు పరగణాయందలి కలహకారులపై వెడలెను. షాౝటంగు పరగణా "కియాంగుసు" (Kiangsu) పరగణావలెనె మూఁడు వైపుల సముద్రము కలిగి నేల సన్నగిలి సముద్రములోనికిఁ జొచ్చియుండును. పూర్వమునందువలెనే వారి నాసన్నగిలిన ప్రదేశములోనికిఁ దఱిమి యడ్డముగా గోడ పెట్టించి వారిని దేశములోనికి రాకుండఁ జేసితి ననుకొనెను. కాని వారు పడవ లెక్కిపోయి యన్యగ్రామములను యథేచ్ఛముగఁ దోచుకొనుచుండిరి. లిహాంగుచాంగు తనపన్నుగడ భిన్నమయ్యెనని మిగుల విచారపడెను. ఆకార్యము నిర్వహింపఁజాలనందునను, మఱికొన్ని యసమర్థకృత్యములం బట్టియును చక్రవర్తి యంతకు మున్నాయన కధికగౌరవసూచకముగ నొసంగియున్న పసుపువర్ణపుచొక్కాను మఱలఁ దీసికొని యతని యుద్యోగమున కతని మఱలఁ బొమ్మని యుత్తరువు చేసెను. కాని యతం డాకలహకారుల నదృష్టవశంబున ననేకపర్యాయములు వరుసగ నోడించి తుదకు వారి రాయిడి నివారించుటంజేసి చక్రవర్తి యతనికి గొప్పసభచేసి యపుడు పసుపువర్ణపుచొక్కాయిని మఱల నొసంగెను.

## మహమ్మదీయులు యూనాౝ జిల్లాలో నివసించుటకుఁ గారణము.

చీనాదొరతనము వారితోఁ గలహించిన దోపుడుకాండ్రాదొరతనమువారియదృష్టవశంబున నసమర్థులను దాము జయించిన ప్రదేశములయందయినను దమప్రభుత్వమును స్థిరంబుగ నెలకొల్పఁజాలనివారు నైయుండిరి. టాయిపింగు కలహకారులతో చీనాదొరతనమువారు హోరాహోరిగఁ బోరుచున్నప్పుడె "యూనాౝ" జిల్లాయం దొకకలహ మంకురించి నానాఁటికి పెరుగుచుండెను. ఆజిల్లాయందు మహమ్మదీయజనసంఖ్య యెల్లప్పుడు హెచ్చుగనుండును. ఆమహమ్మదీయు లాజిల్లాకెక్కడనుండి యెప్పుడువచ్చిరో తెలిసికొనుటకుఁ బూర్వవృత్తాంతములు పరస్పరభిన్నంబులుగ నున్నవి. క్రీ-త ౮ వ శతా

బ్దములోఁ దనదేశమందలి కలహమడంచుటకు చీనాచక్రవర్తిసహాయము వేఁడఁగా కలీపు 3000 తురుష్కభటులను బంపెననియు, వారు వచ్చినకార్యము నెఱవేర్చి మఱల స్వదేశమునకుఁ బోఁగాఁ బందిమాంసము తిను చీనావారిదేశములో వారడుగు పెట్టినందున వారి నక్కడివారు దేశములోనికి రానీయలేదనియు,నందువలన వారు మఱలివచ్చి యూనాన్ జిల్లాయందె నివసించిరనియు, ఆమహమ్మదీయుల పూర్వచరిత్రలు తెలుపుచున్నవి. చీనాస్త్రీలను బెండ్లాడుటచే వారిసంతతియొక్క రూపములు కొంత మార్పునొందినను దమపూర్వుల ముఖలక్షణములును దేహదార్ఢ్యమును మొదలయినవి వారిప్పటికిని గలవారుగా నున్నారు. మఱియు 14వ శతాబ్దములో ననేకులయిన మహమ్మదీయులు చీనాదేశమందలి యూనాన్ జిల్లాలో నివాసములు గుదుర్చుకొనిరని దేశచరిత్రలు కూడఁ దెల్పుచున్నవి.

## ఆమహమ్మదీయులను చీనావారు బాధించుట.

ఆమహమ్మదీయులు 19-వ శతాబ్దముయొక్క మధ్యకాలము పర్యంతము చీనాదేశీయు లెంత హింసించినను జగడము లాడక నెమ్మదిగఁ గాలక్షేపము చేయుచుండిరి. చీనాదొరతనమువారి యుద్యోగులరాయిడికిఁ దాళఁజాలక యామహమ్మదీయులు తమబాధ నివారింపుమని చక్రవర్తికి 1851సంలో లిఖితపూర్వకముగ విన్నవించుకొనిరి. కాని లాభము లేకపోయెను. యూనాన్ జిల్లా గనులకుఁ బ్రసిద్ధము. ఒక గని విషయమై చీనాయుద్యోగులకును ఆమహమ్మదీయులకును 1855 సం. లో పెద్దకలహము పొడమెను. ఆజిల్లా యధికారి తనచేతిక్రింది యుద్యోగు లా కలహించు మహమ్మదీయుల గొంతుకలు పరపర కోయఁదలంచుట యెఱింగి వారిని వారింపనోడి తా నాత్మహత్య చేసికొనెను. అందువలన నైనవా రుపశమించి క్రూరవధ కావింపకుందురని యాయన తలంచెను గాని యదియు నిష్ఫలమయ్యెను. ఆ మహమ్మదీయులలోఁ బలువురనాయుద్యోగులు తమ క్రూరాచారప్రకారము వధించిరి. చావఁగా మిగిలినవారలు రెండుగుంపులుగ నేర్పడిరి. అక్కాలపు స్థితులంబట్టి యాగుంపులకు నాయకులమని యిద్దఱు బయలువెడలిరి. వారిరువురిలో నొకని పేరు "మా"

(Ma) రెండవవానిపేరు "టు" (Tu) మా అనువాఁడు మహమ్మదీయ మతాచరణమందుఁ బ్రముఖుఁడు. వారి ముఖ్యయాత్రాస్థానమయిన మక్కాకుఁగూడఁ బోయి యుండెను. రెండవవాడయిన "టు" పరాక్రమవంతుఁడును వ్యూహరచనాసమర్థుఁడునయి యుండెను. ఇతఁడు "తలిఫి" (Talifee) అను ముఖ్యపట్టణము నాదియందే వశపఱచుకొనెను. వక్ష్యమాణవృత్తాంతమువలన నది కొంతకాలము బెట్టిదంబులగు పోరుల కునికిపట్టుగ నుండినట్లు తెలియఁబడును. అట్టిపోరుల కది దిట్టమగుపట్టుగ నుండునని గుట్టెఱింగియే యాదిట్టరి దానిం జేపట్టెను. 1857 సం. లో దానియందలి జనము 30,000 దానిచుట్టునుండు బయళ్లకావరణములవలెఁ గొండలవరుస లున్నవి, దానియందొక మడుఁగున్నది. దానిపొడువు 40 మైళ్లు; వెడల్పు 10 మైళ్లు. అది చేఁపలచే నిండియుండి కాఁబోవు యుద్ధారంభము కాకపూర్వము 4,00,000 జనముసకు జీవాధారముగ నుండెను. దుర్గములచే సంరక్షింపఁబడిన రెండుకనమదార్ల వెంబడినే యానగరములోనికిఁ బోవలెను. పూర్వకాలమునుండియు నానగరము బలిష్ఠమయినదనియే వాడుక.

## ఉభయనాయకుల చర్యలు.

అట్టినగరమందు దాను సురక్షితముగనుండి యాతఁడు "మా" అనువాని నతనిసన్నాహము నతనిని జేసికొమ్మని విడిచిపెట్టెను. కావున నతఁడు సామాన్యులను గొందఱను సమకూర్చుకొని "యూనాన్ ఫు" (Yunon fu) నగరమును ముట్టడించి యోడిపోయి మఱికొంతకాలమునకు 50,000 సైన్యమును గూర్చుకొని జయమొందుటకు సిద్ధముగనుండియు నేమికారణముననో చీనావారికి సంధిరాయబారములను బంపెను. చీనావారిసైన్యములో దనను దనయనుచరులను జేర్చుకొమ్మని కోరుటయె యా సంధివిషయమయి యుండెను. తామోడిపోవలసిన వారైయుండఁగా దమశత్రువు సంధిగోరినందునను చీనాదొరతనమువా రుప్పొంగి యానాయకునికి గొప్ప సేనోద్యోగము నిచ్చిరి. ఆతని యనుచరులను దమసేనలోఁ జేర్చుకొనిరి. ఆ "మా" అనువాని కొక జ్ఞాతి కలఁడు. వాని పేరును "మా." ఆతనిని సేనానాయకునిగా చీనాదొరతనమువారు

నియమించిరి. అతని నిండుపేరు జులంగుమా. అతఁడు "యూనాన్ఫూ" నగరమందలి కలహకారులపై వెడలి వారినడంచి కొంత స్వస్థతం గలుగఁజేసెను. "టు" అనునాయకునితోఁ బోరాడక సౌమ్యముగ లోఁబఱచుకొనఁగోరి యాపనికి చీనావారితో సంధికావించుకొనిన "మా" అనువాఁడే తగినవాఁడని దొరతనమువా రతని నియమించిరి. అతఁడు "టు" అనువానిం జేరి తాను దొరతనమువారికి లోఁబడినందునఁ దనకుఁగలిగిన లాభములం బేర్కొని యతనినిఁగూడ వారియనుగ్రహముం బడసి మేలొందుమని చెప్పఁగా నతఁడు దొరతనమువారికి దాసుఁడనై లాభములఁ బడయువాఁడను గానని దృఢంబుగఁ జెప్పెను.

## "మియోటీజు" అను తెగవారు కలహించుట.

**1,07, 969** మైళ్ల విస్తీర్ణముకల "యూనాన్ఫు" పరగణాయందలి కలహాగ్ని సమీపపరగణాయైన "క్వీచా" (Kweichow) పరగణాలో నున్న యొకతెగవారిహృదయములను గూడ రవుల్కొల్పెను. వారు చీనాదేశముయొక్క యాదిమకాపురస్థులవంశములలోఁ జేరినవారు. ఆ తెగపేరు "మియాటుజు" (Miaotzu) చీనావారు చీనాదేశమందు నివసింపవచ్చిన యాదికాలమందె వీరు "క్వీచౌ, కాంగ్సి" పరగణాలయందలి కొండపట్టులయం దునికిపట్టులఁ గుదుర్చుకొని బహుకాలమునుండి నెమ్మదిగఁ గాలక్షేపముచేయుచుండిరి. వారు చీనావారిజోక్యమే లేనివారైయుండిరి. కాని చీనావారి దౌర్జన్యమునకుఁ దాళఁజాలక వారిపై నప్పుడప్పుడు తిరుగఁబడుచుండిరి. అట్లుండఁగ **1863** సం. లో నేకారణముననో పెద్దకలహమునకుఁ బూనుకొనిరి. అందువలన చీనాదొరతనమువా రాసంవత్సరములో ఆరెండు పరగణాలో రెండు నిప్పుకొలుములమధ్య నుండిరో యన్నట్లుండిరి. అవికాక "లినాన్ఘూ" నగరమం దొక కలహము తలయెత్తెను. దానినాయకుఁడు లియాంగు (Liang.) అవ్విధముగ నాపరగణాలు **3, 4,** వత్సరంబులు దనుక యల్లకల్లోలముగ నుండెను. **1867** సం. యొక్క చివఱిభాగమందు "మా" అనుసేనాధిపతి "తాలిఫు" నగరమును ముట్టడించి యోడిపోయెను. "టు" అను

వాఁడు బర్మారాజుతో సఖ్యముకావించుకొని కొన్ని సప్లయి లచ్చటనుండి తెప్పించుకొనుచుండెను. అట్టి సప్లయిలు రాకుండఁజేయుటకు "మా" యత్నించెనుగాని వినియోగింపలేదు. అదియటుండ "టు" ఆంగ్లేయులసాయము కోరి తనమేనల్లుని నింగ్లాండునకుఁ బంపెను. కాని వారు సహాయమొసంగుట కంగీకరింపరైరి. అది యటుండ నాప్రయత్నము చేయుటవలన చీనాదొరతనమువారు ప్రచండకోపోద్దీపితమానసులై మహమ్మదీయుల నొక్కుమ్మడి ప్రుక్కుఁజేయఁబూనిరి. కావున నందునకై తగు సన్నాహంబును వారు సావకాశముగఁ జేయుచుండిరి. ఆలోగా "టు" యూనాక్ఫ్యును ముట్టడించి యోడిపోయి తనదుర్గంబులో మఱలఁ జేరెను. మహమ్మదీయకలహనాయకులలోఁ గొందఱితో చీనావారు కొన్ని స్వల్పయుద్ధములుచేసి యోడింపఁగా వారు తమప్రాణములను రక్షింపుఁడని ప్రార్థించుచు లోఁబడిరి. కాని చీనావారు తమ యాచారప్రకారము వారిని నమ్మించి వధించిరఁట.

## తాలిఫుకోటను ముట్టడించుట.

పిమ్మట హునాక్నుండి ప్రబలసైన్యము చక్రవర్తిసైన్యముతోఁ గలసెను. మఱియు యుద్ధవ్యయమునకు గాను 6 పరగణాలవారు 70,000 (తాయిలు) నాణెములను దొరతనమువారికి సహాయమొనర్చిరి. కావున చీనాసైన్యము ప్రాబల్యమందును ద్రవ్యోపపత్తియందు నున్నతస్థితిలోనుండి యునాక్ పరగణాను మఱల ముట్టడించి స్వాధీనపఱుచుకొని మిగిలియున్న "తాలిఫు" (Talifu) కోటను ముట్టడించిరి. "టు" కొంతవట్టుకుఁ బోరాడి నిర్వహింపలేక ప్రాణములపై నాశవదలుకొనియే చీనావారికి లోఁబడెను. చీనావారి యధీనములోనుండఁగా నతఁడు త్రాగుటకు నీరడిగెననియు, వారిచ్చిన నీరము పానముచేసినతోడనే యతఁడు మృతినొందెననియు, నానీటిలో విషపదార్థము కలిపిరనియుఁ జెప్పెదరు. అతనినిఁ జంపి మృతకళేబర మూరేగించిరని కొందఱు చెప్పెదరు. అదికాక లోఁబడిన మహమ్మదీయనాయకులను విందునకుఁ బిలిచి వారు విందారగింపఁ బోవుచుండఁగనే వారినందఱను చీనాసైనికులు వధించిరి. మఱియు యూనాక్ఫు నగరమందలి ప్రజల నాబాలవృద్ధంబుగ నందఱను దమఖడ్గళక్తికి బలి యివ్వఁ దలచిరోయనునట్లు వధించి వధించి తుద

కు వధింపలేక విసికిరంట. వధించుటయే ఘోరకృత్యము. మఱియు శరణార్థులను వధించుట యెంత ఘోరకర్మ మనవలె.

పైననుడువఁబడిన ఘోరయుద్ధముల కనంతరము 17 వత్సరంబులు దనుక యూనాన్ పరగణా యించుమించుగఁ బాడుపడినట్లుండెను. దానికి మాలీజాడ్యము తోడై జేతలను విజితులను నొక్కుమ్మడి సంహరించెను. ఆభూమి విశేషము సారవంతమయినది కాదు. అదియు సేద్యముచేయఁబడుటలేదు. దానియందనేకములయిన గనులు కలవు. ఆగనులను చీనాదొరతనమువారు తమ భుక్తములోనే యుంచుకొందురు. కావున నన్యులచ్చట కాపురములను గుదుర్చుకొనుట లేదు. ఆపరగణాకును బర్మాదేశమునకును రైలువేయఁబోవుచున్నారు. అటుపిమ్మట దానికి మంచిదశ పట్టవచ్చును.

## రాజ్యమునందితరస్థలములఁ గలిగిన కలహములు.

పైనఁజెప్పఁబడిన యుద్ధములు చీనారాజ్యముయొక్క నైర్రుతిమూలను 1857 సం. లోఁ బ్రవర్తిలుచుండఁగ ఆమహమ్మదీయమతస్థులే మఱికొందఱు వాయవ్యమూలఁ గలహించుచుండిరి. టాయిపింగు కలహకారులతో నాసంవత్సరమునఁ బోరుచుండుటచే దొరతనమువా రామహమ్మదీయులవిషయమై గట్టిపని పూనఁజాలరైరి. అది యటుండ దొరతనమువా రొకద్రోహకృత్యము కావించి యాజనులయొక్క కోపానలమును బ్రజ్వలింపఁజేసిరి. ఆయల్లరుల నివారించుటకై దొరతనమువారు కమీషనర్ల నిద్దఱను బంపిరి కాని వారిలో నొకనిని శత్రువులు వధించిరి. అంతట చక్రవర్తి కోపోద్దీపితుండై మహమ్మదీయమతావలంబుల నందఱను వధింపవలసినదని యుత్తరువుచేసెను. చీనాగోడకు దక్షిణముగ నుండు చీనారాజ్యమందలి కలహములను దొరతనమువా రెట్టకేలకు బలపరాక్రమములచే నివారించిరి. కాని యాగోడ కవల నున్న చీనారాజ్యమించుమించుగా నెడారియె. దానియందచ్చటచ్చట చీనావారి పట్టణములుండును. అచ్చటిజనులు చిరకాలమునుండి మూఢులుగను గ్రూరులుగ నుండిరి అల్లరులు చేయుటకును దొరతనముపైఁ దిరుగఁబడుటకును వెనుదీయరు. ఆయెడారులయందు పరిపాలింపవలయుననియు, నాయకులుగ నుండవలెననియు

పొక్కపారిగ నచ్చటిజనులు కారుమబ్బులవలె లేచి చీనారాజ్యమును గప్పివేయ నుంకించిరి. మహమ్మదీయమతస్థులలోఁ గొందఱు చీనాసైనికులుగ నుండియుండిరి. చక్రవర్తి శాసనముప్రకారము వారిని ద్రోహంబుతోఁ జంపుటకు చీనావా రుద్యుక్తులైరి. దానిసవ్వడి యెఱింగి వారు చీనావారిపైఁ దిరుగఁబడిరి. అది యటుండఁ బూర్వము మహావీరుఁడని ప్రసిద్ధినొందిన జహంగీరునియొక్క శేషించియున్న పుత్రుఁడు "కోకండు" నగరము తనదియని ముట్టడించి వశపఱచుకొనెను. ఆముట్టడియందు బలపరాక్రమశాలియైన "యాకూబుఖాన్" వానికిం దోడ్పడెను. లేనియెడల వాఁడు వశపఱచుకొనజాలఁడు. ఆపట్టణము స్వాధీనముకాగానే జయలాభము తనదేయని యాకూబుఖాను దానికిఁ బ్రభువయ్యెను. ఆకలహములు "ఇలి" పరగణాయందుఁగూడ వ్యాపించెను. దానియందుండు రుషియావారికిఁగూడఁ దొందరలు కలుగుచుండఁగాఁ దమ రా పరగణాను వశపఱచుకొనెదమని చీనాదొరతనమువారికి రుషియాయేజెంట్లు వ్రాసిరి. అప్పుడు దక్షిణదిశయొక్క తుట్టతుదవఱకు నున్న కలహకారుల నందఱను రూపుమాపుటకు దొరతనమువారు పూర్ణసన్నాహముఁ జేయుచుండిరి. అట్లున్నను మహమ్మదీయకలహముల కాటపట్టుగ నున్న షెన్సి, (Shensi) కాన్సు(Kansu) పరగణాలకు "సోబంగుటాంగు" (Tsobhung Tung) అను నాతని రాజప్రతినిధిగా

## ప్రసిద్ధచీనా సేనానాయకుఁడు.

దొరతనమువారు నియమించి యాపరగణాలయందును మధ్యాసియాయందును గలహముల నివారించుటకై సేనలపై సర్వాధికార మాయన కిచ్చిరి. దొరతనమువారియదృష్టవశమున నా సేనాధిపతి పరాక్రమవంతుఁడును కార్యనిర్వహణదక్షుండు నయియుండెను. ప్రసిద్ధశక్తిసంపన్నుఁడైన "కిన్ పన్" ఆయనకు సహాయ సేనానాయకుఁడుగా నేర్పడెను. వారు "సూచౌ"(Soochow) హామి (Hamie) మొదలయిన నగరములుపట్టుకొని పిమ్మట మధ్య ఆసియాయందలి యెడారిప్రదేశములయందు భోజనపదార్థములు దొరకవని గ్రహించి ఫలవంతమయిన కొంతప్రదేశమందు తమసైనికులచేవ్యవసాయముచేయించి ధాన్యములు పండించి యనుభవించిరి. చీనావారు నెమ్మదిగా కార్యములను సాధిం

చుకొనువారని చరిత్రకారుఁడు వ్రాసినది సత్యముగానేయున్నది. అట్లు సేనల బలపఱచుకొని 1876 సం. లో నాసేనానాయకులిరువురును గొన్ని నగరముల వశపఱచుకొని "మానాస్" పట్టణమును బిట్టుగ ముట్టడింప దానియందున్న శత్రువులు భోజనపదార్థములులేక కృశించి తుదకు లోఁబడుటకుంబూని, శరణార్థులయినవారి శిరంబుల దునుముటకు చీనావారు మొదటివారని వారొకపనిచేసిరి. తమ యాడువాండ్రను బిల్లలను నిల్వబెట్టి వారిచుట్టును మగవాండ్రుఁదఱు వ్యూహముపన్ని చీనాసైన్యముపై నొక్కుమ్మడిపడి దాడి చేసికొనం జూచి వ్యర్థులయిరి. చీనావా రాయాడువారిని బిల్లలను విడిచి మగవాండ్రను బూర్తిగ సంహరించిరి. పైనఁజెప్పంబడిన యాఖూజుఖాన్ కూడ పలుసార్లు పరాజితుఁడై విషముఁద్రావి చచ్చెనఁట. పూర్వచక్రవర్తులు చీనారాజ్యమునకు సంపాదించి పెట్టిన మధ్యాసియాప్రదేశమంతయును ఆసేనానాయకు లుభయులును మఱల సంపాదించి దొరతనము వారివలన విశేషోద్యోగములను సన్మానములం బడసిరి.

## అన్యదేశీయ వ్యవహార లక్షణములు.

1860 సం. విదేశీయులకును చీనావారికిని జరిగిన యుద్ధములును దదనంతరసంధికృత్యములును గతంబున లిఖింపఁబడియున్నవి. అదిమొదలుకొని యీయుభయులకును వ్యవహారము లెట్లుండెనో యింతదనుక లిఖించి యుండలేదు. ఇప్పుడు సంగ్రహముగ నుడువఁబడుచున్నది. ఆసంవత్సరమందు జరిగినసంధికిఁ బిమ్మట వెంటనే "అన్యదేశీయకార్యస్థాన" మను పేరుతో నొక ఆఫీసు ఏర్పడెను. అన్యదేశీయు లనాగరికజన మను తిరస్కారబుద్ధి చీనాదొరతనమువారికుగ్గుతోఁబెట్టినట్లుండును. కావున వారికి విదేశవ్యవహారములు పట్టియుండనివై యుండె. వారి తలం పెట్లున్నను అన్యదేశీయుల వ్యవహారము లంతకంతకుఁ బ్రాముఖ్యముం జెందుచుండెను. కావున నాకార్యస్థానమును బలపఱుప దొరతనమువారి కావశ్యకము కలిగెను. సభికులను మువ్వుర నేర్పఱచిరి. వారిలో నధ్యక్షుఁడు రాజన్యుఁడయిన "కంగు" వ్యవహారములు ప్రబలినకొలఁది యాసభికులసంఖ్యయుఁ బెరుగుచుండును. ఈనేఁటికాలంబున వారిసంఖ్య పదునొకండని యెఱుంగవలయు "టుంగుచి" "(Tung chih) చక్రవర్తియొక్క పరిపాలనారంభమునుండి కొన్నివత్సరంబులు దనుక దొరతనమువారు పికిన్ రాజధాని

యందునికిగానున్న యన్యదేశీయరాయబారులతో వారివారివ్యవహారములను సంప్రతించుచు వారియాలోచనల నడుగుచునుండిరి. ఆయన్యదేశరాయబారులు దొరతనమువారి కనేకములయిన సదాలోచనలను జెప్పి యటుల దొరతనమువా రొనరించునట్లు చేయుటకై కృషిచేసిరి కాని వ్యర్థమగుచువచ్చెను. చీనావారిసేనలకు సలక్షణమయిన యుద్ధకౌశల్యము కలుగఁజేసి చీనారాజ్య మన్యాపేక్షలేకుండ స్వతంత్రరాజ్యముగ నుండునటుల చేయుట యన్యదేశరాయబారుల ముఖ్య తాత్పర్యమయియుండెను. అందునకుఁగాను (డిలుపుస్తకముల నింగ్లీషుభాషలోనుండి చీనా భాషలో వ్రాసిరి. ఫూచూ, నాన్కిన్, షాంఘాయి రేవుపట్టణములయందు సేనలనుంచునట్లు చేసిరి. ఆసేనలయొక్క తీర్పును బరిశీలించుటకై యన్యదేశీయోద్యోగులు నియమింపఁబడిరి. పైనఁజెప్పిన మూఁడు రేవులయందుఁ కొంతవట్టుకు పనులుచక్కఁగజరిగెను. కాని చీనావారు యుద్ధకౌశల్యమును సంపాదించుటయందుకంటెఁ బరిపాలనా విషయములయందును సంధివ్యాపారములయందు నెక్కువ యపేక్షకలవారు. కావుననే రణవిద్యమాట యటుపెట్టి యన్యదేశీయుతో నీకటిలోఁ జేసికొనిన యొడంబడికలలో వారికి నెక్కువస్వాతంత్ర్యములు నిచ్చియుంటిమని చింతించుచు దొరతనమువారు వానినిమఱలఁ దీసికొనుట కుద్యుక్తులుగ నుండిరి. అన్యదేశరాయబారులు పికిన్ రాజధానియందు నివాసముగనుండవచ్చునెడి సంధినిబంధనవలన వారికి వల్లమాలిన స్వాతంత్ర్య మియ్యఁబడినదనియు ఆనిబంధనను బూర్వపక్షము చేయవలెననియు చీనా సభికులు చక్రవర్తికి దుర్బోధచేసిరి. మఱియు నన్యదేశీయరాయబారులు పికిన్ రాజధానియం దుండుటవలన వారు పలువిధములయిన యిడుమలఁ బడఁగలరని యాసభికులె బెదిరించుచు వారు (అన్యదేశీయులు) సంపాదించుకొనియున్న స్వాతంత్ర్యములను మఱల లాగుకొనఁ జూచుచుండిరి.

## బర్లింఘమ్మను రాయబారిని నన్యరాజులయొద్దకుఁ బంపుట.

అట్లుండఁగా రాజధానియందుండు రాయబారులలో "బర్లింఘు" మను పేరుగల యాతండొకడుండెను. ఆయన అమెరికాదేశపుసంఘపాలనవారి (United states of America) ప్రతినిధి. ఆయన మంచిప్రాసంగికుఁడు,

స్వదేశాభిమాని,పరమసాధువు.కావున చీనాదేశీయసభికులచేతులలోఁ బొమ్మవలె నాడుచుండెను.ఆయన సులభసాధ్యుఁడని గ్రహించి యామెరికాదేశ ప్రతినిధి ననుమాటను బ్రస్తుతము కడగానుంచి చీనాదేశపు రాయబారిగా బయలువెడలి యూరోపు,అమెరికా ఖండములయందుండు ప్రభుస్థానములకుఁ బోయి యన్య దేశీయులకును వారికిని గల సంధినిబంధనలచేతను అన్యదేశీయులకుఁగల స్వాతంత్ర్యములచేతను చీనాదొరతనమువారు బద్ధులుకా రనువిషయమును ముఖ్యముగాఁ దెల్పవలయునని యాయనను గోరిరి. ఆయన వారిప్రార్థనను శిరంబునఁ దాల్చి యాప్రకారమే చేయుచుండెను. మఱియు నాయన చీనాదొరతనమువారి యొక్కయు ప్రజలయొక్కయు వివేకమును,సౌజన్యమును, పరమతసహనమును గుఱించి యా యాప్రభువులసన్నిధియందు నగ్గలంబుగఁ బొగడుచుండెను. ఆవ్యవహారమాసరణిగనుండ "యాంగుచౌ"(Yong Chow) నగరమందు చీనావారొనరించిన ఘోరకృత్యములు విని యాయాప్రభువులు నివ్వెఱంజెందిరి. చీనాదొరతనమువా రన్యదేశీయులతోఁ జేసికొనిన యొడంబడికలో నొక నిబంధనయందిట్లు వ్రాయఁబడియుండెను.

నిబంధన.

"క్రీస్తుమతము పుణ్యమార్గమును బ్రతిపాదించునదియై యొరు లేయవితన కొనరింపంగోరుదురో యట్టివే యొరులకు నరుఁడొనరింపవలయునని తెలుపుటం జేసి తద్బోధకులనుగాని తన్మతావలంబులనుగాని యీదొరతనములోని యధికారులు సమముగాఁ జూచి రక్షింపవలెను. వారీదొరతనమువారిచట్టములను దిరస్కరింపక నెమ్మదిగఁ దమపనులఁ దామొనర్చుచుండునంతదనుక వారిని లేశమాత్రమయినను బాధింపఁగూడదు.వారిపనుల నభ్యంతర పఱుపఁగూడదు."

ఆనిబంధ ననుసరించి "హడ్సన్ టెయిలరు" (Hudson Taylor) అనునొక బోధకుఁడు (Missionary) యాంగుచౌనందు నివాసమేర్పఱచుకొనెను. ఆయనయు ఆయనయనుచరులును బ్రజలలోఁగలసి మెలసి వర్తింపుచుండఁగా దురదృష్టవశమున వారిమీఁదనభూతకల్పనగ నొకనింద మోపఁబడెను. ఏమన వారు పిల్లలను జంపి వారికండ్లను గుండెకాయలను నౌషధములలో నుపయోగించెద రని. ఆనిందను జనసమూహము నమ్మెను.ఆవెఱ్ఱిజనుల కది

సత్యముకాదని ప్రదేశాధికారులు చెప్పి యల్లరి నడంపకపోఁగా బాహాటముగా వారిని బురికొల్పిరి. చీనాదేశమునం దల్లరి సాగినతర్వాత నడంచుట దుస్తరము కావునఁ గొంత మూక బయలుదేరి మతబోధకులయిండ్లను దగలఁబెట్టి, వారిం గొట్టి, యాపట్టణమునుండి వెడలించిరి. అంతట షాంఘాయియందుండెడి యన్యదేశీయమంత్రి చీనాదొరతనమువారి కిట్లు వ్రాసెను.

## అన్యదేశీయమంత్రియొక్క లేఖ.

(1) ప్రదేశాధికారుల నుద్యోగములనుండి తగ్గించవలెను.

(2) అల్లరికిఁ గారకులైన విద్వాంసులను శిక్షింపవలెను.

(3) గాయపడినట్టియు, వెడలఁగొట్టఁబడినట్టియు మిషనరీలకు దొరతనమువారు 2000 "తాయిలు" నాణెముల నిచ్చుకొనవలయును.

(4) ఆమిషనరీలను దొరతనమువారు వ్యవహార సన్మానముతో మఱల నానగరమందె ప్రవేశపెట్టవలయు.

(5) జరిగిన యల్లరియొక్క వృత్తాంతమంతయు నొక్కరాతిపలకపై వ్రాసియన్యదేశీయులు చీనారాజ్యముయొక్క మధ్యప్రదేశమునకుఁ బోవ నధికారమును సంధినిబంధనవలనఁ గలవారని దానిపైనే ప్రచురించి యాపలకను బహిరంగప్రదేశమున వ్రేలాడఁ గట్టవలెను.

"టాయిపింగు" లతోఁ గలహించి విజయబిరుదము లొందిన "సెంగుకోఫాను" కు ఆమంత్రివ్రాసిన యుత్తరమును చక్రవర్తి పంపఁగాఁ బండితుల శిక్షించుటకును బలకను గట్టుటకును ఆయన యంగీకరింపఁడయ్యె. అంతట షాంగాయియందున్న యాంగ్లేయమంతిరియొక్క నావికాసైన్యము పసుపు ఏటిమీఁదుగా బోయి నాన్కిన్ నగరము మ్రోల నిలిచెను. పాశ్చాత్యుల నావికాసైన్యముయొక్క తాకు డెటింగినవాఁడగుటంజేసి "సెంగుకోఫాను" ఆయుత్తరమునందలి నిబంధనల కన్నిటికి సమ్మతించుచు రాతిపలకను మాఱుగఁ గొయ్యపలకను గట్టునట్లుకోరెను. మఱియుఁ బ్రదేశాధికారులు కఠినముగా మందలింపఁబడిరి. కలహకారులు శిక్షింపఁబడిరి. అదిమొదలుకొని యానగరము విదేశీయులకు విద్వేషస్థానము కాకుండ విహితస్థానముగ నుండెను. అకీర్తి

యంతయు నప్పటి విదేశీయమంత్రికిఁ జెందవలసినదేయని చరిత్రకారుఁడు వ్రాసెను.

అన్యదేశీయులయందు విద్వేష దౌర్జన్యాదులు చీనారాజ్యములో నిత రస్థలములయందుఁ దఱుచుగా జరుగుచునేయుండె. అట్టి యొక యల్లరిలో ఫ్రాన్సుదేశీయుఁడొకఁడు చంపఁబడెను. అంతట వారిమంత్రి దొరతనమువారికిఁ దెలియపఱచి పైనుదహరింపఁబడినట్లె కట్టుబాటులను వారిని లోఁబఱచి సంతుష్టిం జెందెను. ఈవివాదలు తుదముట్టినతోడనే "టియంటుసిను" నగరమందసాధారణమైన కల్లోల మొకటి 1870 సం. జూన్ నెలలో బయలు వెడలెను.

---

## 13-వ అధ్యాయము.

టుంగుచిచక్రవర్తియొక్క పాలనశేషము.

క్వాంఘుషు చక్రవర్తి (1875-1901)

రోమన్ కాతొలిక్ మతస్థులయెడలఁ గల్పితదోషములు.

టియన్ట్సిన్ నగరమందున్న రోమన్ కాతొలికుమతస్థులు * చీనావారికి కొంతకాలమునుండి సరిపడుటలేదు. ఆమతమందు వివాహము వర్జించినకొందఱు యోగినులుందురు. వారు మెండుగ భూతదయగలవారు. కావున ఆనగరమందు "అనాథశరణాలయ మొకటి వారు స్థాపించిరి. అదియు చీనావారికి బొత్తుగ గిట్టకయుండెను. ఆశరణాలయమందు 1870 సం. మేయినెలలో నొక యంటుడు జాడ్యమువలన ననేకశిశువులు చనిపోయిరి. యూరోపుఖండవాసులు వ్యాధిపీడితులయిన శిశువులయొక్క కండ్లను గుండెలను ఔషధములలో వాడెదరను పిచ్చియూహ మూఢజనులయందుఁ గొంతకాలముక్రిందట నంకురించి నానాఁటికిఁ బెరిగి పెద్దవిషవృక్షంబై పైని నుడువఁబడిన కారణంబున

* రోమన్ కాతొలికుమత మాదిక్రైస్తవమతము. కాలక్రమంబున దానిలోనుండి చీలి కొన్నిమార్పులతో ప్రాటెస్టెంటు మత మేర్పడినది.

శరణాలయమందు శిశుమరణము లధికముకాఁగాఁ బిందెలేన్పడి ముందు చెప్పఁబోవు హత్యలరూపంబున విషఫలంబుల ఫలింపఁదొడఁగె. అల్లరి మితిమించుచుండుటంజూచి యాయోగినులు వెఱఁగొంది కలహకారులలో నేవురు వచ్చి శరణాలయమును శోధించుకొండని చెప్పిరి. వారట్లు రాక వీరికి జడిసి యాశోధనను సమ్మతించుట యని ప్రాన్సువారిమంత్రి వారిని వెళ్ళఁగొట్టెను. అచటి ప్రదేశాధికారి యటుల వెళ్లఁగొట్టవలదనియు నందువలన నల్లరి మఱింత హెచ్చునని‌యు వారించినను ఆమంత్రి వినఁడయ్యె. పిమ్మట నొకయల్లరిమూక శరణాలయమును జుట్టుకొనఁగా నామంత్రి స్మారకము తప్పినవానివలె పరుగెత్తుకొని పోయి ప్రదేశాధికారికిం దెల్పి యాయన శక్తిలేకయో యిష్టములేకయో యుపేక్షింపఁగాఁ దానె మఱలివచ్చి కలహకారులఁ గొందఱను గుండు దెబ్బలఁజంపి తుదకు వారి చేతిలో తానును దుర్మరణమొందెను.

## హత్యలు.

అంతట నాగుంపు శరణాలయమును ముట్టడించి శిశువులమాత్రము చంపక యాయోగినుల నందఱను జంపిరి. వారి నవుకర్లయిన స్వదేశీయులను గూడ మడియించిరి. అట్లు చచ్చినవారిలో యోగినులసంఖ్య 20. ఇతరుల సంఖ్య 20. ఈఘోరహత్య మూఢజనుల యజ్ఞానంబువలనను నకాలంబున "సంకరమతసంహారక" మను పేరితో నొకగ్రంథము ప్రచురింపఁబడుటవలనను సంభవించియుండెను. "రోమకరాజ్యముయొక్క క్షీణమును పతనమును" అను గ్రంథములోఁ బూర్వకాలముందు క్రీస్తుమతస్థు లొనరించు హత్యలను దెల్పుమాటలంబోలిన మాటలు పైనిఁజెప్పిన "సంకరమతసంహారక" మను గ్రంథమందున్నవి. కావుననే చీనాప్రజలు తల్లడిల్లిరి. "రోమకరాజ్యపతన" మను గ్రంథములో లిఖింపఁబడియున్నవచనము లీక్రింద వ్రాయఁబడుచున్నవి. వానివలనఁ బూర్వకాలంబున క్రీస్తుమతస్థులు చేసిన ఘోరకృత్యములు విశదము కాఁగలవు.

"ఆకాలమందలి క్రైస్తవులు బహుపాపకర్ములు. వారు రహస్యస్థలములయం దతిఘోరకృత్యములు చేయుచుండిరి. మిక్కిలి యధర్మకార్యంబుల

జేసి కానరాని దేవుని యనుగ్రహముఁ బడయఁజూచిరి. అతిదూష్యములయిన యాసంఘముయొక్క యాచారముల నవలంబించితిమనియు నుడివెదమనియు నటించువార లనేకులుండిరి. ఆసంఘము వారప్పుడు పుట్టిన యొకశిశువును దెచ్చి దానిపై పిండిపోసి యది యేమయియుండెనో చెప్పక మతప్రవేశకుని చేతిఖడ్గంబు నిచ్చి దాని నతిరహస్యముగఁ బొడుచుట ప్రథమకార్యం బని బోధించి వానిచేఁ బలుసార్లాశిశువును బొడిపించెదరు. తదనంతర మామతశాఖల వా రాశిశువుయొక్క రక్తమును పానము చేయుదురు. గజగజవడకుచున్న దాని యవయవములును బలవంతమున నాళతో నూడఁబెఱికి యది పాపకృత్య మని యందఱెఱిఁగియుండుటచే నాకృత్యమును శాశ్వతమయిన రహస్యముగా నుంచెదమని ప్రమాణములు చేసికొనెదరు. పిమ్మట నాపాపకార్యమునకుఁ దగినట్టి యొక విందుభోజనము రాత్రికాలమందుఁ జేసెద రని నిస్సందేహముగఁ దెలియఁబడును. ఆవిందుకాలమందు స్మారకము తప్పనట్లుగఁ ద్రాగి దానిచేఁ బశుకర్మపరాయణులై నియమించుకొనిన కాలము రాఁగానే దీపముల హఠాత్తుగ నార్పి శిగ్గును బోకార్చి, ప్రకృతి ధర్మమును మంట గలిపి, తల్లి, బిడ్డ తోడు నను వివక్షలేకుండ నంధకారంబున యథాసంభవముగా రమించెదరు" సంకరమత సంహారక మనెడి యాదూష్యగ్రంథముయొక్క వ్యాపకము నాపుదల చేయుమని దొరతనమువారికి ననేకయర్జీలు పంపఁబడెను. అది యటుండ నన్యదేశీయమంత్రులు కలహకారులను శిక్షింపవలయు ననియు జరగఁబడిన హత్యలకుఁగాను బరిహారద్రవ్య మీయవలెననియు నొక్కుమ్మడిగ దొరతనము వారిని నిరోధింపసాగిరి.

## దొరతనమువారు కలహకారుల విచారింపఁబూనుట.

కావున జరగఁబడిన యల్లరికిని హత్యలకును గారకులను విచారించుటకై దొరతనమువారు "సెంగుక్వోఫాను" (Tsang kwofan) కును "చాచంగు" (Chow chung) కును విధించిరి. సెంగు పెద్దవాఁడైనను అన్యదేశీయులయందు ద్వేషముకలవాఁడుగనే యుండెను. కావున విచారణ నుపేక్షచేసెను. ఆంగ్లేయమంత్రియైన "సర్ తామసువేడు" (Sir thomas wade)

అట్టియుపేక్షల సహింపఁడు. కావున అన్యదేశీయకార్యస్థానాధ్యక్షుఁడయిన కంగున కీదిగువ యంశములతో మఁదలింపుగా నొక యుత్తరము వ్రాసెను.

(1) దొరతనమువారు నియమించిన యధికారులు న్యాయముగను దీవ్రముగను నేరమును విచారింపలేదు.

(2) అల్లరియు హత్యయుజరుగుటకు జనులమౌర్ఖ్యమే కాకయధికారులకుట్రయుఁగారణమయియున్నది.

(3) సామాన్యజనులలోఁ గొందఱిని ఖయిదులోఁబెట్టిరి. ముఖ్యులయిన నేరస్థులను విచారింపనేలేదు.

(4) కుట్రచేసిన యధికారులు నిర్భయముగ నుండిరి.

(5) అట్టిఘోరకృత్య ముపేక్షింపఁబడినదని జనులు విఱ్ఱవీఁగి పటములలోఁ గలహస్థలంబును జర్యలను జిత్తరువులుగ వ్రాయించి పంచిపెట్టుచు వీధుల వెంటఁ బాటలుపాడుచు నుప్పొంగుచుండి.

(6) చక్రవర్తికిని ఆయనసభికులలో వివేకవంతులకును దప్ప కడమవారి కన్యదేశీయుల నశింపుచేయుట ముఖ్యాభిలాషయై యున్నట్టు తెలుఁగుదుము.

(7) వారు న్యాయమైనవిచారణ కానీయక యెన్నియొ యాటంకములఁ గలుగఁ జేయుచున్నారు.

పైనివ్రాసిన ప్రకారమె యితరులయిన యన్యదేశీయమంత్రులును దొరతనమువారికి వ్రాయుటచే జరగఁబడిన యల్లరిని హత్యలనుగుఱించి వారు తగు విచారణ చేయఁబూనిరి.

## దొరతనమువారుచేసిన క్రమవిచారణయు శిక్షలును.

"సెంగుకోఫాను" తత్ప్రదేశాధికారిగానుండు దనుక యన్యదేశీయులకు స్వస్థత చిక్కదని గ్రహించి యతని నతనియొక్క పూర్వాధికారములోనికి బంపి యతనిస్థానంబునకు విహాంగుచాంగును దొరతనమువారు రప్పించి సెంగుకోఫానుమొదలయిన ముగ్గురను దోడుచేసికొని నిష్కర్షగ విచారణచేయుమని యుత్తరవుచేసిరి. తనతోడివారితో నాలోచింపకుండ వ్యవహరింపఁగల

స్వాతంత్ర్యముకూడ లభించియుండెను. కావున ఆయన యాయధికారములోనికి వచ్చినతోడనే యన్యదేశీయుల తెరువునకు చీనాప్రజలు పోయిరేని కఠినముగా శిక్షింపఁబడుదురని ప్రజలకు గట్టిగ దిట్టపఱచెను. విచారణచేసి కలహకారులలోఁ గొందఱ నురిదీయించెను. గొందఱను దేశమునుండి బహిష్కారమొనరించెను. తత్ప్రదేశదండనాధికారిని మంచూరియా ప్రదేశమునకు వెళ్లిపోవలసినదని యుత్తరువుచేసెను. చీనాదొరతనమువారంత బహిరంగముగను నిష్కర్షగను శిక్షించినను వారి చర్యలోఁ గొంత కపటవ్యాపార మున్నట్లన్యదేశీయులు గ్రహించిరి. ఏదియన నన్యదేశీయులనిరోధమువలన తమ యుద్యోగులను బాహాటముగా శిక్షించునట్లుగ మఱియొకచోటునకుఁ బంపివేసి యచ్చట నాతనికిఁ బూర్వముకంటె గొప్పయుద్యోగమును దొరతనమువారిచ్చుటయు మరణదండనకర్హులయిన యితర నేరస్థులు పైని నుడువఁబడిన హత్యలొనరించినవారిలోఁ జేరినవారేయని యురికొయ్యకుఁ బంపి యివ్విధమున నపరాధులసంఖ్యఁ బెంపొనరించి యన్యదేశీయుల శాంతింపఁజేయుటయు నిట్టికపటవ్యాపారములను చీనాదొరతనమువారియందు నన్యదేశీయులు కనిపెట్టిరి. ఎట్లయినను గతంబున నుడువఁబడిన హత్యంగూర్చి 16 గురికి మరణదండన విధించిరి. వారు ఘాతుకులే యయియుండిరి. వారు 1870 సం. అక్టోబరు 18 తేదీ నురిదీయఁబడిరి. కాని వారలు తమజాతీయమతమునకై ప్రాణముల నిచ్చినవారినిగ దొరతనమువారు భావించి వారిచేఁ బట్టువస్త్రములను ధరింపఁజేసి స్త్రీలకీర్తి నలంకరించి యురితీయించిరి. హత్యలు జరగఁబడినప్పుడున్న దండనాకారిని మాంచూరియా దేశమునకు వెడలఁగొట్టిరని గతంబున లిఖింపఁబడియున్నది. కాని యాయనకుటుంబముతో స్వగృహములో సుఖంబుగ నుండుట గూఢంబుగ నంగీకరించి యతని నొకదేశాభిమానిగ నెంచి దేశాభిమానులపై వర్షించుకీర్తిని దొరతనమువా రాయనపై బహుమతుల వర్షింపుచుండిరఁట.

## టిటు అను కలహకారుఁడు.

“టిటు” అను పేరుగలవాఁడొకఁడుండెను. వాఁడిదివరలో టాయిపింగు కలహకారులలోఁ జేరియుండి గొప్పజీతముగల యుద్యోగమున కాళపడి

దొరతనమువారి కొలువులోఁజేరెను. వాఁడు ప్రబలఘాతుకుఁడని యాంగ్లేయ మంత్రి యెఱిఁగియుండెను. వాని కన్యదేశీయులయెడల నపారమైన ద్వేషము కలదు. ఈయధ్యాయమందుఁ జెప్పఁబడిన హత్యలకాలమందు వాఁడాప్రదేశమం దుండుట కలిగెను. వాఁడే యట్టిఘోరకృత్యములఁ జేయించె నని యాంగ్లేయులు నమ్మియుండిరి. దొరతనమువారికి వానియందు మిగుల నభిమానముం డుటచే వాని కేయపాయములేకుండ వానిని గాపాడుచుండిరి. కావున వానిని వాన్కిఙ్ నగరమందు నాంగ్లేయుల కావలిలోనుంచునట్లు దొరతనమువారినివా సమ్మతిపఱచుట యాంగ్లేయమంత్రికి దుర్ఘటమయ్యెను. ఈపఱలో హతులైన యోగినులు ఫ్రాన్సురాజ్యములోఁ జేరినవారగుటచే ఆదొరతనమువారికి 4,00,000"తాయిలు" నాణెములను జరగఁబడిన హత్యలకొఱకపరాధద్రవ్యముగానిచ్చుటకును స్వయముగా ఆదొరతనమువారిసన్నిధికిఁబోయి, చీనాదొరతనము వా రాహత్యలను గూర్చి పరితపించుచుండి రని మనవిచేయునిమిత్త మాహత్యలకుఁ బ్రోత్సాహకుఁ డని నిందింపఁబడిన చుంగుచౌను బంపుటకును చీనాదొరతనమువారు సమ్మతించిరి.

## అన్యమతవిషయనిబంధన మధికస్వాతంత్ర్యము కలిగియుండుట.

టియస్టిను నగరమందును సమీపప్రదేశములయందును బ్రవర్తిల్లియున్న మతకలహము రాజ్యములో బహుప్రదేశములయందు వ్యాపించియుండెను. దొరతనమువారి గొప్పయుద్యోగులే యాకలహములకుఁ గారకులుగాఁగాని ప్రోత్సాహకులుగాఁగాని యుండిరని యాంగ్లేయరాయబారి యాదొరతనమువారికి స్పష్టముగా ఋజువుచేసెను. అన్యదేశీయులసంధినిబంధనలలో మతవిషయికనిబంధనవలన నన్యమతస్థులకుఁ గలిగిన స్వాతంత్ర్య మపారముగా నున్నదని యన్యదేశీయ కార్యస్థాన సభికులాలోచించి దానిని మట్టుపఱచుటకు నెనిమిది నిషేధములను వ్రాసి యన్యదేశీయరాయబారులకుఁ దెలియపఱచిరి. ఆనిషేధములలో ముఖ్యమయినవి యీదిగువ వ్రాయఁబడును.

(1) నిరుపాధికశరణాలయములను దీసివేయవలయును.

(2) ప్రార్థనామందిరముల (Churchs) లోనికి స్త్రీలు రాఁగూడదు. ధర్మయోగినులు చీనాదేశమం దుండఁగూడదు.

(3) మిషనరీలు చీనాదేశపుచట్టములకును, ఆచారములకును అధికార్లకును లోఁబడవలయును.

(4) అల్లరులు సాధారణముగాఁ బామరజనులవలనఁ జేయఁబడును. కావునఁ బండితు లట్టివి చేయించిరని వారిని నిందింపఁగూడదు.

(5) ఎవనినయినను క్రైస్తవమతములోఁ జేర్చుకొనునపుడు వాఁ డంతకుమున్ను నేరస్థుఁడో శిక్షపడినవాఁడో యని విచారింపవలెను.

## అన్యదేశీయరాయబారులు సమ్మతింపకుండుట.

పైనిషేధములు సంధినిబంధనలకు బహువిరోధముగ నుండుటంజేసి యన్యదేశీయరాయబారులకు లేశమాత్రమును సమ్మతముగ నుండలేదు. ఈవిషయమై చరిత్రకారుఁ డిట్లువ్రాసెను. "చీనాదొరతనమువారు తమరాజ్యమం దే మతస్థులున్నను వారు చీనాదేశీయులను దమ మతములోఁ జేర్చుకొనినను వారి తెరువునకుఁ బోనంతటి మతసహనము కలవారు. వారు సంతోషార్థముగాఁగాని వ్యవహారార్థముగాఁగాని బహుదేవతారాధనఁ జేసెడువారు. క్రైస్తవులకుఁబ్రతిమారాధన యెంతమాత్రమును గిట్టదు. తమప్రజలలోఁ గొందఱట్టి యన్యమతస్థులగుట దొరతనమువారికిని ద్వేషముగానే యుండును. అట్టిద్వేషము నెఱిఁగి యుండి ప్రజ లన్యమత మేల యవలంబించెదరో వింతగా నుండును. ఎట్లయినను దొరతనమునకు విరుద్ధముగా మతబోధ చేయు స్వల్పసంఖ్యగల మిషనెరీలకు హత్యలును గష్టములును దప్పకుండునా?" పైనిజెప్పఁబడిన విషయములు దుస్తరములుగ నుండుటంజేసి దొరతనమువా రేమియుఁ దోఁచక యుండిరి. అట్టిసమయమం దనఁగా 1872 సం. లో చక్రవర్తికి 16 సం. ల ప్రాయము వచ్చెను. అదియే వివాహమాడుటకును స్వయముగ రాజ్యపరిపాలన చేయుటకును బూర్వాచారప్రకారము చక్రవర్తికిఁ దగినసమయము. అట్టి మహాచక్రవర్తికిఁ దగినంత పరువుగల కన్యదాత దొరకుట కడుదుర్లభంబుకదా. చక్రవర్తి కన్యను స్వయముగా నన్వేషించుకొనగూడదట. సుముహూర్తకాలమందే యామెను

చక్రవర్తి దర్శింపవలెను. కావున నిదివఱలోఁ జెప్పఁబడిన ప్రకారము రాజప్రతినిధులుగా వ్యవహరించుచున్న చక్రవర్తును లిద్దఱును చక్రవర్తియొక్క సుఖము కోరినవారై యాయనకుం దగిన కన్యను విచారించుచుండిరి. ఆకన్య మంచూరి యా వంశమునఁ బుట్టినదియు నామెతండ్రి రణవీరులలోఁ బరిగణింపఁ బడినవాఁడుగా నుండవలెను. అట్టికన్యల నయిదారువందల మందిని విచారించిరి. చక్రవర్తిని కనేకములయిన కట్టుదిట్టము లుండుటం జేసి యాకట్టుదిట్టములకుఁ దాళఁజాలమని కన్యలు కుంటివారుగను గూను మొదలయిన లోపములుగలవారుగను నటించి తప్పించుకొందురు. తుదకు అహ్లుత (Ahluta) అనుపేరుగల కన్యను వారు స్థిరపఱచిరి. ఆమెతండ్రి ప్రబలవిద్యావంతుఁడగుటం జేసి యాకన్యకకుఁ జాలఁగ విద్య కఱసెను. అట్టి చక్రవర్తియొక్క వివాహోత్సవసన్నాహము లెంతవిశేషముగ నుండియుండెనో చదువరులే యూహింపఁగలరు. 1872 సం. అక్టోబరు 16 తేది నడురేయియందు సుముహూర్తము నిశ్చయింపఁబడెను. ఒక బంగారపు పలకపైఁగన్యను గూర్చుండఁబెట్టి యామె కిరీటమును శిఖాముద్రను దానిపైనుంచి యాపలకను నలువురు గొప్పయుద్యోగులు మోచికొని శయనగృహమునకు సపరివారముగఁ దీసికొనిపోయిరి. తదనంతరము నలువురు పడుచులు చక్రవర్తి కుపభార్యలుగా నంతఃపురములోనికిఁ బంపఁబడిరి. చక్రవర్తికి మొదటి తరగతి పడుచులు 4 గురును, రెండవ తరగతి పడుచులు 27 గురును, మూడవతరగతి పడుచులు 81 రును ఉపభార్యలుండవలయునని చీనావారిచట్టములు విధించుచున్నవి. అయినను ఆ "టుంగుచి" చక్రవర్తి మొదటితరగతివారు నలువురే తనకుఁ జాలునని చెప్పెను. అది యుచితమే కదా.

## చక్రవర్తి స్వయముగఁ బరిపాలింపఁబూనుట.

చక్రవర్తి వివాహమాడినతోడనే రాజప్రతినిధు లుండఁగూడదని నియమముండుటచే, చక్రవర్తి స్వయముగానే పరిపాలింపఁబూనెను. ఆయన యొనరింపఁబూనిన ప్రథమకార్య మన్యరాజ్యరాయబారులకు దర్శనమిచ్చుట. అటుల దర్శన మొసంగవలెనని 1858 సం. మొదలి సంధి నిబంధనలలో నుండెను. ఈచక్రవర్తి తండ్రి రాజధానిని విడిచి 'జిహోలు' నగరమందుండి దర్శన

మొసంగక తప్పించుకొనెను. ఆయన మరణానంతర మీచక్రవర్తికి యుక్తవయస్సు రానందున నాకార్యము నెఱవేరనే లేదు. అన్యదేశపు రాయబారు లెట్టివారో చూడవలెనని చక్రవర్తికిఁ గుతూహలముకూడఁ గలిగెను. కాని దర్శనమునకు వచ్చినప్పు డన్యదేశరాయబారులు చూపవలసిన మర్యాదను గుఱించిన వివాద మప్పటికిని బాధించుచుండె. చక్రవర్తికట్టెదుట రాయబారులు తమమోములను నేలకు దాఁకించుటకు నిరాకరించి మెకార్ట్నీ రాయబారి మోకాలించెనని గతంబున లిఖింపఁబడియున్నది. సమానస్కంధులయిన యన్య రాజులవద్దనుండి వచ్చిన రాయబారులు మోకాలించుటకూడ నగత్యములేదని సంధినిబంధనలలో నుండెను. కావున రాయబారులు మోకాలించుటను గూఢ నిరాకరింపఁ దలఁచిరి. వారిచే నెట్లయినను హీనకృత్యము చేయింపవలెనని చీనామంత్రులు పెనఁగులాడుచుండిరి. కార్యావసరముం బట్టి యెట్లయినను దర్శనమునకుఁ బోఁగానె మూడుసలాములు చేయుట కన్యదేశీయ రాయబారులు సమ్మతించిరి. అది యటుండ చక్రవర్తి యీదిగువరీతిగ నొకశాసనము 1873 సం. జూన్ నెలలోఁ బ్రకటింపఁజేసెను.

## దర్శనవిషయమైన చక్రవర్తియొక్క శాసనము.

పికిన్ రాజధానియందున్న రాయబారులు తమరాజులవద్దనుండి తెచ్చినయుత్తరములను మాకు సమర్పించుటకు దర్శనమీయుఁడని మిమ్మునఁ బ్రార్థించిరని సభికులు తెలియఁజేసిరి. కావున వారు తమయుత్తరములతో మాదర్శనమునకు వచ్చునట్లు క్రిందుమూలకముగా నాజ్ఞాపించుచున్నాము. ఈశాసనము స్వాతిశయముతో నిండియున్నదని రాయబారులు కినియుచుండిరి. ఒకవిహార మంటపమందుఁ జక్రవర్తి దర్శనమిచ్చునట్లేర్పడెను. చక్రవర్తికి లోఁబడియుండెడి యన్యరాజుల రాయబారులకు దర్శనమిచ్చుచో టదియేయగుటచే వారితో సమానముగనే తమ్మును చక్రవర్తి భావించినాఁడనియు నారాయబారులు సంశయించుచుండిరి. 1873 సం. జూన్ నెల 29 తేది యుదయము 6 గంటల వేళ దర్శనకాలము నిర్ణయింపఁబడినది. అదియు నసందర్భకాలమని యారాయబారులు తలఁచిరి. వారిచింత చీనామంత్రుల కానందజనకంబుగ నుండె.

నఁట. అప్పుడు దర్శనార్థులుగ నున్నవారు ఆంగ్లేయ, ఫ్రాన్సు, హాలండు, అమెరికా, రుషియా, జపాను దేశముల రాయబారులు. వారిలో జపాను రాయబారి యగ్రగణ్యుఁడని యాయనకుఁ బ్రథమదర్శనం బీయఁబడెను. కడమవారు పిమ్మట దర్శించిరి. వారు తెచ్చినయుత్తరములను బల్లపై నుంచిరి. చక్రవర్తి వానిం జదువుకొని ప్రత్యుత్తరములను మర్యాదగా నొసంగెను. పిమ్మట నా మంత్రులు వందనములు చేసి వెడలిపోయిరి.

## మంత్రులే రాయబారులకు నధికారులుగ నుండుట.

ముందు చెప్పఁబోవుజపానుయుద్ధము దనుక యన్యదేశ రాయబారులకును చీనాదొరతనము వారిమంత్రులకును జరుగుచుండిన వ్యవహారసరణి రాయబారులు ప్రార్థించుటయు, మంత్రులంగీకరించుటయుగానె యుండెను. మంత్రులా రాయబారులను దిరస్కరించుచునేయుండిరి. లిహంగుచంగు ఇంగ్లాండు దేశము చూడఁబోయినపుడాయన స్వాతిశయాదులెట్లున్నను నచ్చటియధికారులు విశేషసన్మానము చేసిరి. అయినను ఆయనసంతసింపఁడయ్యె. తూర్పురాజ్యముల లక్షణమట్టిదే యని పాశ్చాత్యచరిత్రకారుఁడు శ్లాఘించెను.

యూనాన్ పరగణాలయందు జరిగిన కలహములలో జనులూఁచకోఁత కోయఁబడిరని గతంబున లిఖింపఁబడియున్నది. అప్పుడు ఖడ్గమునకుఁ దప్పి బ్రతికినవారిని క్షామమును వ్యాధియు తమపొట్టఁబెట్టుకొనెను. అట్టి దురవస్థఁజూచి నూతనచక్రవర్తి మిగులఁగరుణించి హతశేషులు చెల్లింపవలసిన పన్నులఁగొట్టివేసి వారికిశిస్తులేకుండ భూములను వ్యవసాయముకొఱ కిచ్చి కొన్నిసదుపాయములను జేసెను. కాని యానాఁడు మహమ్మదీయులు జేసిననాశమునుండి యాపరగణా యిప్పటికిని గోలుకొనలేదు.

వాయవ్యమూలనున్నకాన్సు (Kansu) షెన్సి (Shensi) పరగణాలను మంచిస్థితిలోకిఁ దేఁగలందులకు నచ్చటి మిలిటరీ సైన్యమును మరల నేర్పర్చిరి. వారు పూర్వపద్ధతిప్రకారము విండ్లనమ్ములను ధరింపవలసినవారే యయియుండిరి. సేనలయుద్ధకౌశల్యము నశింపుచుండెననియు విద్యాపరీక్షలు సమాప్తింజెందుటచే దుర్నీతి దేశమందు బ్రబలుచుండెననియు నక్కాలపు రాజ్య

స్థితిని వర్ణించుచు ఆలోపముల నివారించుట యావశ్యకమని పికిన్ గేజటు యందుఁ దత్ప్రదేశవాసియగు పండిత ముఖ్యుఁడు ప్రకటించెను. దేశభాష యందలి నీతిపద్యములను జనులు పఠించిరేని నన్యోన్యకలహములు నివారింపఁ బడునని కాంటన్ గవర్నరా గెజటీయందే ప్రచురించెను. ఆప్రకటనలు 1873 సం. లో జరిగెను.

"హునాన్" పరగణాయందుఁ బ్రజాకలహము ప్రచండంబుగ వెడలెను. పసుపు యేఱు పొంగి వెల్లువగట్టి యెన్నియొ చదరపుమైళ్ల భూమిని జలమయము చేసెను అని చక్రవర్తికి సమాచారములు వచ్చెను.

## జపానీయులు ఫార్మోజాద్వీపమందు దండువిడియుట.

అవి యటుండ జపాన్ దేశపు నావికులు సముద్రయానమందు బడవలు పగులుటచేఁ దల్లడపడుచుండినపుడు పలుసారు ఫార్మోజాద్వీపవాసులు వారిం బొరిగొనుచుండిరి. చీనాదొరతనమువా రాద్వీపవాసుల దండింపఁజాలమనిరి. అంతట జపానీయులసైన్య మాద్వీపమందు దండువిడిసి పికిన్ రాజధానికి రాయబారింబంపఁగా చీనామంత్రులు లోఁబడి యాసంకటము నివారించెద మని చెప్పుచు నివారింపని యెడల నపరాధద్రవ్యమెంత చెల్లించెదరో యెప్పుడు చెల్లింపఁబడునో యావిషయములఁ దెల్పరైరి. కావున జపానీయులు యుద్ధోన్ముఖులు కాఁగా ఆంగ్లేయమంత్రి తాను దొరతనమువారిచే 500000 తాయిలు నాణెముల నిప్పించెదనని ప్రతిభువై యీయుద్ధ మాఁపించెను.

ఈ "టంగుచి" చక్రవర్తి బాలుఁడైయుండఁగ రాజ్యపరిపాలనము చక్రవర్తినులు చేయుచుండిరి. వయసు వచ్చినకొలఁది యాచక్రవర్తి వారికట్టుబాటులోనుండుట కిష్టములేనివాఁడయ్యెను. పూర్వము మహమ్మదీయుల కలీఫయిన హరూనల్ రశీదువలె నీచక్రవర్తి జనుల కష్టసుఖంబుల నరయుటకై రాత్రులయందు వేషమూనుచుండెనట. అన్యదేశీయ కార్యస్థానాధ్యక్షుఁడైన "కంగు" యొక్కవ్యవహారము లాయన కసమ్మతములగుటచే నాయనను బనిలోనుండి చక్రవర్తి తొలఁగించెను.

ఆయుత్తరువులను రద్దుపఱచి చక్రవర్తిను లాయనను మరలఁ బనిలో నుంచిరి. వ్యవహార ధర్మమటుల సరసను తప్పియుండఁగా చక్రవర్తి మశూచకముపడి 1875 సం. జనవరి 12 తేదీని కాలధర్మము నొందెను.

ఈయన మరణించు కాలమునకు 19 వత్సరంబుల ప్రాయము కలిగియుండెను. ఈయన స్వయముగఁ బరిపాలించినది యొక వత్సరంబె. అంతవఱకీయన తల్లులిరువు రీయనకు మాఱుగఁ బదియేను వత్సరంబులు పరిపాలించిరి. వారిలో నొకయామె యీయనను గన్నతల్లి ఆమెపేరు. "సి అన్" (TsiAn.) రెండవ యామెపేరు. "సిసి" (Tsi Hsi.) ఈయన స్వయముగఁ బాలింపఁబూని తల్లులమాట విననివాఁడగుటచేతను. దల్లులకుఁ బరిపాలనాకాంక్ష దీఱకపోవుటచేతను వారె విషముపెట్టి చంపియుందురని జనులును విదేశ రాయబారులును దలఁచిరి. ఎంతమరుహ్యామయినవిషయము చూడుఁడు.

## చక్రవర్తిమరణము, నూతనచక్రవర్తింగూర్చి నెమకుట.

అంతట నూతన చక్రవర్తి యెవరు కావలయునో యను విచారణకు సమయము వచ్చెను. గతించిన చక్రవర్తి భార్యయయిన "అహ్లుటా (Ahluta) గర్భవతిగానుండెనని కింవదంతి కలిగియుండెను. ఆసంగతియే నిజమయి పుత్రుఁడే కలిగినయెడల నామెయే రాజప్రతినిధిగ రాజ్యమేలవలసి యుండెను. కావున నావిషయమును మరుగుపఱచి చక్రవర్తినులు తామె రాజప్రతినిధులుగనుండి రాజ్యమేలుటకై యొకబాలుని చక్రవర్తిఁగఁ జేయఁబూనిరి. చీనావారి చట్టముల ప్రకారము రాజ్యార్హు లిద్దఱుండిరి. ఒకడు "కంగు" యొక్క ప్రాయంపు కుమారుఁడు. రెండవవాడు "చున్" యొక్క మగశిశువు. "కంగు" కుమారుడు చక్రవర్తియయిన యెడల అయనకులోఁబడి యాయన తండ్రి మంత్రిగ వ్యవహరించుట కలుగును. పితృభక్తి గౌరవములు చీనావారికి మెండు. కావున "చున్" యొక్క బాలునే చక్రవర్తిగ నియమించి చక్రవర్తినులెప్పటివలెనే రాజప్రతినిధులుగ నుండిరి. ఆబాలుని వయస్సు నాలుగువత్సరంబులు నిండుగాలేవు. ఆయనపేరు "సైటీను" (Tsaitien). ఆయనను అయన తాతగారయిన సియన్ఫింగు చక్రవర్తికి దత్తునిగనెంచిరి. చక్రవర్తినుల యొ

క్కు నున్నట్టుయటుండ దానికిందోడుగ నప్లుతా వ్యాధిపీడితురాలై శీఘ్రకాలములోనె యనఁగా 1875 సం. మార్చి 29 తేదిని మృతినొందెను. భర్తయొక్క మరణానంతర మామె జీవించియుండు నేని చక్రవర్తినుల కపటకృత్యమున కామె పానకములోఁ బుడకవంటి దయి మరణించుటచే వారికిఁ బాలలోఁ బంచదారవంటి దాయెను.

చక్రవర్తిను లిరువురును బరిపాలనా కాంక్షచే నీమె మరణమునకుఁ గారకులని యపఖ్యాతినొందిరి. అక్కాలంబున ముఖ్యమంత్రియయి యుండిన "కంగు" వంటి యోగ్యుఁడును వ్యవహారదక్షుండును మఱియొకఁడు లేఁడని విదేశీయులు భావించియుఁ బిన్నవయసులో చక్రవర్తియు నవ్యవధానముగ నాయనభార్యయు మరణమొందుటఁ జూచి యాయననుగూడ నిందాపాత్రుని జేసిరి.

స్వకార్యధురంధరులు తమకుఁ బ్రతిబంధకములుగ నుండు పరుల ప్రాణంబుల నయినఁ బోఁగొరుదురు కదా. ఆమె తాను మరణించి వారి కుపకారి యగుటంజేసి యామె జీవితకాలమందు సుగుణములఁగని యనియుఁ బతివ్రత యనియు నామె మరణానంతరము చక్రవర్తినులు ప్రమరింపఁ జేసిరి. చీనాచక్రవర్తులకు జన్మనామముకాక చక్రవర్తిత్వమందు వేఱొక నామమును ధరించు నాచారముకలదు. కావున నీ బాలచక్రవర్తికి "క్వాంఘుసు" (Kwanghsu) అని నామమిడిరి.

ఈ నూతన చక్రవర్తివయస్సు 4 వత్సరంబులు. ఇద్దఱుచక్రవర్తినులు "కంగు" అను మంత్రియొక్క యాలోచనముఁగొనుచు రాజ్యమేలుచుండిరి. కావున పరిపాలనముయొక్క యోగ్యతాయోగ్యతలు వీరి ముగ్గురిలో నెవరికిఁ జెందవలయునొ విస్పష్టంబు కాకుండెను.

## కొజ్జాలనుద్యోగములనుండి తొలఁగించుట.

గతించినచక్రవర్తి కొజ్జాలను దగని యధికారస్థానములయందుంచి రాజ్యముయొక్క గౌరవమును దర్పమును జెడఁగొట్టెనని చక్కఁగ యోచించి వారిలో నేడుగురిని వారినేరములంబట్టి శిక్షించి కడమవారిని వారివారికిఁ దగి

న యుద్యోగంబులందుంచిరి. రాజప్రతినిధులయిన యాచక్రవర్తినుల ప్రథమ ప్రశస్తకార్యమిదియె. దీనివలన రాజ్యమునకు బీడఁగనుండు కొజ్జాల వ్యవహారము చక్కఁబడెను.

ఏది యెట్లున్నను అన్యదేశీయులతో చీనామంత్రు లెంతమృదువుగను నెనురాగముగను సంభాషించుచున్నను వారి యంతరంగములయందు ద్వేషభావము ప్రబలుచునేయుండెను. గతచక్రవర్తికాలంబున యూనాన్ పరగణా యందు వర్తకవ్యాపారములను జరుపుటకు ఇండియా దేశమునుండి తగువారిని గొందఱను బంపుఁడని యచ్చటి గవర్నరుజనరల్ గారిని దొరతనమువారు గోరిరి. ఆప్రకారమే కొందఱు సంఘముగా బయలుదేరి భామోపట్టణమునకు రాఁగా వారిని వెదుర్కొని తీసికొనివచ్చుటకు "మార్గరి" (Margary) యను పేరు గల యాంగ్లేయసభికుని సపరివారముగ చీనాయందలి యాలోచన సభవారు పంపిరి. ఆయన భామోవద్ద 1875 సంవత్సరము జనవరి 26 తేది వారిం గలసికొనెను. ఆయన చీనాభాషయందు పండితుఁడును ఆప్రదేశములసంగతి యెఱిఁగినవాఁడును ఇండియానుండివచ్చిన సంఘమున కధిపతి కర్నలు బ్రౌను ఆసంఘాధిపతిని వెనుకనుండి రమ్మనుమని "మార్గరి" అను నుద్యోగిముందుగఁ దగు పరిజనముతోఁబోయి యొకపట్టణముచేరఁగా నచ్చటి ప్రదేశాధికారియొక్క ప్రేరేపణచే నాయనసేవకులు సమీపమున గనులున్నవి పరీక్షించవచ్చునని యాయాంగ్లేయసభికుని తోడ్కొనిపోయి క్రూరవధ కావించిరి. కర్నలు బ్రౌనుయొక్క పరివారముపై చీనాసేనలు పడఁగా నాసేనలను వారు తఱిమివేసిరి.

## దొరతనము వారాహత్యనుగూర్చి విచారింపఁబూనుట.

ఆంగ్లేయసభికుఁడైన "మార్గరి" ని వధించుటను గూర్చియు కర్నలు బ్రౌనుయొక్క పరిజనమును చీనాసైన్యము నిర్హేతుకముగ ముట్టడించుటను గూర్చియుఁ గ్రమమయిన విచారణచేసి యపరాధులను శిక్షింపవలయునని యాంగ్లేయరాయబారి చీనాదొరతనము వారిని నిరోధింపఁగా వారేమేమొ సమాధానములుచెప్పుచుఁ బూర్వపక్షములుచేయుచుఁ దుదకు "లిహాంగుచం

గు" అను మంత్రిని ఆంగ్లేయ కార్యనిర్వాహకునికిఁ దోడుగనిచ్చి విచారణచే యుటకుఁ బంపిరి.

వారు విచారణ నారంభింపక పూర్వమే యది తృప్తికరముగఁ బూర్తి యగుటకు ఆంగ్లేయ మంత్రియగు "సర్ తామసు వేడు" చీనాదొరతనము వారినిఁ గొన్ని విషయములను గోరి వాని నంగీకరింపవలయునని ప్రతిపాదించెను. ఆవిషయము లేవియనఁగా.

(1) పికిన్ రాజధానియందున్న అన్యదేశీయ రాయబారులతో చీనాదొర తనమువారు వ్యవహార సంబంధముల నెక్కువగాఁ గలిగి యుండవలెను.

(2) వర్తకసదుపాయములు వృద్ధికావలయును.

(3) మార్గరి యనుసభికుని హత్య జరిగి 6 మాసములయినప్పటికి తత్ప్రదేశాధికారియయిన "సెన్" (Tsen) ఆహత్య యెట్లు సంభవించినది యేల తెలియఁజేయకుండెనో విచారింపవలెను.

(4) మార్గరిని నిష్కారణముగా హత్యకావించినందునకు చీనాదొరతనము వారి విచారమును ఆంగ్లేయ దొరతనము వారికి దెలుపుటకై చీనాదేశపుమంత్రిని ఇంగ్లాండునకుఁ బంపవలెను.

(5) అటుల చీనాదేశపు మంత్రిని బంపినట్లు పికిన్ గెజటిలోఁ బ్రకటింపవలెను.

ఇవికాక మఱి రెండు విషయములను గోరెను.

## దొరతనమువారిచ్చిన ప్రత్యుత్తరము.

తమకు నన్యదేశీయ వ్యవహారములతోఁ బని లేదనియు, ఆవ్యవహారముల కొఱకు నియమింపఁబడిన వారే యాపనులను విచారించెదగనియు, ఇంగ్లాండు దేశమునకు చీనా మంత్రిని బంపుట సంభవింప దనియు, చక్రవర్తియొనరించు శాసనముల విషయమై సలహాయిచ్చుటకుఁ దమ కధికారము లేదనియు దొరతనము వారు ప్రత్యుత్తర మిచ్చిరి. అంతట నాంగ్లేయ మంత్రి యుద్ధసన్నద్ధుఁడయ్యెను. అదిచూచి చీనాదొరతనమువారు లిహాంగు చియాంగును మఱియొక మంత్రిని బోయి యాంగ్లేయమంత్రితో మార్గరియొక్క హత్యనుగుఱించి మా

ట్లాడుమని నియమించిరి. "లిహాంగుచాంగు"కు సర్వాధికారమిచ్చితిమని వ్రాసిరి కాని యాయన తీర్పులకు దొరతనమువారు బద్ధులయి యుండరని పదంపడి వ్రాసిరి.

యూనాన్ నగరమందు జరగఁబడిన "మార్గరీ" యొక్క హత్యను గుఱించి విచారింపఁబోయిన ఆంగ్లేయ కమిషనరున కావశ్యకమయిన సాక్ష్యము చిక్కనీయక యాపయోగములేని సాక్ష్యమును జతపఱచుచు నచ్చటి యధికారులు తంత్రముగ వ్యవహరించుచుండిరి. మఱియు నాహత్యకు ముఖ్యముగఁ బ్రోత్సాహకుఁడుగ నుండిన "సెన్" అనుగవర్నరును నిర్దోషిని జేయుటకు దొరతనము వారి యధికారులందఱును బూనుకొనియుండిరి. ఆగవర్నరతిక్రూరుఁడయినట్టు తెలుపుట కతనిచర్యలు గ్రంథస్థము లయి యున్నవి. జనులాయన దోషి కాఁడనియు, కర్నల్ "లి" అనువాఁడు హత్యకు కారకుఁ డనియుఁ జెప్పిరి. ఈతఁడె ఇండియానుండి వచ్చిన సంఘమును ముట్టడించి యుండెను.

## చీఫూనగరము నొడంబడిక.

చీనాదొరతనము వారు సరళముగ వ్యవహరించువారు కారని విసికి యాంగ్లేయ మంత్రి షాంఘాయి నగరమునకు నావయెక్కి వెళ్లి యుద్ధప్రయత్నము చేయుచుండెను. అది తెలిసికొని యాలోచన సంఘమువారు త్వరపడి సంధికావించు కొమ్మని లిహాంగుచాంగును బంపిరి. ఆప్రకారమాయన యాంగ్లేయ మంత్రినిం గలసి యొడం బఱచెను. ఆయొడంబడిక చీఫూ నగరమందు జరుగుటంజేసి దానిని చీఫూ యొడంబడిక యందురు. ఆయొడంబడిక యేర్పడిన తారీఖు మొదలుకొని పంద్రెండు వత్సరములు కడచిన పిమ్మట దానిని చక్రవర్తి స్థిరపఱచెను.

చీనా దొరతనమువారితోఁ జేయఁబడిన యొడంబడికలు దీనితో మూఁడు. ఎవ్వియన (1) నాన్కిన్ ఒడంబడిక, (2) టియాంట్సిన్ ఒడంబడిక, (3) చీఫూ ఒడంబడిక. పికిన్ ఒడంబడిక టియాంట్సిన్ ఒడంబడికలోఁ జేరినదె. ఈయొడంబడికల ననుసరించియే యాంగ్లేయులకును చీనావారికిని వ్యవహారములు జరుగుచున్నవి.

ఆయొడంబడిక నిబంధనలలో నొక నిబంధన ప్రకారము నాంగ్లేయ రాజ సభకు చీనాదేశపు మంత్రియొకఁడు పంపఁబడెను. అదృష్టవశమున నామంత్రి సరసుఁడును యోగ్యుఁడు నయి యుండెను. కావున ఆయన యింగ్లాండు రాజ్యమందుండి నంతవట్టును నన్యోన్య దేశీయవ్యవహారములు సరసముగ జరగుచుండెను. ఆవ్యవహారము లట్లుండ చీనారాజ్యములో గతించిన చక్రవర్తి యొక్కయు, ఆయనపట్టపుదేవియొక్కయు సమాధ్యుత్సవసంరంభములయందుఁ బ్రభువును బ్రజలును మునిఁగి తేలుచున్నట్లుండిరి. మున్నెన్నఁడు వినికని యుండని రీతిగ మహావైభవముతో వారిమృతకళేబరముల నుంచిన పెట్టెలను 1875 సం. అక్టోబరు 16 తే దీని సమాధికి 128 వాహకులు గొంపోయిరఁట. ఆవైభవమునకొఱకు చీనావారికయిన వ్యయము 189000 (తాయిలు) నాణెములని చెప్పఁబడియున్నది.

## ప్ర చం డ క్షా మ ము.

కలహములచేఁ బీడింపఁబడుచుండిన చీనారాజ్య మప్పటికి స్వస్థతం జెందియుండఁగా ఆరాజ్యముయొక్క యుత్తరఖండమందు నసాధారణమయిన క్షామమొకటి సంభవించెను. ఆయుత్తరఖండము రమారమి ఫ్రాన్సుదేశమంత యుండును. దానియందుఁ బలుసైళ్ళవలని భూమిపైభాగము 100 అడుగుల లోతు దనుక సారవంతమయి యుండును. వర్షములు సకాలములో సమృద్ధిగఁ గురిసినయెడల నానేలను బుల్లతోఁ గుళ్లగించి విత్తనములు నాటినయెడల నమోఘముగ ఫలించుచుండెను. అది యట్టి ఫలవంతప్రదేశమగుటచే దానిని చీనాదేశారామమని చీనావారందురు. వర్షములు కురియునప్పుడు ప్రచండవాయువుచే నామట్టి యెగురఁగొట్టుకొనిపోవును. చల్లినవిత్తనము లంతట నెండలో మాడి నిస్సారములగును. కావుననే వలపుకాలమందు చక్రవర్తి వానను మంచును బ్రార్థనచేయును.

1874_76 సం. పర్యంతము సాఁక్సి (Shansi) చిహ్లి (Chihli) మొదలయిన పరగణాలయందు బొత్తిగ వానలులేనందునఁ గాటకము ప్రళయకరంబుగ సంభవించెను. చీనాదేశమం దొకపట్టణమునుండి మఱియొక పట్టణ

మునకు సరళములయిన బాటలుగాని, కాలువలుగాని, రైళ్లుగాని, లేనందునఁ బుష్కలముగఁ బండినప్రదేశములనుండి క్షామపీడిత ప్రదేశములకు సరకులం గొని పోవుటకు వలను పడదయ్యెను.

అట్టి మార్గ సదుపాయముల నేర్పాటుచేసి యార్తిబాధల నివారించుట చక్రవర్తిపనియై యుండఁగా చీనాచక్రవర్తు లేల యుపేక్షించిరో యూహింపఁజాలము. ఆక్షామమువలనఁ దొంబదిలక్షల జనము నశించిరి. ఆయుపద్రవము నుండి జనుల రక్షించుటకై మంత్రియయిన లిహాంగుచాంగు 289394 తాయిలు నాణెములను సమకూర్చెను. అన్యదేశీయు లందఱుఁగూడి 204560 నాణెములను సహాయద్రవ్యముగా నిచ్చిరి. ఆద్రవ్యమును క్షామపీడితులకు వినియోగించెడి క్రిందియధికారులు స్వప్రయోజనపరులై యపహరింపఁ దొడంగఁగ లిహుంగుచాంగు వారలం బట్టికొని బెట్టిదముగ శిక్షించెను. దయాశూన్యు లట్లపహరించుట యబ్బురంబు కాదు కదా.

## రైలుమార్గము నేర్పఱచుట.

కఱవుగానున్న ప్రదేశములకు ధాన్యాదులం గొంపోవుట దుష్కరంబుగనుండుట దొరతనమువారికి మనంబున గాటంబుగ నాటెను. కావున రైళ్ళనేర్పఱుపవలయునను యోచన యంకురించెను. అంతకుమున్నె విదేశీయవర్తకులు "లియాంగు" పరగణాల యధికారియొక్క యనుమతింబడసి "షాంఘాయి" నగరమునుండి "వుసంగు" నదీముఖద్వారము పర్యంతమును గల 12 మైళ్లదూరమున కొక రైలుమార్గ మేర్పఱచిరి. ఆరైలు నెక్కుటకై జనులు గుంపులు గుంపులుగాఁ బోవుచుండిరి. ఆరైలుబండిలో స్థలములేక యప్పుడప్పుడు కొందఱు ప్రయాణము మానుకొనుచుండిరి. దీనింజూడ జనులు రైలుబండ్లయం దత్యంతాదరము కలవారని స్పష్టమగుచున్నది. అయినను చీనావారిలో మహాజ్ఞానియయిన కన్ఫ్యూసియసు (Confucious) యొక్క సిద్ధాంతము నవలంబించిన పండితకోటికి రైలుబండ్లను దేశములోనికి దెచ్చుటయె లేశమాత్రమును గిట్టదయ్యెను. ఏలయన చీనాదేశీయు లెల్లప్పుడు పూర్వాచార పరాయణులుగా నుండవలయుననియు నన్యదేశీయ సౌకర్యాదుల నంగీక

రించుట కాని యపేక్షించుట కాని వలదనియు నామహాజ్ఞాని లెస్సఁగ బోధించి యుండెను. చీనాదేశమందు ప్రజాకలహమును రేపుట క్షణమాత్రముపనియని గత చరిత్రవలనఁ దెలియుచునే యున్నది కాఁబట్టి యీపండిత బృందము రైలుబండ్లయెడల ద్వేషము విశేషముగఁ బుట్టించుటచే రైలుబండ్లకు జనులు హానిచేయఁబూనిరి. ప్రజాకలహము దుర్నివార్యంబుగ నుండె. తత్ప్రదేశాధికారి యాకలహము కొంతవఱకు మట్టుపఱచి లిహంగుచాంగునకును ఆంగ్లేయ మంత్రికిని గలహకారణమును దెలియఁజేసెను.

## రైలును జనులు క్రయముచేసికొని పెల్లగించివేయుట.

వివాద పరిష్కరింపఁబడు దనుక రైలు నాఁపవలసినదని యాంగ్లేయ మంత్రి తనవారికిఁ దెలియపఱచెను. ఈవిషయమై దొరతనమువారికిని ఆంగ్లేయ మంత్రికిని జాలగఁ జర్చ జరిగినపిమ్మటఁ బైజెప్పఁబడిన రైలును చీనాప్రజలు క్రయముచేసికొని వారి స్వంతభుక్తములో నుంచుకొనవచ్చునని దొరతనమువారు తీర్పుచేసిరి. అంతట చీనావారారైలుపట్టాలను బెల్లగించి ఫార్మోజాద్వీపముయొక్క సముద్రతీరమునఁ బడవేసిరి. అచ్చట నవి త్రుప్పుపట్టిపోయెను. రైళ్లు వేయవలయునని లేకలేక దొరతనమువారికిఁ గలిగినతలఁపువ్యర్థముగ నిరంతరంబయ్యెను. లిహంగుచాంగు అను మంత్రిమాత్రము రైలువలనిప్రయోజనము బాగుగ గుర్తెఱిఁగియుండెను. కావున తనపరగణాలో నున్న బొగ్గుగనులవద్ద నుండి టియంట్సిన్ (Tuentsin) టాకు (Taku) నగరములు దనుక నొక రైలుమార్గ మేర్పాటుచేయించెను. ఆరైలుదారి పోవు ప్రదేశము జనాకీర్ణమైనదికాదు. మఱియు రైలు వాసన గిట్టని పండితులు నివసించునదియుఁ గాదు. ప్రజాకలహ సంభవించినను లిహంగుచాంగు వానిని జిదిమివేయఁజాలినవాఁడు. ఆరైలుమార్గము మఱిరెండు రైళ్లేర్పడుటకుఁ గారణమయ్యెను. అందొకటి టాకు కోటలనుండి పికిన్ రాజధాని దనుకను, రెండవది కాయిపింగునుండి షాన్‌హాయి క్వాన్ (Shan hai Kwan)వఱకును ఇవియే చీనాదేశమందలి రైళ్లు. చీనారాజ్యములోనిదైన "ఇలి" పరగణా 1871 సం. నుండి రుషియావారి స్వాధీనములో నుండెను. దానిని మఱలఁ బడయుటకై చక్రవర్తినలును కంగు

ను దలంచి రుషియా చక్రవర్తియొద్ది కొక మంత్రిని సర్వాధికారమిచ్చిపంపిరి. దానిని మఱల చీనావారి కిచ్చువిషయమై యాయన చక్రవర్తితో సరసముగా మాట్లాడఁగా నాపరగణాలోని బడమటి భాగమును మాత్రము రుషియావారి వశమందును శేషించినదంతయు చీనావారియధీనమందున నుండున ట్లొడంబడిక చేసికొనఁబడెను. రుషియాచక్రవర్తి చీనాచక్రవర్తిని దనతో సమానముగ భావించి గౌరవించెనఁట. ఈవిషయము 1881 సం. లో జరిగెను. అప్పటికి చీనాదొరతనమువారి ప్రాముఖ్యతయు గౌరవము నంతగా నుండెను.

చక్రవర్తికి మాఱుగఁ బరిపాలించుచున్న చక్రవర్తిను లిద్దఱిలో చక్రవర్తియొక్క కన్నతల్లియైన "సిఆక్" అను నామె కాలధర్మము నొందెను. ఆమెను గూర్చి యొక చరిత్రకారుఁ డిట్లు కొనియాడుచు వ్రాసెను.

"ఆమె మరణించునాటికి 45సం. ల ప్రాయము కలది. ఆమె నిబ్బరమయిన స్వభావమును సచ్చరిత్రప్రవర్తనయు గలది. ఆమె తనపాలనారంభమందు రాజ్యపరిపాలనలో నెట్టిలోపములఁ గనిపెట్టెనో వానినన్నిటిని దనమరణకాలమునాటికిఁ బూర్తిచేసి మునిఁగిపోవుచున్న రాజ్యము నుద్ధరించిన కీర్తినిపొందెను. రాజ్యమునకు గౌరవాదులను యథాపూర్వముగఁ గలుగఁజేసెను.

## చీనాదేశమందలి రైళ్లు.

అనేక స్వల్పరాజ్యములు చేరిన పెద్దరాజ్యమయిన చీనారాజ్యమందు స్థిరమైన నెమ్మది కలుగుట దుర్లభమయి యుండును. అనాక్ (Annan)రాజ్యములో గలహము సంభవింపఁగా నవి యెట్లో నివారింపఁబడెను. తోడనే కోరియారాజ్యమందుఁ బ్రబలకలహము సంభవించెను. జపానుదొరతనమువారు కోరియారాజ్యమును వశపఱచుకొని పరిపాలింపఁ గుతూహలము కలవారయి యుండిరి. వారిమంత్రియుఁ బరిజనమును కోరియాయందు నివాసముగ నుండిరి. అదియటుండఁ గోరియారాజ్య మంతఃకలహముల కాటపట్టుగ నుండెను. అప్పటి రాజుయొక్క జనకుఁడు తానారాజ్యమును బహుకాలము పరిపాలించి తాను సజీవుఁడుగా నున్నపుడె తనపుత్రున కారాజ్యము నిచ్చెను. ఆ

పుత్రుఁడు వ్యవహారసందర్భముల జక్కఁగ నెఱిఁగినవాఁ డయ్యెను ఆపదలనె దుర్కొనంజాలిన ధైర్యసాహసములు కలవాఁడు కాఁడయ్యెను.

## కోరియారాజ్యమందలి కలహములు నక్రమములు.

ఆయనతండ్రి యన్యదేశీయుల యెడల గర్భద్వేషము కలవాఁడై ఫ్రెంచి వారియొక్కయు, అమెరికావారియొక్కయు దండులనోడించి తనదేశములో నడుగు పెట్టనీయఁ డయ్యెను. ఆయన చేసినది యధర్మపరిపాలన మని నుడువఁదగి యున్నది. తనవలెనే తన తనయుఁడును బరిపాలింపవలయునని యాయన ముఖ్యాభిలాషియై యుండెను. కాని యాయనకుమారుఁడు కేవలోన్ముఖంబులయిన యాయనయుపదేశంబులఁ బెడచెవి నిడఁగా నాతఁడు సులభసాధ్యుఁడు కాఁడని యాయనజనకుఁ డాయనను బలాత్కరింపఁ దొడఁగెను. మఱియుఁ గుట్రలఁ జేయసాగెను. జపానువారితోఁ బూర్వము చేసికొనినయొడంబడికకు విరోధముగా నడువుమని కొడుకున కుపదేశింపఁగా నాతఁడు సమ్మతింపఁడయ్యె. కోరియారాజ్యమం దున్నజపానువారి కార్యస్థానమును ముట్టడించునట్లు రాజజనకుఁడు జనులను బ్రోత్సాహపఱచెను. అంతటఁ బ్రవర్తిల్లిన బెడిదంబగు వెనకువనుండి జపానువారు బహుళప్రయాసము పడి సముద్రతీరముచేరి యాంగ్లేయుల యుద్ధనావయందుఁ దలదాఁచుకొని బ్రతికిరి. రాజుయొక్క జనకుం డట్లు విజృంభించి తనకోడుకును గారాగృహంబునకుఁ బంపె. కోడలినిఁగూడ తన పొట్టను బెట్టికొన సమకట్టఁగా నెట్టులనో యాసవ్వడి నెఱింగి యామె పరిచారకురాలా మెకుఁగాను దనప్రాణం బర్పణఁజేసి యామెను బ్రతికించెనఁట. ఆ రాజ్యమందలి గొడవల నడంచుటకై చీనా దొరతనమువారు లిహంగుచాంగున కధికారమిచ్చిరి. ఆయన “మా” (Ma) అనఁబడు సహాయసేనానిని బలిష్ఠమయిన నావికాసైన్యముతో కోరియాఁకు బంపి యచ్చటికలఁతను నివారింప నాజ్ఞాపించెను. రాజుయొక్క జనకుఁడు కోరియాయందుండు దనుక కుట్రలు మానవనియు నెమ్మది కలుగదనియు లెస్సఁగ గ్రహించి యతనిని దనయుద్ధనావలోనికి విందునకుఁ బిలచి యతఁడు నమ్మిరాఁగా నతనికిఁ దెలియకుండఁగ ఆ

"మా" చీనాదేశతీరమున కాయనను దోడ్కొనివచ్చెను. అంతట చీనాచక్రవర్తి యిటుల నొకయుత్తరువు చేసెను.

"కోరియాదేశపు రాజుయొక్కతండ్రి చిహ్లి పరగణాల్లో పేవోటింగు (Paoting) నగరమందు సుఖముగఁ జీవింపవలెను. ఆపరగణాయొక్క గవర్నరాయనపరువునకుఁ దగినట్లుగ నన్నియు నాయత్తపఱచుచుండవలయు. ఆయనపై ఆగవర్నరు కన్నుపెట్టి యుండవలెను. అందువలన కోరియారాజ్యమున కాయనవలనను నితర బంధువర్గమువలనను ఈతిబాధ తొలఁగును.

### జపానురాజుయొక్క నిబంధనలకు కోరియారాజు ఒప్పుకొనుట.

కోరియారాజ్యములోనున్న తమ కార్యస్థానమునకు ఆరాజ్యప్రజలు చేసిన యపకృతికిఁగాను 500000 * డాలరులను నాణెములను దండుగ నీయవలయుననియు (2) నూతన యొడంబడిక యేర్పడవలయుననియు, (3) కోరియారాజు జపాన్‌రాజును క్షమాపణ మడుగుకొనవలయుననియు, జపానురాజ్యమువారు కోరియారాజును నిరోధించిరి. ఆనిబంధనల నిరాకరింప బలపరాక్రమములులేని వాఁడై కోరియారాజు వానికి బద్ధుఁడయ్యెను.

జపాను దొరతనమువారు తమ సేనలను రణవిద్యయందుఁ దీర్పుచేసికొనుచుండుట చీనాదొరతనమువారు కొంతకాలము నుండి చూచుచుండిరి. ఆరాజ్యమున కట్లు ప్రబలసామర్థ్యము చేకూఱకమున్నె దానిని ముట్టడించి లోఁబఱచుకొనుట చీనాదొరతనము వారికి విధికృత్యమని వ్రాయుచు ముట్టడింపకముందు చీనాసైన్యములను దుర్గములను మంచి స్థితిలో నుంచుటయే కాక బలపఱచుట యావశ్యకమనియు ప్రస్తుతపుస్థితిలో వారిపై దాడివెడలుదురేని యోడిపోవుదురని లిహాంగు చాంగుయొక్క యల్లుఁడు దొరతనమువారికి లిఖితపూర్వకముగాఁ దెలియఁజేసెను. ఆలిఖితమును లిహాంగుచాంగునకు దొరతనమువారు విచారణనిమిత్తము పంపఁగా ఆయన చీనాసేనల స్థితియు దుర్గముల సంరక్షణయు, బాగుపడునంత దనుక జపానురాజ్యముపై దండువెడలఁ గూ

* ఇది యొక బంగారునాణెము. దీని విలువ 4 షి. 2 పెన్సులు. అనగా నిప్పటి నవరసు వెలను బట్టి రు. 3—2—0.

డ దని ఖండితముగా వ్రాసెను. అప్పటికి జపానువారి సేనలును యుద్ధనావలను యూరోపుఖండ వాసులరీతిగా సిద్ధపఱుపఁబడుచుండెను. లిహాంగుచాంగుయొక్క యధికారముక్రిందనున్న సేనతప్ప చీనావారియొక్క కడమ సేన పూర్వాచారప్రకారము విలునమ్ములు ధరించునదిగానే యుండెను. ఎట్లయినను లిహాంగుచాంగుయొక్క యుపదేశమును విని దొరతనమువారు జపానువారితో బలాబలములఁ జూచుకొను తలంపు మానుకొనిరి.

## దొరతనమువారికిని ఫ్రెంచివారికిని జగడము.

అట్లు జపాను రాజ్యముతోఁ గలహము తప్పినను ఫ్రెంచివారితోఁ గలహము చీనావారికిఁ దప్పదయ్యెను. ఆనాము పరగణాయందు ఫ్రెంచివారు కొంత కాలము క్రిందట ప్రవేశించి క్రైస్తవమత బోధను జేయుచుండుటయు ఆబోధకులు చీనావారిచేతులలో దమప్రాణములఁ గోల్పోవుటయు 1858 సంవత్సరము పర్యంతము జరుగుచుండెను. అదియటుండ 1787 సం. లో ఫ్రెంచివారితో చీనా దొరతనమువారు చేసికొని యున్న యొడంబడికను చీనావారు నిరాకరించిరి. కావున ఫ్రెంచివారు చీనావారి రెండు దుర్గములను బాడుచేసి "సాయిగను" (Saigan) పట్టణమును ముట్టడించి వశపఱచుకొనిరి. చీనా రాజ్యములోఁ గొంతభాగమందు దమప్రభుత్వమును నెలకొల్పవలయు నను కోరిక 1870 సంవత్సరమందుఁ బ్రవర్తిల్లిన యుద్ధమున కనంతరము ఫ్రెంచి దొరతనము వారికి నంకురించి ప్రబలుటచే ఆ "సాయిగన్" పట్టణము నందలి ఫ్రెంచివారు చుట్టుప్రక్కలనుండు టాంకిన్ మొదలయిన ప్రదేశములను వశపఱచుకొన సాఁగిరి. టాంకిన్ ప్రదేశము ఆనాం పరగణాలోఁ జేరినదె. ఆనాము పరగణా యనేక శతాబ్దములనుండి చీనావారికిఁ గప్పము చెల్లించెడియొక పాళె * గాని రాజ్యముగా నుండెను. ఆరాజ్యమేలురాజు తనపరగణా యొక్కయుత్తరభాగమును ఫ్రెంచివారాక్రమింపయత్నించుచుండిరని తన విధి చొప్పున చీనా చక్రవర్తికి విశదపఱుపఁగా నప్పుడు యుద్ధప్రసక్తి లేకుండఁ జేసి

* పాళెగాని రాజ్యమేలు నతఁడు ప్రధానప్రభువునకు యుద్ధసమయములయందు దన సేనలతోఁబోయి విధిగాఁ దోడ్పడవలెను.

కొనుటకై "సాంకాయి'' నదికి దక్షిణమందున్న ప్రదేశమును ఫ్రెంచివారి కిచ్చివేయుట యుచితమని లిహాంగుచాంగు దొరతనమువారికిఁ దెల్పెను. ఆయన యభిప్రాయమును చీనా దొరతనమువారును ఫ్రెంచి దొరతనమువారును నిరాకరించిరి. అట్లు పదివత్సరంబులదనుక ఫ్రెంచివారు తమ చుట్టు ప్రక్కలనుండు ప్రదేశములను గదుముకొనుచుంటయు చీనావారి ప్రయత్నములను సవ్యాపసవ్యభంగుల భంగపఱచుచుండుటయుఁ గలుగుచుండెను. పిమ్మట 1884 సం. లో ఫ్రెంచివారు చీనావారివి రెండుపట్టణములను ముట్టడించిరి. ఫ్రాన్సుదేశమందున్న చీనామంత్రి ఫ్రెంచివారి కటుల ముట్టడించుట యుద్ధమునకుఁ బిలుచుటయే యగును గావున ముట్టడిని విరమింపవలయునని యచ్చటి ప్రభువునకుఁ దెలియఁజేసినను వినియోగింపదయ్యె.

## ఫ్రెంచివారికిని చీనావారికిని గలయొడంబడికయొక్క సరసము.

యుద్ధారంభమునకు ముందుగ నుభయపక్షములలో నేపక్షీవారి కుద్రేకము కలదో వారు రెండవపక్షీకి యుద్ధప్రకటన చేయుట యుద్ధధర్మము. అట్టిధర్మము చీనావారికి లేనందున ఫ్రెంచివారును విడిచిరఁట. అది యటుండ నుభయదేశ సైన్యములును చీనాయందు హాహాకారంబు సేయుచున్నను ఆయుభయ రాజ్యములనేస్తపుకట్టుబాటు చెడకయే యుండెనఁట. ఆకట్టుబాటుయొక్క సరసము నేమనవచ్చును! ఆకట్టుబాటు చెడకమున్నె ఫ్రెంచివారితో ననుకూలపడుట శ్రేయస్కరమని పికిఙ్ రాజధానియందు "లిహాంగుచాంగు మొదలయిన ప్రముఖులు భావించి పూర్వమొనరింపఁబడిన యొడంబడికను నిరాకరించిన దోషము తమ యుద్యోగులయందే యున్నదనియు దానికిఁ గారకులయిన'' కంగు మొదలయినవారి నుద్యోగములనుండి తొలగించితిమనియు శేషించినవారిని దగినట్లుగ శిక్షించితిమనియు నొకశాసనమును బ్రకటించిరి. పిమ్మట నుభయ రాజ్యములవారును సంధికియ్యకొనిరి. ఫ్రెంచివారి పక్షమున వారి నావికాసేనాధిపతియు, చీనావారి పక్షమున లిహాంగుచాంగును సంధియేర్పాటునకు సర్వస్వాతంత్ర్యమును దమ తమ ప్రభులవలనం బడసియుండిరి.ఆ సంధియేర్పాటు లేమనఁగా(1) టాంక్విను పరగణా ఫ్రెంచివారి యధీన

మందుండుటకు చీనాదొరతనమువారొప్పుకొనుట. (2) దాని నతిక్రమించి ఫ్రెంచివారు చీనాలోనికిఁ జొరకుండుట. (3) ఆపరగణాకును చీనాదేశమునకును నడిమిమేర కాపద కలిగినప్పుడు ఫ్రెంచివారు కాపాడుట. (4) ఆ పరగణా నుండి చీనా సేనలు తక్షణమె వెడలిపోవుట.

## సంధినిబంధనలలో నొకలోపముండుట.

కాని యుభయరాజ్యముల వారి కనుకొనని చిక్కొకటి సంప్రాప్తమయ్యెను. టాంక్వీను పరగణానుండి చీనా సేనలెప్పుడు వెడలిపోవలయునో యాకాల మొడంబడికయందు నిర్ణయింపఁబడలేదు. ఫ్రెంచివారి సంధికర్త మూఁడువారములనుకొనెనఁట. చీనావారి సంధికర్త 3 మాసము లనుకొనెనఁట. సంధి చేసికొనఁబడినదని యా పరగణాకు సమీపమందున్న ఫ్రెంచి సేనానాయకునికిఁ దెలియఁజేయఁగానే యాతఁడత్యాతురముగ సేనాసమేతుఁడై యా పరగణాను స్వాధీన పఱచుకొనుటకు వచ్చెను. చీనాసైనికులు వారి నడ్డగించిరి. మఱియుఁ దమకు సంధిసమాచారము తెలియలేదనియు పైని యధికారులకు వ్రాసి యుత్తరువు తెప్పించుకొను దనుక నగరములోఁ బ్రవేశింపవల దనియు ఫ్రెంచిసేనానికి చీనావారిమంత్రులు మువ్వురుచెప్పఁగా నతఁడు వారినిదాకట్టుగఁ దన శిబిరమందుంచి యుత్తరువు తెప్పించుకొమ్మనెను. అంతట నుభయసైన్యములకు యుద్ధము జరుగుచుండఁగా నామంత్రులు తమ సైన్యముల నాఁపఁబోవఁగా నది గ్రహింపఁజాలక ఫ్రెంచి సేనానివారిని గుండువేసి కాల్పించెను. పిమ్మట చీనాసైన్యము వీరావేశముతోఁ బోరి ఫ్రెంచివారిని నూఁచముట్టుగనోడించిరి. ఫ్రెంచివారికప్పుడు కొంతసహాయ సైన్యమురాగా హతశేషులు ప్రాణములు దక్కించుకొనిరి. ఆ యొడంబడికలోఁ గాలనిర్ణయముచేయనందుకు సంధికర్త లిరువురు నొండొరుల నిందించికొనిరి. మఱియు నెవరిమట్టునకు వారు నిర్దోషులమని సహేతుకముగ వాదించికొనిరి.

పైని నుడువబడిన కారణములచే నొడంబడికకు భంగము కలుగఁగా ఫ్రెంచివారు టాంకింగు (Tong king) పరగణాలోను ఫార్మోజా (Formosa) ద్వీపమందునను యుద్ధకృత్యముల బ్రారంభించి 1885 సం. ఫిబ్రవరి

నెలలో రెండుపట్టణముల ముట్టడించిరి. మఱియు "మిన్" (Min) నదీ ముఖద్వారమందు చీనావారి యుద్ధనావలు లంగరు వేయఁబడియుండుటఁ జూచి ఫ్రెంచివారా నావలపై ఫిరంగులఁగాల్చి 7 నిమిషములలో వానిని దగ్ధము కావింపఁగా వానిపైనుండు నావికులును సేనలును సముద్రముపాలై యా జలప్రదేశమును దమశరీరములతోఁ గప్పివేసిరి. అదియటుండ "క్వాంగుటంగు" "ఫుకీను" పరగణాల ప్రజల కన్యోన్యవైర మొకటి చిరకాలమునుండి యుండుటచే నాపదవలలోనున్న "క్వాంగుటంగు" నావికులు సముద్రములోఁబడి యీఁదుచు హతశేషులు "ఫుకీను" రేవుఁ జేరుచుండఁగా ఆపరగణాప్రజలు వైరానుబద్ధులై వారిం బొరిగొనిరి. చీనాసైన్య మట్టి దురవస్థపాలై యుండఁగా వారి సేనానాయకుఁడైన "చాంగుపీలన్" (Chang peilun) (ఇతఁడే లిహాంగుచాంగుయొక్క జామాత) తాను ఫ్రెంచివారిని బిట్టుగ నోడించితి ననియు వారి యుద్ధనావలను సముద్రములో ముంచితిననియు చక్రవర్తికి మృషావార్తం దెలియఁజేసెను. పిమ్మట నిజస్థితి తెలియఁగా చక్రవర్తి యతనిని శిక్షార్థము చీనారాజ్యపుఁబొలిమేరకుఁ బంపివేసెను. కాని యతఁడు లిహాంగుచాంగునకుఁ గాఁబోవు నల్లుఁడగుటచే శీఘ్రంబుగ మఱల నచ్చటనుండి రావింపఁబడెను. అనంతర మాతఁడు లిహాంగుచాంగు కూతుం బెండ్లియాడి తన మామగారి వ్యవహారములఁ జక్కబెట్టుచుండెను. గొప్పవారి బంధువులు దోషులయ్యును దప్పించుకొనఁ గలుగుదురుకదా.

## నూతనసంధి.

తదనంతరము ఫ్రెంచివారు "కలంగు" చేరువనున్న చీనావారి కోటలను దాఁకి యయిదుసారులు విఫలులై తుదకు 1885 సం. మార్చినెలలో వశపఱచుకొనిరి. అట్లుభయసైన్యములును బోరిపోరి విసిగిరి. పిమ్మట 1885 సం. జూన్ నెల 9 తేదీయం దుభయరాజ్యములకును నూతనమయిన యొడంబడిక జరిగెను. ఆయొడంబడిక నిబంధనలు తత్పూర్వము సంవత్సరముక్రిందట లిహాంగుచాంగు దొరతనమువారికిఁ దెలియఁజేసినవే. దొరతనమువారప్పుడా నిబంధనల నంగీకరింపక ఫ్రెంచివారితో ననవసరముగ యుద్ధమాడి 60000000 తాలులు

నాశెములను వ్యయపడి 'ఫూచౌ' (Foochow) తీరమందలి యుద్ధనావలను గోలుపోయినపిమ్మట నంగీకరించిరి.

### కోరియా రాజజనకుండు విడుదలఁ జేయఁబడుట.

ఆమధ్యకాలములో కోరియా రాజ్యమందల్లరులు మరలఁ బ్రవర్తిల్లెను. కోరియా రాజుయొక్క తండ్రియయిన "టాయివెన్‌ఖన్" (Taiwenkun) ను చీనాదేశమునకు మాయగాఁ దోడ్కొనివచ్చి యొకనగరమందు చీనాదొరతనమువారు తమవశములో నుంచికొనిరని గతంబున లిఖింపఁబడియున్నది. ఆయనను ఆమరణాంతము విదేశమందుంచుటయే చక్రవర్తియొక్క యభిప్రాయమయియున్నను, చక్రవర్తియొకప్పుడు బుద్ధిప్రమాదమువలన నతనిని విడుదలఁజేయించెను. ఆయన తనరాజ్యమయిన కోరియాకు మరలఁబోయి యచ్చట బరిపాలించుచున్న తనతనయుఁడవలంబించియున్న నూతనపద్ధతులను ముఖ్యముగా యూరోపుఖండమందు వ్యాపించియుండురీతిగ పోస్టువ్యవహారపుపద్ధతినిఁ జూచి యసూయాపరవశుండై యాపద్ధతులను భంగపఱచుటకై తన పూర్వాచారప్రకారము కపటాలోచనలను జేయుచుండెను. పోస్టువ్యవహారపద్ధతిని నెలకొల్పుటకు నియమింపఁబడిన శుభదినమందచ్చటి ప్రముఖులకు గొప్పవిందొనరింప నేర్పాటుచేసి యావిందుకాలమందాయన ఘాతుకజనంబుచేఁ దనపట్టిని గిట్టింప నెట్టన సమకట్టెను. అదియటుండ జపానువారి కార్యస్థానమును మరల నాయన ముట్టడింపఁజేసెను. అంతట జపానువారి యుద్యోగులును సేనలును బూర్వమువలెనే పాఱిపోయి ప్రాణములు దక్కించుకొనిరి. కోరియా రాజ్యమునకుఁ బ్రత్యపకారముచేసి తమ గౌరవమును నిలుపుకొనుటకై జపాను దొరతనమువారు నావికాసైన్యమును బంపఁగా నాసైన్యము సియోల్ (Seoul) పట్టణతీరమున లంగరువేసెను. ఆసమయముందె చీనావారి సైన్యము కోరియాయందుఁ బ్రవేశించెను. కోరియా రాజ్యమును రక్షించువారమని యనుకొను చీనాదొరతనమువారికిని జపాన్ దొరతనము వారికిని బ్రచండభండనం బుద్దండంబుగ జరుగునట్లుగ నుండెనుగాని వారియదృష్టవశమున నొడంబడిక యొకటేర్పడెను.

ఆయొడంబడికయొక్క నిబంధన లేమనఁగా.

(1) ఆయొడంబడికయొక్క దినము మొదలుకొని నాల్గుమాసములలోఁగా నుభయరాజ్యములవారును దమసేనలను కోరియానుండి తీసికొని పోవలయుననియు,

(2) దేశక్షేమముకొఱకై తన సేనలకుఁ గ్రమశిక్ష నేర్పించి వారి కాయుధ సామగ్రిని సమకూర్పుమని కోరియా రాజునకుఁ దెలియఁజేయవలెననియు,

(3) కోరియా రాజ్యమందల్లరులు వెలుగఁ బ్రవర్తిల్లినపు డుభయరాజ్యముల వారుగాని యిరువురలో నొకరుకాని యాయల్లరుల నివారింపఁ బోవునపు డొండొరుల కాసంగతిని దెలియపఱచుకొనవలయుననియు,

(4) అల్లరులు ముగిసినపిమ్మట నుభయరాజ్యములవారు కాని యొకరాజ్యమువారుకాని తమసైన్యములను కోరియానుండి తీసికొని వెళ్లవలయునే కాని యచ్చట నిల్వఁగ నుండఁగూడదనియు,

ఈచివఱనిబంధననే చదువరులు ముఖ్యముగ జ్ఞప్తియుందుంచుకొనవలెను. ఏలయన చీనావారు దాని నుల్లంఘించుటవలననే వారికి జపానువారితో నాశకరమయిన యుద్ధము సంభవించెను.

### చీనా దొరతనమువారి నావికాసైన్య పరామర్శము.

కొద్దికాలముక్రిందట సమాప్తినొందిన ఫ్రెంచివారియుద్ధమువలనను, ఆసన్నమగుచున్న జపానువారి యుద్ధముకొఱకును తమసైన్యమును బలపఱచుకొనవలెనను తలంపు చీనా దొరతనమువారికి నిమేషమాత్రము కలిగెను. దానింబట్టి వారియుద్ధనావలు వెంపొందింపఁబడెను. చీనారాజ్యము నన్యశత్రుపీడారహితముగా నుంచుటకై యాయాపరగణాయధికారులందఱు తమధనవ్యయము వర్షము కురిపించిరి. యుద్ధనావికావిచారణసంఘ మొకటి యేర్పఱుపఁబడెను. దానికి ప్రధానాధ్యక్షుఁడుగా చక్రవర్తియొక్క తండ్రియయిన "చణ" రాజన్యుఁడు నియమింపఁబడెను. ఆంగ్లేయనావికోద్యోగులలోఁజేరిన కెప్టెన్ లాంగు నావికాధ్యక్షుఁడుగా నేర్పఱుపఁబడెను. చీనాదేశపు సేనావ్యవహార

ములోఁ గ్రిందియధికారులని కొందఱుండుట, వారిపైఁ బెద్దయధికారులుండుట యందఱిపై సర్వాధికారి యొకడుండుట యను నిబంధనలు లేవు. ఏప్రదేశాధికారు లాప్రదేశమునకే సర్వాధికారులు. కావునఁ బైనిఁ జెప్పఁబడిన "చఙ" అను రాజన్యుఁ డుత్తరనావికా సంఘమునకే యధికారియయ్యెను. దక్షిణపు నావికాసంఘమున కాయాప్రదేశాధికారులే సర్వాధికారులుగా నుండిరి. ఇంతకుమున్ను సంభవించియున్న జపానుయుద్ధములో నట్టి యధికారవిభజనము వలననే చీనాదొరతనమువారికిఁ జెఱుపు వాటిల్లెను.

## ఉత్తర బర్మారాజ్యమునకుఁ బదిసం॥ ల కొకసారి చెల్లింప వలసిన కప్పము.

1886 సంవత్సరములో చీనా దొరతనమువారి కన్యదేశీయులతో ముఖ్యముగా నాంగ్లేయులతోఁ గొన్నివ్యవహారములు కలిగెను. "ఆసంవత్సరంబున బర్మారాజయిన "తీబా" యొక్క యక్రమ ప్రవర్తన బలమగుటఁజేసి యాంగ్లేయులు "ఎగువబర్మాను" (Upper Burmah) ను స్వాధీనపఱచుకొనెడి యగత్యము కలిగెను. చీనాదొరతనము వారా రాజ్యముపైఁ దమకధికారము కలదని యారాజువలనఁ బదివత్సరముల కొకతూరి కప్పముం గొనుచుందురు. చక్రవర్తికిని ఆయన మంత్రులకును మనసులు నొచ్చకుండునటుల వ్యవహరింపవలయునని చీనాదేశమందున్న యన్యదేశీయ కార్యస్థానమువారు మిక్కిలిగఁ గోరువారగుటంజేసి చీనాదొరతనమువారు బర్మారాజ్య వ్యవహారములతోఁ జొక్యముకలుగఁజేసికొనుట మానుకొందురేని దశవార్షికమయిన కప్పమును వారికిఁ దాము పంపుచుందుమని యానాంగ్లేయులు తెలియఁజేసిరి. చీనాదొరతనమువా రంగీకరించిరి. "ఆంగ్లేయు లట్లు తెలియఁజేయుట సంగతి సందర్భముల నెఱుఁగని కృత్యమైయుండెను.

1842 సంవత్సరము మొదలుకొని యాంగ్లేయుల కృషియంతయు నాంగ్లేయరాజ్యమువారు చీనాదొరతనమువారితోఁ దుల్యమర్యాదగలవారని చీనాదొరతనమువారికి మనంబున గాటంబుగ నాటించుట కేయై యుండఁగా వారికి లోఁబడినవారివలె గప్పము చెల్లించుట కియ్యకొనుట యెంత విరుద్ధకార్యము?

అయినను ఆశియాఖండరాజ్యముల మర్యాదను మాటలను బాగుగ నెఱుంగక యచ్చటి యాంగ్లేయులట్లు లోఁబడిరని యూహింపఁదగియున్నది. అట్లు కప్పము చెల్లించుట యనుచితమని వివేచనాబుద్ధిచేఁ బదంపడి యెఱింగి దానిని మాని వేసిరి. అని యాంగ్లేయచరిత్రకారుఁడు విచారము సూచించుచు లిఖించెను.

## రుషియావారితో నొడంబడిక.

కోరియాయందలి యల్లరులవలన చీనా, జపాను రాజ్యములకే కాక రుషియావారికిని దొందరకలిగెను. రుష్యావారికి కోరియారాజ్యము యొక్క పొలిమేరలయందుఁ గొన్ని ప్రదేశములు కలవు. కావున వారు. కోరియారాజ్యమందు వెంటవెంటనె యల్లరులు జరుగుచుండుటచేఁ దమప్రదేశములకుం గూడఁ బెద్దబెడదగనున్నదనియు చీనాదేశమందలి యుత్తరప్రాంతవాసులు కోరియారాజ్యముయొక్క దక్షిణప్రాంతములపై దాడి వెడలనుంకించుచుండిరనియు నట్టి గొడవలఁ దడవుసేయక యడఁచుట కర్జంబనియు చీనాదొరతనము వారిని నిరోధింపసాగిరి. కోరియాకు దక్షిణదిశను దూరముగనుండు "పోర్టుహామిల్టను" దీవిని ఆంగ్లేయప్రదేశ సంరక్షణార్థముగ తక్షణమే వశపఱచుకొమ్మని యింగ్లాండునుండి తంతివార్తరాఁగ నాంగ్లేయు లచ్చటఁ దమబావుటాను నెలకొల్పిరి. పికిన్ రాజధానియందున్న రుషియామంత్రి యాంగ్లేయుల చర్య చూచి తామును మఱియొకప్రదేశము నాక్రమించుకొనెదమని పోరాడెను. అదృష్టవశమున నామంత్రికిని లిహాంగుచాంగునకును నొడంబడిక కుదిరెను. పోర్టుహామిల్టను దీవిని అన్యదేశీయులవశ మొనరించుట సంభవించెనేని దానిని చీనాదొరతనమువారు రుషియావారివశమే చేయునట్లును రుషియావారు కోరియారాజ్యముయొక్క తెరువునకు లేశమాత్రమును బోఁగూడనట్లు నాయొడంబడికంబట్టి యేర్పడెను. ఆయొడంబడిక నిబంధనలు తమకును ననుకూలముగనుండుటచే నాదీవిని ఆంగ్లేయులు **1887** సంవత్సరను ఫిబ్రవరి **27** తేదీని విడిచిపెట్టిరి.

1888 సంవత్సరములో నన్యదేశీయులవలని తొందరలు చీనారాజ్యమునకు లేవు, దొరతనమువారు తమ సేనాభివృద్ధిం జేయుటయు, దానిని క్రమ

శిక్షలోనుంచుటయు నిట్టికార్యములయందుఁ బనిగలిగియుండిరి. కాని విలునమ్ములధరించుట యనెడి పూర్వపద్ధతినే వెంపొందించుచుండిరి. ఈవిషయమై చీనావారి మూఢత్వము బహునిందార్హముగా నున్నది. పాక్సి ప గణాయందుండు సేనలు కవాతుచేయు మైదానమునకు వచ్చి 30 సంవత్సరములయినదనియు, విలువిద్య యొకవిధముగ నుపయోగకరముయియున్నను రణరంగములయందుఁ దుపాకులును ఫిరంగులునుమాత్రమె మిక్కిలి ప్రయోజనకారులుగను జయప్రదములుగ నున్నవనియు ఆపరగణాధికారి దొరతనమువారికి లిఖించెను. పాపము! పూర్వమునుండి చీనావారు యుద్ధకౌశల్యము లేశమాత్రమునులేని యనాగరికజనులతోను నడవిజనులతోను విలునమ్ములచేతనేఁ బోరాడి జయమొందుచుండిరి. కావున సర్వకాలము తమ్మును విలువిద్యయె రక్షించుననినమ్మికొనియుండిరి.

## హైనన్ ద్వీపియందల్లరుల నడచుట.

ఆసంవత్సరంబుననే "హైనన్" (Hainan) ద్వీపియందుండెడి యాదిమనివాసులు కలహింపఁగా చీనాసేనానాయకుఁ డచటికిఁబోయి బహుకాలము పోరాడి వారినడంచి దొరతనమువారి వలన మెప్పును జెందెను. దొరతనమువా రాయనకు మరకతమువంటి యొకరాయిచెక్కిన బొట్టనవ్రేలియుంగరమును, అట్టిరాయిచెక్కిన పిడిగల బాకును, రెండు పెద్దసంచులును, రెండుచిన్నసంచులును బహుమానముచేసిరి.

**1887** సం. యొక్క ప్రారంభమున చక్రవర్తికి యుక్తవయస్సు అనఁగా **16** వత్సరంబుల ప్రాయమువచ్చెను. కావున ఆయన స్వయముగాబరిపాలింపకలసియుండెను.కాని రాజ్యభారము వహించుట కాయన సమ్మతించనట్లు కనుపించెను. ఆయనకు మాఱుగఁ బరిపాలించుచున్న చక్రవర్తిని రాజ్యము స్వయముగనేలుకొమ్మని దేశపుచట్టములంబట్టికోరఁగా చక్రవర్తి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెనఁట.

వృద్ధచక్రవర్తిని శాసనముఁ బంపెనని వినగానె సముద్రమధ్యమందుండి యొడ్డుఁగాననివాఁడు వడఁకునట్లు వడఁకితిని.ఇంకగొన్ని సంవత్సరంబులు దనుక

రాజకీయవ్యవహారములలో నామె నాకు బోధకురాలుగా నుండుగాక. అయినను నేను సోమరిగా నుండుటకు సాహసింపను. నాపరిపాలనలోఁ బదుమూఁడవ సంవత్సరంబునఁ బ్రథమ చాంద్రమాస పూర్ణిమాదినంబున రాజ్యభారము వహింతునని యాకాశమునకును, భూమికిని, పూర్వులకును, చక్రవర్తినియొక్కయాజ్ఞానుసారముగ విన్నవించితిని. * ఘనతవహించిన చక్రవర్తినిచే నడిపింపఁబడువాఁడనై శ్రద్ధతో నన్నియు నెఱవేర్చెదను"

## కారణములు.

"పదుమూఁడవ పాలనా వత్సరంబున" అని చక్రవర్తి నుడువుటకుఁ గారణమేమనఁగా నీ చక్రవర్తి నాల్గవ వత్సరంబుననే ప్రభువయ్యెను. ఆయనకు మాఱుగ చక్రవర్తిని యేలుచుండెను. అప్పటినుండి గణింపఁగా పండ్రెండువత్సరంబులు గడచినవి. వాస్తవముగా ఆచక్రవర్తినియే 1889 సం॥ దనుక పరిపాలించెను. మఱియు నాసంవత్సరమునుండి యింక గొంతకాలము రాజ్యపాలన మామెయే యించుమించుగఁ జేసెను. చక్రవర్తి రాజ్యభారమును వహించుట కేల నిరుత్సాహిగానుండెనోయని వింతపోవనక్కఱలేదు. చక్రవర్తిని గాకపోతినని యెవఁడును జింతింపఁబనిలేదు. ఏలయన నగరమువిడిచి బహిర్గమనం బెప్పుడో చేయుటకలుగునేకాని యెల్లప్పుడు నగరమందె కారాగృహమందువలెఁ జక్రవర్తి యుండవలెను. ఆయన నగరువిడిచి వెళ్లవలసియున్న ప్రయాణములయందుఁగూడ నతిభారములయిన రాజ్యవ్యవహారము లాయనవెంటనే యుండును. అత్యున్నతస్థితి యందుండువారు మహాదృష్టశాలులని సామాన్యంబుగఁ దోఁచును గాని వారిబన్నంబుల నెన్నతరముకాదనునది చదువరులెఱుంగని విషయముకాదు.

చీనాదేశమందుండెడి యతిదీర్ఘమయిన యాఁగ్ టిసుకి యాంగునది యేఁటేఁటఁబొంగి పొరలి పొలముల నాశముచేసి గ్రామాదులఁ దుడిచిపెట్టును. కావుననే దానిని "చీనాదేశదుఃఖమని" సార్థకముగాఁ జెప్పెదరు. అప్ర

---

* పూర్వులకు మనవిచేసుకొనుటయెట్టిదో రెండవయధ్యాయమందు వివరింపఁబడియున్నది.

వాహము 1887 సం. లో నపరిమితంబుగఁ బొంగి దేశోపద్రవము మిక్కుటంబుగఁ బొనరించెను. అందువలనఁ జక్రవర్తికిభూమిపన్నువలని రాబడి చాలఁగ నష్టమయ్యెను. అదియటుండ "ఫూచూ" నగరమందుండెడి బ్యాంకులలోసొమ్ము స్వల్పముగనుండఁగ ఆబ్యాంకుమీఁదికి నాసొమ్మునుమించిన హుండీలు దెలివితక్కువగ నీయఁబడెను. సొమ్ములేదని బ్యాంకుమూసివేయఁబడఁగా జనులు క్రోపోద్రేకంబుతో నాబ్యాంకును ముట్టడించి సొమ్ము దోఁచుకొని తమనష్టములఁ బూర్తిచేసికొనయత్నించిరి కాని విఫలమనోరథులయిరి. రాజకీయవ్యవహారముల కొఱకగు వ్యయమును దగ్గించవలయునని యుద్యోగులకును, నుత్సవాదులనిమిత్తము స్వల్పవ్యయములు చేయవలయునని మందారినులకును ద్రవ్యలోపముంబట్టి చక్రవర్తి శాసనమూలముగ గట్టియుత్తరవు చేసెను.

## వార్తాతంతి.

ఆసంవత్సరముననే ఫ్రెంచివారితో సంభవించిన యుద్ధముంబట్టి చీనారాజ్యమందు పికిన్ రాజధానినుండి యతిదూరమున నైఋతిమూలనుండు యూనాన్ నగరము దనుక "వార్తాతంతి" (Telegraph) నిర్మింపఁబడెను. అది పూర్వాచారవిరుద్ధ కృత్యమనియు దానినిదీసివేయుమనియు మూఢజనులు కలహింపఁదొడఁగిరి. రాజ్యమునందుఁ జిరకాలమునుండి వ్యాపించియున్నమూఢత్వము జనులనువిడిచిపోవుకాల మాసన్నమగుచున్నదని తలఁపవచ్చును. మంగోలియాయందుండు జిహోలు (Jehol) నగరములోనున్న రాళ్లగనులను ద్రవ్వనారంభించిరి. భూమినినొక దేవతగా చీనావారారాధించుటంజేసి దానిని ద్రవ్వినయెడల నుపద్రవముసంభవించునని వారు తలఁతురు. అట్టిమూఢభావముచేతనే 20 సం. లక్రిందట వారు వల్లమాలిన యల్లరిచేసిరి. అట్టిభావము కూడదని లిహాంగుచాంగు జనులకు మనంబున నాటఁజేసి యల్లరిలేకుండ జనులొడంబడునట్లు కావించెను.

మితవ్యయము చేయవలయునని చక్రవర్తి శాసనము ప్రకటించినను 1887 సం. లో నగరమందనేక యుత్సవములు జరుపఁబడెను. చక్రవర్తి వివాహము చేసికొనుసమయము వచ్చెను. యహోనల (yehonala) అనునామెను

1889 సం. మార్చి నెలలో మహావైభవముతో ఆయన పరిణయమయ్యెను. ఆ కన్య చక్రవర్తినికి సోదరపుత్రిక. మఱియు చక్రవర్తి దేశాచారప్రకారము పర కన్యల నిరువురను జేకొనెను. శాసనప్రకారము చక్రవర్తియొక్క వివాహమందు జరుగవలసిన లాంఛనము లేడు. అవియేవియనిన. (1) వధూవరులకుఁ గట్నములను బంపుట (2) వివాహోత్సవము (3) వధూవరులు కలసి పూర్వుల నారాధించుట (4) "చక్రవర్తిని" యను బిరుదును వధువున కొసంగుట (5) వధువు వృద్ధచక్రవర్తినికి బహుమానమిచ్చుట (6) ఆశీర్వాదములను బొందుట (7) దర్బారు విందు.

## చక్రవర్తియొక్క కృతజ్ఞత.

సర్ రాబర్టు హార్టు (Sir Robert Hart) మొదలగు నుద్యోగులు వివాహకాలమం దధికముగా సన్మానింపఁబడిరి. చక్రవర్తి వివాహితుఁడైనందున రాజ్యచట్టములప్రకారము ప్రభుత్వము వహించెను. పదునెనిమిదివత్సరంబులు రాజ్యభారము వహించిన వృద్ధచక్రవర్తిని విశ్రాంతిగ నివసించుటకై యొకదివ్యభవనమును గట్టించుటయె చక్రవర్తియొక్క ప్రథమోద్దేశ్యమయ్యెను. చక్రవర్తియొక్క కృతజ్ఞత కామె యానందించి శాసనముఖంబున నిట్లు ప్రచురించెను.

"చక్రవర్తి యుక్తవయస్సు కలవాఁడయ్యెను. ఆయన తన దేహమును జక్కఁగాఁ గాపాడుకొని బుద్ధిని వికసింపఁజేసికొని, రాజ్యకార్యముల నిరంతర శ్రద్ధాపూర్వకంబుగ నివర్తించి తనప్రజలయం దనురాగము కలవాఁడై యుండుటయె మమ్మును సమ్మానించుటగా భావించెదను."

ఈ ప్రశస్తోపదేశమును చక్రవర్తి త్రికరణశుద్ధిగ ననుసరించి నడుచుకొనెను. అటుల నడుచుకొనుటచే ఆయన విశ్రాంతియను మాటయే యెఱుఁగఁడయ్యెను. దానికి దార్కాణంబుగ ఆయన ప్రతిదినము తెల్లవారుజామున 2 గంటలకు నిద్రలేచి నగరువిడిచి భూదేవతాలయమునకుఁ బోయి పూజించి, 4 గంటలవేళకు నగరునకు మఱలి ప్రాతఃకాలభోజనముచేసి, పిమ్మట నగ్నిదే

వతాలయమునకుఁ బోయి ధూపాదుల సమర్పించి నగరునకుఁ దిరిగివచ్చి రాజ్య కార్యముల నివర్తించుచుండెను.

ప్రతినిధిగ వృద్ధచక్రవర్తినిఁ బరిపాలించిన కాలమంతయు రాజ్యమున కనేకకష్టంబులును దొందరలును సంప్రాప్తము లయ్యెను. అయినను నట్టియతి జడు లనుసుళ్లచే దుస్తరంబుగ నున్న యకాలప్రవాహంబుపై సామె రాజ్యమను నావను నిరపాయంబుగ నడపించెనని చెప్పుటకంటె నామెయొక్క శక్తిసామర్థ్యముల నధికముగ వర్ణింపవలెనా? కాని క్వాంగుషుచరిత్రయొక్క పరిపాలనారంభమందె రాజ్యమం దల్లరులు సాగెను. అవి వెంటనే నివారింపఁబడినను గొంతకాలము దనుక రాజ్యమందు నెమ్మది లేదు.

ఈవఱలో చక్రవర్తి బాలుఁడయియుండుట వలన నన్యదేశ రాయబారులకు చక్రవర్తియొక్క సందర్శనము యుండలేదు. రాయబారులు సందర్శనమును గోరినంత మాత్రముననె 1890 సం. డిశంబరు 12 తేదిగల పికిఙ్ గెజటులో నిట్లు చక్రవర్తివలన ప్రకటింపఁబడెను.

## రాయబారులకు సందర్శన మిచ్చుటను గూర్చి.

"ఒడంబడిక లయినది మొదలుకొని విదేశీయరాజ్యములకును మారాజ్యమునకు నుత్తర ప్రత్యుత్తరములు నితర లిఖితములను రాజముద్రలు గలవై యన్యోన్య గౌరవసూచకముగాఁ బ్రవర్తిల్లుచున్నవి. దానంజేసి యన్యోన్య మైత్రి నానాఁటికి సురక్షితముగ నుండెను. ఈరాజ్యముతో సఖ్యముగానుండుటకై యన్యదేశీయ రాయబారులు మాయందు నిండుగ రాజభక్తి గలవారలైయుండుట నేనెఱుంగుదును. సంతసించుచుందును. గతవత్సర ప్రథమద్వితీయమాసములలో సర్వ ప్రజాసంతోష కార్యములు ప్రాప్తించినప్పుడు విదేశీయరాయబారులకు విందొనరింపవలయునని సభికులకు "చక్రవర్తిని" యుత్తరువు చేసెను. ఆయుత్సవ మెల్లప్పుడు స్మరింపఁ దగినదియు నానందమిచ్చునదియుఁగదా. నేను స్వయముగా రెండు వత్సరములనుండి పాలించుచున్నాను. కాఁబట్టి రాయబారులకు దర్శనమిచ్చు సమయమయియున్నది. "టుంగుచి" చక్రవర్తి 1873 సం. లో నిచ్చినట్లు గానే దర్శన మీయఁబడును. మ

ఱియు రాజధాని యందుండు రాయబారులను సమ్మానించుటకై కొలువుదీ ర్చుటకుఁ బ్రతిసంవత్సరంబున నొకదినము నిర్ణయింపఁబడును. రాఁబోవు సంవత్సరంబులలోఁ బ్రథమమాసమందు నొకదినము నిర్ణయింపుఁడని సభికులు నన్నుఁ గోరవలయును. అన్యదేశీయకార్యస్థానమందు ఆ సమయమునఁ బ్రవేశింపుటకు నిర్ణయించిన తేదీన రాయబారులకు విందొనరింప వలయును. ఆరీతిగనే ప్రతివత్సరంబునను బ్రథమమాసములో జరుపుచుండవలెను. దానికి సంబంధించిన విధు లేకరీతిగనే యుండును. నూతన రాయబారులను సహిత మప్పుడే గౌరవించెదము. అటుల గొలువుదీర్చియున్న ప్పుడు రాయబారులు తమకు విందొనరింపు మని నన్ను లిఖితపూర్వకంబుగఁ గోరవలెను. దానం జేసి విదేశీయ రాజ్యములతో సఖ్యముగ నుండుటకు నాకుఁ గల యధికాభిలాష ప్రకటితమగును.''

## చక్రవర్తి దర్శన మిచ్చుట.

ఈశాసనము విదేశీయ రాయబారుల కానందకరంబుగ నుండెను. కాని 1873 సంవత్సరంబున టుంగుచి చక్రవర్తి కాలంబున నేయల్పభవనంబున రాజసందర్శనము జరిగెనో యీభవనమందే యది జరిగెను. అది యటుండ రాయబారులు తమ యధికారపత్రికలను చక్రవర్తికిఁ బురోభాగమందుంచు బల్లపై నిదివఱకువలె నుంచక యాయన సన్నిధానవర్తియగు రాజన్యుని చేతి కీయవలయునని నూతనమైన యేర్పా టొకటి కలిగెను. రాయబారుల నవమానించుట కటుల నేర్పడిన ట్లుద్యోగులును బ్రజలును దలఁచుచుండిరి. దానిని రాయబారులు లక్ష్యపెట్టలేదు. చక్రవర్తి రాయబారుల కుచితగౌరవముతోఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఎట్లయినను సందర్శనము రాయబారులకుఁ దృప్తికరముగ నుండనందున నటుపిమ్మట సందర్శనమునకే పోఁగూడదని వారునిశ్చయించుకొనిరి. అట్టి నిశ్చయమును రాయబారులు పూర్వమె కలిగియుండిరేని చీనాచక్రవర్తుల వలన నవమానములు పొందకయే యుందురని యాంగ్లేయ చరిత్రకారుఁడు శ్లాఘించెను.

జపానువారితో యుద్ధ మాసన్నమగుచుండుట యెఱింగి చక్రవర్తి విదేశరాజ్యములవారి ప్రాపకమును సంపాదించుకొనుటకై రాయబారుల ప్రార్థ

నల సమయానుకూలంబుగ నంగీకరింపుమ నొకప్పుడు జర్మానియా దేశపురాయబారి తన సందర్శనమునకు 1898 సంవత్సరంబున రాఁగా గౌరవించి యాయన వెడలి పోవునప్పుడు తాను లేచి వీడ్కొల్పెననట. చక్రవర్తి రాయబారులకు నంత సులభసాధ్యుఁ డగుటం జేసి రాయబారు లప్పటినుండి యిప్పటికి నధిక స్వాతంత్ర్యముతో వ్యవహరించుచుండిరి. 1894 సం. నవంబరు నెలలో చక్రవర్తి తన నగరునందె (1) అమెరికా, (2) రుషియా (3) ఇగ్లాండు (4) ఫ్రాన్సు (5) బెల్జియము (6) స్వీడను (7) స్పెయిన్ రాజ్యముల రాయబారులకు దర్శనమిచ్చి తనతో సమానులనుగా గౌరవించెను. చక్రవర్తిని సందర్శించు కార్య మెంతదుర్ఘటంబుగ రాయబారుల కుండెనో గతంబున లిఖింపఁబడి యుండుటం జేసి కాలక్రమంబున నదియెంత సులభసాధ్యమయ్యెనో యావిషయము తుదకఱకీపేరాలో లిఖించుటంబట్టి 1898 సం.ను జెప్పుట కలిగినది. ఇకను 1887 సంవత్సరమందలి చరిత్ర గతచరిత్ర ననుసరించి యిపుడు లిఖింపఁబడుచున్నది.

## చీనాసర్వకలాశాలలో గణితశాస్త్రప్రవేశము.

చీనావారిలోఁ గేవలము పూర్వాచారపరాయణులు కాని కొందఱకు యూరోపుఖండవాసుల గణితశాస్త్రము * చీనాదేశవిద్యార్థు లభ్యసించుట యగత్యమని గట్టితలంపు గలదు. కావున 1866 సం. లో "కంగు" మొదలయిన వారలు సర్వకలాశాల నేర్పఱచి దానియందా శాస్త్రమును బ్రవేశపెట్టవలయు నని చక్రవర్తిని బ్రార్థించి యాయన యనుమతింబడసి యాప్రకార మేర్పఱచిరి కాని యట్టి యుద్యమము ఫలించుటకుఁ బరిపక్వకాలము రానందున నది నిష్ఫలమయ్యెను. తిరిగి 1887 సం. లో మఱల చక్రవర్తియొక్క

* ఇవి యూరోపుఖండమందు ద్వివిధము (1) అచ్ఛము (2) మిశ్రము. అచ్ఛము మూర్తములయిన వస్తువులనుండి వేఱుగానుండును. దానిలో నంకగణితము, బీజగణితము, క్షేత్రగణితము నిట్టివి చేరును. మిశ్రమందు మూర్తములయిన వస్తువుల పరిమాణాదులు చెప్పఁబడును. దీనిలో జ్యోతిషశాస్త్రము అక్షిశాస్త్రము నిట్టివి చేరును.

యంగీకారమొంది యాశాస్త్రమును సర్వకలాశాలయందుఁ బ్రధాన పాఠము లలోఁ జేర్పఁబడెను.

పూర్వాచారబద్ధంబయిన పండిత బృందంబు విదేశీయ గణితశాస్త్రాభ్యాసమును నిరసించి, ద్వేషించి, మూఢజనంబును గలహంబునకుఁ బురికొల్పెను. చౌహాన్ (Chow Han) అను పండితుఁ డుద్యోగదశయందుండి యాకలహానలంబుఁ బ్రజ్వలింపఁజేయుటకుఁ బ్రబలమహాబలుండై క్రైస్తవమతబోధకులపై నతి నీచమయిన యపవాద లాపాదించి కాగితంబులపై వ్రాసి కొన్ని ప్రదేశములయందుఁ బ్రచురపఱిచెను. ఆనిందలు గతంబున 13 వ యధ్యాయమందు లిఖింపఁబడియున్నవియే. మఱియుఁ గొన్ని నూతనములుకూడ నుండెను. కావున "వుహు" మొదలయిన యేడుపట్టణములయందుఁ బ్రజలు క్రైస్తవదేవాలయములను వారి నివాసగృహములను నేలమట్టముగఁ జేసి యాంగ్లేయుల నిద్దఱను వధించిరి. ఆయక్రమముల విచారింపుమని యాంగ్లేయ రాయబారి నిరోధింపఁగా చీనాదొరతనమువా రుపేక్షాభావముతో నేమో విచారించినట్లు నటించిరి. పైనిఁజెప్పఁబడిన 'చౌహాను'ను స్వేచ్ఛగాఁ బొమ్మని విడిచిపెట్టిరి. సభికులు కలహమునుగుఱించి తెలియఁజేయఁగా చక్రవర్తి శాసనమూలముగా నిట్లు ప్రత్యుత్తర మొకటిమాత్ర మిచ్చెను.

కలహము నివారించుటకై చక్రవర్తిశాసనప్రకటన.

"ఈరాజ్యమందుఁ గ్రైస్తవమతము ప్రవర్తిల్లుటకు నొడంబడికవలన నంగీకరింపఁ బడియున్నది. కావునఁ దద్బోధకులు సురక్షితులుగ నుండునట్లు తగు జాగ్రత్త పుచ్చుకొనుఁ డని యుద్యోగుల కానతిచ్చి యుంటిమి. జనులను సన్మార్గులనుగఁ జేయుటయే యీ మతోద్దేశమయి యున్నది. చీనావారికిని ఆమతబోధకులకును నన్యోన్యమైత్రి యుండవలెను. వారి కుపద్రవము కలుగఁ జేయవలయు నని కొందఱు దుర్మార్గులు వారిపై నపవాదలుమోప సమకట్టుచున్నారు. అట్టిదుర్మార్గు లీరాజ్యములో నక్కడక్కడ నున్నారు. ఆమతబోధకులకును విదేశీయవర్తకులకును వారివలన లేశమాత్రమయిన యాపద గలుగకుం

డేఁ బ్రదేశాధికారులు జాగరూకులై యుండవలయు. ఈశాసనమును జనులకం దఱకును దెలియునటుల రాజ్యమందంతటఁ బ్రకటింపవలయును ''

ఈశాసనప్రకటన జరిగినపిమ్మట రాజ్యమందు గొంతకాలము నెమ్మది నెకొ్కనెను. కాని విదేశీయులయెడ ద్వేషము నిర్మూలింపఁబడలేదు. మఱియు చీనారాజ్యమున కన్యరాజ్యముల వలన నాపద గలుగుచున్నప్పుడు తమ రాజ్యమం దన్యదేశీయులతోఁ గలహింపగనియు, నట్టియాపద నివారింపఁ బడినతోడనే చీనావా రన్యదేశీయుల బాధింపఁ జూచెదరనియు, నన్యదేశీయులు గ్రహించియుండిరి. అందుకు నిదర్శనముగా చీనావారికి జపానువారితో 1895 సం. లో యుద్ధము ప్రసక్తించియుండునంత దనుక నన్యదేశీయులతో వా రనుకూలముగ నుండినట్లు నటించి జపానువారిచే నోడంబడికయైనతోడనే ఫుకీన్ పరగణాయందలి మిషనరీలగృహముల ముట్టడించి కొందఱను గిట్టించిరి. జర్మానియావారి మిషనరీ నక్రిమంబుగ జంపియందు వలన చీనావా రనుభవించిన నష్టము ముందు నుడువఁబడును. మొత్తమున చీనావారు సమర సాధ్యులేకాని సామసాధ్యులు కారని యాంగ్లేయచరిత్రకారుఁడు లిఖించెను. 19 వ శతాబ్దమందలి గతచరిత్రవలన నంతగానే కన్పట్టుచున్నది. అది యసమర్థ పరిపాలనదోషమని గ్రహింపఁదగియున్నది.

## 14 వ అధ్యాయము.

క్లాంగషుచక్రవర్తియొక్క పరిపాలనాశేషము.

జపాను రాజ్యముతో యుద్ధము. నవీనవృత్తాంతములు.

### చీనావారును జపానువారును కోరియాయందలి కలహముల నివారింపఁబోవుట.

కోరియారాజ్యవ్యవహారములే చీనావారికిని జపానువారికిని గలహకారణము లగుచుండెను. ఆయుభయరాజ్యములవారును కోరియారాజ్యమును

వెవ్వేఱుగ ముట్టడించుటంజేసి యీరెండు రాజ్యములకును లోఁబడియున్నట్లు కోరియారాజు నటించుచుండెను. అదియటుండ జపానువారికిని చీనావారికిని గతంబున జరిగిన యొడంబడికలో నాయుభయ రాజ్యములలో నెవరు కోరియాదేశమునకు ససైన్యముగఁ బోవుట కలిగినను రెండవరాజ్యము వారికాసమాచారము తెలియఁ జేయవలయునని యొక నిబంధన యుండెను. రోమన్ కాతోలిక మతమును కోరియాప్రజలలోఁ గొందఱవలంబించి యుండిరి. ఆదేశమందలి స్వమత ప్రజలు వారితో 1894 సంవత్సరంబునఁ గలహింపఁ దొడఁగిరి. కోరియాయందున్న జపానువారు తత్కలహ నివారణంబొనర్ప యత్నించిరి కాని విఫలులైరి. కావున కోరియా రాజు చీనాదొరతనము వారి సహాయము వేడెను. చీనాదొరతనమువారా కలహము వారించుటకు సైన్యముఁ బంపిరి కాని పైని నిబంధన ప్రకారము జపాను వారికిఁ దెలియఁ జేయరైరి. దానికిఁ దగినట్లు జపానురాజ్యము వారు నొక సైన్యము నప్పుడే కోరియాకుఁ బంపిరి. అటుల నుభయసైన్యములు నొక తావుననే తారసిల్లెను. కాని యొండొరులతో సమరం బొనర్పఁబూని యుండలేదు. కోరియా రాజ్యపాలనమునకై కొన్ని నూతనయేర్పాటు లారాజునకుఁ దెల్పి జపానువారు తృప్తిం జెందియుండిరి. జపానీయు లంత వివేకంబుతో వ్యవహరింపఁగా వారట్టియేర్పాటులఁ జేయుట కధికారము లేనివారనియుఁ దామే కలవారమనియు చీనావారు వారి నధిక్షేపించిరి. జపాను రాజ్యమువారా యుల్లంఘనను సహించి యూరకుండిరి. మఱియు జపానీయుల యుద్ధనావలు జూలై 20 తేదినాఁటికి కోరియాతీరమును విడిచిపోవలెనని చీనావారక్రమముగ జపానువారిని నిరోధించిరి. దానికిని జపాను దొరతనము వారు ప్రతిఘటింపలేదు. చీనావారు తమకుఁ దెలియకుండ కోరియాకు సేనలను బంపినయెడలఁ దమ్మును యుద్ధమునకుఁ బిలిచినట్లె భావింతుమని మాత్రము జపానువారనిరి. అటులఁ జేయుమని చీనావారు జపానీయులకు మృదుమధుర వచనము లేమియు చెప్పిరి. చీనావారి వ్యవహారములు పయోముఖ విషకుంభంబులఁ బోలునని జపానీయు లెఱింగినవారగుటంజేసి మూఁడు యుద్ధనావలను "పిచిలీ" (Pichili) సింధుశాఖలోఁ గావలి యుంచిరి. జపానీయుల దూరదృష్టిని సార్థకరిం

చుటకో యన్నట్లు జూలై నెల 25 తేదీ యుదయమున భోజనపదార్థములను సైన్యమును గల యొకపడవయును రెండు యుద్ధనావలును కోరి

## చీనావారి కపట వ్యాపారము.

యాకు చీనాదొరతనము వారు పంపిరి. ఆసింధుశాఖయందున్న జపానీయ యుద్ధనావికు లా కపట వ్యాపారముఁ జూచి యుద్ధసన్నద్ధులై చీనావారి యుద్ధనావలలో నొకదానికి ఫిరంగులచే ఛిద్రములు గావింప నది మునిఁగి పోయెను. రెండవ యుద్ధనావాధికారి సామగ్రి యున్నపడవను జపాను వారికర్పణము చేసి తననావను కోరియాకుఁ దీసికొనిపోయెను. సామగ్రిపడవను జపాను తీరమునకుఁ దీసికొనిపొమ్మని దాని కెప్టెక్కు జపానీయు లాజ్ఞాపింపఁగా తనసైనికులు తన నట్లు చేయనీయకుండిరని వాఁడు మాఱువల్కఁగా జపానీయులు దానిపై ఫిరంగులఁ గాల్చి ససైన్యముగ దానిని సముద్రగామిం జేసిరి. అది యెంతదుఃఖకరము.అంతట నుభయరాజ్యముల వారును బాహాటముగ యుద్ధ ముపక్రమించిరి. "అసాను" పట్టణ సమీపముం దొక యుద్ధము ప్రవర్తిల్లెను. చీనాసేనానియైన "యే" (Yeh) పిరికివాఁడును, ఆలోచనలేనివాఁ డగుటంజేసి యచ్చట కొంతసేనను విడిచి యుత్తరమునను న్న "పింగ్యాంగు" నగరమున కతివేగముగఁ బోయెను. జపానీయులు సులభముగ నాపట్టణమును శత్రువులసామగ్రిలను వశపఱచుకొని యాపిరికిసేనానిని దఱుముకొనిపోయి పింగ్యాంగునగరమును ముట్టడించిరి. బలిష్ఠ దుర్గములను గల యానగరమును వారుముట్టడించుటకుఁ బూర్వమే బలపఱచుకొనవలయునని సహాయసేనానులు చెప్పఁగా వారిని "యే" పరిహసించెను. "వి" "సో" అనువారిద్దఱును సహాయసేనానులు. "సో" కోరియాయందుండు సమర్థమయినసేనాని. శత్రువులు ముట్టడింపఁగానే "యే "వి" వీరిద్దఱు నానగరమునుండి కొంతసైన్యముతో "యాలు" నదీతీరమునకుఁ బారిపోయిరి "సో" ఒక్కఁడైనను రణవీరుఁడై పోరి యుద్ధమందు మడసెను. పందలయిన యా సేనానాయకులలో "వి" అను వానిని చక్రవర్తి యురిదీయించెను.

"యే" లంచములు పెట్టి తలమాత్రము నిలుపుకొనెను గాని యిప్పటికిని గారాగృహమం దుండెను.

చీనా దొరతనము వారు "యాలు" నదివద్దకుఁ గొంత సైన్యమును బంపిరి. అప్పటిసేనాని "సింగు" (Tsing) అనువాఁడు. అచ్చట నుభయుల యుద్ధనావలును సమముగానే యున్నవి కాని చీనావారు వ్యూహరచనయందు మొదటినుండియు నసమర్థులె. జపానీయులు ముందుగ యుద్ధరంగమునకుఁ బోయి తగిన చోట్లను గుదుర్చుకొనిరి. యుద్ధమందు చీనావారి వయిదుయుద్ధనావలు నశించెను. కడమవి తీసికొని జపానీయుల కందకుండ "పోర్డు ఆర్తరు" కు చీనా సేనాని చేరెను.

ఆమధ్యకాలములో యాలునదికి దక్షిణపుగట్టున నున్న యొక పట్టణమును జపానీయులు అక్టోబరు 8 తేదిని బట్టుకొనిరి. దానితో కోరియాలో చీనావారిపురుగు లేకుండఁ బోయెను. అంతట జపానీయ సేనానికి సహాయసైన్యము తోడ్పడఁగ మంచూరియాలోఁ బ్రవేశించి అక్టోబరు 25 తేదిని చీనావారిని "హుషాన్" (Hushan) వద్ద బట్టుగ జపానీయులోడించిరి. మఱికొన్ని బలిష్ఠములయిన నగరము లెదిరింపన్న మాట లేకయె జపానీయులకు లోఁబడెను.

## జపానీయులు పొందినమఱికొన్ని జయములు.

జపానీయుల మఱియొక సేనానియయిన "ఒయామా" (Oyama) పోర్టుఆర్తరు (Port arthur) కు నుత్తరముగ నున్న మూఁడు పట్టణములను బట్టుకొని దానిని ముట్టడింప శక్తుండయ్యెను. ఆరేవు పట్టణమును బలపఱచుటకు లిహాంగుచాంగు విశేషముగ ద్రవ్యవ్యయము చేసియుండెను కావున చీనావారు దానిని శత్రువులకు దుర్గమం బని నమ్మియుండిరి. అట్టి రేవుపట్టణము వద్ద చీనావారేమో కొంత పోరాడి తుదకు ఫిరంగులు విడిచిపెట్టి పలాయితులైరి. అంత బలిష్ఠమయినదని చీనావారు భావించినను జపానీయ సేనాని యయిన ఒయామా దాని నవలీలగ లోఁగొని మంచూరియా యందుఁ బ్రవేశించి "ఫూచూ" మొదలయిన నగరముల కైవసంబు చేసికొనెను. జపానీయసైన్య మంతకంతకుఁ బురి విచ్చుచుండుటయుఁ దనసైన్యముయొక్క—

బీరంబు గచ్చు విచ్చగుటయుం జూచి బీతుఁజెంది లిహాంగుచాంగు యొక్క యుపదేశము వడువున సంధికొఱకై రాయబారుల నిద్దఱను చక్రవర్తి పంపెను. ఆ రాయబారులకు జక్రవర్తి సర్వాధికార మిచ్చియుండ లేదనియు రాయబారులుగా నుండుటకు వారు తగినంత పదవుగలవారు కారనియు వారిని జపాను దొరతనమువా రంగీకరింపక వచ్చిన దారినే పొమ్మనిరి. అటుల వృథాగా చీనాచక్రవర్తి కాలయాపన చేయుచుండఁగ వారికి శేషించియున్న యొక్క కోటయైన "విహాయివి" (Weihaievei) ని వశపఱచుకొనుటకై జపానీయులు వెగ్గలంబుగ నుగ్గరము బన్నుచుండిరి. దాని రేవున చీనావారి ప్రబలనావికా సైన్యముండెను. దాని దళవాయి పేరు "టింగు" (Ting). అతఁడు రణోద్యోగమం దారి తేఱినవాఁడయ్యును నతని సైన్యమాతని యాజ్ఞకు లోఁబడకుండుటచే నతని కౌశల్యము వమ్మయ్యెను. శత్రువులు దానిని ముట్టడించిరి. చీనా సేనాని పిఱతివియక కొంతవఱకుఁ బట్టుగ బోరి తుట్టతుదకు శత్రువులు నెట్టగలరని గుఱ్ఱెఱింగి దిట్టరి యగుటం జేసి శత్రుసేనానియైన "ఇనోటా" కు లోఁబడి తన్ను దన సేనలను బ్రాణాపాయము లేకుండ విడుచుటకంగీకారమును బొందెను. పిమ్మట ఆయన యాత్మహత్య చేసికొనెను. ఆయన సహాయ సేనాను లిరువురు నట్లే చేసికొనిరి. శత్రుసేనానాయకుఁడా శౌర్యకృత్యముం జూచి జాలినొంది పిఱతివియక తనతో బీరంబుగఁ బోరిన "టింగు" యొక్క మృతకళేబరమును దనవశంబుననున్న చీనావారి యుద్ధనావపైఁ బెట్టించి "చిఫూ" నగరమునకుఁ బంపివేసి గౌరవించెను. అంతటితో చీనాచక్రవర్తికి తానెట్టి యాపదలో నుండెనో కండ్లకు గట్టినట్లగపడెను. తానింక రాజ్యమేలు యోగమున్న యెడల జపాను దొరతనము వారితో సంధికావించుకొనక

## చీనా చక్రవర్తి లిహాంగుచాంగును రాయబారిగాఁ బంపుట.

తప్పదని గ్రహించి యకార్యమునకు దగిన రాయబారి లిహాంగు చాంగే యని యెఱింగి యాయనను బుత్తెంచెను. చీనా సముద్రమందున్న యే దీవుల నిమ్మని జపాను రాజ్యమువారు కోరినను సరే "లియోటింగు" పర్యాయద్వీపమును గూడ నిమ్మందురేమొ యని లిహాంగుచాంగు ముందుగనే విదేశీయ

రాయబారుల సాహాయ్యము కోరుట కై కొంత తడవుచేసి తన జీవితకాలములో మొదటిసారిగ నన్య రాజ్యమునకు వెడలెను.

లిహాంగు చాంగు తత్కాలోపయోగమైన సంధికై యత్నించెను గాని జపాను రాజ్యమువారు కోరిన నిబంధనలు చీనారాజ్యమున కపాయకరముగనున్నందున సట్టిసంధిని విరమించి శాశ్వతపు సంధికై యుద్యమించి సఫలమనోరథుఁడయ్యెను. కాని శత్రువులలోఁ జేరిన యొకప్రాణఘాతుకుఁడాయన కొక గాయము పొనర్చెను. అదియొక్కటియె విచారకరమయిన విషయము. ఆసంధిపత్త్రము 1895 సం. య్యేప్రియలు నెల 17_ తేదిని లిఖింపఁబడి సంతకములు చేయఁబడెను.

నిబంధనలు.

(1) పోర్టు ఆర్థరుసహితముగ లియోటొంగు పర్యాయ ద్వీపమును, ఫార్మోజా ద్వీపమును, పిస్కెడోర్సు ద్వీపమును జపానువారి కీయవలయును.

(2) 200 000 000 తాయిలు నాణెములను జపాను వారికి చీనావారలపరాధదవ్య మీయవలయును.

పికిన్ రాజధానియందున్న ముఖ్యులలోఁ గొంద అది దొరతనము వారికి మిగుల నపకీర్తికరమని వాదించినను చక్రవర్తి మేయినెల 8 తేదని దాని నంగీకరించినట్లు సంతకము చేసెను. కాని లియోటొంగు పర్యాయ ద్వీపమును జపానువారివలన దమకు మఱల నిప్పింపుమని విదేశీయ రాయబారులను చక్రవర్తి ప్రార్థించెను. అంతట రుషియా ఫ్రాన్సు జర్మనీ రాజ్యములవారు జపాన్ దొరతనమువారిని జాలఁగా మందలింపఁగా వారెట్టకేలకా పర్యాయద్వీపమును చీనాచక్రవర్తి కిచ్చివేసిరి.

ఈ విషయమై యింగ్లాండు రాజ్యమువారు జోక్యము కలుగజేసికొనలేదు.

రాజ్య మట్లు క్రిందుమీఁదగుచుండఁగ 1895 సంవత్సరముతో వృద్ధచక్రవర్తినికి షష్టిపూర్తియయ్యెననియు సర్వజనానందకరోత్సవంబు జరుగకపోయెననియు చీనావారు గుందుచుండిరి. పూర్వము చియకెలుంగు చక్రవర్తియొక్క

పట్టపుదేవికి జరిగియుండెనని గతంబున లిఖింపఁబడియున్నది. అంత వెట్టిగఁ గామహోత్సవ మొకవిధంబుగ జరుపఁబడెను.

## విదేశీయులు ప్రతిఫలములఁ గోరుట.

చీనాదొరతనమువారి కాపత్కాలమం దడ్డపడిన రుషియావారును, ఫ్రెంచివారును, జర్మానియావారును దాముకోరిన ప్రతిఫలములను దమ కిప్పింపుమని చక్రవర్తిని నిరోధించిరి. సైబీరియా రైలును మాంచూరియాదేశములోనుండి "వ్లాడివాస్టాక్" (Vladivostok) రేవు పట్టణము దనుక పెంపొందించి యా రైలునుండి శాఖలుగ పోర్టు ఆర్థరు (Port Arthur) కును కిరణ్ మౌకుడెను (Kiran Moukden) కును రెండు చిన్నరైళ్లు వేసికొనుట కధికారమిమ్మని, రుషియావారును, టాంక్విను నగరమునుండి "నానింగుఫ్యూ"(Naning Fu) వఱకు చీనావారు వ్యయపడి రైలు వేయింపవలయునని ఫ్రెంచివారును, గొన్నిచోట్ల గనులు త్రవ్వుటకును, గొన్ని ద్రవ్యసదుపాయములను జర్మానియావారును గోరిరి. రుషియావా రుద్దేశించిన రేవు పట్టణము సంవత్సరమున కాఱుమాసములు మంచుచేఁ గప్పఁబడియుండును గనుక యది వర్తక వ్యాపారమునకు నిరర్థకము. ఫ్రెంచివారు కోరిన రైలు నిర్మించుటకు చీనావారికి నత్యంతావశ్యక కృత్యముగా నుండలేదు. జర్మానియావారు స్వల్పవాంఛగలవారుగాఁ గనఁబడిరి కాని వారు కోరినది యొక తెర, దానిచాటున వారిగొప్పయుద్యమములున్నవి. ఈ కోరికలు చీనా చక్రవర్తి కసమ్మతంబుగనుండినను దనయధికారంబు కుంటువడుటంజేసి నిరాకరింపఁజాలఁడయ్యెను. చక్రవర్తియొక్క భాండాగార మించుమించుగా శూన్యాగారముగ నుండెను. జపానురాజ్యమున కీయవలసిన యపరాధ ద్రవ్యము 200 000 00 తాయిలు నాణెములను జెల్లించు దనుక జపానువారు చీనావారి ముఖ్యమయిన కోటయగు "వి హాయివి" ని దాకట్టుగ నుంచుకొనిరి. ఆసొమ్ము చెల్లింపఁజాలక చక్రవర్తి యాంగ్లేయమంత్రిని ఋణమడిగెను. ఆయన యీయదలంచుచుండఁగ రుషియావా రాంగ్లేయుల నప్పడుగవద్దని బెదరించి తామె యిచ్చెదమనఁగా చక్రవర్తి వారివద్దనైనను దీసికొనక మఱియొకరీతిగఁ బూర్తి చేసికొనెను.

ఆగొడవ యటుండ జర్మానియావారి మిషనరీల నిద్దఱను చీనావారిలో నొక యల్లరిగుంపు చంపివేసెను. అంతట జర్మానియా నావిక సేనాధిపతి చీనావారి నావికా రక్షకస్థానమగు కియోచౌను, దాని సమీప ప్రదేశము లను వశపఱచుకొని తమరుచెప్పినట్లు చక్రవర్తి వినుదనుక యాప్రదేశములను విడువమనెను. రుషియావా రదిచూచి పోర్టు ఆర్తరును, 'తాలీనువాను'' (Talienwan) ను దమకిమ్మని చక్రవర్తిని నొత్తసాగిరి. ఆంగ్లేయులు తము రేల మిన్నకయుండవలయుననుకొని జపానువారికిఁ జెల్లింపవలసిన సొమ్మును జెల్లించిన పిమ్మట వారివశంబున దాకట్టుగనున్న "విహాయివి'' ని దమవశము చేయుమని వారు నిరోధించిరి. ఫ్రెంచివారు క్వాంగుచౌతీరమును వశపఱచు కొనిరి. చీనాదేశముయొక్క తూర్పుదక్షిణతీరములయందున్న రేవు పట్టణ ములన్నియు తమతమ యిష్టప్రకారము విదేశీయులు వశపఱచుకొనుట సరస ముగలేదని విదేశీయులకును చీనావారికిని దోఁచెను. అంతట చీనాచక్రవర్తి యాంగ్లేయరాయబారితో సంప్రతించి వర్తకమున కీవఱలో నంగీకరింపఁబడి రేవు పట్టణములు కాక మఱి మూఁడు రేవు పట్టణములను వర్తకమున కంగీ కరించెను.

చీనారాజ్యముయొక్క రేవు పట్టణముల నన్నిటి నించుమించుగా విదేశీయులు వర్తకస్థానములనుగఁ జేసికొనిరి. కాని ప్రతితీరపట్టణమును నన్య రాజ్యముల వారలందఱు వర్తకమున నుపయోగించుకొనునట్టి నిబంధనకూడ నుండెను. వారిలో నెవ్వరయిన నధిక స్వాతంత్ర్యము వహించిరేని గడమ రాజ్యముల వారందఱు వారితోఁ బోరవలసినవారై యుండిరి. అందువలన బరరాజ్యములవారు గాని యూరోపుఖండవాసులు గాని చీనారాజ్యమున కపా యము చేయకుండుటకుఁ బెట్టని కోట యేర్పడెను.

## చీనారాజ్య మండలములు.

శౌర్యధైర్యసాహసాదిగుణములు సమయోచిత ప్రజ్ఞయు లేని చక్రవర్తి పరిపాలించుటవలన చీనారాజ్యమున కెట్టిగతిపట్టుటకు సిద్ధముగ నుండెనో చూడుఁడు. అన్యరాజ్యములవారు చీనారాజ్యమును విభాగించుకొని యేలవలె ననుకొని తమతమ మండలముల నిట్లు నిరూపించుకొనిరి. రుషియావారి మండ

లము మంచూరియా యనియు, జర్మనియా వారివి పొంటంగుపర్యాయ ద్వీపమనియు, ఫ్రెంచివారిది టాంక్విక్ సమీప ప్రదేశమనియు, ఆంగ్లేయులది "యాంగ్ టిసుకియాంగు" నదియొక్క పల్లపు భూములును ఆనదియొక్కయు దానిశాఖలయొక్కయుం బౌలుదల ప్రదేశములు ననియు నూహించుకొనిరి. కాని యాంగ్లేయులు చీనా రాజ్యసంపాదనమును గోరక వర్తకాభివృద్ధిమాత్రము కోరినవారగుటచేఁ దమదియని యుద్దేశించుకొనిన మండలమును చీనా దొరతనమువా రన్యులకిచ్చుట కలుగునపుడు తమకే యిచ్చునట్లును, తమ యెగుమతి దిగుమతి సరకుల సుంకములను వసూలుచేయుటకు దమదేశీయుఁడే యధికారిగా నుండునట్లును చీనావారి యొప్పుదలను నాంగ్లేయులు వడసియుండిరి. రాజ్యమందు రైలుమార్గములు లేకుండఁగను వర్తక మభివృద్ధికాకుండఁగను దమమెట్టసైన్యమును, నావికాసైన్యమును, నవ్యవాట్లుగ నుండునట్లుగను బొనర్చిన చీనాదొరతనమువారి బుద్ధిజాడ్యమునకుఁ జివరనుదువఁబడిన నిబంధన దివ్యాపథమయ్యెను.

పిచిలీసింధుశాఖయం దాంగ్లేయులనావలే వెలయుట.

అది యటుండ రుషియావారికి చీనా దొరతనమువారు పోర్టు ఆర్తరు నిచ్చివేసిరని ప్రకటితమయ్యెను. అది పిచిలీసింధుశాఖాతీరమందున్నది. అది గొప్ప రేవుపట్టణము. రాజధానికి సమీపముగానుండెను. దానంజేసి యాసింధుశాఖను దామే యేలగలమని యనఁగా దమవర్తకపు పడవలతోఁగాని యుద్ధనావలతోఁగాని నింపగలమని రుషియావారు మిన్నందియుండిరి. ఆంగ్లేయులు రుషియావారి కృత్యమున కాక్షేపించి, కొంతకాల ముపేక్షించినట్లుండి యాసింధుశాఖయందు దమనావికాసైన్యమును బూర్ణముగ వెలయించిరి. మఱియు జపానువారికి చీనావారు చెల్లింపవలసి యుండిన ద్రవ్యశేషమును వారు చెల్లించుటకుఁ దోడ్పడి "విహాయివి" యను రేవు పట్టణమును చీనావారి యనుమతిచొప్పున జపానురాజ్యమువద్దనుండి దమవశము కావించికొనిరి. అది యాసింధుశాఖాతీరమునం దగ్రగణ్యమయిన రేవుపట్టణము కావున నిగ్లాండు దేశమే యా సింధుశాఖయందు వైభవ మనుభవించునది యయ్యెను.

---

# 15 వ అధ్యాయము.



## క్లాంఘుషి చక్రవర్తియొక్క పరిపాలనాశేషము.

## ప్రస్తుతవిషయములు.

### 1900 సం. జూన్ నెల.

### చీనారాజ్యమందలిక్రొత్తయేర్పాటులు.

జపానుయుద్ధానంతరము నాగరిక లోకమంతయు విచారపడఁదగిన ఘోరకృత్యములు చీనారాజ్యమందుఁ బ్రవర్తిల్లెను. ఆఘోరకృత్యములు జపాను యుద్ధసంభూతములనియే నుడువవచ్చును. ఏలయన నాయుద్ధానంతరము చీనాదేశీయులలోఁ గొందఱు బుద్ధిశాలులు విశేషసైన్యముఁగల తమ రాజ్యమల్పసైన్యముఁగల జపానువారి సైన్యమున కేల తీసిపోయెనో యని బహుప్రకారంబుల విచారించి చీనారాజ్యమందుఁ బ్రకృత కాలానుగుణ్యంబుగఁ గొన్ని యావశ్యకములైన మార్పులు కావలెనని నిశ్చయించుకొనిరి. అట్టిమార్పులలో రాజ్యమందుఁ బరిశ్రమ లేర్పఱచుట యనఁగా గనులుత్రవ్వుట, రైలునిర్మించుట, యంత్రపుపనుల నిర్మించుట యిట్టివి యేర్పఱచుట ప్రథమకార్యముగాఁ దలఁచిరి. ఆపనుల చామొనరించెద మనియుఁ దగిన సుంకముల నిశ్చయింప వలయుననియు విదేశీయసంఘము లొక్కమ్మడి చక్రవర్తికిఁ దెలియఁజఱచిరి. రాజ్యసంస్కరణముఁ గోరువారి యాలోచన ప్రకారము చక్రవర్తి వారాపనులఁ జేయుట కంగీకరించెను. అట్టియంగీకారమువలన రాజ్యమునకు విశేషద్రవ్యాదాయము శాశ్వతముగా గలుగునని వారిచేఁ జక్రవర్తి బోధింపఁబడెను. అమితము లయిన నల్లబొగ్గు గనులను ద్రవ్వుట యొక సంఘమునకును, ఉత్తరముననున్న పికిన్ రాజధానినుండి దక్షిణముననున్న కాంటన్ నగరము దనుక సరాసరి తెంపులేని రైలువేయుపని వేఱొకసంఘమునకు, రాజ్యమందలి పెక్కు పరగణాలలో భూమిని లెస్సగ గుల్లగించుపని మఱియొకసంఘమునకు నియ్యఁబడెను. పైనిఁ జెప్పఁబడిన పనులకు చీనాదొరతనము వారు సొమ్ము పెట్టుబడి

పెట్టి చేయించుటకు ద్రవ్యము చాలనివారై యుండిరి. మఱియుఁ గొన్ని పనుల నంగీకరించుటకు జాగు చేయుచుండిరి. చీనావారివలె జాగుచేయువారు మఱి

**:చీనాయందలి రైలుపనుల వివరము.**

యొకరుండరని చెప్పవచ్చును. కొన్ని పనులకుఁ బెట్టుబడి పెట్టువారే కనుపడ లేదు. కావున నాపనులను గూర్చి యుద్యమంబే లేకుండెను. 1899 సం. మే యి నెలలో వ్రాయఁబడిన యొక రిపోర్టును బట్టి చూడఁగా చీనాయందలి రైళ్ల స్థితి యీదిగువరీతి నుండెను.

(a) నిర్మింపఁ బడినవి—

| ఎవరివలన | ఎన్ని మైళ్లు |
|---|---|
| చీనావారు | 317 |

(b) నిర్మింపఁ బడుచున్నవి—

| | |
|---|---|
| చీనావారు | 170 |
| బెలిజియము వారు | 700 |
| రుషియావారు(తూర్పు సైబీరియానుండి మంచూరియా దేశమార్గమున) | 1400 |
| | 2270 |

(c) నిర్మింప నిశ్చయించుకొన్నవి—
(సర్వేఅయినదియు నగుచున్నవియు)

| | మైళ్లు |
|---|---|
| చీనావారు | 97 |
| జర్మానియావారు | 430 |
| ఆంగ్లేయులు | 730 |
| ఆంగ్లేయులు నమరికావారును గలసి | 700 |
| రుషియావారును చీనావారును గలసి | 130 |
| ఫ్రాన్సువారు | 420 |
| | 2507 |

(a) నిర్మింప నిశ్చయింపఁబడి సర్వే కానిది—

| | |
|---|---|
| ఆంగ్లేయులును జర్మానియావారును గలిసి | 600 |
| ఆంగ్లేయులు మాత్రము | 470 |
| | 1070 |
| నిర్మింప నిశ్చయింపఁబడిన రైలుయొక్క మొత్తము మైళ్లు | 3577 |

అంత విస్తీర్ణమైన చీనా రాజ్యమునకు మొత్తమున 6164 మైళ్ల రైలు బహ్వల్పము గానుండును. అట్టి స్వల్పమునకుఁ గారణ మేమనిన, చీనావారు రైళ్ల విషయమై పురోగాములుగ నుండకపోఁగా బ్రతిబంధకములుగఁ గూడ నున్నారు.

చీనారాజ్యమందు రైళ్లను విరివిగా వేయుటకు నంగీకరించిన యెడల నన్యరాజ్యములవార లొండొరుల మించవలయునని కక్షల వహించెదరనియు, చీనా రాజ్యముయొక్క మధ్యభాగము విదేశీయులు వశపఱచుకొందురేమొ యనియు దొరతనమువారు సందేహించుచున్నారు.

పికిక్ నుండి మంచూరియా లోనికి రుషియావారిచే వేయఁబడుచున్న రైలొక్కటియే శీఘ్రముగాఁ గొనసాగుచున్నది. ఆరైలు విషయమై యాంగ్లేయులకుఁ గొన్ని వివాదము లుండఁగాఁ దుదకు మంచూరియా దేశములోనుండి రుషియావారు నిర్మించుచున్న రైలు విషయమై యాంగ్లేయులును యాంగ్సికియాంగు యొక్క పాలువల భూములలో నాంగ్లేయులు వేయఁదలఁచిన రైలు విషయమై రుషియావారును జోక్యము కలుగఁజేసికొన కుండునటుల నొక యొడంబడిక యీయుభయ రాజ్యముల వారును జేసికొనిరి.

చీనారాజ్యములో భూమివలన వచ్చెడి యాదాయము రాజ్యవ్యయమునకును నన్యరాజ్యములకు దాను జెల్లింపవలసిన ఋణముల దీర్చుటకును జాలకుండెననియు విశేష వ్యయములకు మొదలే లేదనియుఁ జక్రవర్తి గ్రహించి పైని నుడువఁబడిన పరిశ్రమల నంగీకరించెను. మఱియు రాజ్యతంత్రమునందు ముఖ్యముగాఁ గొన్ని మార్పులఁ జేయవలయు నను వారిపేళ్లను దనకు దెలియజేయుమని యొక శాసనమును పరగణాలయధికార్లకుఁ జక్రవర్తి ప్రకటించెను. ఈరు శిఫారసు చేసినవారిలో "కాంగుయూవి" (Kang yuwei) అను నాతఁడొకఁడు. అతఁడు సంస్కర్తలలో నగ్రగామిగనుండెను. కాని రాజ్యతంత్రానుభవము కలవాఁడు కాఁడు. కావున ఆయన దేశకాల పాత్రంబు లెఱుంగక కొన్ని కాలానుగుణ్యముకాని నూతన యేర్పాటులను చక్రవర్తికిఁ జెప్పెను. చక్రవర్తియొక్క దురదృష్టవశమున 1898 సం. మే 8 తేదీని రాజ్యతంత్రనిపు

## "కంగు" యొక్క మరణము.

ణుఁడైన "కంగు" కాలధర్మము నొందెను. ఆయన యెప్పుడును సఖ్యమును గోరువాఁడుకాని కలహమునకుఁ గాలుద్రవ్వువాఁడు కాకుండెను. అట్టి బుద్ధిశాలి లేకుండుటచే చక్రవర్తి "కాంగు యూవి" యొక్క యాలోచనసైకొన

వలసివచ్చెను. దాని నిషఫలమును చక్రవర్తివెంటనే యనుభవించుటయుఁ గలిగెను.

దేశాచార విచారణ సంఘములోఁ జేరిన పిన్నవయస్సుగల సాంఘికుఁడొకఁడు మంచూరియా దేశమునందుండెడి హెచ్చుసంఘమువారికి చక్రవర్తి శాసనము ననుసరించి యొక లిఖితమును బంపి దానిని చక్రవర్తికిఁ బంపుడని వారిని గోరఁగా తత్సంఘాధ్యక్షుఁడా లిఖితమందు రాజ్యము సమూలముగ మార్పు జెందవలసిన పద్ధతి వ్రాయఁబడినదని దానికిఁ దాను సమ్మతింపక యాలేఖను తలఁదీయింపుఁడని చక్రవర్తికి వ్రాసెను. చక్రవర్తి యక్కాలంబున సంస్కరణపద్ధతులను గాఢంబుగ విచారించుచుండుటచే వారి శిఫారసు నంగీకరింపక వారు తనయాజ్ఞ నుల్లంఘించిరని యభిప్రాయపడి నిర్విచారణగా నట్టి గొప్పయుద్యోగుల నుద్యోగములనుండి తొలఁగించెను. అట్లు దొలఁగించుటచే వ్యవహారకల్లోలము పెల్లుగఁ బ్రవర్తిల్లెను. అప్పుడు వృద్ధచక్రవర్తిని యాకల్లోలమడంచు నవసరంబు కలిగెను. అట్టి యవసరమునకై యామె యెదురు చూచుచుండెనఁట. చక్రవర్తి యధికారమును దలక్రిందు చేయుటకు వృద్ధచక్రవర్తిని యేమి తంత్రముచేసెనో యతి గూఢంబుగనుండెను. కాని 1898 సం॥ సెప్టెంబరు 21 తేదిగల పికిన్ గెజటిలో నీదిగువ శాసనము ప్రకటింపఁ బడెను. అది చక్రవర్తి తాను స్వయముగా బ్రకటించినట్లుండెను.

శాసనము.

"మనరాజ్యము ప్రస్తుతమందు బెడిదంబగు గొడవలలోఁ బడియున్నది. టుంగచి చక్రవర్తి గతించినతర్వాత వృద్ధచక్రవర్తిని రెండు సార్లు రాజ్యభారము వహించి సలక్షణంబుగఁ బరిపాలించియుండెననియుఁ జక్రవర్తి చిక్కులలోఁ జిక్కియుండఁగ దనసామర్థ్యంబుచేఁ జిక్కులందొలఁగించి స్వస్థతను నెక్కొనఁ జేసెననియుఁ, బ్రస్తుతపుగొడవలామెకు జ్ఞాపకము చేయుచున్నవి. పరంపరాగతమైన యీ రాజ్యము సురక్షితముగ నుండవలయునని యన్నిటికంటె యెక్కువగా మనము తలపోయుచుందుము కదా. రాజ్యమునకిప్పుడు వాటిల్లనున్న యాపదలంబట్టి రాజ్యపాలనమునందుఁ దగిన యాలోచనలు చెప్పుటకై మూఁడుపర్యాయములు ప్రార్థింపఁగా నామె మాయొక్కయు మాప్రజలయొ

క్కియు నద్పృష్టవశమునందున కంగీకరించెను. కాఁబట్టి యీదినమునుండి రాజ్యవ్యవహారముల నామెయే యొనర్చును.

ఆమార్పుయొక్క విపరీతఫలిత మవ్యవధానముగానె కన్పట్టెను. (1) ఉద్యోగములనుండి తొలఁగింపఁబడినవారు మరల వారి యుద్యోగములయందుఁ బ్రవేశపెట్టఁబడిరి. (2) పాఠశాలలుగాను సర్వకళాశాలలుగా నుపయోగింపఁబడిన దేవాలయములును మఠములును యథాపూర్వముగఁ జేయఁబడినవి. (3) జాతీయప్రతినిధి సభనేర్పరుచుట ప్రపంచమున్నంతవఱకు జరుగనేరనట్టుగఁ ద్రోసివేయఁబడెను. (4) జనులు ధరించెడి యుడుపులయొక్క మార్పును గుఱించి యాలోచింపకుండఁగనే నిషేధించెను. రాజ్యమనెడి గృహంబునుండి పూర్వాచార పరాయణ భూతంబుల వెడలఁగొట్టి దాని నలంకరించుటకుఁ జక్రవర్తి దలఁచియుండఁగాఁ బూర్వమునకంటె బలవంతములయిన తత్పరాయణ భూతంబులతో నాగృహంబు నిండఁబడెను.

## విదేశీయులయెడలద్వేషమును మరల ప్రబలుట.

వృద్ధ చక్రవర్తిని విదేశీయుల పైఁబగఁదీర్చుకొనుటకు వల్లమాలిన క్రౌర్యంబుఁబూని సంస్కర్తలలో నార్వురను విచారించి దోషనిరూపణము చేయకయే యురిదీయుట కుత్తరువుచేసెను. పైనిఁ జెప్పఁబడిన "కాంగుయూవి" చక్రవర్తియాలోచన చొప్పునఁ బలాయితుఁడయ్యెను. "చక్రవర్తిని" సంస్కరణము నొల్లకుండుట జూచి "యథారాజాతథాప్రజా" అను న్యాయంబున నుద్యోగులుఁదఱు నామె తోఁబాటుగ సంస్కరణమును భంగపఱుపఁ గంకణముకట్టుకొనిన ట్లుండిరి. ఆట్టిద్వేషభావంబుచే సంస్కరణ ప్రతికక్షులు క్రైస్తవబోధకుల నివాసముల ముట్టడించిరి. విదేశీయులను భూతములపై విషముగ్రక్కుచుండిరి. చిహ్లి, షాంటుంగు మొదలయిన ప్రదేశములయందంతట విదేశీయుల యెడల ద్వేషము సముగ్రంబుగ నుండెను. ఇది యంతయును ముఖ్యముగా చీనా రాజ్యములోని యుత్తర ప్రదేశములయందు 1900 సం. లో జరుగుచుండెను.

వృద్ధ చక్రవర్తిని ముఖ్యముగా మంచూరియా వంశ్యులచే విద్వేషకృత్యములఁ జేయబోధింపఁబడుచుండెను. వారిలో నిద్దఱామె కున్నంతద్వేషము కలవారై యుండలేదు. కాంగి (Kangi) టుంగఫూసియాఁగు (Tung

Fhu siang) అను నిర్దలు మాత్రము విదేశీయుల బాధించి వారి యేర్పాటులను ద్వేషింపఁదలఁచినవారై యుండిరి. కాంగియను నాతఁడె పైనలిఖించిన ట్లార్యవర నుతితీయించుటకుఁ జక్రవర్తినిని బ్రోత్సాహపఱచినవాఁడు. చక్రవర్తినిచేఁ గ్రూర శాసనములఁ బ్రకటింపఁజేయించినవాఁడతండె. మఱియునతఁడె భాండాగారమందు ధనము స్వల్పముగనున్నదని కియాంగు మొదలయిన పరగణాప్రజలవలన దౌర్జన్యముగ సొమ్ము సంగ్రహించి కోశాగారంబుఁ బూరించెను. కాని తత్పరిదేశవాసులకును నధికారులకును బలవద్విరోధియయ్యెను. (చక్రవర్తిని యొక్క పోత్సాహకులు) ఆశాసనములలో నిట్లు ప్రకటింపఁబడెను.

### శాసనము.

“విదేశీయులయందీ దోషములు స్పష్టముగఁ గన్పట్టుచున్నవి. (1) వారికి భూమిపై యాశమెండు. (2) వారు చీనారాజ్యమనెడి పెద్దమృగమును ముక్కలు ముక్కలుగాఁ జేసి తినఁబూనిన ఘోరవ్యాఘ్రంబులయి యున్నారు. (3) క్రీస్తుమతము దేశమందు బోధించి ప్రజలను బూర్వాచారములనుండి తొలఁగించి తమయూహలను వారికిఁ గఱపుచున్నారు. వారు వర్తకముకొఱకు రేవుపట్టణములను గొన్ని ద్వీపములను దమవశముచేసికొని యున్నారు. ఆవిషయమై చీనాదొరతనము వారు కినియుట లేదు. రాజ్యమును నూతనమండలములుగ విభజించి విదేశీయులు తామే పరిపాలింపఁదలఁచి వివాదలు పడుచు “చీనారాజ్యవిభాగము” అనెడి యపకీర్తికర శబ్దముల నుద్భవిల్లఁ జేసిరి.”

కన్ఫ్యూసియసు నాటనుండి పూర్వాచారములను బట్టుకొని వ్రేలాడుచుండు చీనావారికి నన్యదేశీయసంబంధము లేశమాత్రమును గిట్టకుండుట సుప్రసిద్ధమే కదా. దానంజేసియే పైని నుడువఁబడిన కారణములు చీనావారికిఁ గన్పట్టెనని చరిత్రకారుఁడు వ్రాసెను.

1899 సంవత్సరాంతమందు బాక్సరులు (ముష్టియుద్ధముచేయువారు) అను నొక గుంపు బయలువెడలెను. గతాధ్యాయములలోఁ గలహకారుల గుంపులంగూర్చి యనేకపర్యాయములు లిఖింపఁబడియున్నది. ఆగుంపులు తఱచు

గ రాజ్యముతోఁ గలపించినవై యుండెను. పైనిఁజెప్పఁబడిన బాక్సరులగుంపో యట్టిదికాదు. వారు దేశాభిమానులని భావించి వారిని "చక్రవర్తిని" ప్రోత్సాహపఱచుచుండెను. వాండ్రు కలహకారులని దొరతనమువారు పౌరపాశ్చాత్యులుగ నానా రాజ్యములవారికిఁ దమరాయబారులవలనఁ దెలియఁ జేయుచుండిరి. ఆనిజస్థితి 1899 సంవత్సరాంతమందుఁ దెలిసెను. ఏమనిన నట్టి ముష్టియుద్ధకారులచే నేదియో ఘోరకృత్యము చేయించుటకై దొరతనమువారు వారిని దమకొలువునందుఁ బ్రత్యేకముగ నుంచుదురనియు, వారు దొరతనమువారిసైన్యముతోఁ జేరుకొనియే యుందురనియుఁ దెలిసెను.

## మిషనరీల హతముకావించుట.

1899 సం. లో వారు చెలరేఁగి యనేకులయిన మిషనెరీలను హతముకావించిరి. ముఖ్యముగా నామిషనెరీలు షాన్సి (Shansi) పరగణాయందుండినవారు. ఆపరగణా కొండలనడుమనుండుటచే వారచ్చటనుండి తప్పించుకొని పోవఁజాలరైరి. షాంటంగు మొదలయిన చోట్లనున్న మిషనెరీ లెట్లనో తప్పించుకొని పోయి బ్రతికిరి. మఱియు బాక్సరులు రైళ్లను బాడుచేసిరి. పాఠశాలల నేలమట్టముకావించిరి. ఈయల్లరు లన్నియు చక్రవర్తిని యొక్క యెఱుక నేనిరాఘాటముగా నుత్తరపరగణాలయందుఁ జరుగుచుండెను. ఎఱుకయన నక్కఱలేదు. ఆమె తదనుకూల శాసనములనే ప్రకటించి యుండెను. అట్టి క్రూర శాసనములనే మధ్యపరగణాలకును దక్షిణపరగణాలకును జక్రవర్తిని బంపెను. కాని యచ్చటి యధికారు లాఘోర శాసనములను మన్నింపరైరి. కావున బాక్సరులుత్తర పరగణాల యందువలె బాఱులు తీరి పోరుటకు వలనుపడక యాపరగణాలలోఁ దోఁడేళ్లవలె నందందు గుంపులు గూడి రొదలుచేయుచు బెదరిపోవుచుండిరి.

వృద్ధ చక్రవర్తిని యుత్తర పరగణాల యందుఁ దనవాఛం దీర్చుకొని మధ్యదక్షిణ పరగణాలయందు విఫలమనోరథయై తుదకు పికిన్ రాజధాని యందున్న విదేశీయ రాయబారులను, వారికి సంబంధించియున్న కుటుంబములను బరిచరులను, మొదలయిన సమస్తమును నూఁచముట్టుగ నిర్మూలింపఁ

గంకణము కట్టుకొనెను. అన్యరాజ్యముల వారియెడల నడుచుకొనవలసిన నాగరిక మర్యాదలు చీనావారేమియు నేఱుఁగని వారనియే చెప్పవలెను.

ఆచక్రవర్తిని యాదుర్మార్గ కృత్యమునకుఁ బూనకమున్నె 1900 సం. జూన్ 16 తేదీని తన సభికులరావించి తనయుద్యమంబు తెల్పఁగా వారిలో చీనాదేశీయులు వలదని వారించిరి. కావున వారిపై చక్రవర్తిని కోపానలంబు మియు చూపులఁ బఱపెను. రాజ్యపదచ్యుతుఁడై యున్న చక్రవర్తి వలదని తాను కూడ నేమొ చెప్పఁబోయెను గాని యాయనను చక్రవర్తిని నోరెత్తనీయ దయ్యెను. మాంచూరియా దేశీయు లయిన సభికులు మాత్రమె క్రోధాగ్నికింధనము లైనవచనములం బల్కిరి. కావున నామెయొక్క సర్వసంహారకసంకల్పంబే నిశ్చయింపఁ బడెను. సభచాలించుసమయమున చక్రవర్తి యామె పాదంబులపై వ్రాలి యాబాలిశకర్మంబు రాజవంశమునకును ప్రజావర్గంబునకును నాశకరంబు కావున దానిం బూనవలదని బిట్టుగ మొఱవెట్ట నాతని మొఱ సరకు సేయక బాలుని కీయుద్యమ మేమి తెలియఁగలదని పలికి దుడిదుడి వెడలిపోయెనఁట. అనంతరమామె బాక్సరులు రాజ్యాభిమానులనియు వారిని బర

## ద్వేషపూరిత శాసనములు.

గణాధికారులు విశేషంబుగ గౌరవింప వలయు ననియు నొక శాసనమును, బరగణాధికారులు విదేశీయ భూతము లేయూత్రియు గదుముకొని వచ్చినను దనయుత్తరువుతోఁ బనిలేకుండ నెంతవ్యయ మయినను సరే వారిఁ బోరాడ వలయునని మఱియొక శాసనమును బ్రకటించెను. మొదటి శాసనబలంబున సామాన్య జనులందఱు బాక్సరులతోఁ గలసిరి. అదియటుండ రాజధాని యందుండు రాయబారు లేమి కారణముననో మందప్రజ్ఞులై తమ దొరతనముల వారికి సకాలంబున చీనావారి దురాలోచనలను దెలియఁ బఱపరైరి.

చీనారాజధాని సమీపమున 72000 సైన్య మాయత్తపడియుండె. ఫిరంగులు మొదలయినవి మందుగుండు సామాను లన్నియు సమకూర్పఁబడి యుండెను. ఆంగ్లేయులకును మిగిలిన విదేశీయ రాజ్యముల వారికిని యుద్ధనావలు చీనాతీరమందుఁ గలవు కాని యవి మెట్టయుద్ధమునకుఁ బనికిరావు. ఇండియా దేశమునుండి 15000 సైన్యము పంపవలసినదని యాంగ్లేయులు వ్రాసిరి.

అది యటుండఁ బాక్సరులు నేల యీనినయట్లు బయలు వెడలిరి. వారి నేమొ యడంచెద మని చీనాసైన్యము నటించుచుఁ దుదకు వారిలోనే చేరి యం చ ఱేక మయిరి. బాక్సరులు కేవలము దోఁపుఁడుకాండ్రే యగుటం జేసి యుద్ధ నైపుణ్యములేనివారు. అయినను సమగ్రమయిన చీనాసైన్యముతో గూడుటచే వారును బరాక్రమముతోఁ బోరగల్గిరి. కాఁబట్టి యావత్సైన్యమును స్వల్పయుద్ధ కృత్యములను మాని ప్రబలయుద్ధ వ్యూహముతో రాజధానికిని టాకుకోటలకును నడుమనుండు బలిష్ఠప్రదేశముల నాక్రమించుకొని టియంట్సీను నగరమును ముట్టడించి దానికిని రాజధానికిని మధ్యనుండు రైలును వశపఱచుకొనెను. మఱియు రాజధానియందున్న రాయబారుల నివాసంబులను 8 వారము లవిచ్ఛిన్నముగ చీనావారు ముట్టడించిరి. వారిని విడిపించుటకై యాంగ్లేయ నావికా సేనాని రెండుసార్లు యత్నించెనుగాని కొనసాగలేదు. చీనావా రంతట టాకుకోటలలోఁ బ్రవేశింప యత్నింపఁగా విదేశీయనావికాధ్యక్షులు కూడి యాయుద్యమమును భంగపఱుపఁగా జూన్ 18 తేదీని పగలు 1 గంటవేళ ప్రసిద్ధమయిన వాటర్లూ యుద్ధముంబోలి 7 గంటలకాలము భయపక్షములవారు ఫిరంగులతోఁ బోరిరి. తుదకు చీనావారె యోడిపోయిరి. రాజధానియందున్న రాయబారి సంఘ మల్పముగనున్నను మగంటిమితోఁ గాపాడుకొనుచుండెను. అటులనుండగ ఇండియాదేశమునుండి సహాయసైన్యమురా

### చక్రవర్తిని పాఱిపోవుట.

గా ఆగష్టు 14 తేదీని రాయబారులు ముట్టడినుండి విడుదలంగాంచిరి. వృద్ధ చక్రవర్తిని మోటుబండిలో నెక్కి పాఱిపోయెను. అన్యదేశ రాయబారు లనుమతించినగాఁని యామె స్వదేశమునకు మరల రాజాలదు. ఆముట్టడి యటులనుండఁగ చీనాదొరతనమువారు విదేశీయులతో సఖ్యముం బ్రకటించుచునే యుండిరఁట. అట్టికపటవ్యవహారములు నింద్యములేకదా. పైనినుడివిన ప్రకారము చక్రవర్తిని పాఱిపోఁగా చీనాదొరతనమువారును రాజధానికిఁ గొన్నివందల మైళ్లదూరమున మంగోలియా ప్రాంతమునకుఁ బోయిరి.

పిమ్మట స్నేహానుబంధముగల విదేశీయ రాయబారులందఱు చీనారాజ్యమును గుఱించి ముందెట్లు వ్యవహరింపవలెనో యెవరితో సంధికావింపవలెనో

యని యాలోచింపసాగిరి. రైళ్లను బాగుచేయించిరి. టీయంట్సిన్ నగరమును రాజధానికిని, దీరమునకును నడుమనున్న పట్టణములను, సురక్షితములుగ నుంచిరి. రాజధానియందు 50 000 సైన్యము నెలకొల్పిరి. సంధిగోరి చీనాదొరతనమువారు రాజన్యుల నిద్దఱను రాయబారులయొద్దకుఁ బంపిరి. తద్విషయమై ప్రసిద్ధుఁడైన లిహంగు చాంగునుగూడఁ బుత్తెంచిరి. చీనారాయబారులు పూర్వమువలెనే సంధివిషయములంగూర్చి చర్చలును వివాదములను సాగించిరి.

## నిబంధనలు.

| అన్యదేశీయరాయబారులు కోరిన నిబంధనలు. | చీనారాయబారుల యంగీకారము. |
|---|---|
| (1) ప్రవర్తిల్లిన క్రూరకృత్యములకు గారకులైన రాజన్యుల నురిదీయించుట. | దీనిని గొంతవఱకు సులభపఱచిరి. |
| (2) రాజధానియందు విదేశీయులబలమైన సేననుంచుట. | విదేశీయుల సంరక్షణార్థము గాగొంత సైన్యముండవచ్చును. |
| (3) రాజధాని మొదలు సముద్రతీరముదనుక విదేశీయుల సేననుంచుట. | అంగీకరింపఁబడలేదు. |
| (4) యుద్ధవ్యయముల చీనాదొరతనమువా రిచ్చుట— | ఇంచుమించుగా నంగీకరింపఁబడినది. |

ప్రస్తుత మేలుచున్న మంచూ వంశ మిక మీఁదటఁ బరిపాలించునో లేదో యిప్పుడు నిశ్చయించుటకు వలను పడదు. చక్రవర్తి న్యాయమెఱుంగును గాని సమర్థుఁడు కాఁడు. వ్యవహారములు వెంటనే తీర్చి చీనావారికి స్వతంత్రము గలుగఁజేసినయెడల చీనావారు పూర్వపురీతిని విదేశీయుల మరల దిరస్కరించెదరని విదేశీయరాయబారులు కాలయాపనము చేయుచుండిరి.

ఎట్టకేలకు నాంగ్లేయులును జర్మానియావారు నీదిగువ యేర్పాటు లొనరించిరి.

(1) రేవుపట్టణములయందు బాహాటముగ సందలు వర్తకముచేసికొన వచ్చును.

(2) చీనారాజ్యమును విదేశీయరాజ్యములవా రెవరు నాక్రమించుకొనఁ గూడదు.

(3) ఎవరయిన నాక్రమింపఁజూచిరేని గడమవారు వారి నభ్యంతరపఱుప వలెను.

శేషించిన విదేశీయరాజ్యముల వారా యేర్పాటులకు సమ్మతించి చేవ్రాలుచేసిరి. కాని రుషియావా రట్లు సమ్మతించియుఁ బదంపడి మంచూరియాలోఁ గొంతయాక్రమణకు యత్నించిరి కాని కడమవారికి వెఱచి చీనావారు వారికిచ్చుటకు సమ్మతింపరైరి. ఎట్లయినను చీనారాజ్యమును దుర్దశ యనునల్లమబ్బుకమ్మికొనియున్నది. అది విచ్చిపోవునో పోనేపోదో చెప్పశక్యముకాదు. మధ్య దక్షిణ పరగణాలయందు మాత్రము ప్రదేశాధికారులు నెమ్మదిని నెలకొల్పినారు. ఇట్లు 1901 సంవత్సరముతో చీనాచరిత్ర ముగింపఁబడుచున్నది.



## 18-వ అధ్యాయము.

### ఉపసంహారము.

చీనారాజ్యముయొక్కయుఁ దత్ప్రజావర్గముయొక్కయు గుణాగుణంబులఁ గొంచెము విమర్శించెదము. చీనాచరిత్రకారులయిన పాశ్చాత్యులు చీనావారియం దీదిగువ దోషంబులుకలవని చరిత్రలందుఁ బలుమాఱు నిందించిరి.

(1) అన్య రాజ్యములవారిని మర్యాదచేయుట యెఱుఁగరు.

(2) వధలకు వెనుకదీయరు.

(3) ఒడంబడికలజేసికొని భంగపఱచెదరు.

(4) యుద్ధములుచేయుచు సంధివిషయముల మాటలాడెదరు.

(5) పరమత సహనములేనివారు.

(6) రాజ్యపరిపాలనలో లోపములుకలవారు.

(7) యుద్ధకౌశల్యము లేనివారు.

(8) డంబవిద్యకలవారు.

(9) దేశాభిమానము లేనివారు.

(10) పూర్వాచారమందు మూఢవిశ్వాసము కలవారు.

1 మొదలు 5 వఱకుఁ గలపైయాక్షేపణలు పూర్వాచారపరాయణత్వములోనుండి పుట్టినవేయని గ్రహింపఁదగును. ఏలయన గతంబున రెండవ యధ్యాయమందుఁ జెప్పఁబడినట్లు చీనాదేశమందు మతమె రాజ్యపరిపాలనము కూడఁజేయును. ఆమతమందుఁ బూర్వాచారములనుండి తొలఁగఁగూడదని గట్టికట్టుబాటుండెను. కావునఁ బరమతముగాని పరజనులుగాని వారిదేశములోఁజొరఁగిట్టదు. చొచ్చుటకలిగె. నాయామతమును జనులును వారికనుకూలించియుండవలెను. చీనావారు తమతమ మతమును వ్యాపింపఁజేయవలెనని గాని పరదేశ విశేషంబుల నెఱిఁగి తమదేశమందు వానిని నెలకొల్పవలెనని గాని కోరిక గలవారుకారు. తమకు విరోధంబొనరించుదనుక పరులతో జగడమాడఁజూడరు. కాఁబట్టి శాంతస్వభావులనియే వారిని నుడువవలయు. అట్టివారియజ్ఞానంబుఁ బాపవచ్చిన క్రైస్తవమతబోధకులును, భాగ్యంబుఁ బెంపొనరింపవచ్చిన విదేశీయులును వారికి శత్రుప్రాయులే యైరి. కావున శత్రువులంబాధించినట్లు వారిని బాధించిరి. సంధికృత్యములను నడపినను మనస్ఫూర్తిగఁ నొనరించియుండరు. కావున వానికి వ్యతిరేకంబుగ నేల నడచుకొనరు? వారిపరంపరాగతమతము వేళ్లువారియుండఁగ వారికిఁ బరమత సహనంబెట్లు కలుగును. క్రైస్తవమతము జ్ఞానదాయకమని చక్రవర్తులు కొందఱిటీవల శాసనములం బ్రకటించిరనియు, వేలకొలఁది జనులు క్రైస్తవ మతావలంబులైరనియు, స్వమతమందు గాఢవిశ్వాసమే కలవారైరేని వారు మతాంతరులేలయైరనియు జరిత్రకారుఁడు ప్రతిపాదించెను. చీనాదేశమందు క్రైస్తవమతము సౌమ్యముగనే మొదట ప్రవేశించి చీనావారి యాచారముల నంగీకరించెను. తమ యాచారములకు భంగములేదనుకొనియు, మఱికొన్ని కారణములచే తను దొరతనమువారు కొంతవఱకు నుపేక్షించిరి. కాలక్రమమున 19 వ శతాబ్ద

ములలో క్రైస్తవమతము తెరచాటునుండి వెడలి నిజస్వరూపముఁ బ్రకటింపసాగెను. మతసంకరుల సంఖ్య ప్రబలమై యచ్చటిపండితకోటికిఁ గంటలో నెరసయ్యెను. అప్పుడు రామరావణయుద్ధము సాగెను. అప్పటికి విదేశీయవర్తకులు అనఁగా ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, జర్మానియావారు, రుషియావారు, స్పానియావారు, పోర్తుగీయులు మొదలయినవారు చీనారేవుపట్టణములయందుఁ బ్రవేశించి దొరతనమువారు లేచిపొమ్మని బాధించినను బోక వారితో హాహాహాకారిఁ బోరుచు నిల్వఁదొడఁగిరి. కాని పైనిఁ జెప్పిన మతబోధకులకు వధాదులు సంభవించినప్పుడు విదేశీయరాయబారులు చీనాదొరతనమువారిపై దండెత్తుచుండిరి. క్రైస్తవమతవ్యాప్తి యిప్పుడు బలాత్కారలక్షణము కలదయ్యెను. అంతట రాయబారులతోఁ బోరలేక తాత్కాలికోపశమనార్థ మొడంబడిక నిబంధనలలోను, శాసనములలోను క్రీస్తుమతమంగీకరించితిమని దొరతనమువారు వ్రాయుటగలిగె. అంతియేకాని దొరతనమువారికేమి పండితమండలికేమి క్రైస్తవమతము ప్రాణగొడ్డంబుగ నేయుండె. వేలకొలఁది జనులు క్రైస్తవులగుటకుఁ గారణమిట్లూహింపవచ్చును. ఏ మతమందును జనులందఱు దృఢవిశ్వాసులైయుండరనుమాట సర్వవిదితంబె. బహుజనాకీర్ణమైన చీనారాజ్యమందధమవిశ్వాసులు వేలకొలఁదియుండుటయు వారు మతసంకరులగుటయు నబ్బురంబగునా? కన్ఫ్యూసియసను జ్ఞానికాలమందు మతవిశ్వాసము క్షీణించుటఁ గనుగొని పునరుద్ధారణంబుచేసెనని చరిత్రయే తెలుపుచున్నది. మఱియుఁ బూర్వాచారముల విడువవలదని ప్రభువును బండితులును ప్రజాసంఘమునకుఁ దఱచుగ బోధించుచుందురఁట. మతములకును వృద్ధిక్షయములు కాలక్రమమునఁ బాటిల్లుచుండు నని దేశచరిత్రలె నుడువుచున్నవి. అట్టిలక్షణములు చీనామతమునకు లేవు. రాజ్యమున కెన్ని యిక్కట్టులు కలిగినను, జను లెన్ని యల్లరులు చేసినను వారిమత మెందుచునో వాడుచునో యట్లే యుండెను. ఇందుకుఁ గారణము చక్రవర్తియె మతగురువగుట యని యూహింపవచ్చును. అట్టి రాజ్యములోనికి బరమతప్రవేశమే కలహబీజంబయ్యెనని చదువరులు గ్రహింపఁగలరు.

మఱియు వాణిజ్యముకొఱకు విదేశీయులరాక యాబీజమునుఁ బోషించి క్రమక్రమంబుగ విషవృక్షంబుగఁ బరిణమింపఁజేసెను. కారణమేమనఁగా వారు నావికాసైన్య సంపదయుఁ బ్రబలాయుధ సామగ్రియుఁ గలవారగుటచేఁ దమ దేశమున కపాయకరులగుదురని చీనాదొరతనమువారు భీతినొందిరి. పైని వక్కాణింపఁబడిన ప్రకారము వారొకచెంప తమ మతబోధకుల కూఁతకట్టుల గుచు నొకచెంప రైళ్లు మొదలయిన నూతనపుటేర్పాటులఁ జొప్పింపసాగిరి. ఇట్లు చేయుటయు వారి పూర్వాచారములకు విరోధకంబయ్యె. కావున వారు సమయోచితంబుగ నెన్ని యొడంబడికలఁజేసికొన్నను, ద్వేష వృక్షంబు చిగురించుచు నేయుండె. పునఃపునః కలహప్రయత్నములు జరుగుటయు గలిగెను. పూర్వాచారపరాయణులైన చీనావారు పైనిజెప్పఁబడిన కారణంబులచేఁ బరాపకారులయిరి కాని స్వభావదౌష్ట్యముచేఁ గాదని చదువరులు గ్రహింపవచ్చును. ఎట్లయిన నావిషవృక్షంబు యుద్ధరూపారుణపుష్పంబులఁ దాల్చి దుఃఖరస పూరితాపజయఫలంబుల చీనావారి కొసంగి నెట్టన ననుభవింపఁ జేసెనని నుడువక తప్పదు.

చీనావారి రాజ్యపరిపాలనయందు లోపములు కలవనెడి యాఅవయాక్షేపణమును గుఱించి చర్చింపఁగ నిట్లు తోఁచుచున్నది. ప్రభువులును బ్రజలును దమ మతధర్మానుకూలముగ బ్రవర్తించెదరేనిఁ బుణ్యావర్తను లగుదురని యు నందువలన రాజ్యము సుభిక్షముగ నుండుననియుఁ దద్వ్యతిరేకంబుగ నడుచుకొనిరేని రాజ్యము పాపభూయిష్టమయి భూకంపాద్యుపద్రవములచేఁ బీడింపఁబడుననియు కన్ఫ్యూసియను అనుజ్ఞాని బోధించియుండెను. రాజ్యోపద్రవములు కలిగినప్పుడు "సియాఙ్ఫింగు" చక్రవర్తి తదొప్పిధ ననుసరించియే, తనను బ్రజలను నిందించుచు నొక శాసనము ప్రచురించెను. ఏ రాజ్యమందైనను జట్టము లెంతసమగ్రముగ నున్నను వానిం బ్రవర్తింపఁజేయునుద్యోగస్థులలోఁ గొందఱుఁ పాపచిత్తులై దుష్కృత్యంబులఁజేసి చట్టముల నవమానించి తాము శిక్షలంబొందుట చూచుచుందుముకదా. ఒక్కప్రభువు స్వచ్ఛందాధికారముతో బహువిస్తీర్ణరాజ్యము పరిపాలించునప్పుడు దోషములుండుట యా

ద్భుతంబగునా? అయినను 18 సం. వఱకు చీనారాజ్యము నేలినచక్రవర్తులలో ననేకుల కాలమం దట్టి దోషంబులు కానరావయ్యె. వారు సమర్థులయిన చక్రవర్తులయి యుండురుకదా. ఉద్యోగస్థులకు జీతములు స్వల్పమగుటచే లంచగొండులై జనులఁ బీడించి తమసంచుల నింపుకొనుచుండి రని చరిత్రకారుఁ డభిప్రాయపడెను. అధికజీతమిచ్చినను నాశకు మేరయుండునా? లంచములకుఁ జేయి చాపకుండురని ఖండితముగ వక్కాణింపఁగలమా? కావుననే చీనారాజ్యమంతు నీతిబోధకములయిన పద్యములను బాటలను బ్రజలకు నేర్పించి చదివించుచుందురు. చీనావారికిఁ బరలోక విచారణలేకున్నను నైహికవిచారణ సంపూర్ణముగఁ గలదనియు దానికిం దగినచట్టములు కలవనియుఁ దెలియుచున్నది. ఆరాజ్యముయొక్క దురదృష్టవశమున 19 వ శతాబ్దమందు వచ్చిన చక్రవర్తులు సమర్థులు కారైరి. దానికిఁ దోడుగ విచ్చలవిడిగ వ్యాపించుచున్న క్రైస్తవమతంబును, బిరుత్రివియని విదేశీయ పరాక్రమంబును దోడయ్యె. అవి ముప్పిరిగొని తాయిపింగు, త్రియాడు మొదలయిన సంఘములేర్పడి చక్రవర్తులపైఁ దిరుగబడుటకును విదేశీయుల కొలువుతో చీనాప్రజలలోఁ గొందఱు చేరి దొరతనమువారితోనే పోరాడుటకును చీనాదేశీయులకు స్వదేశాభిమానము లేదనియెడు తొమ్మిదవ యాక్షేపణ కెడమిచ్చుటకును గారణములయ్యెను. పరమతములవలనను విదేశీయులవలనను చీనారాజ్యమున కుపద్రవము కలుగునని కాంగ్షి చక్రవర్తి మున్నె సూచించియున్నట్లు చరిత్రవలనఁ దెలియుచున్నది.

చీనావారికి యుద్ధకౌశల్యము లేదనుటను గుఱించి కొంచెము విమర్శించెదము.

చీనావారు కృషిపరులేకాని యుద్ధపరులు కారని ద్వితీయాధ్యాయమందును దానికిఁ దార్కాణముగ వారు రాజ్యసంపాదనము సౌమ్యముగఁ జేసిరేకాని శస్త్రాస్త్రంబులఁ జేసినవారు కారని తృతీయాధ్యాయ ప్రారంభంబునను వక్కాణింపఁబడియున్నది. చీనాదేశమునకు నుత్తరంబుననున్న మధ్యాసియా ప్రదేశ మడవిజనముల గుంపులతో నిండియుండి చీనారాజ్యమున కుపద్రవకరముగ నుండుటచే నాగుంపుల జయించి యాదేశ మించుమించుగ చీనా

దొరతనమువారు వశపఱచుకొనిరి. ఆకార్యంబునకు వారి విలునమ్ములే చాలి యుండెను. వారు పరరాజ్యములపై దండెత్తి జయింపవలెననుకొన్నచో ఆసియాఖండమందు భరతఖండము మొదలయిన వెన్ని దేశంబులు కలవు? నిమిత్తవశంబున బర్మాకొచ్చిన్ చీనా, నేపాళదేశములపై దండెత్తి జయించి కప్పములుచెల్లించు నిబంధనలమీఁద నారాజులకే యారాజ్యముల విడిచిపెట్టిరి కాఁబట్టి వారికిఁ బరరాజ్యాపేక్షయున్నట్లు చరిత్రవలనఁ దెలియుటలేదు. మఱియుఁ బూర్వాచార ప్రకారము 18 వ శతాబ్దాంతమువఱకు ధనుర్విద్యనే నమ్మకొనుచు దానివలననే జయంబొందుచు చీనావారు సుఖంబుండిరి. కృషిపరులగుటచేతనే వారిసేనలు ధనుర్విద్యాకౌశలము కలిగిన పిమ్మటఁ గృషివలన జీవించుచుండిరి. యుద్ధాభిలాష కలవారు కాకపోవుటచేతనే వారు పరదేశములకుఁ బోరైరి. ఆయుధవిశేషంబుల నెఱిఁగి తమ యాయుధసామగ్రిని బెంపొనరింపరైరి. 18 వ శతాబ్దాంతము వఱకు చీనావారు తమ ధనుర్విద్యచేతనే పరాక్రమవంతులని పేరువడసిరి. 19 వ శతాబ్దము వారికి ప్రతికూలకాలం బగుటచే నపజయ పరంపరకలిగి యంతశ్ఛిద్రము లేర్పడి చీనారాజ్య మపఖ్యాతిం జెందె. ఎంతబలవంతులైనను బరాజితులైనప్పుడు పరిహాసాస్పదులే కదా.

చీనావారిది డంబవిద్య యనుటకు, యూరోపుఖండ వాసులకుఁ దెలియకమున్నె యెన్నియొ విజ్ఞానములైన పనుల చీనావారు నేర్చియుండిరనియు వారు బుద్ధి సూక్ష్మము కలవారనియు చరిత్రకారులే వ్రాసియున్నారు. అదిగాక చీనావారి భాషయు లిపియు నన్యులకు దురవగాహంబులనియు దుస్సాధ్యంబులనియుఁ జెప్పఁబడియున్నవి. అట్టి భాషను సాధించి పండితులైన వారు తమకు బాగుగఁ దెలియనివికూడఁ దెలిసినట్లు నటించెద రనుకొందము. అట్లయినను వారు పరదేశములకుఁ బోక నూతనవిషయముల గ్రహింపక యేకదేశవర్తులయి స్వబుద్ధి బలంబుచే నూతనవిషయంబులను యంత్రములను గొంతవఱకైన నిర్మించి వెలయించుట శ్లాఘాపాత్రంబయియుండ దాని పైని వ్రాయఁబడిన యంశంబులం బట్టి చీనారాజ్య మనేకవిషయంబుల యందు శ్లాఘనీయంబుగ నున్నది కాని యాదొరతనమువారు పరరాజ్యములతోఁ దమకు సంబంధము లేదనియుఁ దమ యిచ్ఛచొప్పున దమ రేలుకొందుమనియుఁ, దమకు

స్న విద్యాబుద్ధులును ఆయుధాది సామగ్రులును తమకుఁ జాలుననియును బూర్వమునందు వలెనే తమ కెల్లకాలము జరుగుననియు హిందువులవలెఁ దలఁచుట క్షేమకరము కాదని 19 వ శతాబ్దమువలన బాగుఁగ దెలిసికొనియుందురు. రాజ్యము వీరభోజ్యమని ప్రాజ్ఞులు పలుకుచుందురు. పరరాజ్యములపైకిఁ దాము దండెత్తి పోకున్నను బరులు దండెత్తి వచ్చినప్పుడు తమ రాజ్యమును దాము సంరక్షించుకొను నట్టి యుపాయంబు బలపరాక్రమంబులును గలిగి యుండక తప్పదుగదా. అట్టిశక్తిలేక యెదిరిశక్తియుఁ దమశక్తియుం దెలిసికొనక యొడంబడికలకుఁ గట్టువడక 19 వ శతాబ్దమందలి చక్రవర్తులసమర్థులయ్యు వెఱ్ఱెత్తినట్లు మాటిమాటికిఁ బోరి తుదకు రాజ్యమును విదేశీయుల కర్పణంబుచేసిరి. విదేశీయ రాజ్యములవారు కరుణించి వారి రాజ్యమును వారికింతవఱకు విడిచిపెట్టిరి. కాఁబట్టి చదువరులు 18 వ శతాబ్దము కడపటి చీనా రాజ్యమునకు గలనిరుపమాన వైభవంబునకు సంతసించి 17 వ శతాబ్దమందుఁ దానికిం గలిగినయిక్కట్టులు మరల నొందక యది యథాపూర్వంబుగ నున్నతపదవిం జెందఁగోరుదురు గాక.

## చైనాలోనివిప్లవము.

పూర్వాచారపరాయణులైనచీనాదేశీయులు రైలుమార్గము మున్నగు నవనాగరికపు టేర్పాటుల నపేక్షింపక యెంతెంతగ పరిపాలకులతోఁ గలహించియుండిరో అందువలన దేశాభివృద్ధి నెంతభంగపడుచుకొనిరో పరదేశీయుల వలన నెంత గాయిడినుందిరో గతాధ్యాయములలో సంగ్రహముగ నుడువంబడి యున్నది. చీనావారిలో కొందఱు పాశ్చాత్య విద్యామృతంబును గాలక్రమంబున నించుకించుక చవిచూచుచు ఆదేశములకేఁగి తద్విద్యాపారంగతులగుటకు యత్నించుచుండిరనియు గతాధ్యాయములలో లిఖించియుంటిమి. ఎట్లులయిననేమి నవనాగరికాభిలాష ప్రభుత్వము వారికిఁ నానాఁటికి గలుగుచుండి నూతనపు టేర్పాటులకు వారుద్యమించుచుండిరి.

చైనారాష్ట్రములోని పదునెనిమిది యుపరాష్ట్రములలో 'సింఘువాను' మిక్కిలి ఫలవంతమైనది.పరదేశీయులవద్ద ఋణముఁగొని ఆయుపరాష్ట్రములో

రైలుమార్గము నేర్పఱుపవలెనని రాష్ట్రాధికారులుద్దేశించినందున ప్రజాప్రతినిధులిష్టపడక తమ యనంగీకారమును దెలిపిరి. తెలిపినను రాష్ట్రాధికారులు తమ యిష్టప్రకారమే యొనరింపఁబూనినందున 'సింషువాను' ప్రజలు తిరుగఁబడిరి. వారితోఁబాటుగ రాష్ట్రములోని సైనికులును గలపించిరి.

## కలహానివారణ ప్రయత్నములు.

అచ్చటి రైలువే యధికారియయిన 'టస్పాంగు' (Tuspang) ను, రెండువేల సైన్యమును, ప్రచండుఁడని పేరువడసినట్టి 'సింషువాను' యొక్క పూర్వపు గవర్నరైనట్టియు 'షెంచంసువాను' (Shenchamsuwan) ను ఆకల్లోలము నడఁచుటకుఁ బ్రభుత్వమువారు పంపిరి. కాని 'సింషువాను' నుండి వరిధాన్యముయొక్క యెగుమతి యాగిపోయినందున 'ఇచాంగు' మొదలగు ప్రదేశములయందు క్షామము ప్రారంభమయ్యెను. 'షెంచంసువాను' (Shenchamsuwan) 'శూచాంగు' కు వచ్చినతోడనే ప్రభుత్వమువారి కిట్లు లిఖితపూర్వకముగాఁ దెలియఁజేసెను.

'సింషువాను' ప్రజలు రైలుమార్గమును నిర్మించుటను గుఱించి కలహామాడుచున్నారుగాని పాలకులమీఁదఁ దిరుగుబాటుచేయుటలేదు. 'సింషువాను' నందలి రైలు అధికారిని బనినుండి తొలఁగింపవలయు. రైలువ్యాపారపు భాగములను గొని "టస్పాంగు" (Tuspang) యుపరాష్ట్రమువలన 30 లక్షల నాణెములు నిప్పించినఁ జాలుననియు!"

ప్రభుత్వమువారు పైనియేర్పాటులలో దేనినియు నంగీకరించనందున 'షెంచుసువాను' (Shenchamsuwan) తనపనికి రాజీనామాయిచ్చివెనుకకుమఱలెను. 'సింషువాను' ప్రజలతిరుగుబాటు విశేష యుపద్రవముచేయకయే యణఁగిపోయెను; కాని విస్తీర్ణమగు చీనాదేశమునంతను విప్లవసముద్రములో ముంచుటకు నిమిత్తకారణము మాత్రమయ్యెను.

మంచూరియా జాతివారు ప్రభుత్వమవలంబించినది మొదలు వారిని చీనాదేశీయులు పైఱవారిని గానే చూచుచుండిరి. ఉన్నత పదవులన్నియు వారివశముచేసికొని హీనోద్యోగములమాత్రము తమకు వదిలిరని వారియందు దీ

క్ష బ్యను బూనియుండిరి. మంచూరియా వారు చేసిన వాగ్దానములన్నియుఁ దమ్మును మోసపుచ్చుటకుఁ జేయు మిషలని గట్టిగా నమ్మియుండిరి. కావుననే మంచూరియా రాజ్యమును బడఁద్రోయుట కెప్పుడు సందు దొరకునా యని చీనా దేశీయులు ముఖ్యముగా దక్షిణ చైనావారు వేచియుండిరి. 10 సంవత్సరముల క్రిందట బాక్సరు తిరుగఁ బాటని పేరువడసిన కలహము రగిలిరగిలి తాత్కాలికోపశమనమును జెందియుండెను. భిషగ్మణియగు 'సున్యసేన' పరదేశముల పాలై లోకములో నెక్కడెక్కడనోయున్న చీనావారిచందలను విప్లవమునఁ బ్రోత్సాహపఱచుచుండెను.

## విప్లవమువలని యుపద్రవములు.

'హూటు, హునాను' (Hoot Hunan) రాష్ట్రములకు రాజధానియగు "వూంచాంగు" (Voonchang) లోని సేనా నివేశముల యందు గతసంవత్సరపు అక్టోబరు నెలలో నకస్మాత్తుగా నగ్నిజ్వాలలు వెడలెను. రాజద్రోహులగు సేనలకును రాజకీయ సేనలకును ఘోరయుద్ధము తర్వాత 'వూంచాంగు' రాజద్రోహుల పాలయ్యెను. సేనాధిపతి యగ్నిగోళము వాతఁబడఁగా రాజప్రతినిధి పలాయితుఁడయ్యెను. వెంటనే విప్లవకారు లన్యదేశీయుల కభయ మొసంగి ప్రకటించిరి. అందువలన యూరోపియనుల కెవ్వరికే యపాయము లేకుండ సురక్షితులై యుండిరి వర్తకమున కేరితినేని భయము లేకుండెను. సమీపముననున్న 'హాంకౌ' (Hong cow) లో సేనలు తిరుగఁబడి 300 మంచూరియా జాతివారిని హత్యకావించిరి. ఎదిరించువారు లేకయే హాంకౌ విప్లవకారుల వశమయ్యెను. ఉక్కు, ఇనుము పోతపోయు యంత్రశాలలును ఆయుధ నిర్మాణము చేయు శాలలును 'హ్యునాంగు' (Hunang) పట్టణమును వెంటనే వారి స్వాధీనమయ్యెను. ఇందువలన మితిలేని మందుసామానులు, లెక్కలేని తుపాకులు విప్లవకారులకు దొరకెను. యుద్ధ సామగ్రి యెంతకావలె నన్న నంత యెప్పటి కప్పుడు సిద్ధపఱచుకొనుశక్తి వారికిఁ గలిగెను. యుద్ధప్రారంభమునందె రాజపక్షమువారికిఁ గలిగిన నష్టమును వారి విరోధులకుఁ గలిగినలాభమును ప్రత్యేకముగా వర్ణింప నక్కఱలేదు. తరువాత

పికింక 'హాంకౌ' నడుమనున్న యినుపదారిలో 20 మైళ్లు పొడవుగల పట్టాలూడదీసి వంతెనలను దెగనఱికిరి. "హూపే" రాష్ట్రపు ప్రజాప్రతినిధి సభవారు చైనాసామ్రాజ్యములోనుండి విడిపోతిమని చాటించి జగద్విదితసంస్కర్తయయిన "సున్యాతసేను" (Sunyatasen) తమ్ముని సేనాధిపతిగను 'టంగులేంగు' (Tungulengu) పండితుని పరిపాలకుని గను నేర్పఱుచుకొనిరి. విప్లవకారులు ధనాగారమును స్వాధీనముచేసికొని 26, 000 సైన్యము కలిగియుండిరి. వీరిసేనాని 'లియంగుహాంగు' (Lianguhang) వెంటనే యీయన 'వుచాంగు' 'హాంకౌ' 'హ్యునాంగు' నగరములకు దా నధికారినియు, బాకీల బాధ్యతిలవిషయములోఁ దానె జవాబుదారుఁడననియుఁ బ్రకటించెను. అమెరికా సంయుక్తరాష్ట్రములలోని చైనావారు 2 లక్షల వరహాలను విప్లవకారుల సహాయార్థమొసఁగిరి.

## ప్రభుత్వమువారి జాగరూకతలు.

1908 సం. లో పదభ్రష్టుఁడయిన "యూనిషికాయిని" (Yunshikayini) హూపే, హూనాను రాష్ట్రములకు రాజప్రతినిధిఁగా నియమించుచు వూచాంగు కరిగి యచ్చట రాజాధికారమును మరల నెలకొల్పవలయునని రాజప్రకటన యొకటి యతనివెంటనే ప్రభుత్వమువారు పంపిరి. మఱియు యాంగ్సినదీప్రాంతమున సర్వసేనల యాధిపత్యము 'యూన్షికాయికి' (Yunshikayiki) నిచ్చితిమనియు, విప్లవకారులకుఁ గఠినశిక్షల విధించితిమనియు, ప్రజలు విప్లవకారులఁ జేరఁగూడదనియు, మఱియు బీదలకు నుచితముగా ధాన్యము పంచిపెట్టవలెననియు, రాజాజ్ఞ యయ్యెను. పికినులోని యుద్ధమంత్రి 24 వేల సైన్యముతో దక్షిణమునకు దాడివెడలెను. చైనాలో ప్రభుత్వమువారి పత్రికలకుఁ బ్రచారము తక్కువయ్యెను. మఱియు దేశీయనిధులనుండి సొమ్మును ప్రజలు తీసికొని యన్యదేశీయులనిధులలో వేయ మొదలు పెట్టిరి. జనులు సర్కారుపత్రములనంగీకరింపకపోయిన శిక్షించెదమని రాజాజ్ఞ ప్రకటింపఁబడెను. ఈకలవరములో అన్యరాజ్యప్రతినిధులు మాత్ర మేపక్షపువారికిని సహాయము చేయక నిష్పక్షపాతముగా నుండి, తమ తమ దేశస్థుల స్వస్థతకుఁ దగినయే

ర్పాటులు మాత్రము చేయుచువచ్చిరి. విప్లవకారులు తమ సైన్యములను దగినక
ట్టుబాటులో నుంచుకొని పరదేశీయులతెరువునకుఁ బోనీయక తమపోరాట
ము మంచూరియావారి విషయమై యుద్దేశింపఁబడినది కాని యన్యదేశీయుల
యెడలఁగాదని స్పష్టముగాఁ బ్రకటించిన బుద్ధికుశలతయే దీనికిఁ గారణము.

## యూన్షికాయిని రాజప్రతినిధినిగా నియమించుటకుఁ గారణములు.

యూన్షికాయియే దేశమునిట్టి దురవస్థలోనుండి యుద్ధరించి రాజాధికారమును శాంతిని దేశములో నెలకొల్పఁగల సమర్థుండని తెలిసి గత్యంతరము కానక ప్రభుత్వమువా రాతని సహాయము కోరిరి. చైనా, జపానుయుద్ధసమయమున సామాన్యసిపాయిగానున్నయీ యూన్షికాయి చైనావారిని శిక్షితులను జేసినవాఁడు లోకములోని యే సైనికులను యుద్ధకౌశలములోను ధైర్యములోను వెనుదీయఁడని ప్రభుత్వము వారు గ్రహించిరి. ఎన్ని సంస్కారములతో చేసి చైనా దేశము నుద్ధరింపవలెనని గట్టి యూహాలలోనున్న క్వాంగ్షి చక్రవర్తిని రాజమాత 1898 సం. లో చెఱసాలలోనుంచి రాజ్యనిర్వహణ కార్యముఁ దాను స్వయముగాఁ బూనినపుడు చీనారాష్ట్రములోని కెల్ల శిక్షిత సైన్యముకల 'యూన్షికాయి' యామెకు సహాయ భూతుఁడై ప్రాముఖ్యతఁ జెందెను. పిమ్మట బాక్సరు కలహములోఁ బరరాష్ట్రము వారి నివేశములను ముట్టడించుటకు నాజ్ఞనొందినవాఁడయ్యెను. అందువలన దేశమునకుఁ గీడుతప్పక మానదని గ్రహించి నెమ్మదిగ సేననడిపించి పరరాష్ట్రము వారిసేనతోఁ బోరాడక రాజమాతయొక్క యనుగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యె. వెంటనే యూన్షికాయి చీనారాజ్యమునందుఁ బ్రబలాధికార పదవిం జెంది నాలుగువత్సరములలో రాజ్యమును విశేష నాగరికతంబడయుమార్గమునఁ బెట్టెను. పరసేనానులకు ఆశ్చర్యమును గలుగఁజేయఁగల గొప్పసైన్యమును నిర్మించెను. సైనికోద్యోగములయందలి యధికార తారతమ్యముల నెంచక తదుద్యోగమందందఱ కభిరుచికలుగునట్లు చేసెను. దేశమున నవీనవిద్యామార్గమును, ప్రతిష్ఠాకృత్యములను నెలకొల్పెను. చీనాదేశపు రాజధానిలోఁ జక్కని వీథులను, ఉద్యానవనములను

నిర్మింపఁజేసి యూరోపియను రాజధానుల యౌన్నత్యము డిందు పఱచెను. రుషియా జపాను యుద్ధానంతరమున చైనారాజ్యమున కేనష్టము కలుగకుండునట్లు యథాపూర్వముగ దానిని నిలిపెను. మఱియు నల్లమందు వ్యాపారమును బది వత్సరములలో రూపు మాపవలెనని ప్రయత్నించిన మహానుభావుఁడితఁడే కాని యీయనయం దనివార్యమైన యొక దోషమున్నదని మంచూరియావారు తలఁచుచుండిరి. అది యేదియనిన నీతఁడు మంచూరియా జాతివాఁడుకాక చైనాజాతీయుఁ డగుటయే కావున నెంత యధికారములో నున్నను ఆతనిఁ బడద్రోయుటకె మంచూరియావారు సమయము వేచియుండిరి. ఇట్లుండఁగా రాజమాత యనంతరము వచ్చిన రాజ సంరక్షకుఁ డధికారము పూనినపుడు యువాన్షికాయికి పదభ్రష్టత కలిగెను. అందుకుఁ గారణ మేమనఁగా నతనికిఁ కాలిలో నొప్పియనియుఁ గానఁ దన యధికారమును జెల్లింప లేఁడనియు రాజప్రకటనలో వెల్లడి చేయఁబడెను.

## విప్లవకారుల ప్రాబల్యము.

ఇంతలో రాజసేనానులు తమసేనలకు విశేషపరాభవ మయ్యెననియు యుద్ధమునకువలయుపరికరము లేమియు లేవనియు'ఇంచాంగు'(Inchaung) సేనానిని వెంటనే పంపనియెడలఁ దమ ప్రాణములు దక్కవనియు మొఱలిడుచు మహాజరును బంపిరి. రాజ పక్షావలంబకమగు 'సియాంపు' రాజద్రోహుల పక్షమున చేరెను. విప్లవమునకుఁ గారణము అన్యదేశీయులనుండి రైల్వేనిమిత్తము తీయఁబడిన ఋణమే యని మున్నే లిఖించియుంటిమి. అట్టి ఋణమునకుఁ గారణభూతుఁడు'షన్కాంగ్వో'(Shunkangwo)అను మంత్రిని'జియాంపు' ఆపనినుండితొలగించియువాన్షికాయిస్నేహితుఁడైన'టంగోయి'(Tungoyi) ని ఆపనికి నియమించెను. దీని వలనఁ ప్రభుత్వము వారికి శృంగభంగమయిన ట్లును దేనికైన లోఁబడుటకు వారు సర్వసిద్ధముగ నున్నట్లును నెల్లరకు స్పష్టమయ్యెను. యూరోపుదేశముల విషయమై పికినులోనున్న రాయబారు లందఱు తమ మూలమున "షన్కాంగ్వో" కీపరాభవము కలిగినదని చింతించి యతనికిఁ ప్రాణభయము లేకుండఁ గాపాడిరి. రాజసేనలకుఁ గొంతవఱ

కు జయముకలుగ మొదలు పెట్టెను. "జాషువారా" పట్టణమును, హాంకా నగరమును వారి వశమయ్యెను. రాజద్రోహుల సేనలకు హాంకాదగ్గర గొప్ప యోటమి సంభవించెను. కాని వారు 'హ్యునాంగు' ఆయుధశాలి రాజసేనల పరముకాకుండ చాలఁగ నాటంకము కలిగించిరి. ఈయుద్ధమున రాజసేనల యుద్ధచాతుర్యమును రాజద్రోహులయు శిక్షితత్వమును వెల్లడి యయ్యెను.

## సంధి ప్రయత్నములు.

నాన్కిన్, లాంచూలోని సేనలకు హాంకా దండయాత్ర వెడలుఁడని యా జ్ఞ కాఁగా వారందున కియ్యకొనక ప్రజాసమ్మత ప్రభుత్వమును వెంటనే ప్ర సాదింపుఁడని ప్రభుత్వము వారికి మహజరు పంపిరి. అంతటఁ బ్రజాప్రతినిధి సభవారు పార్లమెంటు సంస్థాపన నేరస్థుల విడుదల, రాజవంశమును నిల్పుట మొదలగు ప్రార్థనల నన్నిటి నంగీకరించి సేనాభిమతమును బట్టి పార్లమెంటు కూడవలయు నను కోరిక నిరాకరించిరి. యూన్షికాయి రాజాజ్ఞానుసారముగ "పికిను"కు బయలుదేరెను. ఇంతలో హాంకా మరల రాజద్రోహుల వశమ య్యెను. ప్రజాప్రతినిధి సభాధిపత్యము నుండియు మంచూప్రభువులను దొల్ గించి వాని చైనావారిని నియమించుచు రాజ్యాంగములో సంస్కారములఁ దప్పక జరిపెదమనియు, జను లేకీభవించని యెడల చైనాదేశమునకు ముప్పువా టిల్లుననియు రాజాజ్ఞ యొకటి వెలువడెను. మఱియు యూన్షికాయిని బ్రధాన మంత్రిగా నియమించెను. కాని తనయుద్యోగమునఁ బ్రవేశించుటకు రాజ సంరక్షకుఁడుగ "చింగు" వర్తించుచుండెను. యూన్షికాయి తాను విప్లవకా రుల నాయకుఁడగు 'లియంగహాంగు' తో మాట్లాడి సంధి గూర్తుననియు, నంత దనకుఁ దనకుమాఱుగ నింకొకరిని నియమింప వలయుననియు వార్త బం పెను. పికినిలోనున్న ప్రజాప్రతినిధి సభవారును సంధియగు పర్యంతమును యుద్ధము మానుమని లియంగహాంగుకు తంతిఁ బంపిరి. తనపూర్వపు లోప ముల క్షమింపవలెననియు, మంచూ ప్రభువులు మంత్రాంగములోఁ జేరఁగూడ దనియు, వెంటనే ప్రజాప్రతినిధి వారు మంత్రాంగము నేర్పఱుప వలయునని యుఁ బ్రకటించిరి. ఇట్లుండఁగ దక్షిణమునఁ బెక్కునగరములు విప్లవకారుల

వశమయ్యెను. పికిను నగరముకూడ వారికి వశపడినదని దేశమందు వదంతి కలిగెను. కాని యిది కల్ల. రాజసంరక్షకుని సోదరుఁడు దేశమునుండి పలాయితుఁడయ్యెను. యువాన్షికాయిని ప్రతినిధి సభవారు ప్రధానిగా నియమించిరి కాని యతఁడియ్యకొనక తంతివార్తఁ బంపెను. ప్రతినిధి సభవారిట్లొక ప్రకటనను వెలువరించిరి.

"సభ్యుల యెన్నికలను గూర్చి చట్టములఁ గూర్పవలెననియు, ఎన్నికలు వెంటనె జరుగవలయును. విప్లవకారులనుగూడ రాజతంత్రములో నొక పక్షావలంబకులనుగ నంగీకరించెదము. ప్రజలు కోరిన దానినెల్ల జేసెదము. మంచూలును చైనావారును నేకీభవించినఁ గాని దేశము బాగుపడదు."

## పునః కలహము.

ఇంతలో షాంసిపాలకుఁడైన "వూ" అను నాయకుఁడు మంచూ సిపాయిల దురాగతమువల్ల మరణమొందెను. అతఁడు చైనాజాతివాఁడును, జపానులో విద్యఁగఱచిన వాఁడును, విశేష సంస్కారాభిమానము కలవాఁడు నయి యుండెను. అందువలననే యాతనిని మంచూరియా వారు చంపిరని యాతని వశమందున్న చైనాజాతి పటాలములకును మంచూరియా పటాలములకును ఘోరయుద్ధము జరుగుటచే మంచూల యెడల ద్వేషము హెచ్చయ్యెను. పికిను నగరములోఁ గలవరము మెండై విప్లవకారులసేనలు నగరప్రాంతములఁ గూడఁ దిరుగ మొదలుపెట్టెను. మంచూసేన లూరిలోఁ జేరి యుద్ధసన్నద్ధు లగుచుండిరి. యూరోపియనుల సేనలను ఏమిజరుగునోయని యన్నిటికి సంసిద్ధులయియుండిరి. ఈసమయములోనే "కాంటన్" నగరము తన స్వాతంత్ర్యము ప్రకటించెను. లక్షలకొలఁది చైనావారు తమ దేశమును వదలి పరదేశమునకుఁ బయనమైరి. మఱియు, ఇండియాలోను, అమెరికాలోను నింక నితర రాష్ట్రములలోను వలసనున్న చైనావారు మంచూరియవారి దుర్నయమును వెల్లడిచేయసాగిరి. ముఖ్యప్రధానత్వమున కియ్యకొనకయు 'యువాన్షికాయి' పికిను నగరమునకు బయలుదేరెను. అతని జగద్విదితమగు సేన పికినులోఁ బ్రవేశించుటతోడి జనులకపరిమితధైర్యము కలిగెను. రాజాంగము నంగీకరించి ప్రభుత్వమువారు చేసియున్న

వాగ్దానములను వారు నెఱవేర్చుకొనుటకు వారికి నవకాశము నీయవలసినదని వెంటనే విప్లవనాయకుఁడగు లియంగుహాంగుకు యూన్షికాయి వ్రాసెను. కాని దానికి లియంగుహాంగు నవ్వి 'పికిను' లోఁ బ్రవేశించి జవాబుచెప్పెద ననెను. 'చంగు' సేనాని షాంగై మున్నగుపట్టణములను రాజపక్షమువారికొఱకు గెల్చుటకు నాన్కినులో వేచియుండెను. అచ్చట జడలుకత్తిరించుకొన్న చైనావారిని దదితరులు చెండాడసాగిరి. పికినులో యూన్షికాయి' మంత్రాంగము నేర్పఱచికొనెను గాని దానిలో మంచూప్రభువులులేరు. లియంగుహాంగుకోరికచొప్పున విప్లవకారుల వశములోనున్న యువరాష్ట్రీయుల ప్రతినిధులు "షాంగై" (Shangai) లో నవంబరు 16 తేదీని సభచేసి వేఱుగ రాజ్యాంగము నేర్పఱచి ప్రత్యేకముగాఁ బరిపాలన జరుప నిశ్చయించి తమ రాజ్యాంగమును బాటింపవలసిన దనియు రాజ్యము వదలునటులు మంచూలను జేయవలసినదనియు నితర రాష్ట్రీయులవారికి వార్తలఁబంపిరి. హాంకౌవద్ద 'చంగు' సేనలును, లియంగుహాంగుసేనలును నొండొరుల దఱుముకొనుచుఁ బోరాడుచుండిరి. ఎవరికిని నిర్ధారణగా జయముకలుగదయ్యెను. 'వుంచాంగు' మొదలగుచోట్ల మంచూలను పనులు నిరాటంకముగా హత్యకావించి చంపిరి. షాంగైలోని యాయుధాగారము విప్లవకారుల స్వాధీనము కాఁగా వారు వెంటనే తమపక్షమువారి కందఱకు ఆయుధములను స్వేచ్ఛగాఁ బంచిపెట్టిరి. ఇంతలో యుంషికాయి తాత్కాలికముగాఁ బోరాట మాఁపి సంధిప్రయత్నము చేయుట నంగీకరించుచు విప్లవకారులను గూడ రాజ్యాంగ పక్షముగా నామోదించుచు రాజాజ్ఞ యొకటి వెడలెను.

## సున్యతుసేను.

విప్లవకారుల యాదర్శపురుషుఁడైనను సున్యతసేను లండన్ పట్టణమునుండి చీనాకు వెడలెను. ఇతఁడు తన జీవితకాలమంతయు మంచూల యసమర్థతను గుఱించియు, చైనాలోఁ బ్రజాస్వామిక ప్రభుత్వావసరమును గుఱించియు చైనాభాషలో నతి చమత్కారముగా నుపన్యసించుచుఁ, దనయభిప్రాయముల సార్థక మొనరించుటకుఁ దగుపరికరముల సమకూర్చుచుండెను. మఱియు లో

కములోని దేశములనెల్లఁ దిరిగి యెక్కడెక్కడనో యున్న రాజనీతిజ్ఞుల స్నేహము సంపాదించుచువర్తకపు గుమస్తాగాను జపాను వ్యాపారిగాను బహువేషధారియై పరదేశములలోనున్న చైనావారిని వశము చేసికొనుచు జీవయాత్రఁ గడపి నేఁడు ధన్యతగాంచిన క్రైస్తవదేశాభిమాని. 1896 సం న లండనులో చైనాప్రతినిధి వలన చెఱసాలలో నుంచఁబడి జాబు ద్వారా తనవార్త తనస్నేహితుఁడయిన కాంట్లిను దొరకుఁ దెలిపి న్యాయాధికారుల వారంటు వలన విడుదలఁగాంచిన కష్టజీవి చైనాలో 20 సం. లోనుండి ప్రజాస్వాతంత్ర్యమునకై రేయింబవళ్లు పోరాడుచుఁ దనప్రాణము మీఁద లక్షరూపాయిల విలువదొరతనము వారు పెట్టుటచే ప్రాణములను గరగతముగాఁ జేసికొనియు, స్వచ్ఛందముగాఁదిరుగుచున్న వేదాంతి. మఱియు దేశస్థులెల్లరు రాష్ట్రమున కధిపతినిగాఁ దనను నియమించినను నింకొకఁడు నాయకుఁడున్న దేశ క్షేమకరమని గ్రహించినతోడనే యాయాధిపత్యమును బరిత్యజించిన పరమత్యాగి.

## పునర్యుద్ధకృత్యములు.

హాంకౌదగ్గఱ ఘోరయుద్ధము జరుగుచునే యుండెను. రాజపక్షపు సేనలు హానునది దాఁటలేకపోయెను. నాన్కినును విప్లవకారులు ముట్టడించిరి. వారిపక్షమున స్త్రీలు సహితము పోరాడుచుండిరి. తుదకు చీనాకాయువుపట్టైన నాన్కిన్ కూడ విప్లవకారుల వశమయ్యెను. మంత్రివర్గములో ముఖ్యస్థానమునకు మనుష్యులు లేరైరి. మఱియు యుద్ధప్రమేయమువలన రాజపక్షమునకు లాభములేదని యతఁడు గ్రహించెను. రాజసంరక్షకుఁడు ప్రజాప్రతినిధిసంఘమువారి యాలోచన ప్రకారము రాజ్యకార్యముల నడిపెదననియు, రాజ్యనిర్వహణమునుండి ప్రభువుల దొలఁగించెదననియుఁ బ్రమాణము చేసెను. ఇంతలో హాంకౌ, హన్యాంగు, వూచాంగు, నగరములను రాజపక్షపు సేనలు జయించెను. దీనికి విప్లవకారులు భయగ్రస్తులై రాజపక్షమువారినిబంధనలనంగీకరించుటకు మూఁడుదినముల యావకాశము నితరరాష్ట్రముల వారినిగోరిరి.

## పునస్సంధి ప్రయత్నములు.

హాంకొ ప్రజలమూలమున "యూన్షి కాయి" యు పిక్ ప్రజలమూలమున, 'టంగ్షోయి' (Tungshoi) యు సంధిప్రయత్నములు చేయుచుండిరి. అంతలో సంధికి గొప్పప్రతిబంధకమయిన రాజ సంరక్షకుఁడు తనపదవికి రాజీనామాయిచ్చెను. ఇందువలన యూన్షి కాయికిని ఆతనిక్రింది మంత్రులకును గార్యనిర్వహణమందు సర్వ స్వాతంత్ర్యము కలిగెను. జడలను గత్తిరించుకొన వచ్చునని రాజు ఆజ్ఞనిచ్చెను. విప్లవకారులు ఇంగ్లీషు జర్మను వారికియ్యవలసిన ఋణముకిస్తీని జెల్లించిరి. యూన్షి కాయి యభిప్రాయ మేమనఁగా,

(1) చైనాలో జనులు మూఁడువంతులు రాజప్రభుత్వమున క్లిష్టులనియు నొకవంతు మాత్రము ప్రజాస్వామికమునకు సిద్ధపడియున్నారనియు,

(2) ఇట్టిస్థితిలో ప్రజాస్వామిక మేర్పడిన కొంతకాలములో మఱల విప్లవము కలిగి దేశముఁను గల్లోలపఱచుననియు,

(3) అట్టి చిక్కుసమయములోఁ బరరాష్ట్రములవారు చైనాను భాగములవరుసను బంచుకొందురనియు,

(4) అదిగాక యుత్తరచైనారాష్ట్రములు దక్షిణచైనారాష్ట్రములును భిన్నోద్దేశముల మూలమున విడిపోవుననియు,

(5) ప్రస్తుతపుస్థితియందు రాజకుటుంబమునకు మితమైన యధికారముంచి వాగ్దానములఁ దాఁటిపోకుండఁ దగుకట్టుదిట్టములుచేసి యథార్థమునకు నధికారమంతయుఁ బ్రజాప్రతినిధులయందే యుంచవలెననియు,

(6) అందున కనుగుణ్యముగా ఇంగ్లాండులోవలె మితరాజాధికారముగల రాజ్యాంగము నేర్పఱుపవలెననియు,

యూన్షి కాయి తమలోఁ జేరినయెడల నాతనికిఁ బ్రజాస్వామిక నాయక పదవి నిత్తుమని షాంగైలోని సభవారు తీర్మానించిరి. కాని యట్టిది దేశక్షేమకరము గాదనియుఁ బరరాష్ట్రముల వారు దాని నంగీకరించరనియు నాతఁడు తెలిపెను. పికిను ప్రభుత్వముతో పున ఘనసంధిప్రసంగము జరుపుటకుఁ బూ

ర్ణాధికారముతో 'టంగుషోయి' (Tungushoi) ని వూంచాంగునకుఁ బంపిరి. సంధిప్రయత్నము లిట్లు జరుగుచున్నను నాన్కినుసమీపములో యుద్ధముజరుగుచునే యుండెను. ఇంతలో టిబెటుదేశములో జనులు తిరుగఁబడ మొదలుపెట్టిరి. మంచూరియాలో సేనలు రాజద్రోహులఁ జేర మొదలుపెట్టెను. మంగోలియా దనస్వాతంత్ర్యమును బ్రకటించెను.

## సంధి యేర్పాటులు.

'టంగుషోయి' షాంగైకువచ్చినతోడనే పరరాష్ట్రముల ప్రతినిధులును విప్లవకారుల ప్రతినిధులును దగుసత్కారములతో నతనిని గౌరవించిరి. పిమ్మట సంధిమాటలు జరిగెను. విప్లవకారులపక్షమున వూటంగుఫాంగు రాయబారము నడిపెను. పరరాష్ట్రముల వారందఱు సంధియే దేశమునకు క్షేమకరమని తమ ప్రతినిధుల మూలమునఁ దెలియఁజేసిరి. 'వూటంగుఫాంగు' ప్రజాస్వామిక ప్రతిష్ఠయే సంధికి ప్రథమనిబంధనయని వాదించెను. 'టంగుషాంగు' యిట్టి వాదమును పికినువారికిఁ దెలియఁజేయక తానంగీకరింప వీలులేదనెను. కనుక నింకొక వారము యుద్ధమాఁప నిశ్చయించిరి. పికినులో రాజమాత ముఖ్యులగు మంచూప్రభువులకు షాంగైనుండి వచ్చినవార్తను దెలుపుటకు వారిని బిలువనంపెను. పెద్దప్రతినిధి సభనొకటి గూర్చి యాసభయొక్క తీర్మానముచొప్పున రాజ్యాంగమును గూర్చుటకు రాజమాత యొప్పుకొనియందునకుఁ దగిన యేర్పాటులను జేయుటకు యువాన్షికాయికి సెలవొసంగెను. ఇంతలో షాంగైలో సున్యతుసేను ప్రవేశించి ప్రజలప్రార్థనమీఁదఁ బ్రజాస్వామికము నంగీకరించెను. రాజ్యాంగ నిర్మాణ మొనర్చు ప్రతినిధి సభలో నుభయపక్షప్రతినిధులు.

(1) చైనాలోఁ బతిరాష్ట్రమునకు ముగ్గురు చొప్పునఁ బ్రతినిధు లుండవలెననియు.

(2) ప్రతిప్రతినిధికిఁ దీర్పుఁజెప్పనధికారము త్రిగుణముగా నుండవలెననియు,

(3) ప్రతినిధులను తంతివార్తవలన మంచూరాజ్యాంగముకొఱకుఁ గొంతఱను, దాత్కాలికముగా నేర్పఱచిన ప్రజాస్వామికముకొఱకుఁ గొంతఱను అహ్వానము చేయవలెననియు, నిశ్చయించుకొనిరి.

## మఱలఁ గలహము ప్రవర్తిల్లుట.

పిమ్మటఁ గొంతవ్యవధియైనందున విప్లవకారులు హాంకౌ హన్యానాంగులను ముట్టడించి యుద్ధము మరల మొదలుపెట్టిరి. రాజపక్షమువారు తమకుఁ బ్రతినిధి సంఘముయొక్క తీర్మానము వ్యతిరేకముగా నుండునేమో యని భయపడి యది యట్లులుండలేదని యెఱిఁగి సంతసించిరి. రాచసేనలు హన్యాంగు వదలి యుత్తరమునకు రైలుమార్గమునఁ బోయిరి. కాని లియంగుహాంగు తనసేనల నందుఁ బ్రవేశింపనీయలేదు. లియంగుహాంగు సంధిప్రయత్నములకుఁ దాను భిన్నముగాఁ బ్రవర్తించినందుకు క్షమాపణ వేఁడి యందుకు నుత్తరవాదులగు నుద్యోగులఁ బనినుండి తప్పించెను. రాచసేనలు హాంకౌను గూడ వదలిరి. టంగుషోయి తనసౌమ్యతను "పికిను" వారు మెచ్చలేదని గ్రహించి రాజప్రతినిధిపదవిని వదలుకొనెను. 'వూటంగుహాంగు' సంధిప్రయత్నము మంచూరియా వారి దుష్కృత్యములవలనఁ జెడిపోయెనని పరరాష్ట్రములవారికిఁ దెలియఁజేసెను. అతనికి యుయాన్షికాయి సర్వజనులు వారియిచ్చవచ్చిన రాజ్యాంగము నేర్పఱుచుకొనవచ్చుననియు, ప్రజాస్వామిక నాయకత్వమునకుఁ దన నాహ్వానము చేసినందునకు వందనము లాచరించుచు, లేఖ నొకటి వ్రాసెను. విప్లవకారులు మంచూలయెడలఁ దమద్వేషమునకుఁ గారణము వివరించుచు విప్లవమునకు ముందుఁ బరరాష్ట్రములతో జరిగిన సంధులకుఁ గట్టుపడెదమనియు, వాణిజ్యమును గూర్చిన నిర్బంధములను దొలగించెదమనియుఁ దమప్రజాస్వామికము నామోదించవలసినదనియుఁ బరరాష్ట్రముల వారికిఁ బ్రకటనను బంపిరి. విప్లవకారులు సిష్యూవాన్ అనురాజప్రతినిధి నురిదీసిరి. రాచసైన్యము హాంకౌను వదలివేసెను. ఈసందర్భములో యూరపురాష్ట్రములవారు పికిన్ నుండి సముద్రమునకుఁ బోవు రైలుమార్గమును ఆక్రమించుకొనిరి. మంగోలియావారి స్వాతంత్ర్యమును ఆమోదించవలసినదని రష్యావారు చైనావారినిఁ గోరిరి. విప్లవకారులు చైనాతురుష్కస్థానములలోని యాయుధశాలలను జయించి మంచూలను హత్యగావించి, ప్రజాస్వామికము నచ్చట నెలకొల్పిరి. రాజసైన్యములన్నియు హాంకౌనుండిహన్యానునకు దాడివెడలెనుగాని యచ్చట విప్లవకారులవలన

గొప్పయపజయమును బొందిరి. షాంసీ, షెంసీ, హైనాను రాష్ట్రములలో అరాజకము వృద్ధియయ్యెను. ఎచటఁ జూచినను హత్యలు, అగ్నిజ్వాలలు మానభంగములు, ప్రబలియుండెను. షెంసిలో 10000 మంచూలను నగరద్వారముల మూసివేసి చెండాడి హత్యకావించిరి. ఇంతలో పికిను రాజధానిలో మంచూలందఱు సభలుచేసి రాజు రాజ్యభ్రష్టుఁడై నగరువదలినఁగాని దేశమునకు ముప్పుతప్పదని నిశ్చయించిరి. మంచూప్రభువులు, రాజకుమారులు విప్లవకారులనిబంధనల నంగీకరించిరని తంతివార్త వచ్చెను. కొలఁదికాలములో రాచకుటుంబము రాజ్యము వదలి జిహాలు పట్టణమునకుఁ బోవుననియుఁ, ప్రజాస్వామికము నేర్పఱచుచు రాజప్రకటన వెలువడుననియు, యూన్షికాయి పికినులో నిలిచి రాజ కుటుంబముయొక్క పోషణమునకుఁ దగు నేర్పాటులను జేయుననియు వదంతికలిగెను. పోరాటము కొమండ సంధిప్రయత్నముల నిమిత్తమింక రెండువారములయవకాశ మేర్పఱచు కొనఁబడెను. నలుమొగముల విప్లవకారుల సేనలు పికినుపై దాడివెడలుచుండెను. రాచనగరమునుండి యూన్షికాయి స్వగృహమునకు వచ్చుచుండ యూన్షికాయిమీఁద నగ్నిగోళ మొకటి యొకమార్గుఁడు వేసెను. కాని యందువల్ల నతనికేమియు నపాయము కలుగలేదు. విప్లవకారులు చైనావాణిజ్యనావికసంఘము వారిని దమసైన్యమును వేతనములిచ్చుచు వలయుధనమొసంగుఁడనియు, అట్లీయనియెడల వారి యోడలను బట్టుకొని వేలము వేయించెదమనియు బెదరింపసాగిరి. 'యూన్షికాయి' మంచూప్రభువులవలలో నున్నాఁడని జడిసి 'సున్యతసేను' ప్రజాస్వామిక కృత్యముతో ఆయన జోక్యము కలుగఁజేసికొనవలదని యూన్షికాయికి తంతి వార్తఁ బంపెను. ఇందువలన మఱల యుద్ధమారంభమయి దేశసంక్షోభము కలుగు నని లోకమెంచెను. విప్లవకాలమున రాజ్యమునకుఁ జేసినమేలునకుఁగాను యూన్షికాయిని రాజు గొప్పప్రభువునుగా నియమించెను. తాను నవంబరుమధ్యభాగమున 'పికిను' నగరమునకు వచ్చినది యాదిగా దేశమున జరిగిన చిత్ర

కథయంతయు విస్తరించుచుఁ దాను రాజవంశమున కుపకారము చేయఁజాలనందునకుఁ బరితపించుచుఁ దా నాగౌరవమున కర్హుఁడఁ గాననియుఁ దనతప్పు మలన్నింపుమనియు జగద్విఖ్యాతమైన యొక లేఖను వ్రాసెను. పికినులో రాజసంబంధము కలవారిమీఁద అగ్నిగోళప్రయోగము హెచ్చయ్యెను. రాజపక్షపు సేనానులందఱు మంచూప్రభువులలోఁ జిన్నవారి దుర్నయమువలనఁ బ్రజాస్వామికము నేర్పఱుచుట యత్యవసరమనియు, యూన్షికాయిని క్రొత్తరాజ్యాంగ మేర్పఱుచుటకు నియమింపవలసినదనియు నొకయర్జీని రాజునకుఁ బంపుకొనిరి రాజసంరక్షకుఁడు, రాజమాత, మంచూప్రభువులు నందఱు సంప్రతించి విప్లవకారుల నిబంధనల నంగీకరించి సంధి కూర్చుమని మంత్రివర్గమును గోరిరి.

## సంధిప్రవర్తిల్లుట.

మంచూరియాలోఁ గలవరము హెచ్చయి జపాను సేనలు బ్రవేశించెను. ఇంతలో విప్లవకారులు తమ దేశముల యెడల మున్నూఱు సంవత్సరముల నుండి రాజవంశమువారు చేసినహానిని వర్ణించుచు, దాము దేశమును విప్లవ జలధిలో దింపి స్వాతంత్ర్య రాజ్యాంగముచే మఱల నుద్ధరించిన విధమును, ముందు పరరాష్ట్రముల యెడలఁ దాము న్యాయముగాఁ బ్రవర్తించి తమదేశమునకు శ్రేయోదాయకములగు సంస్కారముల నెఱెఁగెడి తలంపును దేశదేశయులకు బ్రకటించిరి. సున్యతుసేను యూన్షికాయిని క్షమాపణవేఁడుచుఁ దానుఁ బొరబడితినని జాబువ్రాసెను. దక్షిణమున నేర్పడ్డ ప్రజాస్వామిక ప్రభుత్వమువారితోఁ గలసి యొకప్రజాస్వామికమును 'పికినులోఁ గూడ స్థాపింపవలయునని యూన్షికాయికి రాజాజ్ఞ వెడలెను. యూరోపు రాష్ట్రములవారును అమెరికావారును చైనాదేశము యొక్క యేకత్వమును జెఱుపఁగూడదని నిర్ధారణ చేసికొనిరి. యూన్షికాయి యొక్క నేర్పువలన సమకూర్పఁబడిన సంధివలన రాజునకును రాజకుటుంబము వారికిని వారి బిరుదులు మర్యాదలు ని

లుచునట్లును వారికిఁ దగు వేతనములును, ఆదాయములును, గ్రొత్తపాలన లి
చ్చునట్లును నేర్పాటు చేయఁబడెను. యూన్షికాయి జనయుద్యోగమును, అ
ధికారమును బ్రకటింపగా 'సున్యతుసేను' రాజాజ్ఞను దాను లక్ష్యముచేయన
నియు యూన్షికాయిని నాన్కినుకు రమ్మనియు తంతివార్త నంపెను. ఫిబ్రే
వరి మధ్యభాగమున నాన్కినులోని విప్లవకారుల సభవలన యూన్షికాయి
యేకగ్రీవముగాఁ బ్రజాస్వామిక నాయకుఁడుగ నెన్నుకొనఁబడెను.

## యూన్షికాయియొక్క సామర్థ్యము.

అటులు నాయకుఁడుగా నెన్నుకొనఁబడుటచే, రాజపక్షము వారికిని
విప్లవపక్షము వారికిని యూన్షికాయి యెడలఁ గలగౌరవము వెల్లడి కాఁగల
దు. మఱియుఁ దనశత్రుపక్షము వలన నాయకుఁడుగా నెన్నుకొనఁబడునట్లు చే
సికొనినయాతని చాతుర్యమును విశదముగాఁ గలదు. సున్యతసేను యూన్షి
కాయి కీవార్తను దెలుపుచు రాజధాని నాన్కినులో నుండవలెననియు, యూ
న్షికాయి యచ్చటికి వచ్చి పట్టాభిషిక్తుఁడు గావలెననియు తంతివార్త నంపె
ను. మఱియు టంగుషోయి యూన్షికాయిని నాన్కినుకుఁ దీసికొనివచ్చుటకుఁ
బయలుదేరెను. యూన్షికాయి యభివందనములు చేయుచు చేయుచు రాయ
బారులు పికినుకు వచ్చినతర్వాత రాజధాని మాట విచారించెదననియుఁ దాను
పికిను వదలిన దేశమునకు గొప్పముప్పు వాటిల్లుననియుఁ బ్రజలకోరిక ప్రకార
ము నాయకపదవి నంగీకరించితి ననియు వార్త నంపెను. దేశదేశముల నున్న చై
నా వారివద్దనుండి యభివందనములు యూన్షికాయికి వచ్చుచుండెను. అమెరి
కాసంయుక్తరాష్ట్రములకు ప్రథమనాయకుఁడైన 'వాషింగ్టను' కుఁ బిమ్మట
యూన్షికాయియే యంతఘనుఁడని నుడువఁదగును. పికినులో సేనాకలహము
జరుగగా దానినంతయు నివారించి యథావిధిగా పికినులో యూన్షికాయి
నాయకుఁడుగాఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. వెంటనే పరదేశముల రాజ్యతంత్ర

ములల యనుభవము గలట్టి దేశాభిమానులను మంత్రాంగముకొఱకేర్పఱచి తనస్నేహితుఁడయిన టంగుషాయిని ముఖ్యప్రధానిగా నియమించెను. చైనారాచకార్యములను దిరిగి చక్కని స్థితికిఁ దేఁగల బుద్ధిశాలియు, బలశాలియు యూన్షికాయయే యని చైనావారి యొక్కయు పరదేశీయులయొక్కయు నభిప్రాయము. అతఁడు తనవిధి నెట్లు నెరవేర్చి చైనారాజ్యాంగమునకుఁ బటుత్వము కలుగఁజేసి ప్రాక్ప్రపంచమునకుఁ గీర్తి తెచ్చునో లోకము శీఘ్రకాలములోఁ దెలిసికొనఁగలదు.

సమాప్తము.



# పద్యములు.

శా. చీనాదేశపుభూమిసారమది నిక్షేపంబు పండున్ సదా
న్యూనప్రజ్ఞయుఁ గౌశలంబుఁ బ్రభు సంతోషంబు దీపింపఁగా
నానాసస్యచయంబు సేద్యమున విన్నాణంబుగాఁ దత్ప్రజ
ల్గాన న్నేర్తురు వారిపుణ్యమును జక్కం బల్కఁగా శక్యమే.

శా. చీనారాజ్యమునందుఁ బుట్టిరి మహాసిద్ధాంతకర్తల్లనయ
జ్ఞానుల్వా రది స్వర్గరాజ్య మని తన్నాథుండు స్వర్గాత్మజుం
గా నిష్ఠామతితోడఁ బల్కిరి మహాగాఢంబు లౌచట్టము
ల్నానాశాఖల గొప్పఁ జేసిరి జగన్మాన్యత్వసత్పాత్రులై.

శా. చీనావారికిఁ దొల్త నెవ్వ రయినం జేడ్పాటుఁ గావించినన్
జ్ఞానస్ఫూర్తిని సంధి చేసికొనఁగాఁ గాంక్షించి యత్నింతు ర
ద్దానన్ సిద్ధినిఁ గాన కున్నతతి యుద్ధం బుద్ధతిం జేయుదుర్
హా! నిందారినశాంతచిత్తు లన న్యాయంబె కదా వారలన్.

శా. చీనావారల ధర్మశాస్త్ర మది యక్షీణప్రభావంబుతో
నేనాఁడో వెలుఁ గొంది మార్పులను దా నీనాటికిం గాన ద
ద్దానిం బండితపామరప్రజలు సత్యం బంచు సేవించి బ్ర
హ్మానందంబును జెందుచుందు రఁట లక్ష్యస్ఫూర్తి వర్తిల్లఁగన్.

శా. చీనారాజ్యము పేరు పెంపు సిరులన్ క్షీణత్వముం గాంచెఁ బ్ర
జ్ఞానైపుణ్యము లన్ని డిందెఁ బ్రజలుం గార్శ్యత్వముం జెందిరె
ద్దానం గల్గెనొ యంతగా గతశతాబ్దంబందు నాఁ జెప్పెదన్
జా నొప్పారఁగఁ గాలయోగ్యగతి ప్రాశస్త్యస్థితిం గానమిన్.



# ప్రకటనలు.

## ఆంధ్రభాషాభివర్ధనీ ప్రచురములు.

దేశాభ్యుదయమున కావశ్యకమగు విషయములం దెల్లఁ బరిశ్రమ జరుగుచున్న యిక్కాలమున భాషాభివృద్ధి కగ్రస్థానమిచ్చుట ప్రధానమైయున్నది. సంఘముయొక్క సర్వావస్థలయందును, దేశముయొక్క అన్ని భాగములయందును, విజ్ఞానము ప్రచురింపఁ జేయుటకు భాషాసేవయే ముఖ్యసాధనము. సనాతనాధునికేతిహాసములు, ప్రకృతిశాస్త్రములు, అన్యదేశాదర్శనికగ్రంథములు, మహాపురుషులజీవితములు, గణితశాస్త్రములు, రాజనీతిశాస్త్రములు, ఆర్థికశాస్త్రములు, వృత్తులును, పరిశ్రమలును, వాణిజ్యమును నడుపువిధమును తెల్పుగ్రంథములు, నవలలు, లేనిలోపమును ఆంధ్రభాషాభివర్ధనీసంఘము నివారింపఁ బ్రయత్నించుచున్నది.

ఈ కంపెనీ మూలధనము రు. 10,000.

## భారతధర్మదర్శనము.

నిర్మలదేశానురాగమును బ్రబోధించుపద్యకావ్యము సుప్రసిద్ధుండగు నొకయాధునికకవివరునిచే మృదుమధురముగ గానముచేయఁబడిన 109 పద్యము లిందు గలవు. వెల రు. 0-2-0. శాశ్వత చందాదారులకు రు. 0-1-6.

ఈక్రిందిపద్యమునుబట్టి శైలియును, భావములును, గ్రహించనగును.

చ. మతములు పొచ్చినిల్లు జనమాన్యచరిత్రులు పుట్టినిలు న
ప్రతిమదయాశమాదిగుణరత్నసమృద్ధికి రోహణాద్రి శా
శ్వతనిరపాయమోక్షఫలభాసురవల్లికి నాలవాల మై
యతులవిభూతిఁ బొల్తు విల నంబరొ! నీసరిధన్య లుందురే?

*

## పీష్వా నారాయణరావు వధ.

గ్రంథకర్త.

వి. రామదాసుపంతులుగారు, బి. ఎ., బి. ఎల్. హైకోర్టువకీలు. ద్వితీయముద్రణము. మూఁడుచిత్రపటములు గలవు. వెల రు. 0-2-0. చందాదారులకు రు. 0-1-6.

## స్వాతంత్ర్యదర్శనము.

గ్రంథకర్త.—దుగ్గిరాల, రామమూర్తిపంతులుగారు, బి. ఏ., ఎల్. టి.

జాన్ స్టూఅర్టు మిల్లు అను ఆంగ్లేయపండితోత్తముని లిబర్టీ అను సుప్రసిద్ధగ్రంథముయొక్క భాషాంతరీకరణము. మనోవాక్స్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము, స్వాతంత్ర్యపరిమితి మొదలగు సాంఘికశాస్త్రసిద్ధాంతము లీగ్రంథమునందు చరిత్రోదంతములతోడ విమర్శింపఁబడినవి. పాశ్చాత్యవాఙ్మయమునం దుత్కృష్టగ్రంథముగ పరిగణింపఁబడుచున్న యీగ్రంథము సుబోధముగ తెనిఁగింపఁబడినది. కాలికోకవరు 175 పుటలు. వెల రు. 0-12-0. చందాదారులకు రు. 0-7-0.

## మహారాష్ట్రచరిత్ర.

గ్రంథకర్త.—చిల్లరిగె, శ్రీనివాసరావు పంతులుగారు.

ఒకప్పుడు భరతఖండమున కాభరణముగా నుండిన మహారాష్ట్రసామ్రాజ్యసంపాదకులైన శివాజీ మహారాజు మున్నగు వీరుల సచ్చరిత్రము. ప్రశస్తమైన యీరాష్ట్రనిర్మాణముయొక్కయు, ప్రవర్తనముయొక్కయు, క్షీణదశయొక్కయు, కారణములు సహేతుకములుగ చర్చింపఁబడియున్నవి. శైలి సుబోధకమై ప్రస్తుతము మనదేశీయచరిత్ర పాఠకార్థులైనవారి కీమహారాష్ట్రచరిత్ర సప్రమాణమైనదిగ నున్నది. మహారాష్ట్రనిర్మాణకర్తల దివ్యచరిత్రములె గాక, శివాజీ, శంభాజీ, రామదాసుస్వామి, అహల్యాబాయి, తారాబాయి, బాజీరావు, పీష్వానారాయణరావు మొదలగువారి 22 చిత్రపటములతోడను, భరతవర్షపు పెద్దపటముతోడను, అనేక కథావిశేషములతోడను, రాజనీతివిచారణలతోడను, నీగ్రంథము విరాజిల్లుచున్నది. సామాన్యులగు చదువరులకు రంజకముగను, విమర్శకులకు కావలసినంత చరిత్రసామగ్రియుఁ బొందుపరుపఁబడియున్నవి. 500 పుటలు. ప్రశస్తమగు కాలికోబైండు వెల రు. 11-4-0. చందాదారులకు రు. 1-4-0.

## ఆంగ్లేయరాజ్యాంగనిర్మాణచరిత్ర.

గ్రంథకర్త—మద్రాసు గవర్నమెంటు తెలుగుట్రాంసులేటరుగా రగు
గోటేటి, కనకరాజు పంతులుగారు, బి. ఎ., బి. ఎల్.

ఇంగ్లాండుదేశీయుల రాజ్యపరిపాలన, నాగరికతయు, విపులముగ నిందు వర్ణింపఁబడియున్నవి. ప్రాచీనవృత్తాంతము, విదేశరాజుల పరిపాలనము, స్వాతంత్ర్యనిర్ణయ మహాశాసనము, నిరంకుశప్రభుత్వమునకు పార్లమెంటునకు పోరాటము, ప్రజాప్రభుత్వము, అమెరికాయుద్ధము, శిల్పకళల ప్రాభవము, పార్లమెంటు సంస్కారము, విక్టోరియామహారాజ్ఞి, కాలనీలు, హిందూదేశము స్వరాజ్యము మొదలగు విషయములు గలిగి సుబోధకమై యున్నది. శైలి మృదుమధురముగను, వర్ణనలు మిగుల రసవంతములుగను, కథానుక్రమణిక హృద్యముగను నుండి చరిత్రకథనము కావ్యములకంటె నుత్కృష్టముగ చేయఁబడినది. ఇందు 6 చిత్రపటములు, 2 దేశపటములును గలవు. 300 పుటలు. ప్రశస్తమగు కాలికోబైండు వెల రు.1-4-0. చందాదారులకు వెల రు.0-12-0.

## ఆరోగ్యశాస్త్రము.

గ్రంథకర్త.—డాక్టరు, భో. పట్టాభిసీతారామయ్యగారు,
బి. ఏ. యం. బి. సి. యం.

ఈక్రిందిసూత్రములను గమనింపుఁడు.

(1) ఆరోగ్యమును గాపాడుటకు వ్యాధిచికిత్సకన్న వ్యాధినివారణమే శ్రేష్ఠతరమగు పరమసాధనము.

(2) దేహము వ్యాధులకు లోనగుటకు రెండులోపము లుండవలెను.

(i) దేహదౌర్బల్యము.

(ii) వ్యాపకకారణములగు సూక్ష్మజీవులను, విషకరపదార్థములను, స్వారోగ్యరక్షణ విధానమును, గృహారోగ్య నిర్మాణమును, జక్కఁగ గమనించిన దేహదార్ఢ్యమును నిలుపుకొనఁగలము.

(iii) సూక్ష్మజీవు లాహార జలవాయువులగుండ దేహములోనికిఁ బ్రవే శించి సాంక్రామికవ్యాధుల నుత్పన్నము సేయును.

ఆరోగ్యశాస్త్రమున నీయంశములన్నియుఁ జర్చింపఁబడినవి.

"వాయు వను" శీర్షికక్రింద వాయువునందుండు కల్మషములును వాయువు ప్రచారమును దానివలని ప్రయోజనములును, వాయువును శోధించు విధమును, వివరింపఁబడినవి.

"జల మను" శీర్షికక్రింద పానీయజలమునకు మూలాధారములును, వాని తారతమ్యములును, జలమునందుండు రసాయన కల్మషములును, సూక్ష్మజీవులును, జలమును శుభ్రపఱచు పద్ధతులును, శోధించువిధానమును తెలియఁజేయబడినవి.

"ఆహార మను" శీర్షికక్రింద ఆహారవిధానము ఆహారాంశములు, దేహమునకు, వానివలని ప్రయోజనములు, వానియందుండు కల్మషములును, గల్మషముల నివారించు విధమును, ఆహారద్రవ్యములను శోధించు నిర్ణయమును విరళింపఁబడినవి.

"గృహము లను" శీర్షికక్రింద గృహముల నెట్టి స్థలములయందును, నెవ్విధమునను నేయేసూత్రములను గమనించియుఁ గట్టవలెనో యవన్నియు వర్ణింపఁబడినవి.

మఱియు చెత్త మొదలగు వ్యర్థపదార్థముల నెట్లు పరిష్కరింపవలసినదియు సాంక్రామిక వ్యాధులను అనఁగా మశూచి విషూచిజాడ్యములు తాపజ్వరము, బొబ్బతెగులు, వానికారణములు, వానిని నివారించు పద్ధతులును, అనుదిన మారోగ్యరక్షణమునకు మనము గమనింపవలసిన సూత్రములను ప్రజాసంఖ్య ప్రతిసంవత్సరము నెట్లు హెచ్చునదియు భీమాకంపెనీలే నియామకములపై నాధారపడి యున్నదియు, ఇంకను దినదినము నాచరింపవలసినయనేక ధర్మములును సులభశైలిని సవిస్తరముగ రచియింపఁబడిన ఈగ్రంథము వెల రు. 1-4-0. చందాదారులకు రు. 0-10-0.

## అశోకచరిత్ర.

గ్రంథకర్త.—చేతపూడి. లక్ష్మీకాంతరావు పంతులుగారు.

ఇందు బౌద్ధధర్మవిజృంభణకాలమున హిందూదేశౌన్నత్యమును, అశోకుని రాజ్యవైభవమును, బౌద్ధధర్మవ్యాపకమును మిగుల రమణీయముగ నీగ్రంథమునందు వర్ణింపఁబడినవి. అనేకశాసనములును అక్కడక్కడ చక్కని పద్యములును, 8 చిత్రపటములును, 1 అశోకుని రాజ్యమును దెలుపు హిందూదేశపు పెద్దపటమును గలవు. ప్రశస్తమయిన క్యాలికో బైండు చేయఁబడినది. 330 పుటలు 1-4-0. చందాదారులకు 0-13-0.

## ప్రభావతి.

గ్రంథకర్త.—గాడె. జగన్నాథ స్వామిగారు.

ఈ నవల జగద్విఖ్యాత యశుఁడగు శివాజి మహారాజును గురించి వ్రాయబడినది. కథాచమత్కార మద్భుతము. భాష మృదుమధురము. ఈ నవల నాంధ్రమహాజను లనేకవిధములఁ గొనియాడి యున్నారు. కాలికో బైండింగు చేయఁబడినది. చందాదారులకు. 0-12-0. ఇతరులకు రు. 1-4-0.

పశుశాస్త్రము రు. 0-5-0. ఇతరులకు రు. 0-10-0.

### పునర్ముద్రణమందున్న గ్రంథములు.

(2) అక్బరుచరిత్ర. (4) వివేకానందస్వామిజీవితము. (5) సిక్కుల చరిత్ర. (6) విద్యాసాగరుని చరిత్ర. (7) రామమోహనరాయల చరిత్ర.

### ముద్రణమందున్న గ్రంథములు.

(1) జ్యోతిషశాస్త్రము.

### ముద్రింపఁబడవలసిన గ్రంథములు.

అమెరికాచరిత్ర, జపాన్ చరిత్ర, మహారాష్ట్రచరిత్ర 2-వ భాగము, ఔరంగజేబుచరిత్ర మొదలగునవి.

**N. B.** మా శాశ్వత చందాదారులకు 100 పుటలు పోస్టేజిగాక రు. 0-4-0 చొప్పున నిచ్చుచుందుము. రు. 0-4-0 ప్రవేశకట్నము చెల్లించవలయును. దరఖాస్తులు చేయువారు వివరముగ విలాసము వ్రాయవలయును. చందాదారులను చేర్చు యేజంట్లకు మంచికమీషన్ యీయఁబడును.

మేనేజరు,

ఆంధ్రభాషాభివర్ధనీసంఘము. (లిమిటెడ్), మచిలీపట్నం.

# విజ్ఞానచంద్రికాగ్రంథమాల.

చింతాద్రిపేట, మద్రాసు.

ఇందు

సంవత్సరమునకు నాలుగుచొప్పున

దేశచరిత్రములు. ప్రకృతిశాస్త్రము.
చిత్రవిషయిక నవలలు. మహాపురుషుల జీవితములు.

ఇంగ్లీషు ఉద్గ్రంథముల భాషాంతరీకరణములు

ప్రచురింపఁబడును.

శాశ్వతపు చందాదారులకు 100 పేజీలకు పోస్టేజితో 0-4-0 చొప్పున పుస్తకముల ఖరీదు ఏర్పరుపబడును. ఇతరులకు పోస్టేజిగాక అ. 0-6-0 లు. శాశ్వతపు చందాదారులు వెనుకటిగ్రంథములు కావలసినయెడల అ. 0-4-0లు. అక్కఱలేనియెడల 1-0-0 ప్రవేశ రుసుముక్రింద చెల్లించవలెను.

చిరునామా :—ఆ. లక్ష్మీపతి, బి.ఏ., ఎం.బి. సి.ఎం.,

మేనేజరు.

## ప్రచురింపఁబడిన గ్రంథములు.

### హిందూమహాయుగము.

ఇది హిందూదేశ కథాసంగ్రహముయొక్క మొదటిభాగము మనపూర్వుల రాజ్య విస్తారంబును, అప్రతిమశౌర్యంబును, అకలంక స్వదేశభక్తియు తెలిసికొనగోరువారీగ్రంథము తప్పక చదువవలయును. అత్యంతపురాతనకాలమునుండి మహమ్మదీయుల దండయాత్రవరకుగల చరిత్రమంతయు సవిస్తరముగా వర్ణింపఁబడినది. గ్రంథకర్త, కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. మా చందాదారులకు పోస్టేజితో రు. 0-11-0. ఇతరులకు పోస్టేజిగాక రు. 1-0-0.

## రాణీ సంయుక్త.

జగద్విఖ్యాతమై, నాలుగు నాటకరచనలకు మార్గదర్శకమై శైలియందును, వర్ణనలయందును, కథాచమత్కారమునందును నిరుపమానమై పండితులచేతను పామరులచేతను పొగడ్తగన్న ఈ అద్భుత నవలనుగురించి ఎంతవ్రాసినను తనివిదీరదు. దీనింజదివి యిందలి సారస్యమును పాఠకులే గ్రహింతురుగాక! చందాదారులకు పోస్టేజితో రు. 0-9-0. ఇతరులకు పోస్టేజిగాక రు. 0-12-0. గ్రంథకర్త—వేలాల, సుబ్బారావుగారు.

## విమలాదేవి.

ఇది విచిత్రమైన క్రొత్తనవల. రంగుపటములు. కలిగియున్నది. రాజసింహునియొక్కయు అతని భార్యయగు విమలాదేవియొక్కయు, శౌర్యము, ధైర్యము, మతాభిమానము మొదలయిన విందు జక్కగ ప్రదర్శింపబడినవి. ఇందిరాదుర్గాదాసులరాజభక్తి దేశరక్తి, ధర్మాసక్తి, గోలకొండలోనియక్కన్న మాదన్నగారి వైభవమును, వైకుంఠయోగిచేసిన యద్భుతకృత్యములును మిగుల రమణీయముగ వర్ణింపబడినవి. కథాసందర్భము (Plot) అత్యద్భుతము. వర్ణనలు అశ్రుతపూర్వములు. మా చందాదారులకు రు. 0-13-0. ఇతరులకు రు. 1-2-0. గ్రంథకర్త—బాలకవి, భోగరాజు నారాయణమూర్తిగారు.

## కలరా.

వాంతిభేది, విషూచి, గత్తర యని మనవారులు బిలుచు జాడ్యమును గూర్చి ఇందు సమగ్రముగ వ్రాయబడినది. చందాదారులకు రు. 0-4-0. ఇతరులకు రు. 0-6-0 గ్రంథకర్త—వైద్యవిశారదులగు ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం. గారు.

## ప్రకృతిశాస్త్రముల ప్రథమపాఠములు.

ఇందు జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, శారీరశాస్త్రములను గురించిన కొద్ది యంశములు బాలురకు స్త్రీలకు తెలియునటుల వ్రాయబడినవి. చందాదారులకు రు. 1-2-0 లు. ఇతరులకు రు. 1-10-0 లు. గ్రంథకర్త—కే. సీతారామయ్య, బి. ఏ., ఎల్. టీ. గారు.

## భౌ తి క శా స్త్ర ము.

400 పుటలు. 200 పటములు.

దీని నింగ్లీషులో ఫిజియాగ్రఫీ (physiography) అందురు. ఇందు పదార్థవిజ్ఞాన, రసాయన, భూగర్భ, భౌతిక, భూగోళ, ఖగోళశాస్త్రములకు గలపరస్పరబంధమును, ముఖ్యముగా భూమికిని, సృష్టియందలి యితరపదార్థములకును గలసంబంధములును, విపులముగను, విచిత్రముగను వర్ణింపఁబడినవి. ఇది శ్రీయుత మైనంపాటి, నరసింహం బి. ఏ., ఎల్. టీ. గారిచే నెంతయు పరిశ్రమపూర్వకముగా వ్రాయబడినది. మాచందాదారులకు పోస్టేజితో రు. 1-0-0. ఇతరులకు పోస్టేజిగాక రు. 1-8-0.

పునర్ముద్రణమగుచున్న గ్రంథములు.

ఆబ్రహాము లింకను, జీవశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము.

## మ హ మ్మ దీ య మ హా యు గ ము.

రెండవకూర్పు. (Mahammadan period) క్యాలికో బైండు.

ఇందు ఆఱుపరికరణములుగలవు :— 1 ముసల్మానులయుత్పత్తి; వారీదేశమునకు వచ్చుట. 2 ఆఫ్గాన్ రాజులు. 3 మోగల్ ప్రభుత్వము. 4 దక్షిణములోని మహమ్మదీయరాజ్యములు. 5 రాజపుత్రులశౌర్యాగ్ని. 6 విజయనగర సామ్రాజ్యము.

కొందరు తలఁచినట్లు హిందూదేశము మహమ్మదీయులకు సులభముగా వశము కాలేదనియు హిందువులు అభిమన్యునివలె నేయపరిమితపరాక్రమమును జూపి మోసమునకును స్వామిద్రోహమునకు లోనై యోడిపోయిరనియు నీగ్రంథమునందు సప్రమాణముగాఁ జూపఁబడినది.

ఇందు శ్రీకృష్ణదేవరాయలు, పృథ్వీరాజు, రాణాప్రతాప్, అక్బరు మానసింగ్ నానక్ మొదలయిన మహాత్ముల దివ్యమైన పటములు కలవు.

శ్రీయుత కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ. గారిచే రచింపబడినది. చందాదారులకు పోస్టేజితో రు. 1-3-0. ఇతరులకు పోస్టేజిగాక. రు. 1-12-0.

## ఆంధ్రులచరిత్రము.

ఇది ప్రథమభాగము. పౌరుషమునందును పాండిత్యాతిశయంబునందును, రాజ్యవిస్తారంబునందును పూర్వపు ఆంధ్రులు హిందూదేశములోని యితర దేశములవారికి దీసిపోవువారు కారని యీగ్రంథము సప్రమాణముగా సిద్ధాంతీకరించుచున్నది. ఇప్పటి యాంధ్రులవలెనే మన పూర్వపుటాంధ్రులుగూడ కూపమండూకములె యనుకొంటిరా? ఆంధ్రు లొకప్పుడు మగధసామ్రాజ్యమును, ఇంకొకప్పుడు మహారాష్ట్రమును, మఱియొకప్పుడు యవద్వీపమును, వేఱొకప్పుడు పాండ్యచోళదేశంబులనుజయించి రని మీరు కలనైన నెఱుంగుదురా? ఎఱుంగనియెడల ఈగ్రంథముం జదువుడు.

శ్రీయుత చిలుకూరి_వీరభద్రరావుగారిచే రచింపబడినది. చందాదారులకు పోస్టేజితో రు. 1_0_0. ఇతరులకు పోస్టేజిగాక రు. 1_4_0.

## రసాయనశాస్త్రము.

రెండవకూర్పు. 320 పుటలు_75 పటములు. క్యాలికో బైండు

మనపూర్వులు బంగారము చేయవలయునన్న కోరికచే ఈశాస్త్రమును అభ్యసించిరి. ఇప్పుడు ఇంగ్లీషువారు ఈశాస్త్రమును అభ్యసించి కోట్లకొలది ధనము సంపాదించుచున్నారు. ఇట్టిఘనమైనవిద్య మనవాంద్రులకు తెలియుటకై ఈగ్రంథము చక్కనివచనశైలిని వ్రాయబడినది. జనులు లక్షాధీశులై దేశము ధనసంపన్నతతో తులతూగుటకు ఇట్టి పుస్తకములే యాధారములు. ఈ గ్రంథమునందు హిందూరసాయనశాస్త్రముయొక్క చరిత్రకూడ రసవంతముగ వ్రాయఁబడినది. శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ, ఎం. ఎ. గారిచే రచియింపబడినది. చందాదారులకు పోస్టేజితో రు. 0_13_0. ఇతరులకు పోస్టేజికాక రు.1_4_0

రావుబహదూరు. కం. వీరేశలింగముగారి

## స్వీయచరిత్రము.

ఇంగ్లీషుభాషలో మహనీయుల స్వీయచరిత్రలు (Auto Biographies) పెక్కులున్నను తెలుఁగులో నేటివఱకు నొక్కటియు లేకపోవుట

గొప్పలోపమనియుఁ దానినెట్లు తొలగింపనగుననియు మేము చింతించుచుండగాఁ రావు బహద్దరు కందుకూరి, వీరేశలింగము పంతులుగారు తమస్వీయచరిత్రమును ప్రకటించు గౌరవము మాకుఁ గలుగఁజేసిరి. గద్యతిక్కనయైన ఈమహనీయునిగుఱించిగాని, వారిగ్రంథములనుగుఱించిగాని మే మధికముగా వ్రాయుట కాగడాతో సూర్యునిఁ జూపించుటయే!

గర్వముగాని స్వాతిశయ భావముగాని యెంతమాత్రమును లేక, యున్నదియున్నట్లు యథార్థచరిత్రము ఇందుఁ జక్కనిభావలో వ్రాయబడినది. ఈ చరిత్రము జూచి పంతులవారి విరోధులుగూడ తలయూపెదరని మానమ్మిక. మహనీయులపటము లనేకములుగలవు. నిజమైనచరిత్రయని అందరు మెచ్చుకొనియున్నారు. చందాదారులకు రు. 1-0-0. ఇతరులకు రు. 1-8-0.

## ఆంధ్రుల చరిత్రము.

(రెండవభాగము)

ఇది విజ్ఞానచంద్రికా గ్రంథమాలలోని 18 వ కుసుమము.—ఇందు క్రీ. శ. 1100 నుండి 1550 వరకుగల ఆంధ్రదేశ చరిత్ర వర్ణింపబడినది. పురాణములు, కావ్యములు, శాసనములు, విదేశీయులవ్రాతలు మొదలగు వానినన్నిటిని శోధించి, తెలుఁగుచోడులు, నాగవంశోద్భవులైన మహారాజులు, కాకతీయచక్రవర్తులు, పల్నాటివీరులు, కమ్మవారు, రెడ్లు, వెలములు, మొదలగువారి చరిత్రలు ఈయుద్గ్రంథమునందు క్రోడీకరింపఁబడినవి. రామానుజుఁడు, బసవేశ్వరుఁడు, నన్నెచోడ కవిశిఖామణి, ఖడ్గతిక్కన, కవితిక్కన, గణపతిదేవచక్రవర్తి, ప్రతాపరుద్ర మహారాజు, మహారాణి రుద్రమదేవి మొదలగువారల పవిత్రజీవితములు శ్రద్ధతో వ్రాయఁబడినవి.

ఆయాకాలములందలి సాంఘిక, రాజకీయస్థితులు చక్కఁగ వివరింపఁబడినవి. పరదేశములయొక్కయు, కట్టడములయొక్కయు, పటములుకలవు.

ఇయ్యది మొదటిభాగమును రచించిన సుప్రసిద్ధులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచేతనే మనోహరమగుశైలిని వ్రాయఁబడినది.

| | |
|---|---|
| మాచందాదారులకు పోస్టేజితో | 1-0-0. |
| ఇతరులకు పోస్టేజిగాక | 1-8-0. |

## ఢిల్లీ దర్బారు.

ఇది గడచిన పట్టాభిషేక మహోత్సవసందర్భమున ప్రచురింపబడినది. ఇందు ఢిల్లీనగరవర్ణనయు, శ్రీరాజదంపతుల జీవితములును, హైద్రాబాదు, బరోడా, మైసూరు రాష్ట్రముల చరిత్రయు, దర్బారుల కథనములును బహురమ్యముగ వర్ణింపబడినవి. చక్కనిపటములచే శోభాయమానముగనుండిన ఈ గ్రంథము నందరును చదివి తీరవలెను.

మాచందాదారులకు పోస్టేజితో 1-0-0

ఇతరులకు పోస్టేజిగాక. 1-8-0.



### తయారగుచున్న గ్రంథములు.

| గ్రంథము. | కర్త. |
|---|---|
| ౧. చంద్రగుప్తచక్రవర్తి. | శ్రీపరమహంస విద్యానందస్వామిగారు, బి. ఏ. |
| ౨. ఆంధ్రులచరిత్రము, (౨-వ భాగము.) | చిలుకూరి-వీరభద్రరావుపంతులుగారు. |
| 3. వ్యవసాయ శాస్త్రము, | గోటేటి-జోగిరాజుపంతులుగారు. |
| ౪. అర్థశాస్త్రము, (Political Economy) | సి. రామలింగారెడ్డి, ఎం. ఏ. గారు. |
| ౫. మహారాష్ట్రవిజృంభణము, | కే. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ. |
| ౬. సద్వర్తనము, (Character) | కే. వి. లక్ష్మణరావుగారు, ఎం. ఏ. |
| ౭. కళింగదేశచరిత్రము, | గురుజాడ. అప్పారావుగారు, బి. ఏ., బి.ఎల్. |

౮. గ్లాడుస్టను జీవితము,

అ. కాశీశ్వర రావుగారు, బి. ఏ., బి. ఎల్.

౯. జంతుశాస్త్రము, (Zoology)

ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎమ్.

## మా న వ సే వ.

మతసంఘపరిశ్రమ భాషావిషయములఁ జర్చించు సచిత్రమాసపత్త్రిక

రాజమహేంద్రవరము.

పత్త్రికాసంపాదకులు— నాళము కృష్ణారావు.

మానవసేవయే దేశసేవయు, దేశసేవయే యీశ్వరసేవయు గావున దీనిం జేపట్టి మీపట్టివలెఁ బోషించుభారము మీపయిం బెట్టినారము.

64 పుటలుఁ గలిగి చిత్రపటశోభితమై విలసిలు నీపత్త్రిక సర్వజనసులభముగ నుండునట్లు సంవత్సరమునకు రు 3 లు మాత్రమె చందా నేర్పఱచినారము. అభిమానులకు రు 5 లు. పోషకులకు రు 10 లు. రాజపోషకులయాదరము వారియనుగ్రహాధీనము.

## ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,

తెనాలి, కృష్ణాజిల్లా.

ఆనరరీసంపాదకుఁడు. అయ్యగారి. నారాయణమూర్తి గారు, బి. ఎ., బి. ఎల్.

ఆనరరీ ప్రెసిడెంటు. కొప్పర్తి చంద్రారెడ్డిగారు.

ఈనిలయమునుండి భాషాభివృద్ధికరంబులును, చరిత్రబోధకములునగు నవలలు రెండుమాసముల కొకటిచొప్పున వెలువడుచుండును. అప్పుడప్పుడు చరిత్రములుకూడఁ బ్రకటింపఁబడుచుండును. ఇందు శాశ్వతచందాదారులుగాఁ జేరువారికి డెమ్మీసైజు 100 పుటలుగలగ్రంథము పోస్టేజిసహా రు 0_6_0 లకు మాత్రమే మంచిబైండుతోఁ బంపఁబడుచుండును. ఇతరులకు పోస్టేజిగాక రు 0_8_0 ల కీయఁబడును. ప్రవేశకట్నముక్రింద రు 0_2_0 లు పంపుము దరఖాస్తుఫారమును బంపవలయును. ఇందు | ప్రప్రథమమున బంకించంద్రచటో

పాధ్యాయ విరచితమగు దుర్గేశనందినియను 240-పేజీలుగల నవల వెలువడినది. ఇది యిదివఱ కాఱుభాషలలోనికి పరివర్తన మగుటవలననే దీనిప్రాశస్త్యము వెల్లడి యగుచున్నది.

శాశ్వతచందాదారులకు రు. 0-12-0. ఇతరులకు రు 1-0-0.

విలాసము:— సెక్రటరీ, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,
తణుకు, కృష్ణాజిల్లా.

అపూర్వము ! అచ్చులోనున్నది ! ! హాస్యరసప్రధానము ! ! !

## చంద్రరేఖావిలాపము.

### కూచిమంచి. జగ్గకవిప్రణీతము.

సుప్రసిద్ధమై, సలక్షణమై, నీతిబోధకమై, చరిత్రాత్మకమై, శృంగారేతర రసప్రధానమైన యిట్టి ప్రౌఢప్రబంధ మాంధ్రమున లేదు. "ఈకృతికి సమముగాఁ గృతి నేకవియును జెప్పఁజాలఁ డిది బిరుద" మని కవియే వ్రాసికొనియున్నాఁడు. కవి సుభద్రాపరిణయాద్యనేక కావ్యకర్త; విశేషించి కవి సార్వభౌముఁడగు తిమ్మకవి తమ్ముఁడు. అసభ్యభాగములను రసభంగముకాకుండ సంస్కరించి యీగ్రంథమును, సీ. పీ. బ్రౌన్‌దొరగారి యమూల్య పీఠికతో కూడ ప్రకటించెదము. అంచెకూలిగాక ప్రతి 1-కి రు. 1-0-0. పదిప్రతులు కోరువారి కొకప్రతి యధికముగా నియ్యఁబడును. కొంఁదిప్రతులే ముద్రింపఁబడును గాన వలయువారు తమ యాజ్ఞను ముందే రిజిస్టరు చేయించుకొనుట మేలు.

### మాయొద్ద వెలకు దొరకెడి యితర గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| నీతికథాసంగ్రహము. సచిత్రము. | 0 | 4 | 0 |
| అపూర్వసంఘసంస్కరణము (అచ్చులో నున్నది) | 0 | 2 | 0 |
| కవితోపాయనము ” | 0 | 1 | 0 |

గ్రంథసంపాదకుఁడు:— కాళ్లకూరి గోపాలరావు,
4, ఆచారప్పన్ లేన్, జార్జిటవున్, మద్రాసు.

## Mesmerism & Hypnotism.

## ప్రాక్టికల్ మెస్మరిజం హిప్నోటిజం.

36 బంగరుపతకములు పొందియున్నారు. | గొప్పవారి వద్దనుండి అనేక సర్టిఫికేట్లు గలవు.

ఈపుస్తకమందు ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణవిద్యలను, మనుష్యులను, జంతువుల్లను లోబరచు మందలులేకయే రోగములు బాగుచేయువిధమును, గురువులేకనే అందరు నేర్చుకొనులాగున, అనేక బంగరు పతకములను బహుమతులుపొందిన ప్రొఫెసర్, టి. వి. సుబ్బారావుగారిచే సులభమైన తెనుగున వ్రాయబడినది. క్రయం రు. 1-0-0 మాత్రమే.

### మంత్రించుకఱ్ఱలు.

తేలుకఱచినను, పాముకఱచినను, మంత్రములు, మందులులేకయే బాగుచేయుటకై, ప్రొఫెసర్, టి. వి. సుబ్బారావుగారిచే యీకఱ్ఱలు (Magnetised Wands.) జనులకుపయోగార్థమై తయారుచేయబడినవి. ఈకఱ్ఱతో తేలుగఱచినను పాముగఱచినను 3 పర్యాయములు దిగదుడిచిన కుట్టిన చోట మంటలేకపోవును. తేలుకుకఱ్ఱ రు. 1-0-0. పాముకుకఱ్ఱ రు. 1-0-0.

### మెసరెజుబాం.

అది చర్మరోగముల నన్నిటిని వక్కపూతవ మాడ్చివేసి చర్మమును మిక్కిలి నునుపుగను అందముగనుచేయును. క్రయం డబ్బి 1-కి అ. 8.

### శెగరోగనివారిణి.

ఇది బట్టంటును, చురుకును, ఇంద్రియనష్టమును, అన్నివిధములగు కాకలను మూడుదినములలో పోగొట్టును.

క్రయం బుడ్డి 1 కి రు 1-8-0 లు మాత్రమే.

☞ ఈమందులు కోరువారు ప్రొఫెసరు. టి. వి. సుబ్బారావు ప్రొప్రైటర్ మెస్మెరిక్ యిన్‌స్టిట్యూట్, నెం. 75, గోవిందప్పనాయనివీధి. జార్జిటవున్, మద్రాసు అని వ్రాయవలయును.

## యాజుషస్మార్తానుక్రమణిక

### అను యజుర్వేదపూర్వప్రయోగ పుస్తకము.

అయ్యా, భగవదనుగ్రహముచే ఈరెండవకూర్పునందు ప్రాచీనవిషయములకన్న నిండనేకస్మార్తరహస్యములును, ఆశీర్వచన మంత్రములకు స్వరములును, గొన్నిప్రయోగములలో నచ్చటచ్చట తెలుగు తాత్పర్యమును జేర్పంబడి ముద్రింపఁబడినది. ఈభట్టీయమును ద్వారలోఁ బంపుమని బహుజనులు జాబులువ్రాసిరి. అప్పట్లో పుస్తకములు లేనందునఁ బంపుటకు వీలులేకపోయెను. ఈగ్రంథమం దుండు విషయములన్నియును, ఈస్వల్పప్రకటనయందుఁ జేర్ప వలనుపడనందున, ముఖ్యములైన కొన్నిస్మార్త విషయములే యిందు సూచింపఁబడినవి. గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, వేదవ్రతములు, స్నాతకము, వివాహము, వైశ్వదేవము ఆబ్దికమంత్రము, ఆయుష్యహోమము, శ్రీరామకళ్యాణము, పుత్రకామేష్టి మొదలగు బహు విషయములుండును. ఈగ్రంథమువలని ప్రయోజనమును జదువరులే యెఱుంగఁగలరు. యాజ్ఞిక జీవనార్థమును సర్వవిద్యార్థి సౌకర్యార్థమును, ఈగ్రంథమునకుతక్కువవెల యేర్పఱుపబడినది. వలయువారలు తమపోష్టుగ్రామము మొదలగునవి విస్పష్టముగా (దెలుగునగాని, యింగ్లీషులోఁగాని) వ్రాసి పంపవలెను. గ్రంథముకోఱకు వ్రాయువారికి బహుమానముగా నవీనముగా ముద్రించిన రామసప్తాహమును కేట్లాగులును వి. పి. టపాద్వారా పంపఁబడును.

గ్లేజుకాగితముల ప్రతి 1-కి 1-8-0. రఫ్ కాగితముల ప్రతి 1-కి 1-4-0. ఇదిగాక పోష్టుఖర్చులు ప్రత్యేకము.

యాజుషస్మార్త మన్త్రపాఠము స్వరసహితము గ్లేజుప్రతులు ఖర్చుబడినవి. రఫ్ ప్రతి 1-కి రు 1-4-0 మాత్రమే.

చల్లా. లక్ష్మీనృసింహశాస్త్రి,
బందరు, బచ్చుపేట, కృష్ణాజిల్లా.

అనేక బంగారు పతకములను, మొదటితరగతి
యోగ్యతా పత్రములను బహుమానమును బొందిన
పండిత డి. గోపాలాచార్యులు. ఏ. వి. యస్ వారి
సర్వజనోపయోగమగు సిద్ధౌషధములు.

| | | | | |
|---|---|---|---|---|
| కలరాకు | కర్పూరాద్యరిష్టం విషూచిసంజీవని. | | 0 | 12 |
| ప్లేగు (మహామారికి) | హేమాదిపానకం | ... | 1 | 10 |
| ప్లేగుబొబ్బలకు | శ్వేతధాతామృతం | ... | 0 | 12 |
| తలంటులకు | అమృతామలకతైలం | ... | 0 | 12 |
| నోటిరుచికి సువాసనకు | తాంబూలవటి | ... | 0 | 8 |
| పండ్లబలిమికి | వజ్రదంతచూర్ణము | ... | 0 | 4 |
| అజీర్ణములకు | అజీర్ణపంచాననము | ... | 1 | 0 |
| శైత్యములకు | జంబీరరసాయనము | ... | 0 | 8 |
| మలబద్ధమునకు | సుఖవిరేచనవటి | ... | 0 | 8 |
| తలనొప్పులకు | చంద్రకళా | ... | 0 | 8 |
| తలవెండ్రుకలు పెరుగుటకు కేశప్రసాదనతైలం | | ... | 1 | 0 |
| తేలుకాటుకు | వృశ్చికదంశనివారిణి | ... | 0 | 8 |
| జలుబుపడిశములకు | మృగమదవటి | ... | 1 | 0 |
| పసిబిడ్డలకు | బాలసంజీవని | ... | 0 | 8 |
| చీడగజ్జికి | వ్రణరోపణి | ... | 0 | 4 |
| తామరకు | పంచాననలేపం | ... | 0 | 8 |
| విద్యార్థులకు | మానసోల్లాసిని | ... | 2 | 8 |
| బలమునకు | జీవామృతము | ... | 3 | 0 |

ప్యాకింగు పోస్టేజి. వేరుగా నియ్యవలెను. కోరువారికి మా పెద్ద క్యాటలాగు ఉచితముగ బంపబడును.

అయుర్వేదమార్తాండ, భిషజ్మణి,
పండిత డి. గోపాలాచార్లు, ఎ. వి. ఎస్.

టెలిగ్రాఫ్ అడ్రసు "పండిట్" మదరాసు.

ప్రిన్సిపల్, మదరాస్, ఆయుర్వేదిక్ కాలేజ్.
ఆయుర్వేదాశ్రమం, జార్జిటౌన్, మదరాసు.
బ్రాంచి ఆఫీసు. నెం. 12, తంబుశెట్టివీధి,
ఆయుర్వేదిక్ కాలేజి బిల్డింగ్సు, మదరాసు.

# ఆంధ్ర భాషాజ్ఞానోదయ సమాజము.

| | | |
|---|---|---|
| న్యా. రామానుజస్వామి పంతులు గారు. బి. ఏ., బి. ఎల్. అధ్యక్షులు. | బరంపురం | ధర్మారావు గారు, బి. ఏ. సంపాదకులు. |

## " వేగుంజుక్క " గ్రంథమాల.

1. మనభాషలో నిదివరకవలంబించని నూతనమార్గంబులఁ గొన్నిటి ననుసరించి పొత్తముల రచియింపించి, వత్సరమునకు మూడు ప్రచురింపఁబడుచుండును. ఈమూడును రెండురూపాయలకు మాశాశ్వతచందాదారులకు మించవు. ప్రవేశ రుసుము నాల్గణాలును, వి. పి. గా పంపఁబడు మామొదటి పొత్తపు వెలతో పాటు రాబట్టుకొనఁబడును.

2. మాగ్రంథమాల కైదుగురు శాశ్వతచందాదారుల నొసంగువారొక పొత్తము బహుమానము నొందగలరు. పదుగురను చేర్చువారి కొకవత్సరపర్యంతము నుచితముగ మాపొత్తముల నంపుచుందుము. పదునైదుగురను చేర్చువారు మాగ్రంథమాలకు శాశ్వతచందాదారులగుచున్నారు.
"మా వి. పి..లను తిరుగగొట్టునట్టి వారు మాకు శాశ్వతచందాదారులుకారు."

3. మాగ్రంథమాలా ప్రచురితములలోనుండు ముఖ్యాంశములు :—

(*a*) ప్రకృతివర్ణనలు (Description of Nature)
(*b*) స్వభావనిర్మాణము (Characterisation)
(*c*) స్వభావనిరూపణము (Devolopement of Character)
(*d*) నూతనకల్పనలు (New Ideas)
(*e*) చరిత్రావిషయిక చిత్రములు (Historical Beauties)

4. (1) మా "వేగుంజుక్క" వ ప్రథమమరీచి "ఉషఃకాలము" (The Dawn) ఇది యాంగ్లభాషా విశారదులును, సంస్కృతాంధ్రభాషల యందసమానపాండిత్యముగలవారును, | నగమాసంపాదకులచే వ్రాయబడిన, చక్కని విషయాంతరగర్భిత (Allegorical) చిత్రకథ. ఇందలి యతిమృదు మధురమగు శైలికిఁ దోడ్పడు నూతనకల్పనలును, ప్రకృతివర్ణనలును, స్వభావ నిర్మాణాది నూతనాలంకారములును భావాతీతములు.

(2) ద్వితీయమరీచి :—"వాఁడే వీఁడు." ఇది యపూర్వమగు నిరూపణా (Detective) నవల. ఇందలి కథాచమత్కారమును, స్వభావనిర్మాణమును, విషయానుగత ప్రకృతివర్ణనలును (Sympathy of Nature) భావాతీతములు.

ఈ రెండు గ్రంథములును మనయాంధ్రవాఙ్మయమునకు నూతనాలంకారములని చదువరులకే వెల్లడికాగలదు.

ఇట్లు,

దేవరాజు - వెంకటకృష్ణారావు,

కార్యదర్శి,

"వేగుంజుక్క" గ్రంథమాల.

బరంపురం.
గంజాంజిల్లా.

# ౧౨౦ పుటల పుస్తకము

## ఉచితము.

---

ఆరోగ్యము మఱియూ ఆయుర్ధాయము కొద్ది స్వాభావిక ధర్మము లనుసరించుటవల్లనే నిస్సందేహముగా సంబంధించియుండును.

ఐశ్వర్యమునకు మార్గమై జీవితకాలమును అభివృద్ధించుచూ ఇట్లు నీశరీరారోగ్యము సమకూర్చుచు ధర్మమార్గమును ఈమేలైన పుస్తకము కనుపరచును.

ఈపుస్తకము ఉచితము. తపాలు ఖర్చులుకూడను అపేక్షింపకయే పంపబడును.

వైద్యశాస్త్రి మణిశంకర్ గోవిందజీ,
ఆతంకనిగ్రహ ఔషధాలయము,
22, బ్రాడ్వే, మదరాసు.

---

96, మవుంటు రోడ్డు,
మదరాసు.

## మదనకామేశ్వర. లేహ్యము.

20 తు. డబ్బి రు. 1—0—0.

(1) ఇది మిక్కిలి వీర్యవృద్ధిని ధాతుపటుత్వమును కలిగించి ఆనందింపజేయును. (2) మేహము, నిర్కాక, శుక్లనష్టమును, స్వప్నస్ఖలితమును ఖండించును. (3) రక్తమును శుభ్రపరచి వృద్ధి నొందించును. (4) పలచనిధాతువును బలపరచి యవ్వనమును నిండించును. 2 డబ్బీలు చాలును. అనేకడబ్బీలు విక్రయము.

ఘనసారచందిని డబ్బీ రు. 1—4—0.

ఇది ఎరుపు, తెలుపు, పసుపు, మొదలగు శిగరోగములకు దివ్యౌషధము.

సుకేశరంజనీ సీసా రు. 0—8—0.

ఇది మిగుల సువాసనగల తలనూనె ఘుమఘుమలాడుచుండును. వెంట్రుకలకు మృదువుగా, నల్లగా పెంచును. మెదడునకు చల్లదనము.

ఎన్నిడబ్బాలకైనా వీ. పీ. ఖర్చులు 0—4—0.

ఆయుర్వేద ఔషధ సమాజము.

(Pondur) పొందూరు,

గుంటూరుజిల్లా.

# కృష్ణా అండ్ కంపెని.

మావద్ద యెల్లప్పుడున్ను సిద్ధముగాయుండెడు లాంగ్ క్లాత్ పట్టులు, అసలు కాన్వారు ట్విల్స్, సాదా లేక రంగుది ఆక్స్ఫోర్డు చీట్లు రంగుది స్ట్రియిఫ్ఫ్లానలు, యిజుఫ్లానలు, సియిక్ఫ్లానలు, ఆస్సాం టోపీలు, కల్లికోట చెక్కుకోట్లు, హారాక్స్ లాంగ్ క్లాత్, కుట్లున్ను. మేలైనదూదితో చేయబడిన తలదిండ్లు, లైస్, బోస్, కాల్లర్స్, క్రిస్టీన్ ఫెల్ట్ కాప్స్, స్టీల్ట్రంకుస్ని, మేలైనమస్లిన్ను, చైనా లేక టూస్సర్ కాకీ పట్టురకములు, బకింగ్హామ్ లేక కర్నాటిక్ మిల్ చెక్కుస్ని, పలువిధముల బ్లాంకెట్లున్ను, అనేకరకముల స్వదేశిబట్టలు మొదలయినవి తక్కువధరలకే విక్రయించుచున్నాము.

బైటిఆర్డరులు తక్షణమే పంపబడును.

కృష్ణా అండ్ కంపెని,

216. చైనాబజార్ రోడ్,

చెన్నపురి. ఈ.

శ్రీ గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములు. ఇదివఱలో వెలువడిన యాంధ్రకవిజీవితములలో నెల్ల మొదటిది. ఇందు పూర్వకవుల గాథలు సమగ్రముగా వ్రాయఁబడుటయే గాక శిష్టు. కృష్ణమూర్తికవి, పిండిప్రోలు. లక్ష్మణకవి మొదలగు నాధునిక కవులచరిత్రలుగూడ సమగ్రముగా వర్ణింపఁబడినవి. దీనిలో దొరకని మహాకవుల చాటుపద్యములు చిత్రకథలు అపూర్వ చరిత్రాంశములు మఱియొక గానెందును గాన రావని చెప్పుట యతిశయోక్తికాదు.

కాలికోబైండు 2 వాల్యములు. రు. 2 8

యాజుషపూర్వప్రయోగచంద్రిక. సస్వరము, అనేకవిషయములఁ జేర్చి యాంధ్రమహాజన సంప్రదాయానురూపముగఁ బరిష్కరించి ముద్రించుచున్నాము.

గురుబాలప్రబోధిక. చిన్నసైజున రామాశ్రమీయాద్యనేక గ్రంథములసహాయముతో చక్కఁగ పరిష్కరింపించి అకారాది అనుక్రమణికతో ముద్రించియున్నాము. } 2 8

ఇంక ననేక సంస్కృతాంధ్రగ్రంథములు మావద్ద దొరకును.

మా ముద్రాక్షరశాలయం దితరుల అచ్చుపనులు, సరసముగను, వేగముగను చేసి యియ్యఁబడును.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

192, ఎస్ప్లనేడ్ }
323, తండియార్పేట } చెన్నపురి.

---

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
161 పుట మొదలు చివరవరకు ముద్రితము.
చెన్నపురి. 1912.